# శంకర గ్రంథ రత్నావళి

(సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహము)

చతుర్థ సంపుటము



అనువాదకులు :

శ్రీ సర్వా శివరామకృష్ణశాస్త్రి



ప్రకాశకులు :

సాధన గ్రంథమండలి, తెనాలి.

[కాపీరైటు]                [వెల రు. 4-00

# పీఠిక

శ్రుతిస్మృతి పురాణానా మాలయం కరుణాలయమ్,
నమామిభగవత్పాద శంకరం లోకశంకరమ్.
యదవిద్యావిలాసేన భూతభౌతికసృష్టయః,
తం నౌమి పరమాత్మానం సచ్చిదానన్ద విగ్రహమ్.

ఈపరిదృశ్యమాన ప్రపంచమున ననంత జీవరాసులు కలవు. ఈజీవరాశి యంతయు నిరన్తరము సుఖకాంక్షులై సుఖ సాధనమునకు యత్నించుట సర్వానుభవసిద్ధము. "సుఖార్థా స్సర్వవృత్తయః" పశుపక్ష్యాదులు మొదలు మానవులవరకు ఎవ్వరేపని చేసినను, ఎవ్వరే ఆలోచనముల జేసినను సుఖము కొఱకే అనుట నిర్వివాదము-నాకు సుఖమక్కరలేదని యే ప్రాణియు భావింపదు గదా! ఈ సందర్భమున సుఖమన నెద్దియో-తత్సాధనము లెవ్వియో, విమర్శించు కొనవలసి యున్నది. నిద్రాహారాదులు సుఖసాధనములనియు తజ్జనితము సుఖమనియు సామాన్యముగా ప్రతిప్రాణికిని గోచరించును. ఇవిపశుపక్ష్యాదులకును సామాన్యములే. మఱియు నిద్రాహా రాదులు అతిమాత్రసేవనాదికమువలన దుఃఖమునే కలిగించు చుండుటయు సర్వానుభవసిద్ధము. సుఖము లభించిన దనుకొని నను ఆసుఖముక్షణికము. అది యీవిశిష్టమానవజన్మమునకు ఫలము కానేరదు. విశిష్ట మానవ జన్మమునకు సంపూర్ణ ఫల మైన సుఖమెట్టిది? దానికి తగు సాధనము లెవ్వి యని పరి

శీలింపవలసియున్నది. ఇయ్యది వివేకప్రధానమైన మానవజన్మ మునందుకొన్న ప్రాణికి ప్రథమకర్తవ్యము. ఈవిమర్శనమునకు ఇట్టి విచారణమునకు అభిముఖముగ కాని మానవునిజన్మము పశుపక్ష్యాది జన్మములకంటె విశిష్టమైనది యని యనుకొనుట కవకాశముండదు. ఆ పరిశీలనమునకు ప్రథమ సోపానము ఈ దృశ్యమానమగు ప్రపంచ సృష్టియెట్లు జరిగినది ? యనునది. దానిని మానవుడు కేవలము తనకుగల ప్రాకృతమగు మానవ బుద్ధితో పరిశీలింప యత్నించుట యవివేకము. ఈ గిరినదీ సముద్రాదికమగు సృష్టి మానవ నిర్మితము కాకపోవుటయే దీనికి ప్రబల కారణము. ఐననీ సృష్టికి మూలకారణమెవరు? "యదవిద్యా విలాసేన భూతభౌతిక సృష్టయః" అని వెనుకటి ప్రశ్నకు శాస్త్రములయందలి సమాధానము. అనగా పరమాత్మ మాయావిలాసమే ఈ సృష్టికి మూలకారణము అని.

ఇట్లగుటచే మన బుద్ధికి ఆ పరమాత్మ యూహాను సాహాయ్యముగా గైకొనక తీరదుగదా ! ఆపరమాత్మయూహా భివ్యంజకములే వేదములు, వేదాంతములును (ఉపనిషత్తులు). వాని నిష్కృష్టసారమే శ్రీ భగవద్గీత, వ్యాససూత్రములు మున్నగునవి. అవి సామాన్యమానవబుద్ధుల కందనివగుటచే లోకశంకరులగు శ్రీశంకరులు భగవత్పూజ్యపాదులు భాష్య ముల రచించి లోకమున కనుగ్రహించినారు. అవియును విశిష్టబుద్ధులకే గాని గ్రాహ్యములు కావని కరుణాలయులైన శ్రీ భగవత్పూజ్యపాదులు భాష్యాదిగ్రంథ ప్రతిపాద్య మహార్థ ములను మానవుల కందరకు నందించు మహాశయముతో

ననేక ప్రకరణ గ్రంథములను, స్తోత్రములను ననేక విధములుగ సంగ్రహముగను, విపులముగను, అత్యంతసులభ శైలిలో బహు సుబోధకముగా రచించి జనులననుగ్రహించియున్నారు. అందీ 'సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహ'మొకటి. ఇదియొక పెద్ద ప్రకరణగ్రంథము. ఈగ్రంథనామమువలననే విశిష్టబుద్ధిగ్రాహ్యములైనఉపనిషత్తులు, తద్భాష్యాదులు మొదలగుసర్వవేదాంత గ్రన్థసిద్ధాన్తసారములిందు మనకు కరతలామలకమువలెకాగల వనిస్పష్టముగా తెలియవచ్చుచున్నది. ఈగ్రంథమునందలి "సర్గం వక్ష్యస్య తస్మాద్వా ఏతస్మాదితిహిశ్రుతిః సకాశాద్బ్రహ్మణః" (౨౦ శ్లో) "... మాయాం స్వామవలంబ్య నిశ్చలతయా స్వచ్ఛన్ద వృత్తిః ప్రభుః సృష్టిస్థిత్యదనప్రవేశ యమనవ్యాపార మాత్రేచ్ఛయా, కుర్వన్ క్రీడతి..."(౪౯౪ శ్లో) అనుశ్లోకములచే భూతభౌతిక సృష్టియంతయు మాయావశమునపరమాత్మ వలననే జరుగుచున్న దనియు, అందువలన నా పరమాత్మ యాజ్ఞలనే మనము తెలియవలయుననియు బోధించుచున్నారు. మఱియు 'సుఖంకిమస్త్యత్ర విచార్యమాణే,గృహేపివా యోషితి వాపదార్థే' (౪౨శ్లో)ఇత్యాది శ్లోకములచే వైషయిక సుఖము తుచ్ఛమనియు,దానికై ప్రవర్తించుచుండుట యవివేకమనియు, 'కామఏవ యమ స్సనత్సుజాత్ ...' ఇత్యాది శ్లోకములలో కామము సర్వానర్థ మూలమనియు, కాన కామవిజయమావశ్యకమనియు సూచించుచు 'కామస్య విజయోపాయం సూక్ష్మం వక్ష్యామ్యహం సతాం...' (౯౩ శ్లో) ఇత్యాది

శ్లోకములలో కామవిజయోపాయమును బోధించిరి. ఇట్లే ఈ గ్రంథమున మోక్షమే నిత్యసత్య సుఖమనియును తదర్థమై విషయవైరాగ్యాదులావశ్యకములని (౮-౨శ్లోకము) మొదలుగ కొంత గ్రంథములోను (౨౧౧-౨౧౨ శ్లోకములలో) జీవాత్మ పరమాత్మలయొక్క స్వరూపమును బోధించిరి. ఇంతియే గాక గ్రంథాంతిమభాగమున గ్రంథాంతరాలభ్యములగు జ్ఞాన యోగానుబంధిసమాధి విశేషములను తల్లక్షణములను తత్సాధనములను నతిసులభముగ వివరముగ బోధించిముక్తిని తత్సాధనములను జిజ్ఞాసువులగు భక్తశిష్యకోటికి కరతలామలక మొనర్చిరి. అట్టి శ్రీ శంకరభగవత్పూజ్యపాదులకు కృతజ్ఞతా పూర్వక సాష్టాంగవందన సహస్రముల నర్పించెదము.

ఇట్టి యీ విశిష్టగ్రంథమును సర్వజనగ్రాహ్యమగు రీతిని చక్కని ఆంధ్రానువాదముతో జతపరచి ఆంధ్రావనికి అందించిన సాధన గ్రంథ మండలి యెంతయు ప్రశంసార్హము. ఈ మండలి చేయుచున్న కృషి ఆంధ్రప్రజకు సర్వతోముఖమగు ఆధ్యాత్మిక వికాసమును కలిగించగలదు. 'శ్రీ శంకర గ్రంథ రత్నావళి' యనుపేరిట శ్రీశంకర గ్రంథముల సులభాంధ్రతాత్పర్యములతో జతపరచి ప్రకటించుచున్న సాధన గ్రంథ మండలికి ఆంధ్రలోకము చాల ఋణపడియున్న దనుట నిస్సంశయము. వీరి సంకల్పము శ్రీశంకర భగవత్పూజ్య పాదుల రచనల నన్నిటిని యీ రీతిని ఆంధ్రావనికి కానుక

పెట్టవలయునని. పవిత్రతరము, భవబంధమోచకము నగు వీరి యాశయము రసజ్ఞులగు ఆంధ్రజనుల ఆదరాభిమానోదార భావములవలనను, దయామయుడగు పరమేశ్వరుని యనుగ్రహ బలమునను, జగదుద్ధరణ దీక్షాపరతంత్రులగు శ్రీజగద్గురువుల అమోఘాశీః ప్రభావమునను అచిరకాలములో సాఫల్యము నొందగలదని విశ్వసించుచున్నాను.

బందరు<br>
ఖోజిల్లీపేట<br>
22-8-67

ఇట్లు<br>
'వ్యాకరణస్థాపక' 'విద్వన్మణి'<br>
'సర్వతన్త్ర విశారద'<br>
కుప్పా శ్రీ ఆంజనేయశాస్త్రి

# విజ్ఞప్తి

శ్రీ శంకర భగవత్పూజ్యపాదుల రచనలన్నియు విద్వజ్జన విదితములై యున్నవి. అందు శ్రుతిస్మృతుల యందలి నిగూఢముగ నిర్ణీతములైయున్న జగజ్జీవ పరాత్మలయొక్క నిజస్వరూపము నంతయు నతిసులభముగ పండితపామర సకల జనసాధారణమగునట్లు సంపూర్ణముగ వర్ణింపబడిన ప్రకరణ గ్రంథరాజ మీ "సర్వవేదాంత సిద్ధాన్త సార సంగ్రహము". ఇందు వేదాన్త శాస్త్రసంబన్ధి విషయవిశేషము లన్నియు ననుభవారూఢములగునట్లును, ఆచరణ సాధ్యమగునటులను సులభశైలిలో మృదుమధురముగా నిరూపింప బడియున్నవి. ఇయ్యది చాల విశాలమైన సర్వవేదాన్త ప్రమేయ ప్రబోధక మైన గంభీరమైన గ్రంథము. ఇందు భాష్యాది గ్రంథముల యందు గూడ వివరింపబడని విషయ విశేషము లెన్నియో - షడ్విధ సమాధులు - సమాహితులగు యోగివర్యుల జాగ్రదాద్యాఖ్యములగు నవస్థావిశేషములు మొదలగునవి విపులముగా స్ఫుటముగా వివరింపబడి యున్నవి.

ఇట్టి యీ విశిష్టగ్రంథమును అత్యల్పజ్ఞుడనే ఐనను నేను శ్రీ సద్గురువుల చోదనావశంవదుడనై తదనుగ్రహ బలమున యథాశక్తి ననువదించితిని. ఇందలి నా దోషముల నన్నిటిని మన్నించి విషయవిశేషముల స్వీకరించి నా యీ రచనను బాలభాషితముగ గ్రహించి పాఠక మహాశయులు

శ్రీ శాంకర సిద్ధాంతములను చక్కగ తెలిసికొని తదాదేశముల నాచరించిన దుస్తరమగు భవాంభోనిధిని తరింప గల్గుదురని విశ్వసించుచున్నాను.

ఈ గ్రన్థస్థములగు శ్లోకములలో నచ్చటచ్చట కొన్ని పాఠభేదము లున్నవని విజ్ఞులవలన వినవచ్చుచున్నది. ఐనను నాకు లభ్యమైన పాఠమును మాత్రమనుసరించి యథాశక్తిగ ననువదించితిని. విశేషములను విశేషాభిజ్ఞులద్వారా తెలిసికొనవలసినదిగ పాఠకమహాశయుల నభ్యర్థించుచున్నాను.

బందరు
22—8—67

ఇట్లు
బుధజనవిధేయుడు
సర్వా శివరామకృష్ణశాస్త్రి

# స్వ విషయము

కాలము త్వరితగతిని పరిణామము చెందుచు నెంతటి దుర్భరస్థితులను గల్పించుచున్నను శ్రీ శంకరుల కృపవలన "శంకర గ్రంథ రత్నావళి'' మూడవ సంపుటమును వెలువ రించిన యనతికాలములోనే యీ నాలుగవ సంపుటమును పాఠకలోకమున కందీయగలిగినందుల కెంతయు సంతసము.

ఇది శంకర గ్రంథరత్నావళి నాల్గవసంపుటము. ఇందు "సర్వవేదాన్త సిద్ధాన్త సారసంగ్రహము"ను శంకరుని ప్రకరణ గ్రంథమొక్కటియే గలదు. ఇది సర్వవేదాన్త సిద్ధాంతముల సారమును తన యందిముడ్చుకొని సహస్రాధిక శ్లోకాత్మకమై యన్వర్థ నామధేయముతో బరగెడి ప్రకరణ గ్రంథరాజము. ముముక్షుజనులకిది కొంగు బంగారము. వివిధ నిగూఢార్థ విషయముల దర్శింపజేసెడి కరదీపిక. ముముక్షుజనుల కత్యన్తోపయుక్తము.

ఈ సంపుటమును మేము కోరిన యంతనే యనువ దించి యిచ్చిన బ్ర. శ్రీ సర్వా శివరామకృష్ణశాస్త్రిగారికి, పీఠిక వ్రాసి యిచ్చిన బ్ర. శ్రీ. కుప్పా శ్రీ ఆంజనేయశాస్త్రిగారికి కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.

రాబోవు సంపుటములను ఉపదేశసాహస్రి, వివేక చూడామణి మున్నగు ప్రకరణ గ్రంథములతో అనతి కాలములోనే వెలుగులోనికి దీసికొని రాదలచుచున్నాము. మండలికి ఆర్థికస్తోమతు లేకపోయినను శ్రీ శంకరుని రచనల నన్నిటిని యాంధ్రానువాదములతో నాంధ్రజనుల కందీయ వలెనను నుత్కంఠయే యీ మహత్తర కార్యభారమునకు మమ్మురిగొల్పుచున్నది. ఉదారులగు మహాశయుల తోడ్పాటుతో శ్రీశంకరుని కృపవలన వెనువెంటనే వీనినన్నింటిని ప్రకటింపగలము. ఈ గ్రంథమును సకాలములో చక్కగా ముద్రించి యిచ్చిన 'భారతీప్రెస్' వారికి మా కృతజ్ఞతలు.

ప్లవంగ<br>శ్రావణము

బులుసు సూర్యప్రకాశశాస్త్రి<br>వ్యవస్థాపకుడు : సాధనగ్రంథమండలి.

## శంకరవాఙ్మయోద్ధారకులు

ప. ప. (శ్రీ) అవధూతేంద్ర సరస్వతీ స్వామివారు
,, ఆర్. సి. ఎల్లారెడ్డిగారు — రామనపల్లె
,, కీ. శే. పోలిశెట్టి సోమసుందరంగారి జ్ఞాపకార్థము వారి కుమారులు — గుంటూరు

## మహారాజపోషకులు

(శ్రీ) ప. ప. శ్రీరామకృష్ణానంద స్వామివారు — ఆళ్లగడ్డ
సంపాదకులు : గీతావాణి
(శ్రీ) డా. బి. పేర్రాజుగారు — వాల్తేరు
,, పి. శ్యామసుందరశాస్త్రిగారు — బందరు
,, వెల్లంకి దొరయ్యగారు — నల్లజర్ల
,, ఏలూరుపాటి రామభద్రచయనులుగారు — వేగేశ్వరపురం
,, వేమరాజు భానుమూర్తిగారు — ఢిల్లీ
,, పిశుపాటి వెంకట్రామశర్మగారు P. H. D. — కరవది
,, గోటేటి సత్యనారాయణమూర్తిగారు — ఏలూరు
,, జంధ్యాల లక్ష్మీనరసింహస్వామిగారు — తెనాలి
,, డా. కళా వెంకటసుబ్బారావుగారు — ద్రాక్షారామం
,, పాటిబండ్ల వెంకటేశ్వర్లుగారు — దొడ్డవరప్పాడు
,, కరిచినాథం శ్రీరామచంద్రమూర్తిగారు — వరంగల్

## రాజపోషకులు

(శ్రీ) కంభంమెట్టు మధుసూదనరావుగారు — బాపట్ల
,, బొలిశెట్టి సీతారామయ్యగారు — ,,

| | |
|---|---|
| శ్రీ ములుగు విశ్వేశ్వరశాస్త్రిగారు | తెనాలి |
| ,, బచ్చు సీతారామాంజనేయులుగారు | ,, |
| ,, ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు | ,, |
| ,, కుప్పా వీరరాఘవశాస్త్రి భాగవతార్ గారు | ,, |
| ,, మట్టిపాటి వెంకటనరసింహారావుగారు | సీతేరు |
| ,, కీ.శే. ధారా వెంకటసీతారామకృష్ణయ్యగారు | వాత్తేరు |
| ,, కర్పూరపు వెంకటనారాయణగారు | గుంటూరు |
| ,, మంతెన సత్యనారాయణరాజుగారు | చెరుకుమిల్లి |
| ,, గుంటూరు సీతారామశాస్త్రిగారు | రామగుండం |
| ,, హరేరామ జపయజ్ఞ సమాజము | ,, |
| ,, ఘంటా చిట్టెయ్యగారు | నల్లజర్ల |
| ,, నీరుకొండ వీరరాఘవరావుగారు | ,, |
| ,, సర్వదేవభట్ల రామకృష్ణయ్యగారు | ఖమ్మంమెట్టు |
| ,, శ్రీపాద శరశ్చంద్రమౌళిగారు | అమలాపురం |
| ,, ప్రఖ్య రాధాకృష్ణమూర్తిగారు | అనంతవరం |
| ,, ముష్టి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు | బెజవాడ |
| ,, యస్. పి. కోటిలింగంగారు | హైదరాబాదు |
| ,, పిశుపాటి బంగారుభొట్లుగారు | కరవది |
| ,, ఈశ్వర సీతారామ ధన్వంతరిగారు | శ్రీకాకుళం |
| ,, తురగ రామబ్రహ్మంగారు | తరకటూరు |
| ,, వులిచి ఆదిశేషయ్యగారు | గుంటూరు |
| ,, బులుసు సత్యనారాయణమూర్తిగారు | రాజమండ్రి |

# విషయానుక్రమణికా


| | | |
|---|---|---|
| 1. | మంగళాచరణమ్ | 1 |
| 2. | అనుబంధచతుష్టయమ్ | 3 |
| 3. | సాధనచతుష్టయస్వరూపనిరూపణమ్ | 5 |
| 4. | గురులక్షణ మహిమాదినిరూపణమ్ | 82 |
| 5. | ఆత్మానాత్మవివేకః | 97 |
| 6. | అజ్ఞానస్వరూపనిరూపణమ్ | 99 |
| 7. | ఆనందమయకోశః | 103 |
| 8. | విజ్ఞానమయకోశః | 114 |
| 9. | మనోమయకోశః | 116 |
| 10. | ప్రాణమయకోశః | 123 |
| 11. | అన్నమయకోశః | 139 |
| 12. | అధ్యాసనిరూపణమ్ | 150 |
| 13. | పుత్రాత్మవాదఖండనమ్ | 167 |
| 14. | దేహాత్మవాదఖండనమ్ | 169 |
| 15. | ఇంద్రియాత్మవాదఖండనమ్ | 171 |
| 16. | ప్రాణాత్మవాదఖండనమ్ | 173 |
| 17. | మన ఆత్మవాదఖండనమ్ | 174 |
| 18. | బుద్ధ్యాత్మవాదఖండనమ్ | 176 |
| 19. | అజ్ఞానాత్మవాదఖండనమ్ | 177 |
| 20. | చిజ్జడాత్మవాదఖండనమ్ | 179 |
| 21. | శూన్యాత్మవాదఖండనమ్ | 180 |
| 22. | ఆత్మస్వరూపనిరూపణమ్ | 182 |
| 23. | తత్త్వమసి వాక్యార్థనిరూపణమ్ | 219 |
| 24. | సమాధితద్విశేషస్వరూపనిరూపణమ్ | 247 |
| 25. | జీవన్ముక్త్యాదిలక్షణమ్ | 292 |

శ్రీ శివాయ గురవేనమః

# శంకర గ్రంథరత్నావళి

## సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహము

శ్లో॥ అఖండానంద సంబోధో వన్దనాద్యస్య జాయతే,
గోవిన్దం తమహం వన్దే చిదానన్దతనుం గురుమ్. ౧

తాత్పర్యము : నేను సచ్చిదానన్దస్వరూపులును మా గురువులును నగు శ్రీ మద్గోవిన్ద భగవత్పూజ్యపాదులను నమస్కరించుచున్నాను. వారు (సాక్షాత్కరించుకొనబడిన) స్వస్వరూపానందానుభవముగలవారు. అందుచేత వారికి వన్దనమాచరించు శిష్యులకు సైతము స్వాత్మానన్దానుభవ మభివ్యక్తమగును.

శ్లో॥ అఖండం సచ్చిదానన్ద మవాఙ్మానస గోచరమ్,
ఆత్మాన మఖిలాధార మాశ్రయేఽభీష్ట సిద్ధయే. ౨

తా॥ నేను నిత్యానందరూపమగు మోక్షము లభించుటకై నా నిజరూపమైన బ్రహ్మస్వరూపము నాశ్రయించుచున్నాను. అది సచ్చిదానన్దాత్మకము. నిరవయవము. ప్రపంచముయొక్క సృష్టి స్థితి లయములకు కారణము. దానియందు జాతి, గుణము, క్రియ, నామము మున్నగు నవేమియును లేవు. అందుచే నా బ్రహ్మమును, శబ్దములు బోధింపలేవు. మరియు బ్రహ్మమునకు చక్షురాదీన్ద్రియ గోచరమగు రూపమేమియు లేదు. కావున మనస్సునకు గూడనది విషయము గాకున్నది. అట్టి బ్రహ్మస్వరూపమును సద్గురూపదిష్టమార్గములచే నిరన్తరమనుసంధానము చేసికొనుచున్నాను. అనగా మాయా కల్పితములగు దేహేన్ద్రియాదులందుగల "నేను" "నాది" యను నభిమానమును విడనాడి, సర్వసాక్షియగు నాత్మస్వరూపమునే నేనైతినని భావించుచున్నానని భావము.

శ్లో॥ యదాలంబో దరం హన్తిసతాం ప్రత్యూహ సంభవమ్,
తదా లంబే దయాలంబం లంబోదరపదద్వయమ్. 3

తా॥ వినాయకుని పాదపద్మద్వన్ద్వమును నమస్కరించు వారలకు విఘ్నము లన్నియు నశించుచున్నవి. భయములు తొలగి పోవుచున్నవి. కావున నట్టి దయామయుడగు గణనాథునకు సేవస్సన మాచరించెదను.

శ్లో॥ అర్థతోఽప్యద్వయానన్ద మతీతద్వైతలక్షణమ్,
ఆత్మారామ మహంవన్దే శ్రీగురుం శివవిగ్రహమ్. 4

తా॥ నేను మా పరమ గురువులగు శ్రీ గౌడపాదాచార్యుల వారిని పూజించుచున్నాను. వారికి అద్వయానన్దులను నామాన్తరము గలదు. వారు జీవన్ముక్తులగుటచే శోకమోహాది సంసారధర్మముల నతిక్రమించి, నిరన్తర మాత్మారాములై తమ నామధేయము నన్వర్థమొనరించు కొనినారు. మరియు వారు యోగాభ్యాసపాటవముచే సిద్ధశరీరులై మాండూక్యోపనిషదర్థ వివరణరూపంబులగు కారికలను రచించి వేదాన్త సిద్ధాన్తమునంతయు ప్రపంచమునకు వెల్లడించి యున్నారు. అందుచేవారు శిష్యులను తరింపజేయుటకై యవతరించిన శివస్వరూపులనుటలో సందియము లేదు.

శ్లో॥ వేదాన్తశాస్త్రసిద్ధాన్త సారసంగ్రహ ఉచ్యతే,
ప్రేక్షావతాం ముముక్షూణాం సుఖబోధోపపత్తయే. 5

తా॥ దుఃఖరూపమగు జనన మరణాది సంసారబన్ధమునుండి విడుదలను గోరు బుద్ధిమంతులకు, స్వాత్మస్వరూపము సులభముగా దెలియుట కొరకై వేదాన్తశాస్త్రము నందలి సిద్ధాన్తములయొక్క సారము నంతను సంగ్రహముగా బోధించెడి యొకగ్రన్థమును రచించుచున్నాను.

శ్లో॥ అస్య శాస్త్రానుసారిత్వా దనుబన్ధ చతుష్టయమ్,
యదేవ మూలం శాస్త్రస్య నిర్దిష్టం తదిహోచ్యతే. ౬

తా॥ ఏగ్రన్థము నందైనను చదువువారలకు ప్రవృత్తిగలుగ వలయు ననిన, "విషయము ప్రయోజనము సంబన్ధము అధికారి" యను ననుబన్ధ చతుష్టయము ముఖ్యముగా దెలియ బడవలయును. కావున నీ గ్రన్థము వేదాన్త శాస్త్రము ననుసరించునదగుటచే వేదాన్తశాస్త్రమునకుఁ జెప్ప బడిన యనుబన్ధ చతుష్టయమే యిచటఁ జెప్పబడుచున్నది.

శ్లో॥ అధికారీచ విషయః సంబన్ధశ్చ ప్రయోజనమ్,
శాస్త్రారంభఫలం ప్రాహు రనుబన్ధ చతుష్టయమ్. ౭

తా॥ అధికారి, విషయము, సంబన్ధము, ప్రయోజనము అను నీ యనుబన్ధములు నాల్గును శాస్త్రారంభ మను ఫలమునకు నిమిత్తమని పండితులు వచించుచున్నారు. (యెచ్చట నుండునో యచ్చటనే శాస్త్రము నారంభింపవలయునని పండితులు వచించుచున్నారు.) ప్రాయికముగా నీ యనుబన్ధ చతుష్టయమునుబట్టియే పాఠకులు దీనియందు ప్రవృత్తులగు చుందురు.

శ్లో॥ చతుర్భి స్సాధనై స్సమ్య క్సంపన్నో యుక్తిదక్షిణః,
మేధావీ పురుషో విద్వా నధికార్యత్ర సమ్మతః. ౮

తా॥ నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థఫలభోగ విరాగము, శమాదిషట్క సంపత్తి, ముముక్షుత్వము అను నీ నాల్గుసాధనములతో గూడుకొనినవాడును, సందిగ్ధ విషయములను సక్రమముగా నిర్ణయించు కొనెడి బుద్ధి సామర్థ్యముగలవాడును, గురువులు చెప్పిన రహస్యములను జ్ఞాపకముంచుకొనెడి వాడును, శాస్త్రజ్ఞానముగలవాడును, బ్రహ్మముగల దనెడి నిశ్చయాభిప్రాయముతో గూడుకొనినవాడునునగు పురుషుడు

వేదాన్తశాస్త్రాధ్యయనము జేయుటకు ముఖ్యమైన యధికారియగుచున్నాడు.

శ్లో॥ విషయ శ్శుద్ధచైతన్యం జీవబ్రహ్మైక్య లక్షణమ్,
యత్రైవ దృశ్యతే సర్వవేదాన్తానాం సమన్వయః. ౯

తా॥ మాయాసంబన్ధములేని శుద్ధబ్రహ్మస్వరూపము వేదాన్తశాస్త్రమునఁ జెప్పబడు ముఖ్యవిషయమగుచున్నది. ఎట్లనగా సచ్చిదానన్దరూపంబగు పరబ్రహ్మము, సంసారకాలమునందు, మాయాసంబన్ధమువలన నీశ్వరుడనియు, అన్తఃకరణసంబన్ధమువలన జీవుడనియు వ్యవహరింపబడుచున్నది. ఇట్టియెడ వేదాన్త వాక్యము లన్నియు నుపక్రమోపసంహారాదులచే, జీవేశ్వరులకిరువురకు గల యుపాధిద్వయమును నివారించి, పరిశిష్టమగు చైతన్యమాత్రమున కభేదమును బోధించుచున్నవి.

శ్లో॥ ఏత దైక్యప్రమేయస్య ప్రమాణస్యాపి చ శ్రుతేః,
సంబన్ధః కథ్యతే సద్భి ర్బోధ్యబోధకలక్షణః. ౧౦

తా॥ జీవబ్రహ్మైక్య మనెడి విషయమునకును, వేదాన్తశాస్త్ర మనెడి ప్రమాణమునకునుగల, సంబన్ధము, బోధ్యబోధకభావరూపమగునని పండితులు వచించుచున్నారు. బోధ్యమనగా, తెలియ దగినదగు జీవబ్రహ్మైక్యము. బోధకమనగా, తెలియజేయునదగు వేదాన్తశాస్త్రము. ఆ రెంటికిగల సంబన్ధము బోధ్యబోధకలక్షణ మనబడుచున్నది.

శ్లో॥ బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానం సన్తః ప్రాహుః ప్రయోజనమ్,
యేన నిశ్శేషసంసార బన్ధా త్సద్యః ప్రముచ్యతే. ౧౧

తా॥ జీవబ్రహ్మ లిరువురు నొకటే యను అపరోక్ష జ్ఞానము గలుగుటయే వేదాన్తశాస్త్రమునకు పరమ ప్రయోజనము. అట్టి జ్ఞానము గలుగగనే సంసారబన్ధము లన్నియు నశించి పోవుచున్నవి.అనగా జీవుడు

సంసారకాలమునందున జ్ఞానముచే తాను కాని, దేహేన్ద్రియాదులను తానని భ్రమించుచున్నవాడై వాని ధర్మము లన్నింటిని తనయం దారోపించుకొని సంసారదుఃఖముల ననుభవించుచున్నాడు. జ్ఞానము కలిగిన పిమ్మట మాత్రము, సచ్చిదానన్దరూపంబగు బరబ్రహ్మమే తాననియు, దేహేన్ద్రియ సంఘాతాదికము మిథ్యాకల్పితమైన దనియు నిశ్చితమగుటచే దేహధర్మంబులగు జరామరణాదులనుండియు, చక్షురాదీన్ద్రియ ధర్మములగునంధత్వమూకత్వాదులనుండియు, ప్రాణధర్మములగు నాకలి దప్పికలనుండియు, మనోధర్మములగు శోకమోహాదులనుండియు విముక్తుడగు చున్నాడు.

శ్లో॥ ప్రయోజనం సంప్రవృత్తేః కారణం ఫలలక్షణమ్,
ప్రయోజన మనుద్దిశ్య నమన్దోఽపి ప్రవర్తతే. ౧౨

తా॥ లోకమునందు మూఢజనులు సైతము ప్రయోజనము నభిలషించియే యేదైన నొక కార్యమును జేయుచుందురు. కావున వేదాన్తశాస్త్రాధ్యయనమునందు మానవులకు బ్రవృత్తిగలుగ వలయుననిన దానివలనఁ గలిగెడి ఫలమును గ్రన్థారంభమునందే నిరూపింపవలయును.

శ్లో॥ సాధనచతుష్టయ, (సు)సంపత్తి ర్యస్యాస్తి ధీమతః పుంసః,
తస్యైవై తత్ఫలసంసిద్ధి ర్నాన్యస్య కించి దూనస్య. ౧౩

తా॥ మరియు నెవనికి సాధన చతుష్టయ సంపత్తి సంపూర్ణముగా నుండునో, వానికే సంసారబన్ధమునుండి విడుదల యనెడి ఫలము లభించునుగాని, కొన్ని సాధనములు తక్కువగానున్న వానికి మాత్రము పూర్వోక్తఫలము సిద్ధింపదు.

శ్లో॥ చత్వారి సాధనాన్యత్ర వదన్తి పరమర్షయః,
ముక్తి ర్యేషాం తు సద్భావే నాభావే సిధ్యతి ధ్రువమ్. ౧౪

తా॥ మోక్షము సిద్ధించుటకు, నాల్గుసాధనములుగలవని మహర్షులు వచించుచున్నారు. ఆ నాల్గుసాధనములు, సంభవించినప్పుడే ముక్తి లభించునుగాని యవి లేకున్నచో ముక్తి లభింపనేరదు.

శ్లో॥ ఆద్యం నిత్యానిత్యవస్తు వివేకస్సాధనం మతమ్,
ఇహాముత్రార్థఫలభోగవిరాగో ద్వితీయకమ్. ౧౫

శ్లో॥ శమాదిషట్కసంపత్తి స్తృతీయం సాధనం మతమ్
తురీయంతు ముముక్షుత్వం సాధనంశాస్త్రసమ్మతమ్.౧౬

తా॥ నిత్యానిత్యవస్తువులను వివేచనము చేయుట యనునది ప్రథమసాధనము. ఇహలోక పరలోక విషయభోగము లందాసక్తి లేకుండుట యనునది ద్వితీయ సాధనము. "శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ సమాధానము" అనునవి గలిగియుండుట యనునది తృతీయ సాధనము. (శమాదులయొక్క లక్షణములు రాబోవు శ్లోకములలో వివరింపబడనున్నవి) మోక్షమునందు వాంఛగలిగి యుండుట యనునది చతుర్థసాధనము.

శ్లో॥ బ్రహ్మైవ నిత్యమన్యత్తు హ్యనిత్య మితి వేదనమ్,
సోఽయం నిత్యానిత్యవస్తువివేక ఇతి కథ్యతే. ౧౭

తా॥ "సచ్చిదానన్దరూపంబగు పరబ్రహ్మ మొక్కటియే సర్వకాలములందును సత్యమైయున్నది." "తద్భిన్నమగు ప్రపంచం బంతయు వశాశ్వతమగుచున్నది." అని వివేచనచేసి తెలిసికొనుటయే నిత్యానిత్య వస్తు వివేకమనబడుచున్నది.

శ్లో॥ మృదాది కారణం నిత్యం త్రిషుకాలేషు దర్శనాత్,
ఘటాద్యనిత్యం తత్కార్యంయత స్తన్నాశమీక్షతే.౧౮

తా॥ మన్ను మున్నగు కారణ పదార్థము, మూడుకాలములందు నుండునదగుటచే నిత్యమగుచున్నది. ఇక కుండ మున్నగు కార్యపదార్థము మాత్రము పుట్టువునకు పూర్వమును నశించిన పిమ్మట లేకపోవుటచే ననిత్యమగుచున్నది.

శ్లో॥ తథైవైత జ్జగత్సర్వ మనిత్యం బ్రహ్మకార్యతః,
తత్కారణం పరంబ్రహ్మభవేన్నిత్యం మృదాదివత్ .౧౯

తా॥ నామరూపాత్మకంబగు ప్రపంచమంతయు, పరబ్రహ్మము వలన పుట్టిన కార్యమగుటచే ఘటాదులవలె ననిత్యమే యగుచున్నది. జగత్కారణంబగు సచ్చిదానన్ద పరబ్రహ్మము మాత్రము స్వతస్సిద్ధమైన దగుటచే మృదాదులవలె నిత్యమైన దగుచున్నది.

శ్లో॥ సర్గం వక్త్యస్య "తస్మాద్వాఏతస్మా"దితి హి శ్రుతిః,
సకాశా ద్బ్రహ్మణస్తస్మా దన్నిత్యత్వే న సంశయః. ౨౦

తా॥ తైత్తిరీయోపనిషత్తు, ఆకాశము మొదలుగాగల ప్రపంచ మంతయు నద్వితీయ పరబ్రహ్మమువలననే యుత్పన్నమగుచున్నదని బోధించుచున్నది. కావున నీ జగంబంతయు బ్రహ్మకార్యమగుటచే ననిత్యమైన దనుటలో సంశయము లేదు.

శ్లో॥ సర్వస్యా ఽ నిత్యత్వేసావయవత్వేన సర్వత స్సిద్ధే,
వైకుణ్ఠాదిషునిత్యత్వమతిర్భ్రమఏవమూఢబుద్ధీనామ్. ౨౧

తా॥ పుట్టుచున్న ఘటాది పదార్థము లన్నియు నవయవములుగల వగుచున్నవి. అవయవములుగల పదార్థము లన్నియు నశించుచున్నవి ప్రపంచము పుట్టుచున్నది గాన నదియవయవ సహితమనియు ననిత్యయనియు నిశ్చితమగుచున్నది. ఇట్టియెడ సావయవములగు వైకుణ్ఠాదిలోకములను నిత్యములనుగా నెంచి వానినే పరమ ప్రాప్యస్థానములనుగా భావించెడి వారియొక్క యభిప్రాయము భ్రాన్తి మాత్రమేయని యెరుంగవలయును.

శ్లో॥ అనిత్యత్వం చ నిత్యత్వ మేవం యచ్ఛ్రుతియుక్తిభిః,
వివేచనం నిత్యానిత్యవివేక ఇతి కథ్యతే. ౨౨

తా॥ ఈరీతిగా శ్రుతులచేతను యుక్తులచేతను, నిఖిల జగత్కారణం బగు పరబ్రహ్మ మొక్కటియే నిత్యమైనదనియు, తద్భిన్నంబగు కార్య ప్రపంచమంతయు ననిత్యమైనదనియు, విచారణచేసి తెలిసికొనుటయే నిత్యానిత్యవస్తు వివేకమగునని పండితులచే చెప్పఁబడుచున్నది.

శ్లో॥ ఐహికాముష్మికార్థేషు హ్యనిత్యత్వేన నిశ్చయాత్,
నైస్పృహ్యంతుచ్ఛబుద్ధ్యాయత్తద్వైరాగ్యమితీర్యతే. ౨౩

తా॥ నిత్యానిత్యవస్తు వివేకమువలన, నిహపర లోకములందలి భార్యాపుత్రాది పదార్థములన్నియు ననిత్యములని గ్రహించి వానియందు వాంఛలేకుండుటయే వైరాగ్యమనబడునని విద్వాంసులు వచించుచున్నారు.

శ్లో॥ నిత్యానిత్యపదార్థవివేకాత్పురుషస్య జాయతే సద్యః,
స్రక్చందనవనితాద్యా సర్వత్రానిత్యవస్తుని విరక్తిః. ౨౪

తా॥ బ్రహ్మపదార్థ మొక్కటియే నిత్యమైనదనియు, ప్రపంచము నందలి పదార్థములన్నియు ననిత్యములనియు బాగుగా పర్యాలోచన జేసెడి పురుషులకు తత్కాలమందుననే, పుష్పమాలికలు, పరిమళద్రవ్యములు, నారీమణులు మొన్నగు ననిత్య వస్తువులయందంతటను వైరాగ్యము దయించుచున్నది.

శ్లో॥ కాకస్య విష్ఠావ దసహ్యబుద్ధి
ర్భోగ్యేషు సా తీవ్రవిరక్తి రిష్యతే,
విరక్తి తీవ్రత్వనిదానమాహు
ర్భోగ్యేషు దోషేక్షణ మేవ సన్తః. ౨౫

తా॥ కాకిరెట్టనుజూచి యసహ్యపడునట్లు, భార్యా పుత్రాది విషయములనుజూచియు, నసహ్యపడుటయే తీవ్రవిరక్తి యనఁబడుచున్నది.

అది యెట్లు గలుగుననగా, విషయములందలి దోషములను విచారించిన కొలదియు వానియందు వైరాగ్యము దృఢమగుచుండును. విషయ గత దోషములన్నియు రాబోవు శ్లోకములందు వివరింపబడుచున్నవి. సంగ్రహముగా గ్రహింపవలయుననిన; స్త్రీలు మున్నగువిషయములు, నల్ల త్రాచు విషముకంటెగూడ నత్యంతదుష్టము లగుచున్నవి — ఏలయన — విషమనునది, త్రాగువారలను మాత్రమే నశింపఁజేయునుగాని, తన్నుఁ జూచువారలను, వినువారలనుమాత్రమేమియుఁ జేయకున్నది. ఇక వనితాది విషయములన్ననో, యనుభవించువారినేగాక, ద్రష్టలను, శ్రోతలనుగూడ వివశుల నొనరించుచున్నవి. కావున వనితాది విషయగత దోషోత్కర్షము వర్ణనాతీతము,

శ్లో॥ ప్రదృశ్యతే వస్తుని యత్ర దోషో
న తత్రపుంసోఽస్తి పునః ప్రవృత్తిః,
అన్తర్మహాదోషవతీం విజానన్
కోనామవేశ్యా మపి రూపిణీం వ్రజేత్. ౨౯

తా॥ ఏ విషయములందుగల దోషములన్నియు సంపూర్ణముగా దెలియబడునో యా విషయములందు, మానవులు మరల ప్రవర్తింప నిచ్ఛగింపరు. అదియెట్లన – వేశ్యాంగనల నభిలషించెడి, కాముకశిఖామణులు సైతము వారియందు దమ ప్రాణముల నపహరించెడి మహాజాడ్యములుగలవని దెలిసిన పిమ్మట వారిని పొందఁగోరరు గదా!

శ్లో॥ అత్రాఽపిచాఽన్యత్ర తు విద్యమాన
పదార్థ సమ్మార్జన మేవకార్యమ్,
యథాప్రకారార్థ గుణాభిమర్శనం
సందర్శయత్యేవ తదీయదోషమ్. ౩౦

తా॥ ముక్తినిగోరువారు ముందుగా నిహపరలోకపదార్థముల నిజ స్వరూపమును బాగుగాఁ బరిశీలింపవలయును. అట్లు పరిశీలించినచో ఆ పదార్థములందలి దోషములన్నియు స్పష్టముగా భాసింపఁగలవు. దోషములు తెలిసిన పిమ్మట నా పదార్థములందు వాంఛకలుగ నేరము గదా!

శ్లో॥ కుక్షౌ స్వమాతు ర్మలమూత్రమధ్యే,
స్థితిం తదా విట్క్రిమిదంశనం చ,
తదీయకౌక్షేయక వహ్నిదాహం
విచార్యకో వా విరతిం నయాతి. ౨౮

తా॥ ప్రతి మానవుడును, తన తల్లి గర్భమునందుండునప్పుడు మలమూత్రముల నడుమ నున్నవాఁడై వానియందలి పురుగులచే పీడింపఁ బడుచున్నాడు. మరియు తల్లియొక్క జఠరాగ్నిచే దహింప బడు చున్నాడు. ఇదియంతయు, బాగుగా నాలోచించినచో, ప్రతి మనుజు నకును, మరల గర్భవాస మెన్నడును వలదనెడి భావము గలుగ గలదు.

శ్లో॥ స్వకీయ విణ్మూత్ర నిమజ్జనంత
చ్ఛోత్తానగత్యాశయనం తదాయత్,
బాలగ్రహాద్యాహతిభాక్చ శైశవం
విచార్యకో వా విరతిం నయాతి. ౨౯

తా॥ పిల్లలు, పుట్టిన పిమ్మట కొన్నిదినములవరకు తమ మల మూత్రములందే పొరలాడుచుందురు. అటునిటు కదలలేక వెలకిలగానే పడుకొనియుందురు. అప్పుడు వారిని నల్లులు, చీమలు, దోమలుమున్నగునవి కుట్టుచుండును. మఱియు బాలగ్రహము లనేకములు పాలు మున్నగునవి త్రాగనీయక వివిధరీతుల బాధించుచుండును. ఇట్టి బాల్యావస్థను

విచారించినచో నెవరికి విరక్తికలుగకుండును. అందరు విరక్తి నొందగలరని భావము.

శ్లో॥ స్త్రీయోః పరై స్తాడనమజ్ఞభావ
మత్య న్తచాపల్య మసత్క్రియాం చ,
కుమారభావే ప్రతిషిద్ధవృత్తిం
విచార్యకోవా విరతిం నయాతి. 30

తా॥ కౌమారావస్థయందు యుక్తాయుక్త వివేచనముండ నేరదు. అప్పుడు చేయుపనులకు ప్రయోజనముండదు. పెద్దలయందు భక్తి యుండదు. నోటికివచ్చిన మాటలనెల్ల నిశ్శంకముగ మాటలాడుటయు, చేతికిదొరకిన వస్తువులనెల్ల దినుచుండుటయు, తిరుగరాని ప్రదేశముల దిరుగుచుండుటయు సంభవించుచుండును. కనుకనే యట్టియెడ తల్లి, తండ్రి, సోదరులును, ఇరుగుపొరుగువారును దిట్టి కొట్టుచుందురు. ఇట్టి యవస్థనంతయు పరికించినచో నెవరు విరక్తినొందకుందురు?

శ్లో॥ మదోద్ధతిం మాన్యతిరస్కృతిం చ
కామాతురత్వం సమయాతి లంఘనమ్,
తాం తాం యువత్యోదితదుష్టచేష్టాం
విచార్యకోవా విరతిం నయాతి. 31

తా॥ యౌవనమందు మదము ప్రాదుర్భవించును. ఆ మదముచే పూజ్యులగు పెద్దలమాటల నాకర్ణింపక, వారిని తిరస్కరించుచుందురు. స్త్రీలోలురై శాస్త్రమర్యాదల నతిక్రమించి సంచరించుచుందురు. స్త్రీల వచనములనే విశ్వసించి వారుచెప్పిన యకార్యమునెల్ల నాచరించుచుందురు. ఈ విధములగు ననన్తదోషములతోఁగూడుకొనిన యౌవన దశను బాగుగా విచారించినయెడల నెల్లవారలకును దప్పక విరక్తి కలుగగలదు.

శ్లో॥ విరూపతాం సర్వజనా దవజ్ఞాం
సర్వత్రదైన్యం నిజబుద్ధి హైన్యమ్,
వృద్ధత్వ సంభావిత దుర్దశాంతాం
విచార్యకోవా విరతిం నయాతి. 3౨

తా॥ ముసలితనమునందు, శరీరమంత వికృతరూపమును జెందును. జనులందరు నవమానించుచుందురు విషయాభిలాషవృద్ధియగును. కోరిన వస్తువులు లభింపవు. బుద్ధిసామర్థ్యము క్షీణించిపోవును. ఇట్లనేక దుఃఖము లతో గూడుకొనిన వార్థక్యమును విచారించినచో సకల మానవులును విరక్తిని జెందగలరు.

శ్లో॥ పిత్తజ్వరార్శః క్షయగుల్మశూల
శ్లేష్మాదిరోగోదిత తీవ్రదుఃఖమ్,
దుర్గంధ మస్వాస్థ్య మనూనచింతాం
విచార్యకోవా విరతిం నయాతి. 33

తా॥ మరియు, ముసలితనమునందు పైత్యము, జ్వరము, మూల వ్యాధి, క్షయ, గుండెదడ, శూలవ్యాధి, కఫము మున్నగు ననేకవ్యాధుల వలన సహింపనలవిగాని దుఃఖము సంభవించును. దేహమంతయు దుర్గంధ మేర్పడును. శరీరమున కేంతమాత్రమును స్వస్థతయుండదు. బంధ వియోగాదులవలనను, భార్యాపుత్రాదులు తనయనంతర మేమగుదురో యను విచారమువలనను, తాను యెట్టి నరకలోకములను జెందుదునో యను భయమువలనను, చిత్తము పలురకములుగా పరితపించుచుండును? ఈ దుఃఖముల నన్నింటిని విచారించినచో నెవరు విరక్తిబొందకుందురు.

శ్లో॥ యమావలోకోదిత భీతికంప
మర్మవ్యథోచ్ఛ్వాసగతీ శ్చ వేదనామ్,

ప్రాణప్రయాణే పరిదృశ్యమానాం
విచార్యకో వా విరతిం నయాతి. 38

తా॥ మరణకాలమునందు యమదర్శనమగును. యముని చూచినంతనే విపరీతమగు భయముగలుగును. శరీరమంతయు వణకిపోవును. యముడు తనపాశములతో స్థూలశరీరమునుండి సూక్ష్మశరీరమును లాగుచుండగా నవయవసన్ధి భాగములం దత్యన్త బాధగలుగును. ప్రాణవాయువు శరీరమునందలి సకలస్థానములనుండియు సంకోచమునొందినదై కంఠమునందు మాత్రము ఊర్ధ్వశ్వాసతో సంచరించుచుండును. అప్పుడు గలుగు దుఃఖము వర్ణనాతీతము. కావున నిదియంతయు విచారించినచో నందరు విరక్తి నొందగలరు.

శ్లో॥ అంగారనద్యాం తపనేచకుంభీ
పాకేఽపి వీచ్యా మసిపత్రకాననే,
దూతైర్యమస్య క్రియమాణబాధాం
విచార్యకో వా విరతిం నయాతి. 39

తా॥ దేహపాతానన్తరము జీవులుతమ పాపకర్మములననుసరించి నరకలోకమునకు బోవుదురు. అప్పుడు వారిని యమభటులు, నిప్పుకొండ్లనది యందును, కాగుచున్న నూనెగంగాళములందును బడద్రోయుదురు. కత్తులవలె సన్న యాకులుగల గంభీరారణ్యములందు నడిపించుదురు. మరియు, వీచి - తపనము మున్నగు నరకవిశేషస్థానములందు వివిధముగా హింసించుచుందురు. ఇది యంతయు విచారించినచో నెవరికి విరక్తి కలుగకుండును.

శ్లో॥ పుణ్యక్షయే పుణ్యకృతో నభస్థై
ర్నిపాత్యమానాన్ శిథిలీకృతాంగాన్,

నక్షత్రరూపేణ దివశ్చ్యుతాం స్తాన్
విచార్యకోవా విరతిం నయాతి. ౩౬

తా॥ మనుష్యలోకమునందు, శ్రుతిస్మృతి బోధితములైన పుణ్యకర్మముల నాచరించిన మానవులు, తమ పుణ్యఫలానుభవమునకై స్వర్గలోకమునకుబోయి యచ్చటి సుఖము ననుభవించి తిరుగ పుణ్యము క్షీణించినతోడనె దేవతలచే క్రిందకి బడద్రోయబడినవారై నక్షత్రరూపములద్వారా భూలోకమున ప్రవేశించుచున్నారు, ఇట్టివారల స్థితి నాలోచించినచో స్వర్గలోకసుఖములందు సైత మెవ్వరికి నీవాంఛ గలుగనేరదు.

శ్లో॥ వాయ్వర్క వహ్నీన్ద్ర ముఖాన్ సురేన్ద్రా
నిశోగ్రభీత్యా గ్రథితాన్తరంగాన్,
విపక్షలోకైః పరిదూయమానాన్
విచార్యకోవా విరతిం నయాతి. ౩౭

తా॥ ఇన్ద్రుడు, సూర్యుడు, యముడు, అగ్ని, వాయువు మున్నగు దిక్పాలకులుగూడ భగవంతునివలన భయముచేతనే, తమ తమ పనులను, యథాక్రమముగా నాచరించుచున్నారనియు, అప్పుడప్పుడు రాక్షసులచే బాధింపబడుచుందురనియు, శ్రుతులు బోధించుచున్నవి. ఈ రహస్యమును గుర్తించినవారు లోకాధిపతుల యాధిపత్యమునుగూడ నభిలషింపరుగదా!

శ్లో॥ శ్రుత్యానిరుక్తం సుఖతారతమ్యం
బ్రహ్మాన్త మారభ్య మహామహేశమ్,
ఔపాధికం తత్తు న వాస్తవంచే
త్యాలోచ్యకోవా విరతిం నయాతి. ౩౮

తా॥ తైత్తిరీయోపనిషత్తునందు సకలభూమి భోగసంపన్నుడగు మహారాజు మొదలు సగుణబ్రహ్మపర్యన్తమునను భవించుచున్న యానన్ద ముత్తరోత్తర ముత్కృష్టతమమైనదని చెప్పబడుచున్నది. అట్టి యానన్ద మంతయు వారివారి యన్తఃకరణములందలి సత్వగుణముయొక్క యాధిక్యము ననుసరించి యభివ్యక్తమగు ప్రతిబింబానన్దమేగాని, వాస్తవికమైన బింబభూతబ్రహ్మానన్దము మాత్రముగాకున్నది. ఈ తత్త్వమును గుర్తించిన వారు, శాశ్వతమైన నిర్గుణ బ్రహ్మానన్ద ప్రాప్తికే యత్నింతురుగాని, సార్వభౌమాద్యున్నత పదవులను తజ్జన్యమగు నానందమును కాంక్షింప నేరరు.

శ్లో॥ సాలోక్య సామీప్య సరూపతాది
భేదస్తు సత్కర్మవిశేషసిద్ధః,
నకర్మసిద్ధస్యతు నిత్యతేతి
విచార్యకోవా విరతిం నయాతి. 35

తా॥ సాలోక్యము విష్ణులోకమును బొందుట; సామీప్యము విష్ణుసమీపమునందుండుట, సారూప్యము విష్ణురూపముతో సమానమగు మరియొక రూపమును జెందుట) మున్నగునవన్నియు ముక్తివిశేషములన బడుచున్నవి. ఇట్టి ముక్తులయందు జీవేశ్వరభేదము తొలగకుండుటచే ముక్తులైన జీవులందరును భగవత్పరతన్త్రులై భయముతోనే కూడుకొని యుందురు. మరియు నీ ముక్తవిశేషములన్నియు శ్రౌతస్మార్త సత్కర్మా నుష్ఠానములవలన సిద్ధించుచున్నవి. కర్మజన్యములన్నియు ననిత్యము లేయగునని శ్రుతులును యుక్తులును నిర్ధారణ జేయుచున్నవి. కావున బుద్ధిమంతులగు విద్వాంసులు, భయరహితంబును శాశ్వతంబునునగు సాయుజ్యముత్తను బ్రహ్మకైవల్యమునే కోరుచుందురుగాని భయగ్రస్తములును ననిత్యములును నగు సాలోక్యాదిముక్తులకొరకై యత్నము జేయరు.

శ్లో॥ యత్రాస్తిలోకే గతితారతమ్య
ముచ్చావచత్వా న్వితమత్ర తత్కృతమ్,
యథేహ తద్వత్ఖలుదుఃఖ మస్తి
త్యాలోచ్యకోవా విరతిం నయాతి. ౪౦

తా॥ ఈ లోకమున చిన్నపదవులందుండు వారలు ఉన్నత పదవులందుండు వారలనుజూచి యసూయనొందుటయు, దుఃఖపడు చుండుటయు సర్వజనానుభవ సిద్ధమైయున్నది. ఇటులనే స్వర్గాదిలోకము లందుఁగూడ నింద్రాదిదేవతాస్థానములన్నియు తరతమభావసమన్వితము లైనవగుటచే దుఃఖమిశ్రితములే యగుచున్నవని శ్రుతులచేతను, యుక్తుల చేతను, నిశ్చిత మగుచున్నది. కావున నీ రహస్యము నెరింగిన బుద్ధిమంతు లందరు, నిఖిలలోకసుఖములందును విరక్తినొంది తీరుదురు.

శ్లో॥ కో నామలోకే పురుషోవివేకీ
వినశ్వరే తుచ్ఛసుఖే గృహాదౌ,
కుర్యాద్రతిం నిత్య మవేక్షమాణో
వృథైవ మోహా న్మ్రియమాణజన్తూన్. ౪౧

తా॥ లోకమున మానవులు శరీరాదులందు "నేను, నాది" యను నభిమానముగలవారై తుచ్ఛసుఖముకొరకు, గృహభార్యాపుత్రాది నశ్వర పదార్థములందు నాసక్తిగలిగి పరమపురుషార్థమగు మోక్షమునుపొందకయే వ్యర్థముగా మృతినొందుచున్నారు. ఇట్టి మానవులను నిరన్తరము జూచు చున్న బుద్ధిమంతుఁ డెవఁడును గృహాద్యనిత్య విషయము లందాసక్తి నొంద నేరడు గదా!

శ్లో॥ సుఖం కి మ స్త్యత్ర విచార్యమాణే
గృహేఽపివా యోషితి వా పదార్థే,
మాయాతమోఽన్ధీకృతచక్షుషో యే
తఏవ ముహ్యన్తి వివేకశూన్యాః. ౪౨

తా॥ నిజముగా నాలోచించినచో, గృహమునందుగాని, భార్యా పుత్ర ధనాదులందుగాని, యెంతమాత్రమును సుఖము లేదు. కావుననే అజ్ఞానముచే నావరింపబడిన వివేకదృష్టిగల మూఢజనులు, గృహవనితాదులందు సుఖముగలదని భ్రమించుచున్నారుగాని, విజ్ఞానవంతులగు విద్వాంసులు మాత్రము మోహము నొందరు.

శ్లో॥ అవిచారితరమణీయం సర్వ
ముదుంబరఫలోపమం భోగ్యమ్,
అజ్ఞానా ముపభోగ్యం న తు
తజ్జ్ఞానాం పరంహేయం (యోషితివాపదార్థే.) ౪౩

తా॥ మేడిపండు పైనజూచినచో మిక్కలి రమ్యముగా నుండును. దాని పొట్ట విచ్చిజూచిన ననేక క్రిములుండును. అటులనే, భార్య మున్నగు పదార్థములన్నియును, బహిర్భాగమునందు మాత్రము బహు సుందరముగా నుండునుగాని, లోపలమాత్రము, మలమాంసాది దోషములతోగూడుకొని యున్నవి. కనుకనే తెలివిలేని యవివేకులు భార్యాది భోగముల నభిలషింతురుగాని, వివేకులగు విద్వాంసులకుమాత్రము వాని యందు వాంఛయే గలుగదు.

శ్లో॥ గతేఽపి తోయే సుచిరం కుళీరో
హాతుం హ్యశక్తో మ్రియతే విమోహాత్,

యథా తథా గేహసుఖానుషక్తో
వినాశ మాయాతి నరో భ్రమేణ. ౨౨

తా॥ ఎండ్రకాయ చెరువులోనినీరు ఎండిపోయినను, తనకు నివాసస్థానమైన భూరన్ధ్రమునందలి యభిమానముచే దానిని విడువలేక తుదకు నచ్చటనే మరణించుచున్నది. అట్లే గృహస్థులును, భార్యాపుత్రాదులందలి యభిమానముచే గృహములు విడువలేక యచ్చటనే సమస్తదుఃఖముల ననుభవించు చున్నవారై యవసానకాలమునందు గృహాద్యభిమానముతోడనే మృతినొందుచున్నారు.

శ్లో॥ కోశక్రిమి స్తన్తుభి రాత్మదేహ
మావేష్ట్య చావేష్ట్య చ గుప్తి మిచ్ఛన్,
స్వయం విసిర్గన్తు మశక్తఏవసన్
తత స్తదన్తే మ్రియతే చ లగ్నః. ౨౫

శ్లో॥ యథాతథాపుత్రకళత్రమిత్ర
స్నేహానుబన్ధైర్గ్రథితో గృహస్థః,
కదాఽపి వాతాన్పరి ముచ్య గేహా
ద్గన్తుం న శక్తో మ్రియతే ముధైవ. ౨౬

తా॥ పట్టుపురుగు తన శరీరమును రక్షించుకొనదలచి, తన నోటినుండి వెలువడు దారములచే తన శరీరమును పలుమార్లు దట్టముగా జుట్టుకొని తుదకు దానినుండి బయటకి రాద్రోవలేక యచ్చటనే మరణించుచున్నది. ఆ విధముననే మానవుడును తాను ఒంటరిగా నున్నచో బ్రతుకలేనని తలచి, తన రక్షణమునకై క్రమముగా భార్య, గృహము, ధనము, పుత్రులు, మిత్రులు మున్నగువారలను సంపాదించుకొని, వారియందు

పలువిధములైన ప్రేమాతిశయములను ప్రసరింపజేసికొని, వృద్ధదశయందు సైతము, వారలకును తనకునుగల ప్రేమపాశములను త్రెంచుకొనలేనివాడై, స్వస్వరూపసాక్షాత్కారమునకు సాధనముగా భగవంతునిచే ప్రసాదింపబడిన మనుష్య జన్మమును నిరర్థకముజేసి కాలధర్మమొందుచున్నాడు.

శ్లో॥ కారాగృహాశ్యాఽస్య చ కో విశేషః
ప్రదృశ్యతే సాధు విచార్యమాణే,
ముక్తేః ప్రతీపత్వ మిహాఽపి పుంసః
కాన్తా సుఖాభ్యర్థిత కర్మపాశైః. ౪౮

తా॥ బాగుగ పరిశీలించినచో, గృహమునకును, చెరసాలకును, భేదమేమియు గన్పట్టదు. చెరసాలయందుండు మానవుడు ఇనుపసంకెళ్లచే బంధింపబడినవాడై దానినుండి విడుదల నొందలేకున్నాడు. అటులనే గృహస్థుడు భార్యాపుత్రాదుల యందలి ప్రేమపాశములచే బద్ధుడై వారి వలననే సుఖమునొందుటకై యనేక కర్మల నాచరించుచు సంసారమునుండి ముక్తిని పొందనేరకున్నాడు.

శ్లో॥ గృహస్పృహా పాదనిబద్ధశృంఖలా
కాన్తా సుతాశా పటుకణ్ఠపాశః,
శీర్షే పత ద్భార్యశనిర్హి సాక్షాత్
ప్రాణాన్తహేతుః ప్రబలా ధనాశా. ౪౯

తా॥ గృహస్థునకు గృహమునందలి యభిమానము కాళ్లకు గట్టబడిన ఇనుపగొలుసు వంటిది. కాలిగొలుసు కదలనీయదు. అటులనే గృహాభిమానము గలవారు, గృహములను వదలి గంగాదితీర్థములను, కాశీ మున్నగు పవిత్రక్షేత్రములను, దర్శింపనేరకున్నారు. ఇక భార్యాపుత్రా

తా॥ లోకమున మిడుత అగ్నిజ్వాలనుజూచి, రమ్యమగు ఫలమను కాశతో దానియందుపడి నశించుచున్నది. అటులనే వివేకహీనుడగు పురుషుడు భార్యాపుత్రాదులవలన సుఖము కలుగునని భ్రమించి సంసారమున నిమగ్నుడై అనేకానర్థ పరంపరల నొందుచున్నాడు. ఇట్టి మోహాస్థను మోక్షమునొందుట దుర్లభము.

శ్లో॥ మాంసాస్థిమజ్జా మలమూత్రపాత్రమ్
స్త్రీయం స్వయం రమ్యతరైవ పశ్యతి,
కామేన కాన్తాం పరిగృహ్య తద్వత్
జనోఽప్యయం నశ్యతి నష్టదృష్టిః. ౫౩

తా॥ వివేక జ్ఞానములేని మానవుడు మలమూత్ర భూయిష్ఠమగు స్త్రీ స్వరూపమును రమ్యముగా నెంచి దాని పరిగ్రహముచే మిడుతవలెనే సుఖము నొంద నేరకున్నాడు.

శ్లో॥ కామఏవ యమః సాక్షాత్ కాన్తా వైతరణీ నదీ,
వివేకినాం ముముక్షూణాం నిలయస్తు యమాలయః. ౫౪

తా॥ మంచిచెడ్డల నెరిగిన ముముక్షుజనులకు విషయ వాంఛయే యముడుగాను, భార్యయే వైతరణీనదిగాను, గృహమే యమనిలయముగాను భాసించుచుండును.

శ్లో॥ యమాలయే వాపి గృహేఽపి నో నృణామ్
తాపత్రయక్లేశ నివృత్తి రస్తి,
కిం చిత్రమాలోక్యతు తద్విశామమ్
సుఖాత్మనా పశ్యతి మూఢలోకః. ౫౫

తా॥ గృహమునందును, యమలోకమునందును, దుఃఖానుభవము సమానము. గృహమునందు, విషయానుభవకాలమువను, సుషుప్తికాలము

నను కొలదికాలము మాత్రము దుఃఖము లేనటులుండును. అంతమాత్రముననే మూఢులగువారు, గృహమునందు సుఖముగలదని పొరబడుచున్నారు.

శ్లో॥ యమస్య కామస్య చ తారతమ్యమ్
విచార్యమాణే మహ దస్తి లోకే,
హితం కరోత్యస్య యమోఽప్రియస్సన్
కామ స్త్వనర్థం కురుతే ప్రియస్సన్. ౫౬

తా॥ మన్మథుడు మంచివాడనియు యముడు చెడ్డవాడనియు లోకులయభిప్రాయము. కాని బాగుగా పరిశీలించినచో మన్మథుని కంటె యముడే మిక్కిలి క్షేమం కరుడని చెప్పక తప్పదు. ఏలయన యముడు లోకులకు నరకలోకబాధల నొనగూర్చుట ద్వారా వారి పాపములను నశింపజేయుచున్నాడు. మన్మథుడు మాత్రము విషయభోగముల నొడగూర్చుటచే మిత్రునివలె గన్పట్టుచు, పలురకములైన పాపముల నాచరించుటకు కారణభూతుడై బహుదుఃఖములనే కలిగించుచున్నాడు.

శ్లో॥ యమోఽసతామేవ కరో త్యనర్థమ్
సతాంతు సౌఖ్యం కురుతే హితస్సన్,
కామ స్సతా మేవ గతిం నిరుద్ధన్
కరోత్యనర్థం హ్యసతాంను కా కథా? ౫౭

తా॥ యమధర్మరాజు పాపములుచేయు వారలను మాత్రమే బాధించుచున్నాడు. పుణ్యాత్ములను సుఖపెట్టుటయే యతని కృత్యము. ఇక కాముడన్ననో పండితప్రకాండులనే భార్యాపుత్రాది విషయభోగములందు భ్రమింపజేయుచున్నాడు. ఇట్టియెడ పామరులపరిస్థితి వర్ణనాతీతము గదా!

శ్లో॥ విశ్వస్య వృద్ధిం స్వయమేవ కాంక్షన్
ప్రవర్తకం కామిజనం ససర్జ,
తేనైవ లోకః పరిముహ్యమానః
ప్రవర్ధతే చన్ద్రిమసేవ చాబ్ధిః. ౫౮

తా॥ పరమేశ్వరుడు ప్రపంచమును విశేషముగా వ్యాపింపజేయ దలచి కాముకజనులను సృష్టించెను. వారివలననే లోకము విస్తరించుచున్నది కామమనగా శబ్దస్పర్శరూపరసగన్ధాదుల యందలి కోరిక. ఇట్టి కోరిక గలవారు కాముకులు. వీరు తమ కోరిక ననుసరించి భార్యా పుత్ర గృహా క్షేత్రాదులను సంపాదించుకొని వారి యభివృద్ధికొరకై పలురకములైన కర్మల నాచరించుచున్నారు. ఈ రీతిగా ప్రపంచము ప్రవర్ధిల్లుచున్నది.

శ్లో॥ కామో నామ మహాన్ జగద్భ్రమయితా
స్థిత్వాఽన్తరంగే స్వయమ్
స్త్రీపుంసావితరేతరాంగక గుణైర్భావై శ్చభావై స్స్ఫుటమ్,
అన్యోన్యం పరిమోహ్య నైజతమసా ప్రేమానుబన్ధేన తౌ
బద్ధ్వా భ్రామయతి ప్రపంచరచనాం సంవర్ధయన్
బ్రహ్మహా. ౫౯

తా॥ కాముడను మహాబలవంతుడు సర్వమానవుల హృదయము లలో ప్రవేశించి మోహపెట్టుచున్నాడు. బ్రహ్మజ్ఞానము కలుగకుండ జేయుచున్నాడు. ఇతడు స్త్రీ పురుషులకు పరస్పరానురాగము గలిగించి, విషయ వాంఛలనే వృద్ధిజేయుచు వారివలన ప్రపంచమును విస్తరింప జేయు చున్నాడు. అనగా ప్రపంచమున మానవులు బహిర్ముఖులై భార్యా పుత్రాది సుఖములనే కోరుచుందురుగాని, అన్తర్ముఖులై ఆత్మజ్ఞానము కొరకు ప్రయత్నింపకున్నారని భావము.

శ్లో॥ అతో ఽ న్తరజస్థితకామవేగాత్
భోగ్య ప్రవృత్తి స్స్వతఏవ సిద్ధా,
సర్వస్యజన్తో ర్ధ్రువమన్యథాచే
దబోధితార్థేషు కథం ప్రవృత్తిః. ౬౦

తా॥ ప్రతిమానవుడును, మనస్సునందలి కామప్రేరణచేత విషయములందు ప్రవర్తించుచున్నాడు. నిశ్చయము. అట్లుకానిచో పసలు బోధింపకుండ ప్రాణులకు నెట్లు విషయ ప్రవృత్తి కలుగును?

శ్లో॥ తేనైవ సర్వజన్తూనాం కామనాబలవత్తరా,
జీర్య త్యపిచ దేహేఽస్మిన్ కామనానైవ జీర్యతే. ౬౧

తా॥ మనస్సునందలి కామునియొక్క ప్రేరణచేతనే సర్వజనులకును విషయభోగములందు తీవ్రవాంఛ గలుగుచున్నది. కనుకనే శరీరము క్షీణించుచున్నను, విషయవాంఛ మాత్రము క్షీణింపకున్నది.

శ్లో॥ అవేక్ష్య విషయేదోషం బుద్ధియుక్తో విచక్షణః,
కామపాశేన యో ముక్తః స ముక్తేః పథగోచరః. ౬౨

తా॥ ఏ మానవుడు శాస్త్రమును చదువుకొని, యుక్తాయుక్త వివేకముగలవాడై విషయములందలి దోషములను పరిశీలించి వానిని పొంద గోరకున్నాడో అట్టివాడు సులభముగా మోక్షమును బొందును.

శ్లో॥ కామస్య విజయోపాయం
సూక్ష్మం వక్ష్యా మ్యహం సతామ్,
సంకల్పస్య పరిత్యాగః
ఉపాయ స్సులభో మతః. ౬౩

తా॥ ముముక్షువులగు సత్పురుషులకు సులభమగు కామవిజయోపాయమును చెప్పుచున్నాను. మనస్సున నేవిషయమును సంకల్పింపకుండుటను అలవరుచుకొనినచో సులభముగా కాముడు జితుడగును.

శ్లో॥ శ్రుతే దృష్టేఽపి వా భోగ్యే యస్మిన్ కస్మింశ్చ వస్తుని'
సమీచీనత్వ ధీ త్యాగాత్ కామోనోదేతి కర్హిచిత్. ౬౪

తా॥ శాస్త్రములందు వినబడుచున్న స్వర్గలోక భోగములందుగాని ప్రత్యక్షముగా కనబడుచున్న ఇహలోక భోగములందుగాని, 'మంచివి' బాగున్నవి 'అనుభవింపదగినవి' అను భావమును సంపూర్ణముగా విడనాడినచో వానియందు ఎవరికిని ఎప్పుడును కోరిక కలుగదు.

శ్లో॥ కామస్య బీజం సంకల్పః సంకల్పాదేవ జాయతే,
బీజే నష్టే ఽంకుర ఇవ తస్మి న్నష్టే వినశ్యతి. ౬౫

తా॥ సంకల్పించుటవలననే విషయాభిలాష పుట్టుచుండును. సంకల్పము నశించిన విషయవాంఛయు నశించును. విత్తనము నశించిన అంకురము జీవింపదుగదా !

శ్లో॥ న కోఽపి సమ్య క్త్వధియా వినైవ
భోగ్యం నరః కామయితుం సమర్థః,
యత స్తతః కామజయే చ్ఛురేతామ్
సమ్య క్త్వబుద్ధిం విషయే నిహన్యాత్. ౬౬

తా॥ ప్రతిమానవుడును మిక్కిలి 'మంచిద'ను భావముతోడనే భోగ్యపదార్థమును గోరుచున్నాడు. మంచిది కాదని గ్రహించినచో నా వస్తువును గోరనేరడు. కనుక కామజిగీషువులు విషయములందు 'మంచివ' ను భావమును పరిత్యజింపవలయును.

శ్లో॥ భోగ్యే నరః కామజయేచ్ఛురేతామ్
సుఖత్వబుద్ధిం విషయే నిహన్యాత్,
యావ త్సుఖత్వభ్రమధీః పదార్థే
తావ న్న జేతుం ప్రభవేద్ధి కామమ్. ౬౭

తా॥ కామమును జయింప గోరువారు భోగ్యవస్తువులందు, సుఖబుద్ధిని విడువవలయును. విషయములందు సుఖబుద్ధి ఎంతకాలము వరకు నుండునో, అంతవరకు కామమును జయింపనేరరు— విషయములందు 'మంచిదను' బుద్ధియు, 'సుఖకరము' అను బుద్ధియు, నీ రెండే ప్రవృత్తి కారణములు గనుక నీ రెంటిని తప్పక పరిత్యజింపవలయునని భావము.

శ్లో॥ సంకల్పా నుదయే హేతుః యథాభూతార్థ దర్శనమ్,
అనర్థచిన్తనం చాభ్యాం నాఽవకాశోఽస్యవిద్యతే. ౬౮

తా॥ విషయములయొక్క నిజస్వరూపమును, వానివలన సంభవించెడి యనర్థపరంపరలను, బాగుగా నాలోచించినచో వస్తు విషయక సంకల్పము కలుగుటకు నించుకంతయు నవకాశము లేదు.

శ్లో॥ రత్నే యది శిలాబుద్ధి ర్జాయతే వా భయం తతః,
సమీచీనత్వ ధీ ర్నైతి నోపాదేయత్వ ధీ రపి. ౬౯

తా॥ ఒకడు మార్గమున పోవుచుండగా నొక రత్నము గనబడెను. అతడు దానినిజూచి యొకరాతినిగా భావించెనుగాని, రత్నమను కొనలేదు. అప్పుడు అతనికి రాజభటులవలన భయముగాని, 'మంచిది ఈ వస్తువు' అనెడి భావముగాని, స్వీకరింప బుద్ధిగాని కలుగనేరదు.

శ్లో॥ యథార్థదర్శనం వస్తు న్యనర్థస్యాపి చిన్తనమ్,
సంకల్పస్యాపి కామస్య తద్వధోపాయ ఇష్యతే. ౭౦

తా॥ భోగ్యవస్తువుయొక్క యథార్థ స్వరూపమును, దానివలన గలుగు ననర్థములను బాగుగా విచారించినచో నా వస్తువు విషయమై సంకల్పముగాని కోరికగాని పుట్టనేరవు.

శ్లో॥ ధనం భయనిబన్ధనం సతతదుఃఖసంవర్ధనమ్
ప్రచణ్డతరకర్దనం స్ఫుటితబన్ధుసంవర్ధనమ్
విశిష్టగుణబాధనం కృపణధీసమారాధనమ్
న ముక్తిగతిసాధనం భవతి నాఽపి హృచ్ఛోధనమ్. ౨౧

తా॥ ధనము భయమును గలిగించును. దుఃఖముల నభివృద్ధి నొందించును. పరులకు పీడగలిగించు కఠినపు మాటలాడించును. బంధువుల నెక్కువగా సమకూర్చి వారివలన రాగద్వేషముల నభివృద్ధిజేయును. మంచిగుణములను పాడుచేయును. లోభబుద్ధిని పెంపొందించును. మరియు మోక్షమునకుగాని చిత్తశుద్ధికిగాని సాధనముగా నేరదు.

శ్లో॥ రాజ్ఞో భయం చోరభయం ప్రమాదాత్
భయం తథాజ్ఞాతిభయం చ వస్తుతః,
ధనం భయగ్రస్త మనర్థమూలమ్
యతస్తత స్తన్నసుఖాయ కల్పతే. ౨౨

తా॥ ధనమున్నచో రాజులవలనను, దొంగలవలనను, పొరపాటువలనను, బంధువులవలనను, భయము తప్పదు. ధనమిన్ని విధముల భయమునకు అనర్థములకును మూలకారణము. గనుక ధనమువలన సుఖ మెంతమాత్రమును కలుగదు.

శ్లో॥ అర్జనే రక్షణే దానే వ్యయేవాపిచ వస్తుతః,
దుఃఖమేవ సదానౄణాం న ధనం సుఖసాధనమ్. ౨౩

తా॥ మానవులకు ధనమును సంపాదించు నపుడును, దానిని కాపాడునపుడును, ఇతరులకు దానము చేయునపుడును, తమ భోగమునకై ఖర్చు పెట్టునపుడును, దుఃఖమే గలుగుచుండును గాన ధనమువలన సుఖము లేదు.

శ్లో॥ సతా మపి పదార్థస్య లాభా ల్లోభః ప్రవర్ధతే,
వివేకో లుప్యతే లోభాత్ తస్మిన్ లుప్తే వినశ్యతి. ౨౪

తా॥ పండితులకుగూడ ధనము, గృహము, పొలము మున్నగు పదార్థములు లభించినంతనే వానియందు నాశ మెక్కుడగుచుండును. ఎంత లభించినను తృప్తియుండదు. ఇట్టి ధనాశవలన నిరంతరము దాని కొరకే ప్రయత్నింతురు గాని యుక్తాయుక్త కార్యములను గుర్తెరుంగరు. అందువలన ఇహ పరలోక సుఖ సాధనములగు వైదికకర్మల నాచరింపక వ్యర్థముగా జెడిపోవుచుందురు.

శ్లో॥ దహాత్యలాభే నిస్స్వత్వం లాభే లోభో దహాత్యముమ్,
తస్మా త్సంతాపకం విత్తం కస్య సౌఖ్యం ప్రయచ్ఛతి. ౨౫

తా॥ ధనములేనిచో దారిద్ర్యము బాధించును. ధనమున్నచో ధనాశ పీడించును. కనుక ధనమున్నను దుఃఖమే లేకున్నను దుఃఖమే. ఇట్టి ధన మెట్లు సుఖదాయకమగును.

శ్లో॥ భోగేన మత్తతా జన్తోః దానేన పున రుద్భవః,
వృథైవోభయ యథా విత్తం నాస్త్యేవ గతి రన్యథా. ౨౬

తా॥ ధనమువలన భోగముల ననుభవించుచున్నచో మదము వృద్ధి యగుచుండును; పరులకు దానము జేయుచున్నచో, తత్ఫలానుభవమునకై తిరుగ పుట్టుక గలుగును. కనుక నేవిధమున జూచినను ధనము దుఃఖాంతమే యగుచున్నది. మరియొక మార్గ మేమియు లేదు గదా?

శ్లో॥ ధనేన మదవృద్ధిస్స్యాత్ మదేన స్మృతినాశనమ్,
స్మృతినాశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి. ౭౭

తా॥ ధనమువలన మదము గలుగును. మదము అనగా ఎద్ది కార్యమో; ఎద్ది యకార్యమో దాని నెఱుంగకుండుట. దీనినే మోహ మందురు. ఇట్టి మోహమువలన శాస్త్రిముల యొక్కయు గురువుల యొక్కయు; నుపదేశమువలన తెలియబడిన మంచి విషయము లెవ్వియు స్మృతికి రానేరవు. ఈ రీతిగా మంచి విషయములు స్ఫురింపకున్నచో కొంతకాలమునకు బుద్ధికిగల మంచిచెడ్డలను వివేచన చేయు యోగ్యత గూడ నశించును. బుద్ధిగూడ నశించిన పిమ్మట పురుషుడు జీవన్మృతు డనబడు చున్నాడు.

శ్లో॥ సుఖయతి ధనమేవేత్యన్తరాశా పిశాచ్యా
దృఢతరముపగూఢో మూఢలోకో జడాత్మా,
నివసతి తదుపాన్తే సన్తతం ప్రేక్షమాణః
వ్రజతి తదపి పశ్చాత్ ప్రాణ మేతస్య హృత్వా. ౭౮

తా॥ లోకమున మూఢజనులు, ధనమే, తమ్ము సుఖపెట్టునని తలంచి దానియందే ప్రాణముపెట్టుకొని దానినే నిరంతరము జూచుచూ దాని సమీపముననే నివసించు చుందురు. ధనము వ్యయమగు ననుభీతితో ధర్మకార్యములనుగూడ చేయకుందురు. కాని కొంతకాలమునకు ఆ ధన తృష్ణతోడనే తమ ప్రాణములనుగూడ విడుతురు. కనుక ధనమనునది ప్రాణములనుగూడ నపహరించునుగాని సుఖము నెంత మాత్రము గలుగ జేయదు.

శ్లో॥ సంపన్నోఽన్నవదేవ కించి దపరం నోవీక్షతే చక్షుషా
సద్భి ర్వర్జితమార్గ ఏవచరతిప్రోత్సారితో బాలిశైః,

తస్మిన్నేవ ముహుః స్ఖలన్ ప్రతిపదం గత్వాఽన్ధకూపే పత
త్యస్యాఽన్ధత్వనివర్తకౌషధమిదం దారిద్ర్యమేవాంజనమ్.

తా॥ లోకమున గుడ్డివాడు నేత్రములు లేకుండుటచే పదార్థములను చూడలేడు. అటులనే ఐశ్వర్యవంతుడు ధనాభిమానమను మహాదోషముచే నశించిన వివేకదృష్టిగలవాడై 'ధనము', 'దాని ననుభవించుట', 'దానిని దాచుకొనుట' అనునవి తప్ప మరియొక విషయము నేమియు (ఇహలోకమున పరులకు సంబంధించినదిగాని, పరలోకమున తనకు సంబధించినదిగాని) విచారింపలేకున్నాడు. ఇట్టివాడు దుష్టుల దుర్బోధల నాదరించుచు శాస్త్రీయములైన శిష్టాచారములను పరిత్యజించుచున్నాడు. అందుచే ననర్థపరంపరలకు లోనగుచున్నాడు. ఇట్టి దోషమున కంతకును వివేకజ్ఞానము లేకుండుటయను గ్రుడ్డితనము కారణము. దీనికిదారిద్ర్యమను కాటుకయే గొప్ప యౌషధము. అనగా కాటుక గ్రుడ్డివానియొక్క నేత్రదోషమును బోగొట్టును. దారిద్ర్యము ధనికుని ధనాభిమానమును నశింపజేసి ధర్మము నాచరింపజేయుచు క్రమముగా కృతార్థుని జేయును.

శ్లో॥ లోభః క్రోధశ్చ దంభశ్చ మదో మత్సర ఏవచ,
వర్ధతే విత్తసంప్రాప్త్యా కథం తచ్చిత్తశోధనమ్. ౨౦

తా॥ ధనప్రాప్తివలన లోభము, క్రోధము, దంభము, మదము, మత్సరము మున్నగునవి వృద్ధినొందును. లోభమనగా ఎంత ధనము లభించినను, తృప్తిలేక యింతకంటెను మిగుల ధనసంగ్రహముచేయ గోరుట. క్రోధము = భృత్యులు కొలది స్వరము చేసినను, అధికముగా నుద్వేగము నొందుట, దంభము = ప్రతిష్ఠకొరకై ధర్మకార్యముల జేయుట, మదము = మంచిచెడ్డల నాలోచింపకుండుట. మత్సరము = పరులనుజూచి యోర్వలేకుంట. ఇట్టి దోషములుగల ధనమువలన చిత్తమెన్నటికిని పరిశుద్ధముగా నేరదు. చిత్తశుద్ధియనగా, చిత్తమునందలి ప్రాపంచిక విషయవృత్తులన్నియు నశించుట. ధనమువలన దుష్టవృత్తులు వర్ధిల్లునుగాని వృత్తిలయముగా నేరదు.

శ్లో॥ అలాభాత్ ద్విగుణం దుఃఖం విత్తస్య వ్యయసంభవే,
తతోఽపి త్రిగుణం దుఃఖం దుర్వ్యయే విదుషామపి. ౮౧

తా॥ లోకమున పండితులకు గూడ ధనము లేనప్పుడు కలుగు దుఃఖముకంటె ప్రాప్తమగు ధనము వ్యయమగునప్పుడు విచారమతిశయించును. ధర్మకార్యములకొరకు ధనవ్యయమగునప్పుడు తాత్కాలికముగా విచారముగలిగినను, పండితులగుటచే పరలోక సుఖాశతో దానిని సహింతురు. గాని దుర్వ్యయమగునప్పుడు మాత్రము వారి పరితాపము వర్ణనాతీతము.

శ్లో॥ నిత్యాహితేన విత్తేన భయచిన్తాఽనపాయినా,
చిత్తస్వాస్థ్యం కుతో జన్తోః గృహస్థేనాఽహినా యథా.

తా॥ ఇంటిలో పాముగల యజమానునకు మనశ్శాంతియుండదు. నిద్రపట్టదు. ఎప్పుడెవరిని కఱచునో యని భయమే గలుగుచుండును. అటులనే ధనముగల వానికిగూడ చిత్తశాన్తి యుండదు మరియు, రాజులవలనను, దొంగలవలనను, ధనమునకు ఎప్పుడు ఏమి అపాయము గలుగునో యని భయ విచారములే తప్ప ధనమువలన సుఖమిసుమంతయు లేదు.

శ్లో॥ కాన్తారే విజనే వనే జనపదే సేతౌ నిరీతౌ చ వా
చోరైర్వాపి తథేతరైః నరవరైర్యుక్తో వియుక్తోఽపి వా,
నిస్స్వస్స్వస్థతయా సుఖేన వసతి హ్యాద్రియమాణో జనైః
క్లిశ్నాత్యేవ ధనీ సదాఽకులమతిః భీతశ్చ పుత్రాదపి.

తా॥ ధనములేనివాడు మహారణ్యమునందైనను, మరియే ఇతర ప్రదేశమునందైనను, చిన్తలేక సుఖముగా నివసించుచున్నాడు. అతనికి దొంగలవలనను, మరియే ఇతరులవలనను భయములేదు. జనులందరు

రాగద్వేషరహితులై అతని నాదరించుచుందురు. ఇక ధనికుడన్ననో, అడవియందున్నచో దొంగలవలనను, గ్రామమందున్న యాచకులవలనను, గృహమందున్న పుత్రులవలనను; నిరన్తరము భయమునే చెందుచుండును. అతనియొక్క చిత్తము శాన్తముగా నుండదు. విక్షేపములనే నిరన్తరము పొందుచుండును.

శ్లో॥ తస్మా దనర్థస్య నిదాన మర్థః
పుమర్థసిద్ధి ర్నభవత్యనేన,
తతో వనాన్తే నివసన్తి సన్తః
సన్న్యస్య సర్వం ప్రతికూల మర్థమ్. ౮౨

తా॥ పూర్వమందు చెప్పబడిన పలుకారణములచే ధనము అనర్థకారణమని తెలుచున్నది. ధనమువలన మోక్షమను ముఖ్యప్రయోజనము సిద్ధింపదు. కనుకనే మహానుభావులగువారు ధనాభిమానమును వదలి వనప్రాంతములందు హాయిగా నివసించుచున్నారు.

శ్లో॥ శ్రద్ధాభక్తి మతీం సతీం గుణవతీం పుత్రాన్
శ్రుతాన్ సమ్మతాన్
అక్షయ్యం వసుధాన్యభోగవిభవైః శ్రీసున్దరం మన్దిరమ్
సర్వం నశ్వర మిత్యవేత్యకవయః శ్రుత్యుక్తిభి ర్యుక్తిభిః
సన్న్యస్యన్త్యపరేతు తత్సుఖమితిభ్రామ్యన్తి దుఃఖార్ణవే.

తా॥ దూరదృష్టిగల విజ్ఞానవంతులు, వేదవాక్యముల సమన్వయము చేతను, యుక్తుల సహాయమునను, ప్రపంచమంతయు ననిత్యమని గ్రహించి యోగ్యురాలగు భార్యను, పండితులైన మంచి నడవడిగల పుత్రులను, అధికమగు నైశ్వర్యమును, రమ్యమగుగృహమును పరిత్యజించి ఆత్మానన్దము ననుభవించుచున్నారు. ఇక మూఢులు మాత్రము సుఖమగలుగునను

భ్రాన్తిచే భార్యాపుత్రాదులనే నమ్ముకొని, సంసారమున దుఃఖపడు చున్నారు.

శ్లో॥ సుఖ మితి మలరాశౌ యే రమన్తేఽత్ర గేహే
క్రిమయఇవ కళత్రక్షేత్రపుత్రానుషక్త్యా,
సురపదఇవ తేషాం నైవ మోక్షప్రసంగః
త్వపితు నిరయగర్భా వాసదుఃఖప్రవాహాః. ౮౬

తా॥ మలమునందు పురుగులు తిరుగుచుండును. వానికి మల వాసము మలభ్రమణము సుఖముగానే యుండును. అటులనే మూఢు లగు జనులు, భార్యాపుత్రాదులయందలి వ్యామోహముచే పలుదోషములు గల సంసారముననే భ్రమించుచుందురు. ఇట్టి వారలకు మోక్షమెన్నటికిని లభింపదు. జన్మమరణ దుఃఖము తప్పదు. స్వర్గలోకమున భోగములను మాత్ర మనుభవించెడి దేవతలకు ముక్తి దుర్లభమగునటులే, భూలోకమున తమ వర్ణాశ్రమ ధర్మముల నాచరింపక భార్యాపుత్రాదుల తోడనే క్రీడించు మనుజులకును, ముక్తి లభింపకుండుటయేగాక తల్లిగర్భమునను, నరకలోకమునను నిరంతర దుఃఖమే గలుగు చుండునని భావము

శ్లో॥ యేషా మాశా నిరాశాస్స్యాత్ దారాపత్యధనాదిషు,
తేషాం సిద్ధ్యతి నాన్యేషాం మోక్షాశాభిముఖీ గతిః. ౮౭

తా॥ ఎవరికి భార్యాపుత్రాదులయందు అభిమానము నశించునో వారికి మోక్షము సులభము. తదితరులకు మిక్కిలి దుర్లభము.

శ్లో॥ సత్కర్మక్షతపాప్మనాం శ్రుతిమతాం
శుద్ధాత్మనాం ధీమతామ్
నిత్యానిత్యపదార్థశోధనమిదం
యుక్త్యా ముహుః కుర్వతామ్,

తస్మా దుత్తమహావిరక్త్యసిమతాం
మోక్షైకకాంక్షావతామ్
ధన్యానాం సులభం ప్రియాది విషయే
ష్వాశా లతాచ్ఛేదనమ్. ౨౨

తా॥ మహానుభావులగువారు శ్రౌతస్మార్తకర్మల నాచరించు చుందురు. అందుచే వారలకు జ్ఞానము కలుగుటకు నాటంకకరములైన పాపములన్నియు నశించును. రాగద్వేషాదిదోషములు క్షీణించుటచే చిత్తము నిర్మలమగును. కనుక వారు నిత్యము వేదాన్తశ్రవణమునే చేయు చుందురు. వేదసమ్మతములగు యుక్తుల సహాయముచే ప్రపంచ మనిత్య మనియు ఆత్మయొక్కటియే నిత్యమని సత్యమనియు భావించుచుందురు. మోక్షము తప్ప మరియొకటి కోరరు. కాన వారుకృతార్థులు. ఇట్టివారలు తీవ్ర విరక్తి యనెడి మహాఖడ్గముతో, నాత్మభిన్నములగు దేహేన్ద్రియ; భార్యాపుత్రాగులందుగల "నేను" "నాది" యను నభిమాన మనెడి మహాలతను సులభముగా త్రెంచివైతురు. అనగా సర్వసంగపరిత్యాగము జేసి ఆత్మానన్దము ననుభవించుచు జీవన్ముక్తులగుదురని భావము.

శ్లో॥ సంసారమృత్యో ర్బలినః ప్రవేష్టుమ్
ద్వారాణితు త్రీణి మహాన్తిలోకే,
కాన్తా చ జిహ్వా కనకం చ తాని
రుణద్ధి య స్తస్య భయం నమృత్యోః. ౨౯

తా॥ జనన మరణ రూప సంసారమనెడి మృత్యువు: "భార్య - ధనము - నాలుక" అను మూడు ద్వారములద్వారా ప్రవేశించుచున్నది. అనగా నీ మూడిటియందలి వాంఛతోడనే మానవులు సంసారమున ప్రవర్తించుచున్నారు. ఏ ధీరపురుషుడు ఈ మూడు ద్వారములను మూసి

నైచునో అనగా పై మూటిపైగల కోరికలునులోనుగాడో అట్టివానికి సంసారమృత్యువువలన భయము లేదు.

శ్లో॥ ముక్తిశ్రీనగరస్య దుర్జయతరం ద్వారం యదస్త్యాదిమమ్
తస్య ద్వే అరరే ధనంచయువతీ తాభ్యాం పినద్ధం దృఢమ్,
కామాఖ్యార్గళదారుణాబలవతా ద్వారం తదేవ త్రయమ్
ధీరో యస్తు భినత్తి సోఽర్హతిసుఖం భోక్తుం విముక్తిశ్రియః.

తా॥ మోక్షలక్ష్మియొక్క పట్టణమునకు ప్రథమ సింహద్వారమొకటి గలదు అది యెవరికిని తెఱవ నలవిగాదు. దానికి ధనము, భార్యయును రెండు తలుపులును, కామము అను నొక అడ్డగడియయు గలవు. ఈ మూటిచే నా ద్వారము మూయబడియుండును. ఈ మూటిని ఎవడు భేదింపగలడో వాడు ముక్తికాంతను చేపట్టగలడు. అనగా గడియ నూడదీసినచో తలుపులు తెరచుట సులభము. అటులనే విషయభోగవాంఛయను కామము నొకదానిని జయించినచో సర్వవిషయములు జితములగును. అంతట రాగరహితమగు చిత్తమున ఆత్మస్వరూపానందమభివ్యక్తమగును. ఇదియేగద ముక్తి యనబడునది.

శ్లో॥ ఆరూఢస్య వివేకాశ్వం తీవ్రవైరాగ్యఖడ్గినః,
తితిక్షావర్మయుక్తస్య ప్రతియోగీ నదృశ్యతే. ౯౧

తా॥ సర్వదుఃఖములను సహించుటయను కవచమును ధరించి, ఇహపరలోక భోగములందు విరక్తియను ఖడ్గమును చేబూని, నిత్యానిత్యవస్తువివేకమను గుఱ్ఱమునెక్కి శాస్త్రవిహితమార్గములందు సంచరించు మానవునకు శత్రువనువాడు లేడు.

శ్లో॥ వివేకజాం తీవ్రవిరక్తిమేవ
ముక్తేర్నిదానం నిగదన్తి సన్తః,

తస్మా ద్వివేకీ విరతిం ముముక్షుః
సంపాదయే త్తాం ప్రథమం ప్రయత్నాత్. ౯౨

తా॥ తత్త్వవిదులగు సత్పురుషులు, తాము కృతార్థులై; నిత్యా నిత్యవస్తు విచారమువలన కలుగు దృఢవైరాగ్యమే మోక్షమునకు మూల కారణమని చెప్పుచున్నారు. కాన మోక్షమును గోరువారు ప్రథమముగా విషయ విరక్తి నలవరచుకొనవలయును.

శ్లో॥ పుమా నజాతనిర్వేదో దేహబన్ధం జిహాసితుమ్,
నహి శక్నోతి నిర్వేదో బన్ధభేదో మహానసౌ (సిః). ౯౩

తా॥ అనిత్యవస్తువులందు విరక్తి నొందని పురుషుడు దేహాభి మానమను బన్ధమును త్రెంచుకొనలేడు. విషయ విరక్తియే బన్ధనాశము నకు ముఖ్యసాధనము. కాన ఎప్పటికైనను విరక్తిచేగాక మరిదేనిచేతను బన్ధము తొలగదు.

శ్లో॥ వైరాగ్యరహితాఏవ యమాలయ ఇవాలయే,
క్లిశ్యన్తి త్రివిధై స్తాపైః మోహితా అపి పండితాః. ౯౪

తా॥ ఎన్నిశాస్త్రములను చదువుకొనినను, వైరాగ్యము కనుక లేనిచో ప్రయోజనమేమియు లేదు, దేహాదులయందభిమానము నివర్తింపదు. కనుకనే పండితులుగూడ తాపత్రయగ్రస్తులగుచున్నారు.

శ్లో॥ ప్రజ్ఞావా నపి పండితోఽపి
చతురోఽ ప్యత్యన్తసూక్ష్మార్థదృక్
వ్యాలీఢ స్తమసా నవేత్తి
బహుధా సంబోధితోఽపిస్ఫుటమ్,
భ్రాన్త్యారోపిత మేవ
సాధుకలయత్యాలంబతే తద్గుణాన్

హాన్త్యాఽసౌ ప్రబలా దురన్తతమస

శ్శక్తే ర్మహాత్మ్యావృతిః.

శ్లో॥ శమో దమ స్తితిక్షో పరతిః శ్రద్ధా తతః పరమ్,

సమాధాన మితిప్రోక్తం షడేవై తే శమాదయః. ౯౫

తా॥ శమము; దమము; తితిక్ష; ఉపరతి; శ్రద్ధ సమాధానము. అను నారు శమాదిషట్క మగుచున్నవి. వీని లక్షణములు రాబోవు శ్లోకములందు చెప్పబడుచున్నవి.

శ్లో॥ ఏక వృత్త్యైవ మనసః స్వలక్ష్యే నియతస్థితిః,

శమ ఇత్యుచ్యతే సద్భిః శమలక్షణవేదిభిః. ౯౬

తా॥ చిత్తము ఇతర వృత్తులను వదలి ఒకే రూపమగు వృత్తితో తన యెదుటనున్న దేవవిగ్రహాదులందు స్థిరముగా నుండుటయే శమ మనబడుచున్నది.

శ్లో॥ ఉత్తమో మధ్యమశ్చేతి జఘన్యశ్చేతిచ త్రిధా,

నిరూపితో విపశ్చిద్భిః తత్తల్లక్షణవేదిభిః. ౯౭

తా॥ ఆ శమము, ఉత్తమము, మధ్యమము, అధమము అని పండితులచే మూడు విధములుగా చెప్పబడినది.

శ్లో॥ స్వవికారం పరిత్యజ్య వస్తుమాత్ర తయా స్థితిః,

మనస స్సోత్తమా శాన్తిః బ్రహ్మనిర్వాణలక్షణా. ౯౮

తా॥ మనస్సు, ప్రాపంచిక విషయములకు సంబన్ధించిన సంకల్ప వికల్పాదివృత్తులను విడనాడి బ్రహ్మకారమగు వృత్తితో గూడుకొని యుండుటయే ఉత్తమశాన్తి యనబడును. ఇట్టి స్థితియందు జీవబ్రహ్మ భేదము భాసింపదు.

శ్లో॥ ప్రత్య క్ప్రత్యయసన్తాన ప్రవాహకరణం ధియః,
యదేషా మధ్యమాశాన్తిః శుద్ధసత్త్వైకలక్షణా. ౯౯

తా॥ మనస్సునందలి రజోగుణ తమోగుణములు నశించిన పిమ్మట బ్రహ్మాకార మనోవృత్తిని నిరన్తర మనుసన్ధానము చేయుచుండుటయే మధ్యమ శాన్తి యనబడుచున్నది.

శ్లో॥ విషయవ్యాపృతిం త్యక్త్వా శ్రవణైక మనస్థితిః,
మనసశ్చేతరాశాన్తిః మిశ్రసత్త్వైకలక్షణా. ౧౦౦

తా॥ మనస్సును విషయములందు ప్రసరింపజేయక, గురువుల సమీపమున వేదాన్తార్థముల విచారించుచుండుట. అధమ శాన్తి యగును. ఇట్టిస్థితియందు చిత్తము రజస్తమోగుణ సంబన్ధము గలిగియే యుండును.

శ్లో॥ ప్రాచ్యోదీచ్యాంగ సద్భావే శమః సిద్ధ్యతి నాన్యథా,
తీవ్రా విరక్తిః ప్రాచ్యాంగం ఉదీచ్యాంగం దమాదయః.

తా॥ శమము సిద్ధింపవలయుననిన పూర్వోత్తరాంగములు సంపూర్ణముగా నుండవలయును. శమమునకు, దృఢవైరాగ్యము పూర్వాంగము. దమము, తితిక్ష, ఉపరతి, శ్రద్ధ, సమాధానము అనునవి యుత్తరాంగములు.

శ్లో॥ కామః క్రోధశ్చ లోభశ్చ మదో మోహశ్చ మత్సరః,
న జితాః షడిమే యేన తస్యశాన్తిర్న సిద్ధ్యతి. ౧౦౨

తా॥ ఏ మానవుడు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములను నీ యరిషడ్వర్గమును జయింపడో, వానికి శాన్తి లభింపదు.

శ్లో॥ శబ్దాదివిషయేభ్యో యః విషవన్నవివర్తతే,
తీవ్రమోక్షేచ్ఛయా భిక్షుః తస్య శాన్తిర్న సిద్ధ్యతి. ౧౦౩

తా॥ మోక్షమును గోరు యే సన్యాసి, విషమునుండి తన బుద్ధిని మరల్చుకొనునట్లుగా, శబ్దాది లౌకిక విషయములనుండి తన మనస్సును మరలించుకొనడో అట్టివానికి శాన్తి దుర్లభము.

శ్లో॥ యేన నారాధితో దేవః యస్య నో గుర్వనుగ్రహః,
న వశ్యం హృదయం యస్య తస్య శాన్తి ర్నసిద్ధ్యతి.

తా॥ ఎవడు పరమేశ్వరుని త్రికరణశుద్ధితో పూజింపడో, ఎవడు గురుశుశ్రూషచే వారి యనుగ్రహమును సంపాదించుకొనడో, ఎవడు తన మనస్సును స్వాధీనపరచుకొనలేడో, అట్టి వానికి శాన్తి సిద్ధింపనేరదు.

శ్లో॥ మనః ప్రసాదసిద్ధ్యర్థం సాధనం శ్రూయతాం బుధైః,
మనః ప్రసాదో యత్సత్వే యదభావే నసిద్ధ్యతి. ౧౦౫

తా॥ ఏ సాధనముల నభ్యసించిననేకాని మనస్సు నిర్మలముగాదో అట్టి సాధనముల చెప్పుచున్నాము. కావున పండితులు వినవలయును.

శ్లో॥ బ్రహ్మచర్య మహింసా చ దయాభూతే ష్వవక్రతా,
విషయే ష్వతివైతృష్ణ్యం శౌచం దంభవివర్జనమ్. ౧౦౬

శ్లో॥ సత్యం నిర్మమతా స్థైర్యం అభిమాన విసర్జనమ్,
ఈశ్వరధ్యానపరతా బ్రహ్మవిద్భి స్సహాస్థితిః. ౧౦౭

శ్లో॥ జ్ఞానశాస్త్రైకపరతా సమతా సుఖదుఃఖయోః,
మానానాస క్తి రేకాన్త శీలతా చ ముముక్షుతా. ౧౦౮

శ్లో॥ యస్యైత ద్విద్యతే సర్వం తస్యచిత్తం ప్రశీదతి,
న త్వేత ద్ధర్మశూన్యస్య ప్రకారాన్తరకోటిభిః. ౧౦౯

తా॥ బ్రహ్మచర్యము, ప్రాణులను హింసింపకుండుట, భూతములను దయతో జూచుట, కపటములేకుండుట, విషయములందు వైరాగ్యము

కలిగియుండుట, మనోదేహముల పరిశుద్ధి, డంబము(బడాయి) లేకుండుట, సత్యము పలుకుట, మమకారము లేకుండుట, నిరభిమానము, ఈశ్వరుని ధ్యానించుట, బ్రహ్మవేత్తలతో సహవాసము, మోక్షశాస్త్రమునందే ఆసక్తికలిగియుండుట, సుఖదుఃఖములందు వికారము నొందకుండుట, ఇతరులగౌరవమును గోరకుండుట, ఏకాన్తప్రదేశమున నివసించుచుండుట, మోక్షమునే నిత్యము గోరుచుండుట అను నీ పదునెనిమిది ధర్మములను ఎవడు కలిగియుండునో అట్టివాని చిత్తము అత్యన్త నిర్మలముగా నుండును.

శ్లో॥ స్మరణం దర్శనం స్త్రీణాం గుణకర్మానుకీర్తనమ్,
సమీచీనత్వ ధీ స్తాసు ప్రీతి స్సంభాషణం మిథః. ౧౧౦

శ్లో॥ సహవాసశ్చ సంసర్గః అష్టధామైథునం విదుః,
ఏత ద్విలక్షణం బ్రహ్మచర్యం చిత్తప్రసాదకమ్. ౧౧౧

తా॥ మైథునమనగా స్త్రీ పురుషసంబన్ధము. ఇది యెనిమిది విధములు. స్త్రీలను మనస్సున తలచుట; చూచుట; వారి గుణ కర్మలను కీర్తించుట, బాగుగానున్నారని యనుకొనుట, వారియందు ప్రేమ కలిగియుండుట; ఒంటిగా వారితో మాటలాడుట; కలసితిరుగుట; సంగమము అనునవి. ఇట్టి మైథునము లేకుండుటయే బ్రహ్మచర్యము. దీనిచే చిత్తము పరిశుద్ధమగును.

శ్లో॥ అహింసా వాఙ్మనః కాయైః ప్రాణిమాత్రాప్రపీడనమ్,
స్వాత్మ వత్సర్వభూతేషు కాయేన మనసా గిరా. ౧౧౨

శ్లో॥ అనుకంపా దయాసైవ ప్రోక్తావేదాన్తవేదిభిః,
కరణత్రితయే ష్వేకరూపతాఽవక్రతామతా. ౧౧౩

తా॥ మనోవాక్కాయముల మూటిచేతను, ఏ జంతువును బాధింపకుండుటయే అహింస యనబడుచున్నది. తన శరీరమునువలె, సర్వ

ప్రాణులను త్రికరణములచే కృపతో జూచుటయే దయయగును. మనస్సునందు, వాక్కునందు, శరీరమునందును ఒకే విధముగానుండుట అవక్రత యనబడును. అనగా మనస్సుచే నాలోచింపబడిన విషయమునే వాక్కుచే నుచ్చరించుచు శరీరముచే నాచరింపవలయునని భావము.

శ్లో॥ బ్రహ్మాదిస్థావరాంతేషు వైరాగ్యం విషయేష్వను,
యథైవ కాకవిష్ఠాయాం వైరాగ్యం తద్ధి నిర్మలమ్.౧౧౪

తా॥ కాకిరెట్టను జూచి యసహ్యపడునట్లుగా, బ్రహ్మలోకము మున్నగు సర్వలోకవిషయములందును విరక్తి నొందుటయే తీవ్రవైరాగ్యమనబడును.

శ్లో॥ బాహ్య మాభ్యన్తరం చేతి ద్వివిధం శౌచ ముచ్యతే,
మృజ్జలాభ్యాం కృతంశౌచం బాహ్యం శారీరకం స్మృతమ్

శ్లో॥ అజ్ఞానదూరీకరణం మానసం శౌచ మాన్తరమ్,
అన్తశ్శౌచే కృతే సమ్యక్ బాహ్యం నావశ్యకం నృణామ్.

తా॥: 'బాహ్యము', 'అభ్యన్తరము' అని శౌచము రెండువిధములు. అందు మృత్తికచేతను, జలముచేతను, స్థూలశరీరమును పరిశుభ్రముగా నుంచుట బాహ్యశౌచము. ఇక నాభ్యన్తరమనగా, మనస్సునందలి దుష్ట సంకల్పములను విడనాడి, అజ్ఞానకార్యములగు దేహేన్ద్రియాదులయందు గల యభిమానమును పరిత్యజించి మనస్సును నిర్మలముగా నుంచుకొనుట (యన్తశ్శౌచము) ఈ రెంటిలోను అభ్యన్తరశౌచము ముఖ్యము.

శ్లో॥ ధ్యానపూజాదికం లోకే ద్రష్టర్యేవ కరోతి యః,
పారమార్థిక ధీహీనః స దంభాచార ఉచ్యతే
పుంస స్తథాఽనాచరణ మదం భిత్వం విదుర్బుధాః.౧౧౭

తా॥ లోకమున కొందరుజనులు ప్రతిష్ఠాప్రాప్తికై పరమార్థచింత లేకయే ఇతరులు చూచునప్పుడు మాత్రము సంధ్యావందనము, దేవతార్చనము మున్నగు సత్కార్యముల నాచరించుచుందురు. కనుకనే ఇట్టివారలు దంభాచారు లనబడుచున్నారు. వీరికి భిన్నులు అదాంభికులు. అనగా దైవభక్తితో యథాశక్తిగా తమ వర్ణాశ్రమ విహితధర్మముల నిరాడంబరముగా నాచరించుచుండుట దంభవిసర్జనము.

శ్లో॥ య త్త్వేన దృష్టం సమ్యక్చ్ఛ్రుతం తస్యైవ భాషణమ్,
సత్యమిత్యుచ్యతే బ్రహ్మసత్య మిత్యపి భాషణమ్.౧౧౭

తా॥ జనుడు తాను కంటితో దేనిని చక్కగా చూచునో, చెవులతో ఆప్తవాక్యములవలన దేనిని జాగ్రత్తతో వినునో దానినే ఇతరులకు చెప్పుటయు, బ్రహ్మమొక్కటియే సత్యమని పరులకు బోధించుటయు సత్యమనబడును.

శ్లో॥ దేహాదిషు స్వకీయత్వ దృఢబుద్ధివిసర్జనమ్,
నిర్మమత్వం స్మృతం యేన కైవల్యం లభతే నరః.౧౧౮

తా॥ దేహేన్ద్రియాదులందును భార్యాపుత్రాదులందునుగల మమకారమును పరిత్యజించుటయే నిర్మమతయగుచున్నది. దీనివలన మోక్షము అనాయాసముగా లభించును.

శ్లో॥ గురువేదాన్తవచనైః నిశ్చితార్థే దృఢస్థితిః,
తదేకవృత్త్యా తత్ స్థైర్యం నైశ్చల్యం నతు వర్ష్మణః.

తా॥ గురువాక్యములచేతను, వేదాన్తవాక్యములచేతను, పూర్వోత్తర గ్రన్థ సమన్వయపూర్వకముగా నిర్ణయింపబడిన విషయమునందు మనస్సును నిశ్చలముగా నిలుపుటయే స్థైర్యము. గాని శరీరమును కదలింపకుండుట స్థైర్యముగాదు.

శ్లో॥ విద్యైశ్వర్యతపో రూపగుణవర్ణాశ్రమాదిభిః,
సంజాతాఽహార్యంతే స్త్యాగ స్త్వభిమానవిసర్జనమ్. ౧౨౧

తా॥ పాండిత్యము, ధనము, సౌన్దర్యము మున్నగు వానిచే గలుగు గర్వమును పరిత్యజించుట, యభిమాన విసర్జనమనబడుచున్నది.

శ్లో॥ త్రిభిశ్చ కరణై స్సమ్యక్ హిత్వా వైషయికీం క్రియామ్,
స్వాత్మైకచిన్తనం యత్తత్ ఈశ్వరధ్యానమీరితమ్. ౧౨౨

తా॥ మనోవాక్కాయముల మూడింటిచేతను, సర్వలౌకికకర్మలను పరిత్యజించి నిరన్తరము స్వస్వరూపమును విచారించుచుండుట నీశ్వర ధ్యానమందురు.

శ్లో॥ ఛాయేవ సర్వదావాసః బ్రహ్మవిద్భి స్సహాస్థితిః. ౧౨౩

తా॥ నీడవలె బ్రహ్మవిదుల నెడబాయకుండుటయే బ్రహ్మ విత్సహవాసమగుచున్నది.

శ్లో॥ యద్యదుక్తం జ్ఞానశాస్త్రే శ్రవణాదిక మేషు యః,
నిరతః కర్మధీహీనః జ్ఞాననిష్ఠ స్సఏవ హి. ౧౨౪

తా॥ ఏ పురుషుడు, ఉపనిషత్తులందు చెప్పబడిన శ్రవణమననాదు లనే నిరన్తర మభ్యసించుచు, భేదదృష్టితో చేయదగు కర్మలందు ప్రవర్తింప కున్నాడో యతడే జ్ఞాననిష్ఠగలవాడగుచున్నాడు.

శ్లో॥ ధనకాన్తా జ్వరాదీనాం ప్రాప్తికాలే సుఖాదిభిః,
వికారహీనతైవ స్యాత్ సుఖదుఃఖసమానతా. ౧౨౫

తా॥ ధనము, భార్య, పుత్రుడు మున్నగునవి సంభవించినప్పుడు సుఖమును, వ్యాధులు, వియోగములు మొదలగునవి వచ్చినప్పుడు దుఃఖ మును గలుగుచుండును. ఈ సుఖదుఃఖములవలన నవివేక మేర్పడును. ఇట్టి సుఖదుఃఖావివేకములు లేకుండుటయే సుఖదుఃఖ సమత్వమనబడుచున్నది.

శ్లో॥ శ్రేష్ఠం పూజ్యం విదిత్వా మాం మానయన్తు జనాభువి,
ఇత్యాసక్త్యా విహీనత్వం మానాఽనాసక్తి రుచ్యతే.

తా॥ లోకమున జనులు తన్ను సర్వవిధముల గొప్పవానినిగా దలచి గౌరవించుచుందురుగాక యను నాసక్తి లేకుండుట మానాఽనాసక్తి యనబడును.

శ్లో॥ సచ్చిన్తనస్యసంబాధో విఘ్నోఽయం నిర్జనే తతః,
స్థేయ మిత్యేక ఏవాస్తే చేత్సైవైకాన్తశీలతా. ౧౨౭

తా॥ జనసంఘములో లోకవిషయములే గోచరించుచుండుటవలన ఆత్మవిచారమునకు నాటంకము కలుగుచుండును. కాన జనసంగమును వదలి యొంటిగానుండుటయే యేకాన్తశీలతయగును.

శ్లో॥ సంసారబన్ధనిర్ముక్తిః కదా ఝటితి మే భవేత్,
ఇతి యా సుదృఢాబుద్ధిరీరితా సా ముముక్షుతా. ౧౨౮

తా॥ ఏ మానవుడు కాలుచున్న గృహమునుండివలె సంసారమునుండి ఏ నిమిషమున బయటబడుదునాయని యావేదనపడుచుండునో అట్టివాడు ముముక్షువు వాని ప్రవృత్తి ముముక్షుత యగును.

శ్లో॥ బ్రహ్మచర్యాదిభి ర్ధర్మైః బుద్ధే ర్దోషనివృత్తయే,
దండనం దమ ఇత్యాహుః దమశబ్దార్థకోవిదాః. ౧౨౯

శ్లో॥ తత్తద్వృత్తినిరోధేన బాహ్యేంద్రియవినిగ్రహః,
యోగినో దమఇత్యాహుః మనస శ్శాంతి సాధనమ్.

తా॥ మనోనిరోధమునకు బహిరింద్రియనిరోధము ముఖ్యము. బ్రహ్మచర్యాదుల నభ్యసించుటచే బహిరిన్ద్రియములు నిరుద్ధములగును. ఈ బహిరిన్ద్రియనిగ్రహమునే దమమందురు. దీనివలన అన్తరిన్ద్రియనిగ్రహరూపమగు శమముకూడ సిద్ధించును.

శ్లో॥ ఇన్ద్రియే ష్విన్ద్రియార్థేషు ప్రవృత్తేషు యదృచ్ఛయా,
అనుధావతి తాన్యేవ మనో వాయు మివానలః. ౧౩౦

శ్లో॥ ఇన్ద్రియేషు నిరుద్ధేషు త్యక్త్వా వేగం మన స్స్వయమ్,
సత్త్వభావ ముపాదత్తే ప్రసాద స్తే నజాయతే
ప్రసన్నే సతి చిత్తేఽస్య ముక్తి స్సిద్ధ్యతి నాఽన్యథా. ౧౩౧

తా॥ ఇన్ద్రియము లాయా విషయములందు ప్రవర్తించుచుండగా అగ్ని గాలి ననుసరించునటుల మనస్సు ఆ ఇన్ద్రియముల ననుసరించి పోవుచుండును. ఇన్ద్రియముల నిగ్రహించినచో మనస్సు నిశ్చలమగును. శాన్తి లభించును. పిమ్మట ముక్తిసులభము.

శ్లో॥ మనః ప్రసాదస్య నిదాన మేవ
నిరోధనం య త్సకలేన్ద్రియాణామ్,
బాహ్యేన్ద్రియే సాధు నిరుధ్యమానే
బాహ్యార్థభోగో మనసో వియుజ్యతే. ౧౩౨

తా॥ నేత్రము మున్నగు జ్ఞానేన్ద్రియములను, వాక్కు మున్నగు కర్మేన్ద్రియములను, విషయములందు ప్రవర్తింపనీయకుండుటయే మన శ్శుద్ధికి మూలసాధనము - బహిరిన్ద్రియములను లెస్సగా నిరోధించినచో వెంటనే మనస్సునకును విషయములకునుగల సంబన్ధమువిలయమునొందును. అనగా చిత్తమున విషయవాంఛలు గలుగవనిభావము.

శ్లో॥ తేన స్వదాస్త్యం పరిముచ్య చిత్తమ్
శ్శనై శ్శనై శ్శాన్తి ముపాదదాతి,
చిత్తస్య బాహ్యార్థవిమోక్ష మేవ
మోక్షం విదుర్మోక్షణలక్షణజ్ఞాః. ౧౩౩

తా॥ బహిరింద్రియములను నిగ్రహించుటచే చిత్తమునందలి విషయాకారములగు చపలవృత్తులన్నియు నిగ్రహింపబడుచున్నవి. ఈ రీతిగా చిత్తవృత్తులన్నియు విలయమునొందుటయే మోక్షమని శాస్త్రాచార్యోపదేశ, విద్వదనుభవములు ధ్రువపరచుచున్నవి.

శ్లో॥ దమం వినా సాధు మనఃప్రసాద
హేతుం నవిద్మ స్సుకరం ముముక్షోః,
దమేన చిత్తం నిజదోషజాతమ్
విసృజ్య శాన్తిం సముపైతి శీఘ్రమ్. ౧౩౪

తా॥ మోక్షమును గోరు పురుషునకు చిత్తస్వాస్థ్య మావశ్యకము. అట్టి చిత్తశాన్తికి బహిరింద్రియ నిరోధము తప్ప వేఱొండు సులభ సాధనము లేదు.

శ్లో॥ ప్రాణాయామా ద్భవతి మనసో నిశ్చలత్వం ప్రసాదః
యస్యాప్యస్య ప్రతినియత దిగ్దేశకాలాద్యవేక్షా,
సమ్యగ్దృష్ట్యా క్వచిదపి తయా నోదమోహాన్యతేతత్
కుర్యా ద్ధీమాన్ దమమనలస శ్చిత్తశాన్త్యైప్రయత్నాత్.

తా॥ కడచిన శ్లోకములలో బహిరింద్రియనిగ్రహరూపమగుదమము వలన నన్తరింద్రియ నిగ్రహమనెడి శమము సిద్ధించునని వర్ణింపబడినది. ఈ శ్లోకమునందుగల విశేషమేమన-దిగ్దేశకాలాది నియమములననుసరించి, పూరక కుంభక రేచకాత్మకమగు ప్రాణాయామమును నాచరించుచున్నచో బహిరింద్రియములన్నియు నాయా విషయములనుండి నివృత్తములై చిత్తశాన్తి సంపాదకములగుచున్నవి. మఱియు నీ బహిరింద్రియ నిగ్రహమనునది యాత్మజ్ఞాన పూర్వకంబుగ నభ్యసింపబడునది యగునేని యెన్నటికిని వ్యర్థముగా నేరదు. అనగా కేవల ప్రాణాయామబలమువలననే బహిరింద్రి

యములను నిరోధించినచో ప్రాణాయామ విరమణకాలమునందు ఇంద్రియ విక్షేపముగలుగుట కవకాశముగలదు. కావున బుద్ధిమంతుడగు ముముక్షువు చిత్తశాంతి సంపాదనకొరకై వివేక పూర్వకముగా బహిరింద్రియములను నిరోధింపవలయును.

శ్లో॥ సర్వేన్ద్రియాణాం గతినిగ్రహేణ
భోగ్యేషు దోషా ద్యవమర్శనేన,
ఈశప్రసాదాచ్చ గురోః ప్రసాదాత్
శాన్తిం సమాయా త్యచిరేణ చిత్తమ్. ౧౩౬

తా॥ జ్ఞానేన్ద్రియ కర్మేన్ద్రియముల నిగ్రహించుట, భార్యాపుత్రాది భోగ్యపదార్థములందు దోషదృష్టిచేయుట, తమ తమ యభీష్టదైవతముల గొల్చుచుండుట పరిచర్యాదులచే గురువుల యనుగ్రహమునకు పాత్రులగుట, అను నీ సహాయ సంపదలచే చిత్తమతి శీఘ్రముగా శాన్తిని బొందగలదు.

శ్లో॥ ఆధ్యాత్మికాది యద్దుఃఖం ప్రాప్తం ప్రారబ్ధవేగతః,
అచిన్తయా త త్సహనం తితిక్షేతి ప్రచక్షతే. ౧౩౭

తా॥ ప్రారబ్ధకర్మప్రాబల్యమున సంభవించు సర్వవిధదుఃఖములను విచారములేకుండగను, ప్రతిక్రియలను చేయకుండగను, సహించుచుండుటయే తితిక్షయగునని పెద్దలు చెప్పుచున్నారు.

శ్లో॥ శిక్షా తితిక్షా సదృశీ ముముక్షోః
నవిద్యతేఽసౌ పవినా నభిద్యతే,
యామేవ ధీరాః కవచీయవిఘ్నాన్
సర్వాం స్తృణీకృత్య జయన్తి మాయామ్. ౧౩౮

తా॥ ముముక్షు జనులకు "సర్వదుఃఖ సహనమను" తితిక్షతో సమానమైన శత్రునాశకరమగు శ్రేష్ఠము సాధనము లేదు. వజ్రాయుధము సైతము దీనిని బద్దలుచేయలేదు. కనుకనే మహానుభావులగు బుద్ధిమంతులు, సంసారమను మహాయుద్ధమున తితిక్షాకవచధారులై కామ క్రోధాది ప్రబల పరిపన్థుల పరాభవించి మాయా రాక్షసిని పరిమార్చ గలుగుచున్నారు.

శ్లో॥ క్షమావతా మేవహి యోగసిద్ధిః
స్వారాజ్యలక్ష్మీ సుఖభోగసిద్ధిః,
క్షమావిహీనా నిపతన్తి విఘ్నైః
వాతైర్హృతాః పర్ణచయా ఇవద్రుమాత్. ౧౩౯

తా॥ ఓర్పుగలవారలకు, యమనియమాద్యష్టాంగ సహితమగు సమాధియు, స్వర్గసుఖప్రాప్తియు, తుదకు సగుణ బ్రహ్మభావమును, సులభముగా సిద్ధించును. ఓర్పులేనివారలకు ప్రతిక్షణమునను, చిత్తవిక్షేపములు గలుగుచుండును. ఇట్టివారు గాలిచే కదలించబడిన ఆకులు చెట్టునుండి రాలిపోవునట్లుగా ముక్తిమార్గవిభ్రష్టులై సంసారముననే పొరలిడుచుందురు.

శ్లో॥ తితిక్షయా తపోదానం యజ్ఞస్తీర్థం వ్రతం శ్రుతమ్,
భూతిః స్వర్గోఽపవర్గశ్చ ప్రాప్యతే తత్తదర్థిభిః. ౧౪౦

తా॥ మనుజులు తితిక్షాయుక్తులగుదురేని, తపము, దానము, యజ్ఞము, పుణ్యక్షేత్రము, వ్రతము, పాండిత్యము, ఐశ్వర్యము, స్వర్గము, మోక్షము మున్నగు వానిని తమ తమ యభీష్టమునుబట్టి పొందగలుగుదురు.

శ్లో॥ బ్రహ్మచర్య మహింసాచ సాధూనా మపి చార్హణా,
పరాక్షేపాది సహనం తితిక్షోరేవ సిద్ధ్యతి. ౧౪౧

తా॥ బ్రహ్మచర్యము, వాఙ్మనశ్శరీరములచే నితరుల నెవ్వరిని బాధింపకుండుట, సాధుపురుషులను సేవించుట పరుల పరిహాసాదుల నోర్చుట మున్నగు సద్గుణ సంపదయంతయు నోర్పుగల మానవునకే సిద్ధించును.

శ్లో॥ సాధనేష్వపి సర్వేషు తితిక్షోత్తమ సాధనమ్,
యత్ర విఘ్నాః పలాయన్తే దైవికా అపి భౌతికాః. ౧౪౨

తా॥ మోక్షసాధనములలో తితిక్షయుత్తమసాధనము. ఇట్టి తితిక్ష యున్నచో, దైవికములగు అతివృష్టి అనావృష్టి మున్నగు వానివలనను, భౌతికములగు సర్పవ్యాఘ్రచోరాదులవలనను చిత్తవిక్షేపము కలుగనేరదు.

శ్లో॥ తితిక్షోరేవ విఘ్నేభ్య స్త్వనివర్తిత చేతసః,
సిద్ధ్యన్తి సిద్ధయ స్సర్వాః అణిమాద్యా స్సమృద్ధయః.

తా॥ ఓర్పుగలవాడై దైవిక భౌతిక విఘ్నములకు లోపడని మానవునకు దూరశబ్దములవినుట, దూరవిషయముల చూచుట, పరుల శరీరముల ప్రవేశించుట మున్నగు యోగసిద్ధులును, అణిమాద్యష్టైశ్వర్యములును సులభముగా సిద్ధించును.

శ్లో॥ తస్మాన్ముముక్షో రధికా తితిక్షా
సంపాదనీయే ప్సిత కార్యసిద్ధ్యై,
తీవ్రా ముముక్షా చ మహత్యుపేక్షా
చోభే తితిక్షా సహకారి కారణమ్. ౧౪౪

తా॥ పూర్వోక్తహేతువులచే తితిక్ష యనునది సర్వోత్కృష్ట మోక్షసాధనమని నిశ్చితమగుచున్నది. కాన ముముక్షుజనులు తితిక్షను తప్పక సంపాదించుకొనవలయును. ఈ తితిక్ష దృఢముగా గలుగుటకు

రెండు సహాయకారణములు గలవు. ఒకటి తీవ్రమగు మోక్షవాంఛ, రెండు లోకవ్యవహారములందు సంబన్ధము నెంతమాత్రము కలిగించుకొనకుండుట.

శ్లో॥ తత్ర త్కాల సమాగతా
మయతతేః శాన్త్యై ప్రవృత్తోయది
స్యాత్తత్ర త్పరిహారకౌషధరత
స్తచ్ఛిన్తనే తత్పరః,
తద్భిక్షు శ్శ్రవణాది ధర్మరహితో
భూత్వా మృతశ్చే త్తదా
కిం సిద్ధం ఫల మాప్నుయా
దుభయథా భ్రష్టో భవే త్స్వార్థతః. ౧౮౫

తా॥ సర్వసంగపరిత్యాగులగు సన్యాసులకు తితిక్ష అత్యన్త మావశ్యకము. సన్యసించిన పిమ్మట గూడ దేహధర్మములగు జ్వరాది వ్యాధులు ప్రారబ్ధకర్మ ప్రాబల్యమున సంభవించుచునే యుండును. అట్టి యెడ తురీయాశ్రమస్థులగు సన్యాసులు, తితిక్షావంతులై వ్యాధులను దేహధర్మములనుగా భావించి దేహతద్ధర్మములందు తాదాత్మ్యాభిమానమును విడనాడి తమయాశ్రమధర్మములగు శ్రవణమనననిదిధ్యాసనములనే నిరన్తరమభ్యసించుచుండవలయును. అట్లుగాక వ్యాధిబాధను సహింపలేనివారై వ్యాధినివారణమునకై వైద్యుల నాశ్రయించి యౌషధముల సేవించుచుందురేని యీ విక్షేపములతోడనే కాలము గడచి పోవును. ఇంతలో ననియతమగు మృత్యువాసన్న మగుటచే పరలోకగతులగుదురు. ఇట్టివారలు కర్మలను విడచుటచే కర్మఫలమగు స్వర్గాదులను గాని శ్రవణాదుల నాచరింపకుండుటచే జ్ఞానఫలమగు మోక్షమును

గాని పొందనేరక పురుషార్థ భ్రష్టులగు చున్నారు. కాన ముముక్షుజనులకు సర్వోత్కృష్టమగు తితిక్ష తప్పక యభ్యసనీయము.

శ్లో॥ యోగమభ్యస్యతో భిక్షోః "యోగాచ్చలిత మానసః,
ప్రాప్య పుణ్యకృతాం లోకాన్" ఇత్యాది ప్రాహ కేశవః.

తా॥ పూర్వశ్లోకమున శ్రవణమన నాది వర్జితుడగు సన్యాసియుభయ భ్రష్టుడగునని చెప్పబడినది. దీనిపై ప్రాజ్ఞులకు ఒక ఆశంక కలుగ వచ్చును. ఏమన : భగవద్గీతయందు ఆరవయధ్యాయమున యోగ భ్రష్టుడగు సన్యాసి పుణ్యలోకములకేగి అచట ఫల మనుభవించి పిమ్మట తిరిగి భూలోకమున భాగ్యవంతుల గృహమున జన్మించునని కృష్ణభగవానుడు చెప్పియున్నాడు గనుక సన్యాసి యుభయ భ్రష్టుడగుననుట తగదు, అని.

ఇందులకు సమాధానము, భగవద్గీత యందున్న పూర్వోత్తరగ్రన్థ సందర్భము పరిశీలించినచో పైప్రశ్నకు తావులేదు. ఎట్లన : సన్న్యసి తితిక్షాయుక్తుడై శ్రవణమనన పూర్వకముగా ధ్యానయోగము నభ్యసించుచు దైవయోగముచే ధ్యానయోగఫలము సిద్ధింపక పూర్వమే కాలకర్మము నొందినచో నట్టివాని గతి యేమగునని అర్జును డడుగగా కృష్ణుడు పుణ్యలోక గతి కలుగునని చెప్పెను. కాన తితిక్షాసహితులై శ్రవణాదుల నాచరించుచు, యోగభ్రష్టులగు వారలకే పుణ్యలోక ప్రాప్తికాని తితిక్షారహితులై శ్రవణాదివర్జితులగువారు ఉభయభ్రష్టులగుదు రనుటలో విరోధ మెంతమాత్రమును లేదు.

శ్లో॥ నతు కృత్వైవ సంన్యాసం తూష్ణీమేవ మృతస్యహి,
పుణ్యలోక గతిం బ్రూతే భగవాన్ న్యాసమాత్రతః.

మరియు :

శ్లో॥ నచ సన్న్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి,
ఇత్యనుష్ఠేయ సంత్యాగాత్ సిద్ధ్యభావ మువాచహ.

తా॥ భగవద్గీత యందు కృష్ణభగవానుడు, "కర్మలను సన్న్యసించి శ్రవణాదులు చేయకుండగనే సిద్ధి పొందిన సన్న్యాసులకు పుణ్యలోకములు గలుగునని చెప్పలేదు. అంతియగాక, జ్ఞానరహితమగు కేవల కర్మత్యాగ మాత్రము వలన జ్ఞానయోగ నిష్ఠారూపమగు నైష్కర్మ్య సిద్ధికలుగ నేరదని కూడ నిరూపించి యున్నాడు.

శ్లో॥ తస్మా త్తితిక్షయా సోఢ్వా తత్త ద్దుఃఖ ముపాగతమ్,
కుర్యా చ్ఛక్త్యనుసారేణ శ్రవణాది శనై శ్శనైః. ౧౪౯

తా॥ అందువలన మోక్షముగోరువారలు పూర్వజన్మ కర్మవశమున సంభవించుచుండు దుఃఖవిశేషములనెల్ల తితిక్షచే సహించుచు, తమశక్తి ననుసరించి వీలుగలిగినప్పుడెల్ల శ్రవణమనన నిదిధ్యాసనముల నాచరించు చుండవలయును.

శ్లో॥ ప్రయోజనం తితిక్షాయాః సాధితాయాః ప్రయత్నతః,
ప్రాప్తదుఃఖా సహిష్ణుత్వే న కించిదపి దృశ్యతే. ౧౫౦

తా॥ సంభవించిన దుఃఖములను సహింపలేకున్నచో కష్టపడి సంపాదించుకొనిన తితిక్షకు ప్రయోజన మిసుమంతయు గన్పట్టదు.

శ్లో॥ సాధనత్వేన దృష్టానాం సర్వేషా మపి కర్మణామ్,
విధినా యః పరిత్యాగః ససన్న్యాస స్సతాం మతః. ౧౫౧

తా॥ శ్రుతులయందు ఆత్మదర్శనమునకు పరంపరా సాధనములుగా వర్ణింపబడిన సర్వకర్మములను, శాస్త్రమున చెప్పబడిన రీతిగా పరిత్యజించుటయే సన్న్యాసమనబడునని పండితుల యాశయము.

శ్లో॥ ఉపరమయతి కర్మాణీ
త్యుపరమశబ్దేన కథ్యతే న్యాసః,

న్యాసేన హి సర్వేషాం
శ్రుత్యా ప్రాప్తే వికర్మణాం త్యాగః. ౧౫౨

తా॥ కర్మలనుపరమింప జేయునదియను నర్థమును అనుసరించుటచే నుపరమ మనగా సన్న్యాసమని యర్థము. సన్న్యాసమనగా వేదోక్తము లగు వివిధకర్మల పరిత్యజించుటయని శాస్త్రములందును లోకమునందును వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ కర్మణా సాధ్యమానస్యాఽ నిత్యత్వం శ్రూయతే యతః,
కర్మణాఽనేన కిం నిత్య ఫలేప్సోః పరమార్థినః. ౧౫౩

తా॥ వేదములందు కర్మలవలన గలుగు ఫలము లన్నియు ననిత్యము లని చెప్పబడినది. కాన నిత్యమగు బ్రహ్మకైవల్యరూప మోక్షమును గోరు ముముక్షు జనులకు కర్మలవలన ప్రయోజనము లేదు.

శ్లో॥ ఉత్పాద్యమాప్యం సంస్కార్యం వికార్యం పరిగణ్యతే,
చతుర్విధం కర్మసాధ్యం ఫలం నాన్యదితః పరమ్. ౧౫౪

తా॥ లోకమున కర్మలవలన గలుగు ఫలము నాలుగు రకములుగా గనబడుచున్నది. 1. పుట్టించుటకు యోగ్యమైనది, 2. పొందదగినది, 3. సంస్కరింపదగినది, 4. వికారమును (మార్పును) పొందింపదగినది. ఇంతకంటె వేరగు కర్మఫలము లేదు.

శ్లో॥ నైతదన్యతమం బ్రహ్మ కదా భవితు మర్హతి,
స్వతస్సిద్ధం సర్వదాఽఽప్తం శుద్ధం నిర్మల మక్రియమ్. ౧౫౫

తా॥ బ్రహ్మము పూర్వోక్తములగు చతుర్విధ కర్మఫలములలోను చేరనేరదు. ఏలయన : స్వతస్సిద్ధమగుటచే ఘటాదులవలె నుత్పత్తి చేయ దగినదికానేరదు. పొందువాని స్వరూపమే యగుటచే నిరన్తరము పొంద

బడియే యున్నది గాన గ్రామాదులవలె నూతనముగా పొందదగినదిగాదు. మాయాసంబన్ధరహితమై ఆకాశమువలె నిర్మలమైనదిగావున మలినములగు దర్పణాదులవలె సంస్కరింపదగినది గాదు. సర్వక్రియారహితమగుటచే పాలు పెరుగుగా మారినట్లు వికార్యమును గానేరదు.

శ్లో॥ నచాఽస్య కశ్చి జ్జనితే త్యాగమేన నిషిధ్యతే,
కారణం బ్రహ్మతత్తస్మాత్ బ్రహ్మ నోత్పాద్య మిష్యతే.

తా॥ శ్రుతులయందు బ్రహ్మకు పుట్టువు లేదనియు బ్రహ్మను పుట్టించువాడు లేడనియు పెక్కు స్థలముల ప్రతిపాదింప బడినది. గాన బ్రహ్మము ఉత్పాద్యము గానేరదు. అంతియగాక; బ్రహ్మమే సర్వ జగములకు మూలకారణమని సకలశ్రుతి స్మృతి సిద్ధాన్తముగాన బ్రహ్మము కారణమేగాని కార్యము గాదు.

శ్లో॥ ఆప్తాప్యయోస్తు భేదశ్చేత్ ఆప్తిచాప్య మవాప్యతే,
ఆప్తృస్వరూప మేవైతత్ బ్రహ్మనాప్యం కదాచన. ౧౫౭

తా॥ ఒకడు ఒక వస్తువును పొందవలయుననిన పొందు మానవు నకును, పొందబడువస్తువునకును పరస్పరము భేదముండవలయును. ప్రకృత మున బ్రహ్మము పొందువాని స్వరూపమే యగుటచే ఆప్యముగానేరదు.

శ్లో॥ మలినస్యైవ సంస్కారో దర్పణాదే రిహేష్యతే,
వ్యోమవ న్నిత్య శుద్ధస్య బ్రహ్మణో నైవ సంస్క్రియా.

తా॥ మలినములగు 'అద్దము' మున్నగు వస్తువులను మలశోధక ద్రవ్యములచే బాగుచేసినచో మలము నివర్తించును. కాని, ఆకాశమువలె నిరన్తర స్వచ్ఛమగు బ్రహ్మ పదార్థమునకు మాత్రము సంస్కరణ మనునది యసంభవము.

శ్లో॥ కేన దుష్టేన యుజ్యేత వస్తు నిర్మల మక్రియమ్,
యద్యోగా దాగతం దోషం సంస్కారో వినివర్తయేత్.

తా॥ లోకమున సంస్కారమను క్రియవలన, ఉన్న దుష్టగుణమును పోగొట్టుట, లేని మంచిగుణమును గలిగించుట అను రెండు ప్రయోజనములు గలవు. ఎటులనిన — అద్దమును బాగుగ తుడిచినచో ఉన్న మాలిన్యము పోవుచున్నది. నూనెను పరిమళ (ద్రవ్యముల) పుష్పములతో గలిపి వంటవండినచో పూర్వము లేని మంచి గంధము గలుగు చున్నది. ఈ రెండుప్రయోజనములను బ్రహ్మమున సంభవింపనేరవు. బ్రహ్మము స్వతఃదోష వర్జితము — గానసంస్కారము అనవసరము — స్వయముగా దోషములు లేకున్నను కొన్నివస్తువులకు వస్త్వన్తర సంయోగముచే దోషము లేర్పడ వచ్చును. బ్రహ్మము క్రియారహిత మగుటచే మరియొక వస్తువుతో సంబన్ధము నొందనేరదు గాన నవ్విధమునను దోషలేశ సంపర్కమైన లేకుండుటచే సంస్కారము నిష్ఫలము. గుణాధానరూప ప్రయోజనముత్తర శ్లోకమున నివారింపబడును.

శ్లో॥ నిర్గుణస్య గుణాధాన మపి నైవోపపద్యతే,
కేవలో నిర్గుణశ్చేతి నైర్గుణ్యం శ్రూయతే యతః. ౧౬౦

తా॥ గుణములుగలవస్తువునకు, మంచిగుణములను గలిగించుటయో, దుర్గుణములను తొలగించుటయో సంభవించును. బ్రహ్మము నిర్గుణమని శ్రుతులు వాక్రుచ్చుచున్నవి. గాన బ్రహ్మమునకు సంస్కార క్రియవలన గుణాధానము గలుగనేరదు.

శ్లో॥ సావయవస్య క్షీరాదేః వస్తునః పరిణామినః,
యేన కేన వికారిత్వం స్యాన్నో నిష్కర్మవస్తునః. ౧౬౧

తా॥ లోకమున అవయవములుగల పదార్థములన్నియు మార్పు చెందు స్వభావము గలవగుచున్నవి. కనుకనే పాలు మున్నగు వస్తువులు

మజ్జిగ మున్నగు పదార్థ సంబన్ధముచే పెరుగు మున్నగు స్వరూపముగా వికారము నొందుచున్నవి. బ్రహ్మపదార్థ మన్ననో నిరవయవము, నిష్క్రియము. గాన యది వికార్యమగుట యనుపపన్నము.

శ్లో॥ నిష్కళం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరంజనమ్,
ఇత్యేవ వస్తున స్తత్వం శ్రుతియుక్తి వ్యవస్థితమ్. ౧౬౨

తా॥ బ్రహ్మము, అవయవములు లేనిదనియు క్రియలు లేనిదనియు, మార్పునొందనిదనియు, రాగద్వేషాదిదోషములు లేనిదనియు, మాయా సంబన్ధముగాని పుణ్యపాప సంబంధముగాని లేనిదనియు, శ్రుతులచేతను యుక్తులచేతను చక్కగా నిర్ణయింపబడినది.

శ్లో॥ తస్మా న్నకర్మ సాధ్యత్వం బ్రహ్మణోఽస్తి కుతశ్చన,
కర్మసాధ్యం త్వనిత్యం హి బ్రహ్మానిత్యం సనాతనమ్.

తా॥ పూర్వోక్త హేతువులచే నే విధముగను బ్రహ్మము కర్మ సాధ్యము గానేరదు కర్మలచే సాధ్యములగునవన్నియు ననిత్యములు. బ్రహ్మము మాత్రము నిత్యము.

శ్లో॥ దేహాదిః క్షీయతే లోకో యథైవం కర్మణాచితః,
తథైవాముష్మికో లోకః సంచితః పుణ్యకర్మణా. ౧౬౪

తా॥ పుణ్యపాప మిశ్రితములగు కర్మలచే పుట్టిన మనుష్యాది దేహములు నశించు చుండుటను మన మెరుంగుదుము. ఇటులనే కేవల పుణ్యకర్మ ఫలములగు దేవాది శరీరములుగూడ నశ్వరములనుటలో సందియము లేదు.

శ్లో॥ కృతకత్వ మనిత్యత్వే హేతుర్జాగర్తి సర్వథా,
తస్మా దనిత్యే స్వర్గాదౌ పండితః కో ను ముహ్యతి.

తా॥ "క్రియాసాధ్యములగు నవన్నియు ననిత్యములు" అను శాస్త్ర సంప్రదాయము ననుసరించి పుట్టునవెల్ల నశించున దనుట నిర్వివాదాంశము

కాన పుణ్యకర్మ విశేషముల వలన సంభవించునవగుటచే ననిత్యములగు స్వర్గాదిలోక సుఖములందు పండితులు భ్రమనొందరు—.

శ్లో॥ జగద్ధేతోస్తు నిత్యత్వం సర్వేషా మపి సమ్మతమ్,
జగద్ధేతుత్వ మస్యైవ వావదీతి శ్రుతిర్మహాః. ౧౬౬

తా॥ ప్రపంచమునందలి మతప్రవర్తకులందరును జగత్కారణమగు వస్తువు నిత్యమనుటలో నైకమత్యము గలిగి యున్నారు. తార్కికులు, జగత్కారణములగు పరమాణువులు నిత్యమందురు. సాంఖ్యులు ప్రధానమే జగత్కారణమనియు అది శాశ్వతమనియు నుడువుచున్నారు. శ్రుతులు మాత్రము సచ్చిదానన్దరూపమగు పరబ్రహ్మమే సర్వజగత్కారణమని వొక్కి వక్కాణించుచున్నవి.

శ్లో॥ "ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్య" మితిచ శ్రుతిః,
అస్యైవ నిత్యతాం బ్రూతే జగద్ధేతోః సతః స్ఫుటమ్.

తా॥ కుండకు మట్టియే, స్వరూపమగునట్లుగా, ప్రతీయమానమగు నీ సర్వప్రపంచమునకును బ్రహ్మమే యథార్థ స్వరూపమనియు, అట్టి బ్రహ్మము నిత్యమనియు ఛాన్దోగ్యశ్రుతి నుడువు చున్నది.

శ్లో॥ న కర్మణా న ప్రజయా ధనేనేతి స్వయం శ్రుతిః,
కర్మణో మోక్షహేతుత్వం సాక్షాదేవ నిషేధతి. ౧౬౮

తా॥ తైత్తిరీయశ్రుతి కర్మలవలనను, సంతానమువలనను, ధనము వలనను, మోక్షము కలుగదనియు, సర్వకర్మల పరిత్యజించి జ్ఞాననిష్ఠులగు సన్యాసులే ముక్తినొందుదురనియు చెప్పుచున్నదై కర్మలవలన నేరుగా ముక్తి కలుగనేరదని నిరూపించుచున్నది.

శ్లో॥ ప్రత్యగ్బ్రహ్మ విచారపూర్వ
ముభయో రేకత్వ బోధా ద్వినా
కైవల్యం పురుషస్య సిద్ధ్యతి
పరబ్రహ్మాత్మతాలక్షణమ్,

న స్నానై రపి కీర్తనై రపి
జపై ర్నోకృచ్ఛ్రచాన్ద్రాయణైః
నోవాఽప్యధ్వర కృత్యదాన
నిగమై ర్నోమ స్త్రతన్త్రై రపి. ౧౬౯

తా॥ ముముక్షు జనులకు, జీవాత్మ పరమాత్మల స్వరూపమును విచారించుటవలన గలుగు జీవబ్రహ్మైక్య జ్ఞానమువలననే ముక్తి సిద్ధించును గాని, స్నానములు, జపములు, వ్రతములు, యజ్ఞములు, మంత్రములు మున్నగువానిచే ముక్తి లభింపదు.

శ్లో॥ జ్ఞానాదేవతు కైవల్య మితిశ్రుత్యా నిగద్యతే,
జ్ఞానస్య ముక్తిహేతుత్వ మన్యవ్యావృత్తిపూర్వకమ్.

తా॥ జ్ఞానమువలననే ముక్తిగలుగును గాని సాధనాన్తరములచే గలుగనేరదు." అను శ్రుత్యర్థములచే జ్ఞానమే మోక్షమునకు ముఖ్యమగు సన్నిహిత సాధనమని నిర్ణయింపబడినది.

శ్లో॥ వివేకినో విరక్తస్య బ్రహ్మనిత్యత్వవేదినః,
తద్భావేచ్ఛో రనిత్యేఽర్థే తత్సామగ్ర్యాం కుతోరతిః

తా॥ ఆత్మానాత్మ వివేకవంతుడై సర్వవిషయములందు విరక్తి నొంది బ్రహ్మము నిత్యమని యెరుంగుటచే నట్టి బ్రహ్మభావమునే కోరు నట్టి ముముక్షువునకు స్వర్గాదులందుగాని, తత్సాధనములగు కర్మలందుగాని, ప్రవృత్తికలుగనేరదు.

శ్లో॥ తస్మా దనిత్యే స్వర్గాదౌ సాధనత్వేన చోదితమ్,
నిత్యం నైమిత్తికం చాఽపి సర్వం కర్మ నసాధనమ్. ౧౭౨
ముముక్షుణా పరిత్యాజ్యం బ్రహ్మభావ మభీప్సునా.

తా॥ వేదములందు. "నిత్యములు, నైమిత్తికములు, కామ్యములు" అను కర్మలన్నియు అనిత్యములగు స్వర్గాది పుణ్యలోక ప్రాప్తికి సాధన

ములుగా విధింపబడినవి. గాననవి నిత్యమగు మోక్షమునకు సాధనములు గానేరవు. అందుచే ముక్తినిగోరువారు సర్వకర్మ పరిత్యాగము చేయ వలయును.

శ్లో॥ ముముక్షో రపి కర్మాస్తు శ్రవణం చాఽపి సాధనమ్. ౧౭౩

శ్లో॥ హస్తవద్ద్వయమేతస్య స్వకార్యం సాధయిష్యతి,
యథా విజృంభతే దీపః ఋజూకరణకర్మణా. ౧౭౪

శ్లో॥ తథా విజృంభతే బోధః పుంసో విహితకర్మణా,
అత స్సాపేక్షితం జ్ఞాన మథవాపి సముచ్చయః. ౧౭౫

శ్లో॥ మోక్షస్య సాధనమితి వదన్తి బ్రహ్మవాదినః,
ముముక్షో ర్యుజ్యతే త్యాగః కథం విహితకర్మణః. ౧౭౬

తా॥ పూర్వమందు జ్ఞానము వలననే మోక్షము కలుగును గాన ముముక్షుజనులు సర్వకర్మల పరిత్యజింపవలయునని చెప్పబడినది. దీనిపై కొందరిటుల శంకించుచున్నారు. పురుషుడు రెండుచేతులతో తన కార్యమును సాధించునటుల ముముక్షువుకూడ కర్మ జ్ఞానములు రెంటితో మోక్షమును సాధించుననుట యుక్తము. మఱియు లోకమున వత్తిని బాగుచేయుటచే దీపము మిక్కిలి ప్రకాశించు నటుల నిత్యకర్మానుష్ఠాన ముచే పురుషుని జ్ఞానము బాగుగా వృద్ధి నొందును గాన కర్మసమాకృత మగు జ్ఞానముగాని కర్మజ్ఞానములు రెండునుగాని (సముచ్చయమనుట) మోక్షసాధన మనుట సమంజసము. ఇట్టియెడ ముముక్షువు సర్వకర్మ పరిత్యాగము చేయవలయుననుట యెట్లు పొసగును?

శ్లో॥ ఇతి శంకా నకర్తవ్యా మూఢవ త్పండితోత్తమైః,
కర్మణః ఫలమన్యత్తు శ్రవణస్య ఫలం పృథక్. ౧౭౭

తా॥ పూర్వోక్త శంకలు మూఢులు చేయదగును గాని పండితు లకు తగినవి గావు. ఏలన కర్మజ్ఞానములకు సముచ్చయ మెన్నటికిని

గలుగనేరదు. కర్మలకు ఫలము స్వర్గాదికము. జ్ఞానమునకు ఫలము మోక్షము. అందుచే రెండును చేరి యొక పనిని సాధింపనేరవు.

శ్లో॥ వైలక్షణ్యం చ సామగ్ర్యోః శ్శోభయత్రాధికారిణోః,
కామీ కర్మణ్యధికృతః నిష్కామీ శ్రవణే మతః.

శ్లో॥ అర్థీ సమర్థ ఇత్యాది లక్షణం కర్మిణోమతమ్,
పరీక్ష్య లోకా నిత్యాది లక్షణం మోక్షకాంక్షిణః. ౧౭౯

శ్లో॥ మోక్షాధికారీ సన్న్యాసీ గృహస్థః కేలకర్మణి,
కర్మణః సాధనం భార్యా స్రుక్స్రువాది పరిగ్రహః.

శ్లో॥ నైవాఽన్యసాధనాఽపేక్షా శుశ్రూషాస్తు గురుంవినా,
ఉపర్యుప ర్యహం కారో వర్ధతే కర్మణా భృశమ్. ౧౮౧

శ్లో॥ అహంకారస్య విచ్ఛిత్తిః శ్రవణేన ప్రతిక్షణమ్,
ప్రవర్తకం కర్మశాస్త్రం జ్ఞానశాస్త్రం నివర్తకమ్. ౧౮౨
ఇత్యాది వైపరీత్యం త త్సాధనే చాధికారిణోః,

తా॥ కర్మజ్ఞానములకు పలువిధమగు భేదములుండుటచే సముచ్చయ మెన్నటికిని కుదురనేరదు. ఎట్లన: విషయసుఖముల గోరువాడు కర్మల యందధికారి. విషయవాంఛలులేనివాడు జ్ఞానమునందధికారి. ధన సంపన్నుడును, శరీరదార్ఢ్యముగలవాడును, విద్వాంసుడును, పుత్రవంతుడును మధ్యవయస్సునన్నవాడునునగు పురుషుడు కర్మలను జేయనర్హుడు. లోకములన్నియు కర్మనిర్మితములగుటచే ననిత్యములని తలచి విరక్తుడై యథాశాస్త్రముగ గురుశుశ్రూష జేయువాడు మోక్షమున కర్హుడు. గృహస్థాశ్రమము కర్మాచరణయోగ్యము. సన్న్యాసాశ్రమము జ్ఞానాభ్యాసయోగ్యము. భార్య, స్రుక్కు, స్రువము మున్నగునవికర్మసాధనములు.

జ్ఞానమునకుగురువుతప్ప మరియొక సాధనము లేదు. కర్మల నాచరించుట వలన అభిమానము వృద్ధిపొందును. జ్ఞానాభ్యాసమువలన అభిమానము నశించును. కర్మశాస్త్రము కర్మలయందు ప్రవర్తింపజేయును. జ్ఞాన శాస్త్రము కర్మలనుండి నివర్తింపజేయును. ఇవ్విధమున, కర్మమునకును జ్ఞానమునకును అత్యన్త భేదముగలదు.

శ్లో॥ ద్వయోః పరస్పరాపేక్షా విద్యతే నకదాచన. ౧౮౩

శ్లో॥ సామగ్ర్యోశ్చోభయో స్తద్వ దుభయత్రాధి కారిణోః,
ఊర్ధ్వం నయతి విజ్ఞాన మధఃప్రాపయతిక్రియా. ౧౮౪

శ్లో॥ కథమన్యోన్య సాపేక్షా కథం వాపి సముచ్చయః,
యథాఽగ్నే స్తృణకూటస్య తేజస స్తిమిరస్యచ ౧౮౫
సహాయోగో నఘటతే తథైవ జ్ఞానకర్మణోః.

తా॥ జ్ఞానకర్మముల రెండింటికిని, వాని సాధనములకును, వాని యధికారులకును, పరస్పరాపేక్ష యెంత మాత్రమును సంభవింపదు. జ్ఞానమువలన నిత్యానన్దరూపమగు మోక్షము గలుగును. కర్మలవలన సంతత దుఃఖాస్పదమగు సంసారము గలుగును. అందువలన వహ్ని తృణములకును తేజస్తిమిరంబులకునుంబోలె జ్ఞానకర్మములకు పరస్పర సాధ్యసాధన భావముగాని, సముచ్చయముగాని గలుగనేరదు.

శ్లో॥ కిమూపకుర్యాత్ జ్ఞానస్య కర్మస్వప్రతియోగినః,
యస్య సన్నిధి మాత్రేణ స్వయం న స్ఫూర్తిమిచ్ఛతి.

తా॥ లోకమున సర్వక్రియలును "నేను కర్తను, దీని ఫలమును నేననుభవింతును." అను నభిమానముగల పురుషునకు సంబన్ధించి యున్నవి. జ్ఞానముగలిగిన వెంటనే కర్తృత్వాద్యభిమానమంతయు

నశించుచున్నది. కనుక కర్మములు జ్ఞానమున కుపకరించునవనుట సమంజసము గానేరదు.

శ్లో॥ కోటీన్ధనాద్రి జ్వలతో౽పి వహ్నేః
అర్కస్య నాఽర్ఘ్యే త్యుపకర్తృ మీషత్,
యథా తథా కర్మసహస్రకోటిః
జ్ఞానస్య కిన్తు స్వయమేవ లీయతే. ౧౮౭

తా॥ అగ్నిహోత్రము ఎన్ని కట్టెల గుట్టలచే ప్రజ్వలింప జేయ బడినను సూర్యప్రకాశమున కించుకేనియు నుపకరింపకుండుటయేగాక సూర్యకాన్తి యెదుట తానే తిరోహితమగుచున్నది. అటులనే శ్రౌత స్మార్తాది కర్మజాలమంతయు, నాత్మవిజ్ఞానమున కెంతమాత్రము సహాయము చేయజాలదు. ఇక జ్ఞాన ముదయింపగనే కర్మసమూహము తానే విలయము నొందుచున్నది.

శ్లో॥ ఏకకర్త్రాశ్రయా హస్తౌ కర్మణ్యధికృతావుభౌ,
సహయోగ స్తయోర్యుక్తో నతథా జ్ఞానకర్మణోః. ౧౮౮

తా॥ పురుషునకు రెండుచేతులును గలసి కార్యసాధకము లగు నట్లుగా ముముక్షువునకు జ్ఞానకర్మములు రెండునుచేరి మోక్షమును సాధింప గలవని పూర్వమున చెప్పబడిన దృష్టాన్త మెంతమాత్రమును కుదర నేరదు. ఎట్లన రెండు చేతులును ఒకే కర్తకు సంబన్ధించినవగుటచేతను, రెండును కర్మల జేయ సమర్థములగుటచేతను వానికి సహయోగము సంభవించు చున్నది. జ్ఞానకర్మములకు మాత్రము, కర్త, విషయము, ఫలము, సాధ నము మున్నగునవన్నియు నత్యన్తభిన్నములగుటచే కలయిక కుదుర నేరదు.

శ్లో॥ కర్త్రా కర్తు మకర్తుం వాఽ ప్యన్యథా కర్మశక్యతే,
నతథా వస్తునో జ్ఞానం కర్తృతన్త్రం కదాచన. ౧౮౯

తా॥ కర్మ యనునది కర్తయగు పురుషున కధీనమై యున్నది. అందుచే నది చేయుటకుగాని, మానుటకుగాని, మరియొక విధముగ మార్చుటకుగాని వీలగుచున్నది. జ్ఞానము మాత్రము వస్తువునకును సంబన్ధించిన దగుటచే కర్త్రధీనముగా నేరదు.

శ్లో॥ యథా వస్తు తథా జ్ఞానం ప్రమాణేన హి జాయతే,
నాఽపేక్షతేచ యత్కించిత్ కర్మవా యుక్తి కౌశలమ్.

తా॥ అన్తఃకరణముయొక్క వృత్తికి, జ్ఞానమనిపేరు. ఇట్టి జ్ఞానము ప్రత్యక్షాది ప్రమాణములచే ఘటము మున్నగు విషయములు ఏ విధమున నున్న నదే విధముగ నేర్పడుచుండును. అందుచే జ్ఞానములన్నియూ వస్తువుల కధీనములై యున్నవి. కనుకనే కర్మలనుగాని, పురుషుని తెలివి తేటలనుగాని యపేక్షింపకున్నవి.

శ్లో॥ 'జ్ఞానస్య వస్తుతన్త్రత్వే సంశయాద్యుదయః కథమ్,
అతో నవాస్తవం జ్ఞానం' ఇతి నో శంక్యతా బుధైః.

తా॥ "పూర్వశ్లోకమున చెప్పబడిన రీతిగా జ్ఞానము వస్తువున కధీనమై యుండునేని; త్రాడు మొదలగు పదార్థములందు" ఇదిత్రాడా లేక పామా ! అని సంశయముగాని "ఇది పామే" యని విపరీత జ్ఞానముగాని కలుగుటకు వీలులేదు. అందుచే జ్ఞానము వస్తుతన్త్రమనుట యుక్తముగా నేరదు." అని ఈ విధముగా పండితులు శంకింపతగదు.

శ్లో॥ ప్రమాణాసౌష్ఠవప్రాప్తం సంశయాది నవాస్తవమ్,
శ్రుతిప్రమాణ సుష్ఠుత్వే జ్ఞానం భవతివాస్తవమ్.
వస్తు తావత్పరం బ్రహ్మ నిత్యం సత్యం ధ్రువం విభు.

శ్లో॥ శ్రుతిప్రమాణే తజ్జ్ఞానం స్యాదేవ నిరపేక్షకమ్,
రూపజ్ఞానం యథా సమ్యక్ దృష్టౌ సత్యం భవేత్తథా,
శ్రుతిప్రమాణే సత్యేవ జ్ఞానం భవతి వాస్తవమ్. ౧౫౮

తా॥ వస్తువు లందున్నట్లుగా భాసించు చుండెడి సంశయ జ్ఞానము, విపరీత జ్ఞానము: మున్నగున వన్నియు ప్రమాణములగు నేత్రము మున్నగు వానియందు గల దోషములచే గలుగునవియేగాని వస్త్వధీనములు గావు. ఇక ప్రకృతమున వస్తువనగా బ్రహ్మము. ఇది నిత్యము. సత్యము. నిర్వికారము. సర్వవ్యాపకమ నగుచున్నది. ఇట్టి బ్రహ్మముయొక్క జ్ఞానము కర్మల నపేక్షింపనిదై గురూపదిష్టములగు తత్త్వమస్యాది మహావాక్యముల వలన గలుగుచున్నది. మరియు ఘటాదులయొక్క రూపజ్ఞానము, చూపు సరిగా నుండిననే కలుగునట్లు బ్రహ్మజ్ఞానము వేదప్రమాణము వలననే సంభవించును.

శ్లో॥ నకర్మణయ త్క్యంచిదపేక్షతే హి
రూపోపలబ్ధా పురుషస్య చక్షుః,
జ్ఞానం తథైవ శ్రవణాది జన్యమ్
వస్తు ప్రకాశే నిరపేక్షమేవ. ౧౯౫

తా॥ రూపమును చూచుటకై, కన్ను - కర్మలనేమియు నపేక్షింపకున్నది. అటులనే శ్రవణ మననిదిధ్యాసనము వలన గలుగు జ్ఞానము కర్మాపేక్ష లేకయే బ్రహ్మమును ప్రకాశింప జేయుచున్నది.

శ్లో॥ కర్తృతన్త్రం భవేత్కర్మ కర్మతన్త్రం శుభాశుభమ్,
ప్రమాణతన్త్రం విజ్ఞానం మాయాతన్త్ర మిదం జగత్.

తా॥ కర్మములు కర్త్రధీనములును, మేలుకీళ్ళు, సుకృతదుష్కృత రూప కర్మాధీనములును, విషయజ్ఞానము, ప్రత్యక్షాది ప్రమాణాధీనములును, ఈ ప్రపంచము, పరమేశ్వరుని యనిర్వచనీయ మాయాశక్తి పరతంత్రమును నగుచున్నవి.

శ్లో॥ విద్యాం చావిద్యాం చేతి
సహోక్తి రియ ముపక్రమతాం సద్భిః,
సత్కర్మోపాసనయో ర్నత్వా
త్మజ్ఞానకర్మణోః క్వాపి. ౧౯౬

తా॥ ఈశావాస్యోపనిషత్తు నందు విద్యాఽవిద్యలను రెంటిని చేర్చి యాచరించు వారలు, సంసారదుఃఖమును దాటి శాశ్వత సుఖమును బడ యుదురని చెప్పబడినది. ఇచట కొందరు విద్యయనగా జ్ఞానమనియు, నవిద్య యనగా కర్మమనియు నర్థమును స్వీకరించి జ్ఞానకర్మ సముచ్చయము శ్రుతియందు చెప్పబడినదని పొరబడు చున్నారు. కాని జ్ఞాన కర్మలకు రెంటికి పలువిధములైన విరోధము గలదని పూర్వము నిరూపింప బడుటచే నటుల భావింప దగదు. పండితులు మాత్రము ఈ శ్రుతియందుగల విద్యాశబ్దము ఉపాసనమును బోధించునదని, గ్రహించి, కర్మోపాసనా సముచ్చయమే శ్రుతివిహితమని గ్రహింపనగును.

శ్లో॥ నిత్యానిత్యపదార్థ బోధరహితో యశ్చోభయత్ర స్రగా
ద్యర్థానామనుభూతి లగ్నహృదయోఽ నిర్విణ్ణబుద్ధి ర్జనః,
తస్యైవాఽస్య జడస్య కర్మవిహితం శ్రుత్యావిరజ్యాఽభితో
మోక్షేచ్ఛో ర్నవిధీయతే తు పరమానన్దార్థినో ధీమతః.

తా॥ నిత్యానిత్య వస్తువివేకము లేనివాడును, ఇహపరలోక భోగములనే కోరువాడును, విరక్తిహీనుడునునగు నజ్ఞజనునకు శ్రుతిచే కర్మలు విధింపబడినవి. కాని, నశ్వరములగు సర్వలోక సుఖములందును విరక్తి నొంది బ్రహ్మానన్ద కాముడై ముక్తి నభిలషించు మనుజునకు మాత్రము కర్మలు విధింప బడుట లేదు.

శ్లో॥ మోక్షేచ్ఛయా యదహారేవ విరజ్యతేఽసౌ
న్యాసస్తదైవ విహితో విదుషో ముముక్షోః,
శ్రుత్యా తయైవ పరయాచ తత స్సుధీభిః
ప్రామాణికోఽయ మితి చేతసి నిశ్చితవ్యమ్. ౧౯౨

తా॥ ఏ వేదముచే కర్మకాండయందు భోగకాములగు మానవులకు ర్మలు విధింప బడినవో; ఆ వేదముచేతనే జ్ఞానకాండయందు మోక్షకాములగు వారలకు ఏనిమిత్తమున సర్వ వైషయిక సుఖములందును విరక్తి కలుగునో యా నిమిత్తముననే సర్వకర్మ పరిత్యాగము చెప్పబడినది. (విధింపబడినది) కావున కర్మసన్న్యాసమనునది శ్రుతిసిద్ధమైనదగుటచే దీని విషయమై పండితు లెంతమాత్రమును సంశయింపదగదు.

శ్లో॥ స్వాపరోక్షస్య వేదాదేః సాధనత్వం నిషేధతి,
నాఽహం వేదై ర్నతపసే త్యాదినా భగవా నపి. ౧౯౯

తా॥ భగవద్గీత యందు కృష్ణభగవానుడు అర్జునునకు తన విశ్వరూపమును చూపిన పిమ్మట, 'ఓ అర్జునా ! నేను వేదములచే గాని, దానములచే గాని, యజ్ఞాదులచే గాని — తెలియబడు వాడనుగాను అని బోధించి, ఆత్మసాక్షాత్కారమునకు, వేదములు మున్నగునవి. సాధనములు గానేరవని నిరూపించి యున్నాడు. ఇట్టియెడ వేదోక్త కర్మలు మోక్షమునకు సాక్షాత్సాధనములు గానేరవనుటలో సందియ మెంతమాత్రమును లేదు.

శ్లో॥ ప్రవృత్తిశ్చ నివృత్తిశ్చ ద్వేఏవ శ్రుతిగోచరే,
ప్రవృత్త్యా బధ్యతే జన్తుః నివృత్త్యాతు విముచ్యతే.

తా॥ వేదములందు, కర్మానుచణరూప ప్రవృత్తి మార్గమును, కర్మత్యాగ రూపనివృత్తిమార్గమును, రెండు చెప్పబడుచున్నవి ఈ రెంటిలో,

కర్మాచరణముచే, సంసారబన్ధమును, కర్మత్యాగముచే మోక్షమును గలుగు చున్నవి.

శ్లో॥ య న్నస్వబన్ధోఽభిమతో మూఢస్యాఽపి క్వచి త్తతః,
నివృత్తిః కర్మసన్న్యాసః కర్తవ్యో మోక్షకాంక్షిభిః.

తా॥ లోకమున మూఢుడైనను తాను బన్ధింపబడి యుండుటను కోరుకొనడు. స్వేచ్ఛాసంచారమునే కోరుకొనును. ఇట్టియెడ ముక్తిని గోరువారు, సంసారబన్ధకములగు కర్మములను తప్పక పరిత్యజింప వలయును.

శ్లో॥ న జ్ఞానకర్మణో ర్యస్మాత్ సహాయోగస్తు యుజ్యతే,
తస్మా త్త్యాజ్యం ప్రయత్నేన కర్మజ్ఞానేచ్ఛునా ధ్రువమ్.

తా॥ జ్ఞానకర్మలకు రెంటికిని సముచ్చయము సంభవింపదని పూర్వము విపులముగా వివరింపబడినది. అందుచే ముముక్షుజనులు తప్పక సర్వకర్మలను విడువవలెను.

శ్లో॥ ఇష్టసాధనతా బుద్ధ్యా గృహీతస్యాఽపి వస్తునః,
విజ్ఞాయాఽఫలతాం పశ్చాత్ కః పున స్తత్ప్రతీచ్ఛతే.

తా॥ ఏదైన నొకవస్తువును స్వాభీష్టమునకు సాధనమగుననుదృష్టితో స్వీకరించును, కొంతకాలమునకు దానివలన ప్రయోజనము లేదని తెలియును. పిమ్మట వదిలివేయునేకాని దాని నెవ్వడును గ్రహింపగోరడుగదా! అటులనే, సుఖము గలుగునను నాశతో పూర్వమున కర్మల నాచరించి నప్పటికిని, వానివలన శాశ్వతసుఖము లేదని నిశ్చయము గలిగిన పిమ్మట కర్మలను పరిత్యజించుటయే యుక్తమని భావము.

శ్లో॥ ఉపరతిశబ్దో హ్యుపరమణం పూర్వదృష్టవృత్తిభ్యః,
సోఽయం ముఖ్యోగౌణశ్చేతి చ వృత్త్యా ద్విరూపతాంధత్తే.

తా॥ లోకము నందలి ఘట పటాది వస్తువులకు సంబన్ధించిన మనో వృత్తులన్నియు నివర్తించుటయే ఉపరతి శబ్దమున కర్థము. ఇట్టి యుపరతి శబ్దార్థము, ముఖ్యమనియు గౌణమనియు రెండు విధములు—

శ్లో॥ వృత్తేర్దృశ్య పరిత్యాగో ముఖ్యార్థ ఇతికథ్యతే,
గౌణార్థః కర్మసన్న్యాసః శ్రుతే రంగతయామతః. ౨౦౫

తా॥ మనస్సునందుగల బాహ్యవిషయాకారములను విడనాడుటయే ఉపరతి శబ్దమునకు ముఖ్యార్థము. దేహము మొదలగు వానియందు అభిమానముగలిగి కర్మలనాచరించుచుండు మానవులకు బాహ్యవిషయముల పరిత్యజించుట దుర్లభము. చిత్తము నిరన్తరమాత్మ స్వరూపమునే చిన్తించుచుండునేని, అప్పుడు బాహ్యవిషయములు స్ఫురింపనేరవు. కావున నిరన్తరాత్మచిన్తనముకొరకై సర్వకర్మలను విడువవలయును. దీనినే కర్మసన్న్యాసమందురు. ఇట్టికర్మసన్న్యాసము, వైషయిక చిత్త వృత్తి పరిత్యాగమునకు సాధనముగావున ఉపరతి శబ్దముచే లక్షణయను శబ్దవ్యాపారమువలన చెప్పబడుచున్నది.

శ్లో॥ పుంసః ప్రధాన సిద్ధ్యర్థ మంగస్యాశ్రయణంధ్రువమ్,
కర్తవ్య, మంగహీనంచేత్ ప్రధానం నైవ సిద్ధ్యతి. ౨౦౬

తా॥ ప్రధానములగు దర్శపూర్ణ మాసాది కర్మలు ఫలప్రదములు కావలయుననిన తదంగములగు ప్రయాజలు, అనూయాజలు మొదలగు కర్మలను తప్పక యనుష్ఠింపవలయును. అటులనే, వేదాన్తశ్రవణము సఫలము కావలయుననిన తదంగమగు సర్వ కర్మ సన్న్యాసము తప్పక స్వీకరింపవలయును.

శ్లో॥ సన్న్యసేత్ సువిరక్తస్సన్ ఇహాఽముత్రార్థతత్సుఖాత్.
అవిరక్తస్యసన్న్యాసో నిష్ఫలోఽయాజ్యయాగవత్. ౨౦౭

తా॥ కాబట్టి ముముక్షుజనులు నశ్వరములగు సర్వలోక విషయ సుఖములందును విరక్తి నొంది సర్వకర్మల సన్యసింపవలయును. విరక్తి లేనివారి సన్యాసము అధికారము లేనివారు చేసిన యజ్ఞము వలె, ఫలము లేనిదగు చున్నది.

శ్లో॥ సన్న్యస్యతు యతిః కుర్యా న్నపూర్వ విషయస్మృతిమ్,
తాం తాం, తత్స్మరణే తస్య జుగుప్సా జాయతే యతేః.

తా॥ సన్న్యసించిన యతీశ్వరులు పూర్వాశ్రమ విషయములను స్మరించుచుండకూడదు. అట్లు స్మరించువారు చెడిపోవుదురని శాస్త్రములు నుడువుచున్నవి. లోకులుగూడ వారలను నిన్దింతురనుట ప్రసిద్ధము.

శ్లో॥ గురువేదాన్తవాక్యేషు బుద్ధిర్యా నిశ్చయాత్మికా,
సత్య మిత్యేవ సా శ్రద్ధా నిదానం ముక్తిసిద్ధయే. ౨౧౯

తా॥ గురువాక్యములు, వేదాన్తవాక్యములును, యథార్థములేయని వానియందు దృఢవిశ్వాసముగలిగి యుండుటయే శ్రద్ధ యనబడుచున్నది. ఇట్టి శ్రద్ధయున్నచో ముక్తి సులభముగా సిద్ధించును.

శ్లో॥ శ్రద్ధావతామేవ సతాం పుమర్థః
సమీరిత స్సిధ్యతి నేతరేషామ్,
ఉక్తం సుసూక్ష్మం పరమార్థతత్త్వమ్
శ్రద్ధత్స్వ సౌమ్యేతిచ వక్తివేదః. ౨౨౦

తా॥ ఏవిషయమైనను, శ్రద్ధగలవారలకు బోధింపబడినప్పుడే సార్థకమగును. శ్రద్ధలేనివారలకు ఎంతగొప్ప విషయమును సులభముగా చెప్పినను, నిరర్థకమే. కనుకనే ఉద్దాలకుడను నొక మహర్షి శ్వేతకేతువను తన కుమారునకు పరమాత్మ తత్త్వమును బోధించుచు; "నాయనా, నీవీ విషయమున శ్రద్ధను వహింప వలయునుసుమా!" అని చెప్పినట్లుగా ఛాన్దోగ్యశ్రుతి చెప్పుచున్నది.

శ్లో॥ శ్రద్ధా విహీనస్య తు నప్రవృత్తిః
ప్రవృత్తి శూన్యస్య న సాధ్యసిద్ధిః,
అశ్రద్ధయైవాఽభి హతాశ్చ సర్వే
మజ్జన్తి సంసార మహాసముద్రే. ౨౧౧

తా॥ శ్రద్ధలేనివారు, మంచిమార్గమున ప్రవర్తింపనివారై శ్రేయస్సును పొందలేకున్నారు. సామాన్యముగా జనులందరును, పెద్దలవాక్యములందును, వేదాన్తవాక్యములందును, విశ్వాసము లేనివారలగుటచేతనే ముక్తిని పొందనేరక యెల్లపుడును సంసారసముద్రముననే మునిగితేలుచున్నారు.

శ్లో॥ దైవేచ వేదేచ గురౌచ మన్త్రే
తీర్థే మహాత్మన్యపి భేషజేచ,
శ్రద్ధా భవత్యస్య యథా యథాన్తః
తథా తథా సిద్ధి రుదేతి పుంసః. ౨౧౨

తా॥ మానవులకు, దైవమునందును, వేదమునందును, గురువునందును మన్త్రము నందును, గంగాది పుణ్యస్థలము నందును, మహాత్ములందును, ఔషధమునందును, ఎట్లెట్లు నమ్మకముండునో, అట్లట్లే కార్యసిద్ధియు కలుగుచుండును. కావున శ్రద్ధయే కార్యసిద్ధికి ముఖ్యకారణము.

శ్లో॥ అస్తీత్యేవోపలబ్ధవ్యం వస్తు సద్భావ నిశ్చయాత్,
సద్భావనిశ్చయ స్తస్య శ్రద్ధయా శాస్త్రసిద్ధయా, ౨౧౩

తా॥ వేదములు, శాస్త్రములు మున్నగునవన్నియు బ్రహ్మపదార్థమున్నదని ప్రమాణపూర్వకముగా నిరూపించుచున్నవి. కావున ఉత్తమస్థితిని పొందగోరు ప్రతిమానవుడును శాస్త్రాచార్యవాక్యములందు శ్రద్ధహించి బ్రహ్మమున్నదనియే నిర్ణయించుకొనవలయును.

శ్లో॥ తస్మాచ్ఛ్రద్ధా, సుసంపాద్యా గురువేదాన్త వాక్యయోః,
ముముక్షోః శ్రద్ధధానస్య ఫలం సిద్ధ్యతి నాఽన్యథా.

తా॥ మానవుడు మోక్షకాముడైనను, శ్రద్ధాయుక్తుడైనప్పుడే ముక్తిని పొందగలుగుచున్నాడు. కావున ముముక్షు జనులు, గురువాక్యములందును వేదాన్త వాక్యములందును దృఢవిశ్వాసము కలిగి యుండవలయును.

శ్లో॥ యథార్థవాదితా పుంసాం శ్రద్ధా జననకారణమ్,
వేదస్యేశ్వర వాక్యత్వాత్ యథార్థత్వే నసంశయః ౨౧౫
శ్లో॥ ముక్తస్యేశ్వరరూపత్వాత్ గురో ర్వాగపి తాదృశీ,
తస్మాత్తద్వాక్యయోశ్శ్రద్ధా సతాం సిద్ధ్యతి ధీమతామ్.

తా॥ లోకమందు నిజముపలుకువాని మాటయందు ప్రతివానికిని నమ్మకము కలుగుచుండును. (శ్రుతివాక్యముల ననుసరించి) పరిశీలించినచో; వేదములు, పరమేశ్వరుని నిశ్వాసరూపములగుటచే; నవి సత్యములనుటలో సందియము లేదు. అటులనే బ్రహ్మజ్ఞానముకల సద్గురువులు పరమేశ్వర స్వరూపులగుటచే వారు బోధించు వాక్యములును యథార్థములే యగును. కావున బుద్ధిమంతులగు వారు గురువేదాన్త వాక్యములను తప్పక విశ్వసింపవలయును.

శ్లో॥ శ్రుత్యుక్తార్థావగాహాయ విదుషా జ్ఞేయవస్తుని,
చిత్తస్య సమ్యగాధానం సమాధాన మితీర్యతే, ౨౧౭

తా॥ సాధకుడగు పండితుడు శ్రుతులందు చెప్పబడిన బ్రహ్మసాక్షాత్కారముకొరకై చిత్తమును విజాతీయవృత్తి రహితముగ నాత్మస్వరూపమున నిలుపుటయే సమాధానమని చెప్పబడుచున్నది.

శ్లో॥ చిత్తస్య సాధ్యైకపరత్వమేవ
పుమర్థసిద్ధే ర్నియమేన కారణమ్,
నైవాఽన్యథా సిధ్యతి సాధ్యమీషత్
మనః ప్రమాదే విఫలః ప్రయత్నః. ౨౧౮

తా॥ ఏదైన నొక కార్యమును సాధింపవలయుననిన చిత్తమును దానియందే నిలుపవలయును. అట్లుకానిచో కార్యము నెరవేరదు. ప్రయత్నమంతయు వ్యర్థమగును. శ్రమరయే మిగులును. కావున ప్రకృతమున మోక్షమను పురుషార్థము సిద్ధించుటకై చిత్తమును బ్రహ్మమునందే లగ్నము చేయవలయును.

శ్లో॥ చిత్తం చ దృష్టిం కరణం తదాఽన్యత్
ఏకత్ర బధ్నాతి హి లక్ష్యభేత్తా,
కించిత్ప్రమాదే సతి బాణమోక్తుః
బాణప్రయోగో విఫలో యథాతథా. ౨౧౯

తా॥ లోకమున వ్యాఘ్రము మున్నగు గురిని గొట్టు మనుజుడు తన చిత్తమును, చూపును బాణమును గూడ నొక్క లక్ష్యమునందే నిలుపుచున్నాడు. అప్పుడు వానికి కొంచెమేనియు పొరబాటు గలుగు నెడ వాని బాణప్రయోగము వ్యర్థమగుచున్నది. అటులనే ముముక్షువునకు మనః ప్రమాదము గలుగునేని ప్రయత్నము ప్రయోజన శూన్యమగును.

శ్లో॥ సిద్ధే శ్చిత్తసమాధాన మసాధారణకారణమ్,
యత స్తతో ముముక్షూణాం భవితవ్యం సదాఽమునా.

తా॥ కార్యసిద్ధికి చిత్తస్థైర్యము ముఖ్యకారణ మగుటచే ముముక్షు జనులు మోక్షప్రాప్తికై చిత్తైకాగ్ర్యమును తప్పక సంపాదించుకొని దానినే నిరంతర మనుష్ఠింప వలయును.

శ్లో॥ అత్యన్త తీవ్రవైరాగ్యం ఫలవిష్ణా మహత్తరా,
తదేత దుభయం విద్యాత్ సమాధానస్య కారణమ్.

తా॥ అశాశ్వతములగు విషయభోగములందు తీవ్రమగు విరక్తియు, శాశ్వతసుఖరూపమగు మోక్షమునందు దృఢవాంఛయు, నీ రెండును, చిత్తమాత్మయందు నిలుచుటకు (సహాయపడు) కారణములగుచున్నవి.

శ్లో॥ బహిరంగం శ్రుతిః ప్రాహ బ్రహ్మచర్యాది ముక్తయే,
శమాది షట్కమేవైతత్ అన్తరంగం విదుర్బుధాః.

తా॥ స్వయముగా కార్యమును సాధించు కారణములు (సాధనములు) అన్తరంగములనియు, మరియొక దానిని పుట్టించుటద్వారా (కలిగించుట) కార్యసాధకములగునవి బహిరంగసాధనములనియు వ్యవహరింపబడు చున్నవి. అటులనే ప్రకృతమందు శమదమాదులు బ్రహ్మాకారవృత్తి కలుగుటకు సాక్షాత్సాధనము లగుటచే నంతరంగములనియు బ్రహ్మచర్యాదులు చిత్తశుద్ధిని కలిగించుటద్వారా తత్సాధనములగుటచే బహిరంగ సాధనములనియు చెప్పబడుచున్నవి.

శ్లో॥ అన్తరంగం హి బలవ ద్బహిరంగా ద్యతి స్తతః,
శమాదిషట్కంజిజ్ఞాసో రవశ్యం భావ్య మాన్తరమ్.

ఎందువలనన–

శ్లో॥ అంతరంగ విహీనస్య కృతశ్రవణకోటయః,
నఫలన్తి యథా యోద్ధు రధీరస్యాస్త్ర సంపదః. ౨౨౪

తా॥ బహిరంగ సాధనముకంటె నన్తరంగ సాధనము ముఖ్యమైనదిగాన ముముక్షుజనులు శమదమాదులనే నిరన్తర మభ్యసించు చుండ వలయును. మరియు యుద్ధమున జయమునొందుటకు ధైర్యమన్తరంగ సాధనము. బాణములు మున్నగునవి బహిరంగసాధనములు. ఇట్టియెడ

ధైర్యములేని యుద్ధభటుని శస్త్రాస్త్రసంపద వ్యర్థమగునట్లుగా, శమాది షట్కము లేని ముముక్షుజనుని శ్రవణాదులును వ్యర్థములే యగుచున్నవి.

శ్లో॥ బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానాత్ యద్విద్వాన్మోక్తు మిచ్ఛతి,
సంసారపాశబన్ధం తన్ముముక్షుత్వం నిగద్యతే. ౨౨౫

తా॥ జీవుడు బ్రహ్మమే అను జ్ఞానము వలన సంసారమను మహా బన్ధమునుండి విడుదల గలుగును. ఇట్టి విడుదలను గోరుటయే ముముక్షుత్వ మనబడుచున్నది.

శ్లో॥ సాధనానాం తు సర్వేషాం ముముక్షా మూలకారణమ్,
అనిచ్ఛోరప్రవృత్తస్య క్వశ్రుతిః క్వను తత్ఫలమ్. ౨౨౬

తా॥ మోక్షమును పొందవలయునను కోరికయే ముక్తిసాధనము లన్నిటికిని మూలకారణము. మోక్షవాంఛయే లేనివానికి ముక్తి సాధనము లగు వేదాన్త శ్రవణాదులందు ప్రవృత్తి సంభవింపదుగదా!

శ్లో॥ తీవ్ర మధ్యమ మందాతి మందభేదా చ్చతుర్విధా,
ముముక్షా తత్ప్రకారోఽపి కీర్త్యతే శ్రూయతాం బుధైః.

తా॥ తీవ్రము, మధ్యమము, మందము, అతిమందము అని ముక్తి వాంఛ నాలుగు విధములు. వాని స్వరూపము రాబోవు శ్లోకములలో చెప్పబడుచున్నది. గావున పండితులు మంచి ముముక్ష నవలంబించుటకై శ్రద్ధతో వినవలయును.

శ్లో॥ తాపై స్త్రిభి ర్నిత్య మనేకరూపైః
సంతప్యమానః క్షుభితాన్తరాత్మా,
పరిగ్రహం సర్వమనర్థ బుద్ధ్యా
జహాతి సా తీవ్రతరా ముముక్షా. ౨౨౮

తా॥ ఏ మానవుడు ప్రతి దినమందును తాపత్రయ దుఃఖములచే బాధింపబడుచుండుటచే క్షణమేనియు మనశ్శాన్తి లేనివాడై తుదకు సంసార మన్తయు నవర్థమేయని తలంచి భార్యాపుత్త్రాదుల నందఱను పరిత్యజించి పరమేశ్వరునే పరిగ్రహించునో, అట్టి వాని ముముక్షు తీవ్ర ముముక్షు యనబడుచున్నది.

శ్లో॥ తాపత్రయం తీవ్రమవేక్ష్య వస్తు(మ్)
దృష్ట్వా కళత్రం తనయాన్విహాతుమ్,
మధ్యే ద్వయో ర్లోడన మాత్మనో యత్
సైషా మతా మాధ్యమికీ ముముక్షా. ౨౨౯

తా॥ లోకమున కొందరు పండితులు, 'సంసారములో నున్నంత వరకు, తాపత్రయ దుఃఖములు తప్పవనియు, పరమాత్మ స్వరూప సాక్షాత్కారమువలననే శాశ్వత సుఖము గలుగుననియు' అనుభవము వలనను, శాస్త్రములవలనను గ్రహించియుగూడ భార్యాపుత్త్రాదులను విడువలేనివారలై, సంసారమున నుందుమా ? లేక సన్న్యసింతుమా ? అని మీనమేషములు లెక్కించుచుందురు. అట్టి వారలకుగల ముముక్షు మధ్యమ ముముక్షు యగుచున్నది.

శ్లో॥ మోక్షస్య కాలోఽస్తి కిమద్య మే త్వరా
భుక్త్వైవ భోగాన్ కృతసర్వకార్యః,
ముక్త్యై యతిష్యేఽహ మథేతి బుద్ధిః
ఏషైవ మందా కథితా ముముక్షా. ౨౩౦

తా॥ మోక్షమునకు, ముందు చాలా కాలము గలదు. కావున నేటినుండియే తొందరపడనవసరము లేదు. నేనుమాత్రము మానుషభోగము లన్నియు ననుభవించి మునిమనుమని పాణిగ్రహణ మహోత్సవమునుగూడ

పూర్తిచేయించి, పిమ్మట ముక్తి విషయము నాలోచింతునని యనుకొనుచుండువాని మముక్షు, మందముముక్షు యని చెప్పబడుచున్నది.

శ్లో॥ మార్గే ప్రయాతు ర్మణిలాభవ న్మే
లభేత మోక్షో యది తర్హి ధన్యః,
ఇత్యాశయా మూఢధియాం మతి ర్యా
సైషాఽతి మందాఽభిమతా ముముక్షా. ౨౩౧

తా॥ మార్గమున ప్రయాణము చేయుచున్న మనుజునకు మణి లభించునటుల సంసార భోగముల ననుభవించుచున్న నాకు ప్రయత్నము లేకయే మోక్షము లభించునేని నేను కృతార్థుడ నగుదునను నిర్విధమైన మూఢుల యభిప్రాయమునే అతి మంద ముముక్షు అందురు.

శ్లో॥ జన్మానేకసహస్రేషు తపసాఽరాధితేశ్వరః
తేన నిశ్శేష నిర్ధూత హృదయస్థితకల్మషః. ౨౩౨

శ్లో॥ శాస్త్రవి ద్గుణదోషజ్ఞః భోగ్యమాత్ర వినిస్పృహః,
నిత్యానిత్యపదార్థజ్ఞః ముక్తికామో దృఢవ్రతః ౨౩౩

శ్లో॥ నిష్టప్త మగ్నినా పాత్ర ముద్వాస్య త్వరయా యథా,
జహాతి గేహం తద్వచ్చ తీవ్రమోక్షేచ్ఛయా ద్విజః.
స ఏవ సద్య స్తరతి సంసృతిం గుర్వనుగ్రహాత్,

తా॥ ఏద్విజుడు పలుజన్మములందు తన వర్ణాశ్రమ విహిత ధర్మానుష్ఠానమువలన పరమేశ్వరుని పూజించుటచేత, పోగొట్టబడిన సమస్త పాపములు గలవాడై వేదాంతశాస్త్రమును బాగుగా విచారించి గుణదోషములను గుర్తెరింగి, విషయవాంఛలను విడనాడి నిత్యానిత్య వస్తు వివేకముగలవాడై ముక్తినేగోరుచు శాస్త్రనియమముల నవలంబించి యుండునో, అట్టివాడు నిప్పుచే గృహము కాలుచున్నప్పుడు ఘటపటాదు

లను విడిచి బయటపడునట్లుగా భార్యాపుత్రాదులను పరిత్యజించి సద్గురు కృపాకటాక్ష వీక్షణముచే బద్ధముక్తుడగుచున్నాడు.

శ్లో॥ యస్తు తీవ్రముముక్షుస్స్యా త్సజీవ న్నేవ ముచ్యతే.
శ్లో॥ జన్మాన్తరే మధ్యమస్తు తదన్యస్తు యుగాన్తరే,
చతుర్థః కల్పకోట్యాం వా నైవ బన్ధా ద్విముచ్యతే.

తా॥ తీవ్ర ముముక్షువు ఈ జన్మమున బ్రతికియుండగనే, మధ్యమ ముముక్షువు మరి యొక జన్మమునను, మందముముక్షువు యుగాన్తరమునను, ముక్తి నొందుచున్నారు. ఇక నతిమంద ముముక్షువున కెన్ని జన్మములకును ముక్తిలేదు.

శ్లో॥ నృజన్మ జన్తో రతిదుర్లభం విదుః
తతోఽపి పుంస్త్వంచ తతో వివేకః,
లబ్ధ్వా తదేత త్త్రితయం మహాత్మా
యతేత ముక్త్యై సహసా విరక్తః. ౨౩౮

తా॥ ప్రాణులకు మనుష్యజన్మము, పురుషశరీరము, వివేక విజ్ఞానంబును ఒకదానికంటె నొకటి కడుదుర్లభములు. కావున పూర్వ పుణ్య విశేషముచే నీ మూడిటిని పొందిన మానవుడు విషయభోగములందు విరక్తి నొంది ముక్తి కొరకే ప్రయత్నము చేయవలయును.

శ్లో॥ పుత్ర మిత్ర కళత్రాది సుఖం జన్మని జన్మని,
మర్త్యత్వంపురుషత్వం చ వివేకశ్చ న లభ్యతే. ౨౩౯
తా॥ భార్యా పుత్ర మిత్రాదులవలన గలుగు సుఖము పశుపక్ష్యాది జన్మలందుగూడ సులభమే యగుచున్నది. మనుష్యభావము, పురుష దేహము, వివేకజ్ఞానము; ఈ మూడుమాత్రము ప్రతిజన్మమున లభించుట కష్టము.

శ్లో॥ లబ్ధ్వా సుదుర్లభతరం నరజన్మ జన్తుః
తత్రాఽపి పౌరుష మత స్సదస ద్వివేకమ్,
సంప్రాప్య చైహికసుఖాభిరతో యదిస్యాత్
ధిక్తస్య జన్మ కుమతేః పురుషాధమస్య. ౨౩౯

తా॥ ఎవడు కడుదుర్లభమగు మనుష్యజన్మమును, పురుషదేహమును, మంచిచెడుల నెఱుంగు తెలివితేటలును గలిగియుండికూడ, విషయభోగములనే కేవల మనుభవింపగోరుచుండునో, అట్టివాని జన్మము అంధునకు లభించిన మహామణివలె నిరర్థకముగు చున్నది.

శ్లో॥ ఖాదతే మోదతే నిత్యం శునకః సూకరః ఖరః,
తేషా మేషాం విశేషః కః వృత్తి ర్యేషాం తు తై స్సమా.

శ్లో॥ ఆహార నిద్రాభయ మైథునాని
సామాన్యమేత త్పశుభిర్న రాణామ్,
జ్ఞానం నరాణా మధికోవిశేషః
జ్ఞానేన హీనః పశుభి స్సమానః. ఇతి.

తా॥ కుక్క, పంది, గాడిద, మున్నగు జంతువులు తమ తమ యాహారమును భుజించుచు భార్యా పుత్రాదుల వలన సుఖము ననుభవించుచుండుటను మన మందఱ మెఱుంగుదుము. ఇట్టియెడ, మనుష్యులై పురుషులై, బుద్ధిమంతులైన వారుగూడ శునకాదుల వలెనే సంచరించుచుండినచో లోకమున పశుపండిత భేదము నిరూపింప శక్యముగాదు గదా!

శ్లో॥ యావన్నాశ్రయతే రోగో యావన్నాక్రమతే జరా,
యావన్నధీ ర్విపర్యేతి యావన్మృత్యుం న పశ్యతి. ౨౪౧

శ్లో॥ తావ దేవ నరః స్వస్థః సారగ్రహణ తత్పరః,
వివేకీ ప్రయతే తాశు భవబన్ధ విముక్తయే. ౨౪౨

తా॥ ముసలితనమున వ్యాధులు మిక్కుటముగా బాధించుచుండును. శరీరేన్ద్రియ సామర్థ్యము తగ్గిపోవును. చిత్తము పలువిధముల చలించుచుండును. అట్టియెడ మోక్షముకొరకు ప్రయత్నము చేయుట కడు దుర్లభము. కావున మానవుడు తాను సమర్థుడై యున్నపుడే, వ్యర్థములగు విషయభోగముల కొరకే తన తెలివితేటలను వినియోగింపక, మానుష శరీర ప్రాప్తికి పరమ ప్రయోజనమగు నాత్మజ్ఞానమునే సంపాదింప యత్నింపవలయును.

శ్లో॥ దేవర్షి పితృమర్త్యర్ణ బన్ధముక్తాస్తు కోటిశః,
భవబన్ధ విముక్తస్తు యః కశ్చి ద్బ్రహ్మవిత్తమః. ౨౮౩

తా॥ లోకమున, బ్రహ్మచర్యము ననుష్ఠించి ఋషుల ఋణము నుండియు, యజ్ఞముల నాచరించి దేవఋణమునుండియు, సంతానమును గని పితృఋణమునుండియు; అప్పులను తీర్చి మనుష్యఋణమునుండియు బయటపడినవారు పెక్కుమంది గలరు. సంసారమను మహాబన్ధమునుండి విడుదలనొందినవాడు మాత్రము, బ్రహ్మవిదుడొక్కడేయగుచున్నాడు.

శ్లో॥ అన్తర్బన్ధేన బద్ధస్య కిం బహి ర్బన్ధమోచనైః,
తదన్తర్బన్ధ ముక్త్యర్థం క్రియతాం కృతిభిః కృతిః. ౨౮౪

తా॥ దేహధర్మములగు జరా మరణాదులను, ప్రాణ ధర్మములగు నాకలి దప్పులను మనోధర్మములగు శోకమోహములను జ్ఞానముచే నాత్మయందారోపించుకొనుటయే సంసారబన్ధ మనబడుచున్నది. ఇట్టి మహా బన్ధమున్నంతకాలము, బాహ్యములగు దేవఋణాది బన్ధము లెన్ని తొలగినను ప్రయోజన మెంతమాత్రమును లేదు. కావున బుద్ధిమంతులగు వారు సంసార బన్ధమునే తొలగించుకొన ప్రయత్నము చేయవలయును.

శ్లో॥ కృతిపర్యవసానైవ మతా తీవ్రముముక్షుతా,
అన్యా తు రంజనామాత్రా యత్ర నోద్దృశ్యతే కృతిః,

తా॥ ఎట్టివాంఛచే మానవుడు శ్రవణమననాదులనే నిరన్తర మాచరించుచుండునో, అట్టి వాంఛయే తీవ్ర మముక్ష యనబడుచున్నది. ప్రయత్నము లేని మోక్షవాంఛమాత్రము ఫలశూన్యమగుచున్నది.

శ్లో॥ గేహాది సర్వ మపహాయ లఘుత్వబుద్ధ్యా
సౌఖ్యేచ్ఛయా స్వపతినాఽనల మావిశన్త్యాః,
కాన్తా జనస్య నియతా సుదృఢాత్వరాయా
సైషా ఫలాన్త గమనే కరణం ముముక్షోః. ౨౭౮

తా॥ పతివ్రతయగు భార్య పరలోకము నందుగూడ స్వభర్తృ సౌఖ్యము నభిలషించినదై తనభర్త మరణించినప్పుడు అతనితో సహాగమనమునకై, గృహము, పుత్రులు, ధనము, మున్నగువాని నన్నిటిని అనాయాసముగా పరిత్యజించి అగ్నిప్రవేశమున కెంత తొందరపడుచుండునో అట్టితొందరగల ముముక్షువే త్వరలో ముక్తిని పొందగలుగుచున్నాడు.

శ్లో॥ నిత్యానిత్యవివేకశ్చ దేహక్షణికతా మతిః,
మృత్యోర్భీతిశ్చ తాపశ్చ ముముక్షో బుద్ధికారణమ్.

తా॥ బ్రహ్మము ఒక్కటియే నిత్యము. తద్భిన్నమంతయూ ననిత్యము. అను వివేకమును, దేహము క్షణికమాత్రమను నిశ్చయ బుద్ధియూ నెప్పుడు మరణింతునోఅని భయమును, అనేక దుఃఖములుగల సంసారమూ ననుభవించు టెట్లు అని పరితపించు చుండుటయూ నను వీనివలన తీవ్రమగు మోక్షవాంఛ గలుగును. కనుకనే మహాభారతమునందు—— *

శ్లో॥ శిరోవివేక స్త్వస్యత్వం వైరాగ్యం వపురుచ్యతే,
శమాదయ షడంగాని మోక్షేచ్ఛా ప్రాణ ఇష్యతే.

---

* శ్లో॥ అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః,
నిత్యం సంనిహితో హి మృత్యుః కర్తవ్యో ధర్మసంగ్రహః.

శ్లో॥ ఈదృశాంగ సమాయుక్తో జిజ్ఞాసు ర్యుక్తి కోవిదః,
శూరో మృత్యుం నిహన్త్యేవ సమ్యగ్జ్ఞానాసినా ధ్రువమ్.

తా॥ నిత్యానిత్యవస్తువివేకమనునది శిరస్సు. తీవ్రవైరాగ్యమనునది శరీరము, శమదమాదులు, హృదయము మున్నగు ప్రధానావయవములు. మోక్షవాంఛ, ముఖ్యప్రాణము. ఇట్టి శాస్త్రీయములగు అంగములతో కూడుకొనిన ముముక్షువు మృత్యువును జయించుచున్నాడు. బ్రహ్మజ్ఞానము గలిగిన తోడనే దేహాభిమానము నశించునుగాన దేహధర్మమగు మరణ మాతనికి సంభవింపనేరదని భావము.

శ్లో॥ ఉక్త సాధనసంపన్నో జిజ్ఞాసు ర్యతి రాత్మనః,
జిజ్ఞాసాయై గురుం గచ్ఛేత్ సమిత్పాణి ర్నయోజ్వలః.

తా॥ పూర్వమందు చెప్పబడిన సాధనచతుష్టయ సంపదగల జిజ్ఞాసువు బ్రహ్మస్వరూపమును దెలిసికొనుటకై చేత నిధ్మకుశపలాదికములు గైకొని రాబోవు శ్లోకములలో చెప్పబడుచున్న లక్షణములుగల సద్గురుని సమీపమునకు పోవలయును.

శ్లో॥ శ్రోత్రియో బ్రహ్మనిష్ఠో యః ప్రశాన్త స్సమదర్శనః,
నిర్మమో నిరహంకారః నిర్ద్వన్ద్వో నిష్పరిగ్రహః.
అనపేక్ష శ్శుచిర్దక్షః కరుణామృత సాగరః. ౨౫౧

శ్లో॥ ఏవం లక్షణ సంపన్నః సగురు ర్బ్రహ్మవిత్తమః,
ఉపసాద్యః ప్రయత్నేన జిజ్ఞాసో స్స్వార్థసిద్ధయే. ౨౫౨

తా॥ వేదశాస్త్రములను చదువుకొనినవాడును, నిరన్తరము బ్రహ్మస్వరూపానుసంధాన పరుండును, జితేంద్రియుండును, దేహేన్ద్రియాదులందు 'నేను' అను భావమును, తద్భిన్నమునందు, నాది యను భావమును లేనివాడును, శీతోష్ణ సుఖదుఃఖాదుల సహించువాడును, సర్వకామనావర్జి—

తుండను, శిష్యులనుతరింప జేయ సమర్థుండును, దయాసముద్రుండును నగు బ్రహ్మవిదుడు సద్గురు వనబడును. ఇట్టిగురువును ముముక్షువు లాశ్రయింప వలయును.

శ్లో॥ జన్మానేకశతై స్సదా దరయుజా
భక్త్యా సమారాధితః
భక్తైర్వైదికలక్షణేన విధినా
సంతుష్ట ఈశస్స్వయమ్,
సాక్షాచ్ఛ్రీగురురూపమేత్య కృపయా
దృగ్గోచరస్సన్ ప్రభుః
తత్త్వం సాధు విబోధ్యతారయతితాన్
సంసారదుఃఖార్ణవాత్. ౨౫౩

తా॥ భక్తులు పెక్కుజన్మములందు పరమభక్తితో వేదోక్తవిధానము నవలంబించి పూజింపగా పరమేశ్వరుడు సంతసించినవాడై భక్తులయందలి దయతో బ్రహ్మజ్ఞానియగు గురునిరూపమును ధరించి యాత్మస్వరూప మును బోధించి తన భక్తులను తరింపజేయుచున్నాడు.

శ్లో॥ అవిద్యా హృదయగ్రన్థి బన్ధమోక్షో భవేద్యతః,
తమేవ గురురిత్యాహు గ్గురుశబ్దార్థ వేదినః. ౨౫౪

తా॥ అజ్ఞానము వలన, హృదయము, ఇన్ద్రియములు, దేహము మున్నగువాని ధర్మములు ఆత్మయందు ఆరోపింప బడుచున్నవి. ఇట్టి యారోపమును హృదయగ్రన్థి యందురు. ఇది ఎవని సదుపదేశము వలన తొలగి పోవునో అతడు గురువని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు.

శ్లో॥ శివఏవ గురు స్సాక్షా ద్గురురేవ శివస్స్వయమ్,
ఉభయో రన్తరం కించిత్ నద్రష్టవ్యం ముముక్షుభిః.

తా॥ శివుడే గురురూపమున నవతరించునని చెప్పబడినది గావున గురువు శివుడనుటలో సందియము లేదు. అందుచే ముముక్షుజనులందరును తమ గురువును శివునిగానే భావింపవలయునుగాని శివ గురు భేదమును ఎంతమాత్రము చేయగూడదు.

శ్లో॥ బద్ధముక్తం బ్రహ్మనిష్ఠం కృతకృత్యం భజే ద్గురుమ్,
యస్య ప్రసాదా త్సంసార సాగరో గోష్పదాయతే.

తా॥ సంసార బన్ధమునుండి విడుదల నొంది నిరంతర బ్రహ్మాను సంధాన పరాయణుండై, మనుష్య జన్మము నందు చేయవలసిన సర్వసంగ పరిత్యాగము మొదలగు సర్వకార్యజాతమును చేసిన వాడగుటచే కృతార్థుడైనట్టి సద్గురువును ముముక్షువు లాశ్రయింపవలయును. అట్టి గురుని యనుగ్రహము వలన, సంసార మహాసముద్రమును ఆవుయొక్క అడుగు జాడను వలె అనాయాసముగా దాటగలరు.

శ్లో॥ శుశ్రూషయా సదా భక్త్యా ప్రణామై ర్వినయోక్తిభిః,
ప్రసన్నం గురు మాసాద్య ప్రష్టవ్యం జ్ఞేయ మాత్మనః.

తా॥ శుశ్రూషచేతను, భక్తియుక్తములగు నమస్కృతులచేతను వినయ విధేయతలచేతను, గురుని సుముఖునిచేసుకొని పిదప తన యభీప్సితమగు నాత్మ తత్త్వము నడుగవలయును.

శ్లో॥ భగవన్ ! కరుణాసింధో ! భవసింధో ర్భవా న్తరిః,
యమాశ్రిత్యాఽ శ్రమేణైవ పరం పారం గతాబుధాః.

తా॥ షడ్గుణైశ్వర్య సంపన్నుడును దయాసముద్రుడునునైన ఓ గురూత్తమా ? తమ యనుగ్రహముచే ననేకులు సంసార సాగరము ననాయాసముగా దాటుచున్నారు. కావున నన్నుగూడ నటులనే కృతార్థుని జేయ వేడుకొనుచున్నాను.

శ్లో॥ జన్మాన్తర కృతానన్త పుణ్యకర్మఫలోదయః,
అద్యసన్నిహితో యస్మా త్త్వత్కృపాపాత్ర మస్మ్యహమ్

తా॥ దేశికోత్తమా! తమకు నాయందు సంపూర్ణాను గ్రహము కలుగుటచే నేడు నా పూర్వపుణ్యములన్నియు ఫలించిన వని నమ్ము చున్నాను.

శ్లో॥ సంప్రీతిమక్ష్ణో ర్వదనప్రసాదమ్
ఆనన్ద మన్తఃకరణస్య సద్యః,
విలోకనం బ్రహ్మవిద స్తనోతి
భినత్తి మోహం సుగతిం వ్యనక్తి. ౨౬౦

తా॥ బ్రహ్మజ్ఞానియగు వాని దర్శనము కలుగగనే నేత్రములకు వికాసముగలుగును. ముఖము ప్రసన్నమగును. చిత్తమునందానంద మావిర్భవించును; దేహేన్ద్రియాదులందుగల యభిమానము నివర్తించును ద్రష్టకు ఉత్తమ స్థితిగలుగనున్నదని సూచించును.

శ్లో॥ హుతాశనానాం శశినా మినానామ్
అప్యర్బుదం వాఽపి నయన్నియ(హ)న్తుమ్,
శక్నోతి తద్బాహ్య మనన్త మాన్తరమ్
హన్త్యాత్మవేత్తా సకృ దీక్షణేన. ౨౬౧

తా॥ అగ్ని, చంద్రుడు, సూర్యుడు మొదలగు వార లెన్ని కోట్ల మంది యయినను బయటనుండు చీకటిని మాత్రమే నివర్తింపజేయగలరు గాని హృద్గతమగు మహామోహాన్ధకారము నించుకేనియు తొలగింప జేయ లేరు. ఇక నాత్మజ్ఞాని యన్ననో అనన్త దుఃఖదాయకమగు నజ్ఞానాన్ధ కారమును తన క్రీగంటిదృష్టిమాత్రముననే రూపుమాపుచున్నాడు.

శ్లో॥ దుష్పారే భవసాగరే జనిమృతి
వ్యాధ్యాది దుఃఖోత్కటే
ఘోరే పుత్రకళత్రమిత్రబహుళ
గ్రాహే కరే భీకరే,
కర్మోత్తుంగ తరంగ భంగనికరై
రాకృష్యమాణో ముహుః
యాతాయాత గతిభ్రమేణ శరణం
కించి న్న పశ్యామ్యహమ్. ౨౬౭

తా॥ స్వామీ! నేను సంసారమున జననమరణాదులవలన మహా దుఃఖము ననుభవించుచున్నాను. ఈ సంసారము నావలె సముద్రమువలె గన్పట్టుచున్నది. దీని యావలి యొడ్డును చేరుట మిక్కిలి కష్టతమముగానున్నది. ఇందు పుత్ర మిత్ర కళత్రాదు లనువారు మొసళ్లవలె పీడించుచున్నారు. పుణ్య పాప కర్మములను పెద్దతరంగములు ఇహపర లోకములందు రాకపోకలను గలిగించుచున్నవి. అందుచే విశ్రాన్తి నెంత మాత్రముపొందలేకున్నాను. ఇట్టియెడ నన్ను రక్షించువారెవరును గానరాకున్నారు.

శ్లో॥ కేన వా పుణ్యశేషేణ తవ పాదాంబుజద్వయమ్,
దృష్టవానస్మి మామార్తంమృత్యోస్త్రాహిదయాదృశా.

తా॥ పూజ్యుడవగు సోగురూత్తమా? నా పూర్వపుణ్యముచే తమ పదపద్మముల సందర్శించితిని. తమరు భక్తపరిపాలనమున కవతరించిన భగవత్స్వరూపులని నా దృఢవిశ్వాసము. కాన తాము దయతో దీనుడ నగు నన్ను మృత్యువు బారినుండి కాపాడ వేడుచున్నాను.

శ్లో॥ వదన్త మేవం తం శిష్యం దృష్ట్వైవ దయయా గురుః,
దద్యా దభయమేతస్మై మాభైష్టేతి ముహుర్ముహుః.

తా॥ ఈ విధముగ ప్రతిమాలుకొనుచున్న శిష్యుని చూడగనే దయతో నాచార్యుడు 'నాయనా! నీకేమియును భయములేదు. సంసార దుఃఖము నతిక్రమింప నపాయ మొందగలదు. ఈ యుపాయము చేతనే పలుమంది పండితులు భవసాగరము నతిక్రమించిరి. నీకు నట్టి మార్గము నుపదేశింతును కావున చింతవిడువుము'' అని ఈ విధములగు నాదర వాక్యములచే శిష్యుని ఓదార్పవలయును.

శ్లో॥ విద్వ న్మృత్యుభయం జహీహి
భవతో నాఽ స్త్యేవ మృత్యుఃక్వచిత్
నిత్యస్య ద్వయవర్జిత స్య
పరమా నన్దాత్మనో బ్రహ్మణః,
భ్రాన్త్యా కించి దవేక్ష్య భీతమనసా
మిథ్యాత్వయా కథ్యతే
మాం త్రాహీతి హి సు ప్తవత్ప్రలపనం
శూన్యాత్మకం తే మృషా. ౨౯౫

తా॥ ఓ పండితుడా! నీవు మృత్యువు వలని భయమును విడువుము. నిజముగ నాలోచించినచో నీవు సత్యజ్ఞానానన్ద బ్రహ్మస్వరూపుడవు. ఇట్టి నీకు మరణ మెన్నటికిని సంభవింపనేరదు. నీవు భ్రాన్తిచే దేహేన్ద్రియ సంఘాతమును నీ స్వరూపముగా నెంచుకొని దేహధర్మమగు మరణము నీకు గలుగునని పొరపడుచున్నావు. నిద్రించుచున్నవాని కలవరింతవలె ''నన్ను మృత్యువు నుండి కాపాడుమా''? అను నీ వాక్యమును నసత్యమగుచున్నది.

శ్లో॥ నిద్రా గాఢతమోవృతః కిల జనః
స్వప్నే భుజంగాదినా

గ్రస్తం స్వం సమవేక్ష్య యత్ప్రలపతి
త్రాసాద్ధతోఽస్మీ త్యలమ్,
ఆప్తేన ప్రతిబోధితః కరతలే నా
తాడ్యపృష్ట స్స్వయమ్
కించిన్నేతి వదత్యముష్య వచనం
స్యా త్తత్కి మర్థం వద. ౨౬౬

తా॥ మానవుడు నిద్రయను కటిక చీకటిచే నావరింపబడినవాడై సర్పము మున్నగు క్రూరజంతువులు తన్ను పీడించు చున్నటులు కలను గని "అయ్యో! మరణించితిని, ఇక బ్రతుకను ప్రాణములు పోవుచున్నవి. నన్ను రక్షించువా రెవరు?" అని బిగ్గరగా కేకలు పెట్టుచున్నాడు. పిమ్మట తండ్రి మున్నగువారు చేతితో కొట్టి మేలుకొలిపి "ఏమిరా? నాయనా! అబ్బాయి! పలుకుచున్నావు?" అని యడుగ నేమియు లేదని చెప్పుచున్నాడు. వాని స్వప్నవాక్యములన్నియు నర్థరహితములే యగుచున్నవిగదా!

శ్లో॥ రజ్జోస్తు తత్త్వ మనవేక్ష్య గృహీతసర్ప
భావః పుమానయ మహి ర్వసతీతి మోహాత్,
ఆక్రోశతి ప్రతిబిభేతి చ కంపతే తత్
మిథ్యైవ నాఽత్ర భుజగోఽస్తి విచార్యమాణే. ౨౬౭

తా॥ ఒకడు త్రాడుయొక్క నిజరూపమును జూడక సర్పమని భ్రమపడి "పాము ఇచట నున్నది. చూడుడు." అని బిగ్గరగా నఱచు చున్నాడు. భయముతో గడగడ వణుకు చున్నాడు. యథార్థమును విచారించినచో నచట పాములేదు గనుక వతని యాక్రందనాదికమంతయు భ్రమ మాత్రమే యగుచున్నది.

శ్లో॥ తద్వ త్త్వయా వ్యాత్మన ఉక్తమేతత్
జన్మా ప్యయవ్యాధిజరాది దుఃఖమ్,
మృషైవ సర్వం భ్రమకల్పితం తే
సమ్య గ్విచార్యాత్మని ముంచ భీతిమ్. ౨౬౮

తా॥ నిద్రయందు కలగనిన వాని వచనమువలెను, తాడునుజూచి పామని భ్రమపడినవాని మాటలవలెను, నీవు "ఆత్మకు జననమరణాది దుఃఖము గలద"ని చెప్పినదంతయు నజ్ఞాన విలసితమే యగుచున్నది. కావున నీవు ఆత్మ యాథార్థ్యమును బాగుగా పరిశీలించి భయమును పరిత్యజింపుము.

శ్లో॥ భవా ననాత్మనో ధర్మా నాత్మన్యారోప్య శోచతి,
తదజ్ఞాన కృతం సర్వం భయం త్యక్త్వా సుఖీభవ. ౨౬౯

తా॥ నీవు అనిత్యములగు దేహాదులయొక్క మరణాది ధర్మముల నాత్మయం దారోపించుకొని "నేను మృతినొందు చున్నాడ"నని మొదలుగా దుఃఖించుచున్నాడవు. ఇది యంతయు నజ్ఞానమువలన గలిగినదియే కావున ఇట్టి భయమును వదలి నీ స్వరూపానన్దము ననుభవింపుము.

శ్లో॥ శ్రీమద్భి రుక్తం సకలం మృషేతి
దృష్టాన్తవ వ్యుపపద్యతే తత్,
దార్ష్టాన్తికే నైవ భవాదిదుఃఖమ్
ప్రత్యక్షతః సర్వజన ప్రసిద్ధమ్. ౨౭౦

తా॥ గురువర్యులారా! తమరు ఆత్మకు గల జనన మరణాది దుఃఖమంతయు నయథార్థమని సెలవిచ్చి దాని సమర్థనమునకై రెండు

దృష్టాన్తములను చూపియున్నారు కాని. కలగనిన వాని కొకనికే సర్ప వ్యాఘ్రాదులవలన భయము గలుగుచున్నది. అతనికి కలలో కనబడిన దుష్ట జంతువులు మేలుకొనిన మరియెవరికిని కనబడుటలేదు. కావున నతని వచనములన్నియూ భ్రమసిద్ధము లనుటలో సందియము లేదు. అటులనే తాడును జూచి పాము అని యనికొనిన వానికొకనికే భయముగలుగు చున్నది గాని వివేకవంతుల కెవరికిని త్రాటివలన భయముగలుగుచున్నది గావున నతని యాక్రందనాదికమంతయూ నయథార్థమనుట యథార్థము. ఇక నాత్మకుగల జననమరణాది దుఃఖము సర్వమానవులకును అనుభవ సిద్ధము. ఈ విషయమున నెవ్వరికిని భేదాభిప్రాయము లేదు. కావున నిట్టి దుఃఖమంతయూ మిథ్యయనుట మందప్రజ్ఞుడనగు నాకు సమంజసముగ గన్పట్టుచున్నది.

శ్లో॥ ప్రత్యక్షేణానుభూతార్థః కథం మిథ్యాత్వ మర్హతి,
చక్షుషో విషయం కుంభం కథం మిథ్యాకరోమ్యహామ్.

శ్లో॥ విద్యమానస్య మిథ్యాత్వం కథం ను ఘటతే ప్రభో ?
ప్రత్యక్షం ఖలు సర్వేషాం ప్రమాణాం ప్రస్ఫుటార్థకమ్.

తా॥ స్వామీ ! లోకమున ప్రత్యక్షము, అనుమానము, ఉప మానము శబ్దము మొదలుగాగల ప్రమాణము లన్నిటిలోను ప్రత్యక్ష ప్రమాణ మనునది ప్రబలమైనదికదా ! ఇట్టియెడ ప్రత్యక్షముగా నింద్రి యములకు కనబడుచున్న విషయములన్నియూ నసత్యములనుట కడు విచిత్ర ముగా నున్నది.

శ్లో॥ మర్త్యస్య మమ జన్మాది దుఃఖభాజోఽల్పజీవినః,
బ్రహ్మాత్వ మపి నిత్యత్వం పరమానన్దతా కథమ్. ౨౭౩

శ్లో॥ క ఆత్మా కస్త్వనాత్మాచ కిములక్షణ మేతయోః,
ఆత్మన్యనాత్మ ధర్మాణాం ఆరోపః క్రియతే కథమ్? ౨౭౪

శ్లో॥ కి మజ్ఞానం తదుత్పన్న భయత్యాగోఽపి వా కథమ్ ?
కిము జ్ఞానం తదుత్పన్న సుఖప్రాప్తిశ్చ వా కథమ్ ? ౨౭౫

శ్లో॥ సర్వ మేత దృథా పూర్వం కరామలకవత్ స్ఫుటమ్,
ప్రతిపాదయమే స్వామిన్ ! శ్రీ గురో ! కరుణానిధే ?

తా॥ స్వామీ ! మరణించు స్వభావము గలిగినట్టియు, జన్మజరాది దుఃఖముల ననుభవించు చున్నట్టియు, కొలది కాలము మాత్రము జీవించు నట్టియు నాకు, సత్యజ్ఞానానన్ద బ్రహ్మస్వరూపమెట్లు సంభవించును ? మరియు నాత్మయనగా నేమి ? అనాత్మ యననేమి ? ఆత్మా నాత్మలకు రెంటికిని ప్రత్యేక లక్షణములెవ్వి ? ఆత్మయందు దేహేన్ద్రియాదులును వాని ధర్మములును ఎటులారోపింప బడుచున్నవి ? అజ్ఞాన మననేమి ? అజ్ఞానము వలన గలుగు దుఃఖమును వదలు టెట్లు ? జ్ఞాన మననేమి ? జ్ఞానము వలన సుఖము గలుగుటెట్లు ? ఈ విషయముల నన్నిటిని బాగుగా తెలిసికొన గోరుచున్నాను. కావున తమరు దయతో నాసంశయముల నన్నిటిని నివర్తింపజేయ వేడుకొను చున్నాను.

శ్లో॥ ధన్యః కృతార్థ స్త్వమహో వివేకీ
శివప్రసాద స్త్వయి విద్యతే మహాన్,
విసృజ్య తు ప్రాకృత లోకమార్గమ్
బ్రహ్మాఽవగన్తుం యతసే యత స్త్వమ్. ౨౭౭

తా॥ నాయనా ! నీవు మిక్కిలి ధన్యుడవు. నీజన్మము సఫలమైనది. సామాన్య జనులందరును సంసారమునందే ప్రాకులాడుచుందురు. నీవుమాత్ర మట్లుగాక బ్రహ్మసాక్షాత్కారము కొరకు సర్వమును వదలుకొని ప్రయత్నము చేయుచుంటివి. కావున పరమేశ్వరాను గ్రహము నీయందు సంపూర్ణముగా గలదని స్పష్టమగుచున్నది.

శ్లో॥ శివప్రసాదేన వినా న సిద్ధిః
శివప్రసాదేన వినా న బుద్ధిః,
శివప్రసాదేన వినా న యుక్తిః
శివప్రసాదేన వినా న ముక్తిః. ౨౭౭

తా॥ లోకమున శివానుగ్రహము లేనివానికి, తలచిన కార్యము నెరవేరదు. మోక్షము కొరకు ప్రయత్నింప వలయునని బుద్ధి పుట్టదు. వేదాన్తములను వినగోరికయే గలుగదు. ముక్తిమాట మునుపే లేదు. ఇట్టి యెడ సకల సద్గుణ సంపన్నుడవగు నీయందు శివానుగ్రహము కలదనుటలో సంశయము లేదు.

శ్లో॥ యస్యప్రసాదేన విముక్తసంగాః
శుకాదయ స్సంస్మృతిబన్ధముక్తాః,
తస్య ప్రసాదో బహుజన్మలభ్యః
భక్త్యైవ గమ్యో భవముక్తి హేతుః. ౨౭౮

తా॥ పరమేశ్వరుని యనుగ్రహముచేతనే శ్రీశుకుడు, నారదుడు, జనకుడు మొదలగువార లెందరో మహానుభావులు సంసారసాగరమును తరించియున్నారు. పెక్కుజన్మములందు పరమభక్తితో పరమేశ్వరుని నారాధించిననే కాని మోక్షదాయకమగు భగవదనుగ్రహము కలుగనేరదు.

శ్లో॥ వివేకోజన్తూనాం ప్రభవతి జనిష్వేవ బహుషు
ప్రసాదాదేవైశా ద్బహుసుకృతపాకో దయవశాత్,
యత స్తస్మా దేవ త్వమపి పరమార్థావగమనే
కృతారంభః పుంసా మిదమిహ వివేకస్యతు ఫలమ్. ౨౭౯

తా॥ మానవులకు; పెక్కు జన్మలందు చేయబడిన పుణ్యకర్మలచే కలిగిన భగవదనుగ్రహము వలననే ఆత్మానాత్మ వివేకము కలుగుచున్నది.

అట్లు గలిగిన వివేకము వలననే నీవు ముక్తి కొరకు ప్రయత్నించు చున్నాడవు. వివేకజ్ఞానము గలిగియున్నందుకు పరమప్రయోజనము మోక్షమునకై యత్నించుటయే గదా ?

శ్లో॥ మర్త్యత్వసిద్ధే రపి పుంస్త్వ సిద్ధేః
విప్రత్వసిద్ధేశ్చ వివేక సిద్ధేః,
వద న్తి ముఖ్యం ఫలమేవమోక్షః
వ్యర్థం సమస్తం యదిచే న్నమోక్షః. ౨౮౧

తా॥ మానవుడు తాను పురుషుడుగాను, బ్రాహ్మణుడుగాను జన్మించి మంచి జ్ఞానముగలవాడై యున్నందుకు పరమ ప్రయోజనము, మోక్షముకొరకు ప్రయత్నించుటయే కాన నట్లు చేయకున్నచో నంతయు నిష్ఫలమేయగుచున్నది.

శ్లో॥ ప్రశ్న స్సమీచీన తర స్తవాయమ్
యదాత్మ తత్త్వావగమే ప్రవృత్తిః,
తత స్తవై త త్సకలం సమూలమ్
నివేదయిష్యామి ముదాశ్రృణుష్వ. ౨౮౨

తా॥ నాయనా! నీవడిగిన ప్రశ్న చాలబాగుగా నున్నది. నీవు ఆత్మస్వరూపమును తెలిసికొన నాసక్తుడవుగా నున్నావు, కావున నాత్మ తత్త్వము నంతయు ప్రమాణ పూర్వకముగా నీకు బోధింతును గాన శ్రద్ధతో వినుము.

శ్లో॥ మర్త్యత్వం త్వయికల్పితం
భ్రమవశా త్తేనైవ జన్మాదయః
త త్సంభావిత మేవ దుఃఖమపి
తే నో వస్తుత స్తన్మృషా,

నిద్రామోహవశా దుపాగతసుఖం
దుఃఖం చ కిం నుత్వయా
సత్సత్త్వేన విలోకితం క్వచిదపి
బ్రూహి ప్రబోధాగమే. ౨౮౩

తా॥ నీవు సచ్చిదానన్దస్వరూపుడవు. అట్టి నీయందు మరణము మొదలగు ధర్మములును వానివలన గలుగు సుఖదుఃఖములును; అజ్ఞానముచే నారోపింపబడుచున్నవి. అనగా దేహము, ఇన్ద్రియములు మున్నగువానిని "నేను" అని అభిమానించుటవలన వాని ధర్మములగు మరణాదులు నీయందు భాసించుచున్నవి. యథార్థము నాలోచించినచో నవి యన్నియూ భ్రమకల్పితములగుటచే నయథార్థములగుచున్నవి. స్వప్న కాలము నందనుభవింపబడుచున్న సుఖము దుఃఖము మున్నగునవి మేలుకొనినపిమ్మట భాసింపకున్నవిగదా! అటులనే అజ్ఞానదశయందు కనబడుచున్న మరణము మున్నగు ధర్మములన్నియూ జ్ఞానము గలుగగనే నివర్తించునని భావము.

శ్లో॥ నానాశేమలోకై రనుభూయ మానః
ప్రత్యక్షతోఽయం సకలప్రపంచః,
కథం మృషాస్యా దితి శంకనీయమ్
విచారశూన్యేన విముహ్యతా త్వయా. ౨౮౪

తా॥ నీవు తత్త్వమును విచారింపకుండుటచే భ్రమనొందుచున్నవాడవు. "సర్వజనానుభవ సిద్ధమగు ప్రపంచమెట్లు కల్లయగు" నని సంశయమునెంతమాత్రము పొందకుము.

శ్లో॥ దివాఽన్ధదృష్టేస్తు దివాఽన్ధకారః
ప్రత్యక్షసిద్ధోఽపి స కిం యథార్థః,

తద్వద్భ్రిమేణాఽవగతః పదార్థః
భ్రాన్తస్య సత్య స్సమతే ర్నృపైవ. ౨౮౫

తా॥ గ్రుడ్లగూబ కంటికి పగటియందు చీకటి కనబడుచుండును. అది దానికి ప్రత్యక్షమే అయినను, ఇతరుల కెవరికిని పగటియందు చీకటి లేకుండుటచేత నది యప్రమాణమగుచున్నది. అటులనే భ్రమపడుచున్న వారికి సత్యములుగా గనపడు పదార్థములే భ్రమలేనివారికి అయథార్థము లగుచున్నవి.

శ్లో॥ ఘటోఽయ మిత్యత్ర ఘటాభిధానః
ప్రత్యక్షతః కశ్చి దుదేతి దృష్టేః,
విచార్యమాణే తు సనాఽస్తి తత్ర
మృద స్తి తద్భావ విలక్షణాసా. ౨౮౬

తా॥ లోకమున "ఇదికుండ" అనుస్థలమందు కుండయను పేరుగల యొక వస్తువు కనులకు గనపడుచున్నది. సూక్ష్మముగ నాలోచించినచో, నచట మట్టికంటె భిన్నమగు మరియొక పదార్థములేదు. మట్టియందు నామరూపముల నారోపించి ఘటమని వ్యవహరించు చుండుటచే నా ఘటము సత్యము గా నేరదని భావము.

శ్లో॥ ప్రాదేశమాత్రః పరిదృశ్యతేఽర్కః
శాస్త్రేణ సందర్శిత లక్షయోజనః,
మానాన్తరేణ క్వచిదేతి బాధామ్
ప్రత్యక్షమప్యత్రహి న వ్యవస్థా. ౨౮౭

తా॥ సూర్యుడు మన నేత్రములకు ప్రాదేశమాత్ర ప్రమాణముగల వాడుగా గనపడుచున్నాడు; బొటనవ్రేలికిని, తర్జనికిని మధ్యయందుగల

పరిమాణమును ప్రాదేశమందురు. అయినను మనమా పరిమాణమును ప్రమాణముగా గ్రహింపక శాస్త్రనిర్దిష్టమగు లక్షయోజన పరిమాణము గలవాడుగనే స్వీకరించుచున్నాము. కావున ప్రత్యక్షప్రమాణముగూడ నొకప్పుడు ప్రమాణాంతరములచే బాధింపబడుచుండుటచే నదియే యథార్థమని యెంచతగదు.

శ్లో॥ తస్మాత్త్వయీదం భ్రమతః ప్రతీతమ్
మృషైవ నోసత్యమవేహి సాక్షాత్,
బ్రహ్మాత్వ మేవాఽసి సుఖస్వరూపమ్
త్వత్తో నభిన్నం విచినుష్వబుద్ధౌ. ౨౮౮

తా॥ యథార్థము నాలోచించినచో, జననమరణాదులు నీ యందు కల్పింపబడినవియేగాని వాస్తవములుగావు. నీవు సచ్చిదానన్ద రూపమగు బ్రహ్మమవు. బ్రహ్మ నీకంటె భిన్నము కాదు. బుద్ధియందు విచారింపుము.

శ్లో॥ లోకాన్తరేవాఽత్ర గుహాన్తరే వా
తీర్థాన్తరే కర్మపరం పరాన్తరే,
శాస్త్రాన్తరే నాఽస్త్యనుపశ్యతా మిహ
స్వయం పరం బ్రహ్మవిచార్యమాణే. ౨౮౯

తా॥ బ్రహ్మపదార్థము ఏదియో యొక లోకమునందుగాని, ఒక గుహయందుగాని, ఒకానొక పుణ్యస్థలమునగాని; కర్మవిశేషమునందుగాని, మరియొక శాస్త్రమునగాని లేదు. బాగుగా విచారించినచో నాత్మస్వరూపమును విచారించువారల స్వస్వరూపమే యగుచున్నది.

శ్లో॥ తత్త్వ మాత్మస్థ మజ్ఞాత్వామూఢశ్శాస్త్రేషుముహ్యసి,
గోపః కక్షగతం ఛాగం యథా కూపేషు దుర్మతిః. ౨౯౦

తా॥ లోకమున మతిచెడిన గొల్లవాడు తనచంకయందుగల మేక పిల్లను మరచి నూతులలో వెదకుచున్నాడు. అటులనే నీవును దేహేంద్రియాది సంఘాతమునే, నీ స్వరూపమునుగా భ్రమించి, నీ బుద్ధియందు భాసించుచున్న బ్రహ్మస్వరూపమును గ్రహింపలేక శాస్త్రముల యందెచటనో కలదని మోహపడుచున్నావు.

శ్లో॥ స్వమాత్మానం పరం మత్వా పరమాత్మాన మన్యథా,
విమృగ్యతే పునస్స్వాత్మా బహిః కోశేషు పండితైః. ౨౯౦

తా॥ పరమార్థదశయందు జీవుడు బ్రహ్మస్వరూపుడు. వ్యవహార కాలమునందు బ్రహ్మమే జీవస్వరూపముగా భాసించుచున్నది. ఈసంగతి నంతయును, పండితులు శాస్త్రములవలన తెలిసికొని తత్త్వానుభవమునకై అనృతజడ దుఃఖాత్మకములగు పంచకోశములకంటె భిన్నముగను సాక్షిగా వెలుగొందుచున్న సచ్చిదానన్ద బ్రహ్మస్వరూపమును సాక్షాత్కరించు కొనుచున్నారు.

శ్లో॥ విస్మృత్య వస్తున స్తత్త్వ మధ్యారోప్యచ వస్తుని,
అవస్తు తాం చ తద్ధర్మా న్మూఢాశోచతి నాఽన్యథా.

తా॥ మూఢులగువారు, సచ్చిదానన్దరూపమగు నాత్మతత్త్వమును మరచి, దానియందు, దేహేన్ద్రియాదులను వాని ధర్మములగు జరా మరణాదులను నారోపించి, నేను "జన్మించి, మరణించుచున్నానని" వ్యసనపడుచున్నారు.

శ్లో॥ ఆత్మానాత్మ వివేకంతే వక్ష్యామి శృణు సాదరమ్,
యస్య శ్రవణమాత్రేణ ముచ్యతేఽ నాత్మబన్ధనాత్.

తా॥ నాయనా! నీకు ఆత్మానాత్మ వివేకమును చక్కగా బోధించెదను, శ్రద్ధతో వినుము. దీనిని బాగుగా గ్రహించినచో సంసార బంధము సులభముగా విడిపోగలదు.

శ్లో॥ ఇత్యుక్త్వాఽభిముఖీ కృత్య శిష్యం కరుణయా గురుః,
అధ్యారోపాప వాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచయన్.

శ్లో॥ సమ్యగ్బోధయ తత్త్వం శాస్త్ర దృష్టేన వర్త్మనా,
సర్వేషా ముపకారాయ తత్ప్రకారోఽత్ర దర్శ్యతే.

తా॥ ఆచార్యు డీరీతిగా శిష్యుని ప్రోత్సహించి ఉపనిషత్తులయం దుపదేశింపబడిన విధమున నాత్మతత్త్వమునంతయు నతనికి బోధించెను. ఉపనిషత్తు లన్నియు, పరమాత్మవలననే ప్రపంచ సృష్టినివర్ణించి మరల 'నేతి నేతి' వాక్యములచే ప్రపంచమునంతయు నిరాకరించి అద్వితీయమగు ఆత్మతత్త్వము నిరూపించుచున్నవి. దీనినే అధ్యారోపాపవాదక్రమ మందురు. ఇదియే రాబోవు శ్లోకములలో ముముక్షుజనుల కుపకరించు నటుల సులభముగా వర్ణింపబడుచున్నది.

శ్లో॥ వస్తున్యవస్త్వారోపోయః సోఽధ్యారోప ఇతీర్యతే,
అసర్పభూతే రజ్జ్వాదౌ సర్పత్వారోపణం యథా. ౨౯౬

తా॥ లోకమున, పామకాని త్రాటియందు "పాము" అను భావము కలిగి నటుల, యథార్థమగు నొక వస్తువునందు అయథార్థమగు మరియొక వస్తువు భాసించుటయె యధ్యారోప మనబడుచున్నది.

శ్లో॥ వస్తు తావత్పరం బ్రహ్మ సత్యజ్ఞానాదిలక్షణమ్,
ఇద మారోపితం యత్ర భాతిఖే నీలతాదివత్. ౨౯౭

తా॥ ఆకాశమనగా నవకాశమే స్వరూపము గాగలది. దానికి నలుపు మొదలుగాగల దోషము లేవియు లేవు. అయినను మూఢులగు వార లాకాశము యొక్క యథార్థ స్వరూపమును గ్రహింప నేరక దాని యందు నలుపు మొదలగువాని నారోపించు చున్నారు. అటులనే సచ్చిదానన్ద రూపమగు నాత్మస్వరూపము నందజ్ఞానులచే ప్రపంచ

మారోపింపబడుచున్నది. యథార్థ మాలోచించినచో పరమాత్మ స్వరూపమొక్కటియే వాస్తవమగుచున్నది.

శ్లో॥ తత్కారణం యదజ్ఞానం సత్కార్యం సద్విలక్షణమ్,
అవస్త్విత్యుచ్యతే సద్భిః యస్య బాధా ప్రదృశ్యతే.

తా॥ ఆత్మయందు ప్రపంచారోపమునకు మూలకారణ మజ్ఞానము. ఇది బ్రహ్మమున కధీనమై అనృతజడదుఃఖాత్మకమగు చున్నది. ఈ యజ్ఞానము బ్రహ్మజ్ఞానముచే నశించును. లోకమున ప్రమాణాంతరముచే బాధింబడు పదార్థము యథార్థము కానేరదని శాస్త్రజ్ఞులు చెప్పు చున్నారు. కావున అజ్ఞానము అవస్తువగు చున్నది.

శ్లో॥ అవస్తు తత్ప్రమాణైర్యత్ బాధ్యతే శుక్తిరూప్యవత్,
న బాధ్యతే యత్తద్వస్తు త్రిషు కాలేషు శుక్తివత్. ౨౯౯

తా॥ ముత్యపుచిప్పయందు కల్పితమగు రజితము శుక్తిజ్ఞానముచే నివర్తించు చున్నది. అటులనే యే వస్తువు ఇతర ప్రమాణములచే బాధింపబడుచున్నదో యది యవస్తువనబడున్నది. ఇక ముత్యపుచిప్ప వ్యవహారకాలమునందు దేనిచేతను బాధింపబడనట్లుగా, నెయ్యది మూడు కాలములందు నే యొక్క ప్రమాణముచేతను బాధింపబడకున్నదో యది వస్తువని వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ శుక్తేర్హ్యబాధానఖల్వస్తి రజతస్య యథా తథా,
అవస్తు సంజ్ఞితం యత్తత్ జగదధ్యాసకారణమ్. 300

తా॥ శుక్తికయందు కల్పితమగు రజతము శుక్తిజ్ఞానము చేతను వలె బ్రహ్మమునందధ్యస్తమగు నజ్ఞానము బ్రహ్మజ్ఞానముచే బాధితమగుచున్నది గాన నది యవస్తువనబడుచున్నది. బ్రహ్మము త్రికాలాబాధ్య మగుటచే నది వస్తువనుట స్పష్టము.

శ్లో॥ సదసద్భ్యా మనిర్వాచ్య మజ్ఞానం త్రిగుణాత్మకమ్,
వస్తు తద్భావ బోధైక బాధ్యం తద్భావలక్షణమ్.
మిథ్యాసంబంధత స్తత్ర వస్తున్యాశ్రిత్య తిష్ఠతి,
మణౌ శక్తి ర్యథాతద్వ న్నైతదాశ్రయ దూషకమ్.

తా॥ అజ్ఞానము, సత్తు (లేక) శాశ్వతమనిగాని అసత్తు (లేక) శూన్యము అనిగాని చెప్పవీలులేనిది. ఏలన సత్తు (శాశ్వతము) అయినచో బ్రహ్మమువలె నెప్పుడును నశింపకుండవలయును. కాని బ్రహ్మజ్ఞానము కలుగగనే నశించునదగుటచే సత్తని చెప్పతగదు. ఇక నసత్తు (శూన్యము) అయినచో కుందేటి కొమ్మువలె నెప్పుడును భాసింపగూడదు. "నేను అజ్ఞాని" అను స్థలము నందజ్ఞానము స్పష్టముగా భాసించుచున్నదగుటచే నసత్తనియు చెప్పవీలుగాదు. కనుకనే శాస్త్రజ్ఞులు దీనిని అనిర్వచనీయ మను చున్నారు. సత్త్వరజస్తమస్సులను మూడుగుణములే దీని స్వరూపము. బ్రహ్మము యొక్క యునికియే దీనియందు భాసించుచున్నది. అనగా "అజ్ఞానమున్నది" అను చోట "నుండుట" అను ధర్మము బ్రహ్మలక్షణమై అజ్ఞానమునందు కనబడుచున్నది గాని ప్రత్యేకముగా నుండుటయను ధర్మమజ్ఞానమునకు లేదని భావము. అదియున్నచో నజ్ఞానముగూడ నొక శాశ్వతపదార్థము కావలసివచ్చును. ఇట్టి యజ్ఞానము కాల్పనిక సంబన్ధముచే బ్రహ్మస్వరూపము నాశ్రయించి, మణి యందుగల (దహించుటను ప్రతిబన్ధించు) శక్తివలె సూక్ష్మముగనున్నది. త్రాటియందు కల్పితమగు సర్పముయొక్క విషము మున్నగు దోషములు త్రాటినివలెను, ముత్యపుచిప్పయందు కల్పితమగు వెండియొక్క విలువ మున్నగు గుణములు ముత్యపుచిప్పనువలెను అజ్ఞానగతములగు గుణదోషములు బ్రహ్మస్వరూపము నెంత మాత్రము స్పృశింప నేరవు.

శ్లో॥ సద్భావే లింగమేతస్య కార్యమేత చ్చరాచరమ్,
మానం శ్రుతిస్స్మృతిశ్చాజ్ఞో2 హమిత్యనుభవో2పిచ.

తా॥ అజ్ఞాన "మనునది యొకటి గలదు" అనుటకు ప్రత్యక్షము అనుమానము శబ్దము. అను మూడు ప్రబల ప్రమాణములు గలవు. 'నేను అజ్ఞుడను. నాకేమియును తెలియదు' అనునది సర్వజన ప్రసిద్ధమగు ప్రత్యక్ష ప్రమాణము. ఇక ననుమానమనగా కార్యముచే కారణము నూహించుట. లోకమున ధూమమను కార్యముచే వహ్నియను కారణము నూహించుటను మనమందర మెరుగుదుము. అటులనే మనకు ప్రపంచ మను కార్యము కనబడుచున్నది. దీనియందుగల పదార్థము లన్నియూ సత్త్వరజస్తమో గుణాత్మకములై యున్నవి. ఈ ప్రపంచము సత్తనిగాని యసత్తనిగాని నిర్ణయింప వీలులేకున్నది. మరియు లోకమున నెక్కడను కారణములేని కార్య మప్రసిద్ధము. కావున అనిర్వాచ్యమై త్రిగుణాత్మక మగు ప్రపంచమునకు అనిర్వచనీయమును గుణత్రయాత్మకమును నగు నజ్ఞానము; కారణముగ నూహింపబడుచున్నది.

శబ్దప్రమాణ మెట్లనగా "శ్వేతాశ్వతరోపనిషత్తు"మున్నగు నుపని షత్తులును 'భగవద్గీత' మున్నగు స్మృతులును గుణత్రయాత్మకమగు అజ్ఞానము గలదనియు, నిది పరమేశ్వరున కధీనమై ప్రపంచమును నిర్మించుచున్నదనియు" స్పష్టముగ ప్రతిపాదించుచున్నవి.

శ్లో॥ అజ్ఞానం ప్రకృతి శ్శక్తి రవిద్యేతి నిగద్యతే,
తదేత త్సన్నభవితి నాऽసద్వా శుక్తిరూప్యవత్. ౩౦౪

శ్లో॥ సతోభిన్న మభిన్నంవా నదీపస్య యథా ప్రభా,
నసావయవ మన్యద్వా బీజస్యాంకురవ త్క్వచిత్. ౩౦౫

శ్లో॥ అతఏత దనిర్వాచ్య మిత్యేత త్కవయో విదుః,

తా॥ ఈ యజ్ఞానము ప్రకృతి; శక్తి; అవిద్య; మాయ; ప్రధా నము; అవ్యక్తము అని పలునామములచే వ్యవహరింపబడుచున్నది. ఇది బ్రహ్మజ్ఞానముచే నశించునది గావున సద్రూపము గానేరదు. వ్యవహార

దశయందు కార్యరూపమున ప్రసిద్ధమగు చున్నదిగాన సద్రూపమును గానేరదు. మరియు నీ యజ్ఞానము దీపముయొక్క కాంతివలె బ్రహ్మము కంటె భిన్నమనిగాని యభిన్నమనిగాని చెప్పనలవిగాకున్నది. బీజము వలన గలుగు మొలకవలె సావయవమనిగాని ఆకాశమువలె నిరవయవమని గాని నిరూపింప నశక్యమగుచున్నది. కావుననే ఈ యజ్ఞానము "అనిర్వచ నీయము = ఏ విధముననుచెప్పనలవి గానిది" అని పండితులు గ్రహించు చున్నారు.

సమష్టి వ్యష్టిరూపేణ ద్విధాఽజ్ఞానం నిగద్యతే, 30౬

శ్లో॥ నానాత్వేన ప్రతీతానా మజ్ఞానానా మభేదతః,
ఏకత్వేన సమష్టిస్స్యాత్ భూరుహాణాం వనం యథా.

శ్లో॥ ఇయం సమష్టి రుత్కృష్టా సత్త్వాంశోత్కర్షతః పురా,
మాయేతి కథ్యతే సద్భిః శుద్ధసత్త్వైకలక్షణా. 30౭

తా॥ అజ్ఞానము, వ్యష్టిరూపమునను, సమష్టిరూపమునను, రెండు విధములుగానున్నది. వ్యవహారకాలమునందు ఆయా జీవులనాశ్రయించి వేలువేలుగా నుండునది వ్యష్ట్యజ్ఞానము. ఇక-చెట్లయొక్క సముదాయము వనమని వ్యవహరింపబడు నటుల సకలాజ్ఞానములయొక్క సముదాయము 'సమష్టి' యనబడుచున్నది. ఈ సమష్ట్యజ్ఞానమె సత్వగుణాధిక్యమువలన శుద్ధసత్వలక్షణమగు మాయ యనబడుచున్నది.

శ్లో॥ మాయోపహిత చైతన్యం సాభాసం సత్త్వబృంహితమ్,
సర్వజ్ఞత్వాది గుణకం సృష్టిస్థిత్యన్త కారణమ్. 30౮
అవ్యాకృతం తదవ్యక్త మీశ ఇత్యపిగీయతే,

తా॥ సత్వగుణ ప్రధానమగు మాయయందు ప్రతిబింబించిన బ్రహ్మ చైతన్యంబును మాయకు నధిష్ఠానమైన పరబ్రహ్మంబును; మాయయు, జేరి

యవ్యాకృతమనియు, నవ్యక్తమనియు, నీశ్వరుడనియు శాస్త్రములందు వ్యవహరింపబడుచున్నది. ఇట్టి ఈశ్వరుడు సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వ సత్యసంకల్పత్వాది గుణములుగలవాడై సర్వజగములయొక్క సృష్టి స్థితి లయములకు కారణమగుచున్నాడు.

శ్లో॥ సర్వశక్తిగుణోపేతః సర్వజ్ఞానావభాసకః. ౩౧౦

శ్లో॥ స్వతంత్ర స్సత్య సంకల్పః సత్యకామ స్స ఈశ్వరః,
తస్యైతస్య మహావిష్ణో ర్మహాశక్తే ర్మహీయసః. ౩౧౧

శ్లో॥ సర్వజ్ఞత్వేశ్వర త్వాది కారణత్వా న్మనీషిణః,
కారణం వపురిత్యాహుః సమష్టిం సత్త్వబృంహితామ్.

తా॥ మాయాసంబధముగల చైతన్యము 'ఈశ్వరుడు' అనబడునని పూర్వము చెప్పబడినది. అట్టి యీశ్వరుడు సర్వశక్తియుతుండును; సకల సద్గుణ సంపన్నుడును; సర్వవృత్తిభాసకుండును; సత్వగుణప్రధానుండు నునై రజోగుణతమోగుణములచే తిరస్కరింపబడకుండుటచే స్వతంత్రుడును; సత్యసంకల్పుండును, సత్యకాముండును సర్వవ్యాపకుండును, సర్వ విషయముల తెలిసినవాడును, సర్వనియామకుండును నగుచున్నాడు. ఇట్టి ఈశ్వరునకు సత్త్వగుణవిశిష్టమగు మాయ కారణశరీరమగుచున్నది. స్వభావముచే సర్వగుణరహితమగు బ్రహ్మమునకు మాయాసంబంధముననే సర్వజ్ఞత్వాది గుణములు ఏర్పడుచున్నవి, గాన మాయ కారణశరీర మనబడు చున్నదని భావము.

శ్లో॥ ఆనన్దప్రచురత్వేన సాధకత్వేన కోశవత్,
సైషాఽఽనన్దమయః కోశ ఇతీశస్య నిగద్యతే. ౩౧౩

తా॥ శుద్ధసత్వ గుణప్రధానమగు మాయయందు చైతన్యము యొక్క సచ్చిదానన్దాంశములు మూడును ప్రతిఫలించును. కావున

మాయ యనునది అనన్త మధికముగా గలదగు చున్నది. మరియు లోకమున ధనసముదాయము విషయానన్ద ప్రాప్తికి సాధనమగునట్లుగా మాయయను నది ఈశ్వరునకు నిరతిశయానన్దాభివ్యక్తికి కారణమగుచున్నది గావునను కర్త్రి యొక్కయందిమిడి యుండునట్లుగా ఈశ్వరుడు ప్రతిబింబ రూపమున మాయాన్తర్గతు డగుచున్నాడు, గావునను 'మాయ' ఈశ్వరునకు ఆనన్దమయ కోశమని చెప్పబడుచున్నది.

శ్లో॥ సర్వోపరమహేతుత్వాత్ సుషుప్తిః స్థాన ముచ్యతే,
ప్రాకృతః ప్రలయోయత్ర శ్రావ్యతే శ్రుతిభిర్ముహుః.

తా॥ సుషుప్తికాలమున సర్వవిషయాలును సూక్ష్మరూపముతో నజ్ఞానమున నిమిడియుండును. ఇట్టి యజ్ఞానములయొక్క సమష్టియే యుపాధిగా గలవాడగుటచే నీశ్వరనకు సుషుప్తి స్థానమని శ్రుతులచే చెప్పబడుచున్నది.

శ్లో॥ అజ్ఞానం వ్యష్ట్యభిప్రాయా దనేకత్వేన భిద్యతే,
అజ్ఞాన వృత్తయోనానా తత్తద్గుణ విలక్షణాః. 30॥

శ్లో॥ వనస్య వ్యష్ట్యభి ప్రాయా ద్వృక్షా ఇత్యనేకతా,
యథా తథైవాఽజ్ఞానస్య వ్యష్టిత స్స్యాదనేకతా.

తా॥ అజ్ఞానము వ్యవహారసిద్ధమగు నానా జీవగత భేదము ననుస రించి పలువిధములగుచున్నది. సత్వరజస్తమో గుణముల తారతమ్యముచే నజ్ఞానవృత్తులుగూడ నానాప్రకారములగు చున్నవి. లోకమున వన మనునది యొకే రూపమున గనబడుచున్నను, దానియందుగల వృక్షముల యొక్క భేదముచే పలురకములగునట్లుగా నజ్ఞానముగూడ సమష్టి రూప మున ననేకముగనన్నను వ్యష్టిరూపమున ననేక రూపమగుచున్నది.

శ్లో॥ సమస్త మపిచ వ్యస్తం గుణై ర్యద్వాప్యవ్యతిష్ఠతి,
తత స్సమష్టివ్యష్టిత్వ వ్యపదేశోఽస్య యుజ్యతే. 308

తా॥ పత్ర పుష్ప ఫలాది ధర్మములు వేఱు వేఱుగా ప్రతివృక్షము నందునుగలవు. వృక్షసముదాయరూపమగు వనమునందునుగలవు. అందుచే వృక్షములయొక్క సమష్టిభావముచే 'వనమ'నియు, వ్యష్టిభావముచే 'చెట్లు' అనియు వ్యవహారము గలుగుచున్నది. అటులనే సత్వరజస్తమో గుణములు సమష్ట్యజ్ఞానమును, వ్యష్ట్యజ్ఞానవృత్తులనుగూడ వ్యాపించి యుండుటచే నొకే యజ్ఞానమునకు సమష్టి, వ్యష్టివ్యవహార మేర్పడినది.

శ్లో॥ వ్యష్టిర్మలిన సత్త్వైషా రజసా తమసాయుతః,
తతో నికృష్టా భవతి యోపాధిః ప్రత్యగాత్మనః. 309
చైతన్యం వ్యష్ట్యవచ్ఛిన్నం ప్రత్యగాత్మేతి గీయతే,

తా॥ వ్యష్ట్యజ్ఞానము, రజోగుణతమోగుణములచే కలుషితమైన సత్వగుణముగలది. అందుచే నది శుద్ధసత్వప్రధానమగు సమష్ట్యజ్ఞానము (లేక మాయ) కంటె నికృష్టమగుచున్నది. ఇట్టి వ్యష్ట్యజ్ఞానము ఉపాధిగా గలదై, దీనికి ఆధారమగు చైతన్యము ప్రత్యగాత్మ యనబడుచున్నది. అనగా తనయందు కల్పితమై యనృతజడదుఃఖాత్మకమగు అజ్ఞానమున కంటెను, అజ్ఞాన కార్యములగు స్థూలసూక్ష్మశరీరములకంటెను విలక్షణముగా సచ్చిదానన్ద రూపమున భాసించునది యని భావము. దీనినే జీవసాక్షి యనికూడ వ్యవహరింతురు.

శ్లో॥ సాభాస వ్యష్ట్యుపహిత సత్తాదాత్మ్యేన తద్గుణైః. 310
అభిభూత స్సఏవాత్మా జీవ ఇత్యభిధీయతే,
కించి జ్జత్వా నీశ్వరత్వ సంసారిత్వాది ధర్మవాన్. 320

తా॥ పూర్వమందు చెప్పబడిన ప్రత్యగాత్మయే వ్యష్ట్యజ్ఞానమున ప్రతిబింబించి దానియందు "నేను" అను నభిమానము గలిగి దాని

గుణములగు రజస్తమస్సులచే నావరింపబడిన స్వస్వరూపము గలదై "జీవుడను" నామముచే వ్యవహరింప బడుచున్నది. ఇట్టి జీవుడు తన యుపాధి యందలి దోషములచే కొలది జ్ఞానము గలవాడుగను, ఇతరులను నియమింప శక్తిలేనివాడుగను, సుఖము, దుఃఖము, శోకము, మోహము, ఆకలి, దప్పిక, వార్ధక్యము మరణము మున్నగు సంసార ధర్మములుగల వాడుగను నగుచున్నాడు.

శ్లో॥ అస్యవ్యష్టి రహం కార కారణత్వేన కారణమ్,
వపు స్తత్రాభిమానాత్మా ప్రాజ్ఞ ఇత్యుచ్యతే బుధైః.

తా॥ జీవునకు దేహేంద్రియాది సంఘాతమునందుగల 'నేను' అను నభిమానమునకు వ్యష్ట్యజ్ఞానము మూలకారణమగుటచే నదియే అతనికి కారణ శరీరమగుచున్నది. ఇట్టి కారణశరీరముతో తాదాత్మ్యమునొందిన జీవుడు ప్రాజ్ఞుడననడుచున్నాడు.

శ్లో॥ ప్రాజ్ఞత్వ మస్యైకాజ్ఞాన భాసకత్వేన సంమతమ్,
వ్యష్టే ర్నికృష్టత్వేనాఽస్య నాఽనేకాజ్ఞాన భాసకమ్.

తా॥ ప్రాజ్ఞుడనగా పదార్థములను బాగుగా తెలిసికొనువాడు లేక ప్రకాశింపజేయువాడు అని యర్థము. సుషుప్తికాలమున జీవుడు తన కారణ శరీరమగు నజ్ఞానము నొక్కదానినే భాసింప జేయునుగాన ప్రాజ్ఞుడనబడుచున్నాడు. మరియు జీవుడనగా రజస్తమో గుణములచే తిరస్కృతమగు సత్వగుణముగలవాడుగాన నితనికి మిగిలిన జీవుల యజ్ఞానములను భాసింపజేయుగల సామర్థ్యము లేదు. ఈశ్వరుడు మాత్రము శుద్ధసత్వగుణప్రధానుడగుటచే సర్వజీవుల యజ్ఞానగతములగు విశేషములను గ్రహింప సమర్థుడు.

శ్లో॥ స్వరూపాచ్ఛాదకత్వే నాఽప్యానన్దప్రచురత్వతః,
కారణం వపు రానన్దమయఃకోశ ఇతీర్యతే. 323

తా॥ జీవునకు వ్యష్ట్యజ్ఞానము కారణశరీరమగునని పూర్వము చెప్పబడినది. ఇట్టి యజ్ఞానము విశేషమగు నానన్దము గలదియగుటచే నానన్దమయమును ఒఅఖణ్డము నాచ్ఛాదించునట్లుగా జీవుని యొక్క నిజమగు సచ్చిదానన్ద రూపము నావరించునదగుటచే కోశము గావున ఆనన్దమయ కోశమని చెప్పబడుచున్నది.

శ్లో॥ అస్యాఽవస్థా సుషుప్తి స్స్యా ద్యత్రానందః ప్రకృష్యతే,
ఏషోఽహం సుఖమస్వాప్సం నతుకించి దవేదిషమ్

శ్లో॥ ఇత్యానన్ద సముత్కర్షః ప్రబుద్ధేషు ప్రదృశ్యతే

తా॥ ఈ కారణశరీరము గాఢనిద్రయందు గోచరించును. ఇందు ఆనన్దమధికముగా నభివ్యక్తమగుచుండును. కనుకనే నిద్రించిలేచిన ప్రతి మానవుడును- "నేను సుఖముగా నిద్రించితిననియు, నాకేమియు తెలియదు" అనియు చెప్పుచున్నాడు.

సమష్టే రపిచ వ్యష్టే రుభయో ర్వనవృక్షవత్. 3౨౫

శ్లో॥ అభేద ఏవ నోభేదో జాత్యేకత్వేన వస్తుతః,
అభేద ఏవజ్ఞాతవ్య స్తథేశ ప్రాజ్ఞయో రపి. 3౨౬

వెనుక 306 + 307 శ్లోకములలో జెప్పిన, వనవృక్ష న్యాయముచే జీవోపాధియగు వ్యష్ట్యజ్ఞానమునకును, ఈశ్వరోపాధియగు సమష్ట్యజ్ఞానమునకును భేదములేదు గావున తదుపాధికులగు జీవేశ్వరుల (ప్రాజ్ఞ) కిరువురకును స్వరూపముచే భేదమెంతమాత్రము లేదని గ్రహింపదగును.

శ్లో॥ సత్యుపాధ్యో రభిన్నత్వే క్వభేద స్తద్విశిష్టయోః,
ఏకీభావే తరంగాఽబ్ధ్యోః కోభేదః ప్రతిబింబయోః 3౨౭

తా॥ సముద్రమునకును దానియందలి తరంగములకును భేదము లేదు గాన వానియందు ప్రతిఫలించిన సూర్యప్రతిబింబములకును భేదము

లేదు. అటులనే వ్యష్టిసమష్ట్యజ్ఞానములు రెండును స్వరూపముచే వానియందలి చైతన్యప్రతిబింబములగు ప్రాజ్ఞునకును, ఈశ్వరునకునుగూడ పరమార్థమున భేదమించుకేనియు లేదని గ్రహింపనగును.

శ్లో॥ అజ్ఞాన తదవచ్ఛిన్నా భాసయో రుభయోరపి,
ఆధారం శుద్ధచైతన్యం యత్తత్తుర్య మితీర్యతే. ౩౨౮

తా॥ వ్యష్టిసమష్ట్యాత్మకమగు నజ్ఞానమునకును, దానియందలి ప్రతిబింబములగు జీవేశ్వరులకును, మూటికిని గూడ నాధారమగుశుద్ధచైతన్యము "తుర్య" మను నామముచే శ్రుతులయందు చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏతదేవాఽవివిక్తం సత్ ఉపాధిభ్యాంచ తద్గుణైః,
మహావాక్యార్థ వాచ్యార్థో వివిక్తం లక్ష్య ఇష్యతే.

తా॥ "తత్త్వమసి" అను మహావాక్యమునందు "తత్" అను పదముచే "సర్వజ్ఞత్వము" మున్నగు గుణములుగల ఈశ్వర చైతన్యమును, "త్వం" అను పదముచే "కించిద్జ్ఞత్వము" మొదలగు ధర్మములుగల జీవచైతన్యమును, అసి అనుపదముచే జీవేశ్వరుల కైక్యమును, చెప్పబడుచున్నది. దీనిని వాచ్యార్థమందురు. ఇట్టి యర్థమునందు విరుద్ధధర్మములుగల జీవేశ్వరచైతన్యముల కేకత్వ మసంభవము. ఐక్యభావము "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" ఇత్యాది శ్రుతులకు విరుద్ధము. కావున వాచ్యార్థము కుదురనప్పుడు లక్ష్యార్థము నాశ్రయింపవలయును. అట్టియెడ విరుద్ధములగు ధర్మములు పరిత్యక్తములగుటచే శుద్ధమగు చైతన్యమున కేకత్వము పపన్నము. కావున మహావాక్యమునందలి తత్త్వంపదములకు వాచ్యార్థము సోపాధిక చైతన్యమనియు, లక్ష్యార్థము నిరుపాధిక చైతన్యమనియు గ్రహింపనగును.

శ్లో॥ అనన్త శక్తిసంపన్నో మాయోపాధిక ఈశ్వరః,
ఈక్షామాత్రేణ సృజతి విశ్వమేత చ్చరాచరమ్. 330

తా॥ మాయోపాధికుడగు నీశ్వరుడు మాయయందలి వివిధ శక్తులతో గూడుకొనిన వాడు గాన తన సంకల్పమాత్రముననే చరాచరాత్మకమగు నీ జగమును సృజించుచున్నాడు.

శ్లో॥ అద్వితీయ స్వమాత్రోఽసౌ నిరుపాదాన ఈశ్వరః,
స్వయమేవ కథం సర్వం సృజతీతి నశంక్యతామ్॥. 331

శ్లో॥ నిమిత్తమ ప్యుపాదానం స్వయమేవ భవన్ ప్రభుః,
చరాచరాత్మకం విశ్వం సృజత్యవతి లుంపతి. 332

తా॥ లోకమున కుండకు కులాలుడు నిమిత్తకారణము. మట్టి యుపాదాన కారణము. కుమ్మరివాడు మట్టిచే కుండలను నిర్మించుచున్నాడు. ఇక నీశ్వరుడన్నచో ఒక్కడు. సర్వవ్యాపకుడు. ఇతనికి కుండకు మట్టివలె ప్రపంచ నిర్మాణమునకు మూలసాధనమగు మఱియొక వస్తువేమియును లేదు. ఇట్టియెడ నిమిత్త కారణమగు నీశ్వరుడొక్కడే ఉపాదాన కారణము లేకుండ ప్రపంచము నెట్లు సృష్టింప గలడని శంకింప దగదు. ఏలన సర్వశక్తి సంపన్నుడగు పరమేశ్వరుడు తానే నిమిత్త కారణమును ఉపాదాన కారణమునునై ప్రపంచముయొక్క సృష్టిస్థితి లయములకు కర్తయగుచున్నాడు.

శ్లో॥ స్వప్రాధాన్యేన జగతో నిమిత్త మపికారణమ్,
ఉపాదానం తథోపాధి ప్రాధాన్యేన భవత్యయమ్. 333

శ్లో॥ యథా లూతానిమిత్తంచ స్వప్రధానం తథాభవేత్,
స్వశరీరప్రధానత్వే నోపాదానం తథేశ్వరః. 334

తా॥ సాలెపురుగు, చిన్నపురుగులను తినుటకలన గలిగిన తన నోటియందలి చొంగచే దారము నుత్పత్తిచేయుచున్నది. ఇట్టి దారము పుట్టుటకు సాలెపురుగునందలి చేతనభాగము నిమిత్త కారణమును, అచేతన

మగు దాని నోటిచొంగ ఉపాదానకారణమును నగుచున్నవి. అటులనే మాయయందు ప్రతిఫలించిన చైతన్య స్వరూపుడగు పరమేశ్వరుడు తనచే నిర్మితమగు ప్రపంచమునకు చైతన్య ప్రాధాన్యమున నిమిత్త కారణమును, మాయా ప్రాధాన్యము ననుపాదాన కారణమును నగుచున్నాడు. అందువలననే ఈశ్వరుడు ప్రపంచమునకు అభిన్న-నిమిత్తోపాదాన కారణమని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ తమః ప్రధానప్రకృతి విశిష్టా త్పరమాత్మనః,
అభూ త్సకాశా దాకాశ ఆకాశాద్వాయురుచ్యతే.33॥
వాయోరగ్ని స్తథైవాఽగ్నే రాపోఽద్భ్యఃపృథివీక్రమాత్.

తా॥ తమోగుణ ప్రధానమగు ప్రకృతితో గూడిన పరమాత్మ వలన, ఆకాశంబును, ఆకాశమువలన వాయువు, వాయువువలన నగ్ని, అగ్నివలన జలము, జలమువలన భూమియు క్రమముగా పుట్టినవని తైత్తిరీయము మున్నగు శ్రుతులు నుడువుచున్నవి.

శ్లో॥ శక్తే స్తమః ప్రధానత్వం తత్కార్యే జాడ్యదర్శనాత్.
ఆరభన్తే కార్యగుణాన్ యేకారణ గుణాహితే,

తా॥ కార్యవస్తువునందు గానంబడు గుణములు కారణ వస్తువు నుండి సంక్రమించునవియే గావున ప్రకృతియొక్క కార్యములగు పంచభూతములయందు జడత్వము కానంబడుటంబట్టి భూత కారణమగు ప్రకృతి, తమోగుణప్రధానమైన దని యూహింపబడుచున్నది.

శ్లో॥ ఏతాని సూక్ష్మభూతాని భూతమాత్రా ణ్యుపక్రమాత్
ఏతేభ్య స్సూక్ష్మ భూతేభ్య స్సూక్ష్మదేహా భవన్త్యపి,
స్థూలా న్యపిచ భూతాని చాన్యోఽన్యాంశ విమేళనాత్

తా॥ తొలుత, నుత్పన్నములగు భూతములు తమతమ ప్రత్యేక గుణములతో మాత్రము గూడుకొని సూక్ష్మభూతములనియు పంచతన్మాత్రలనియు ప్రసిద్ధములగుచున్నవి. అనగా ఆకాశము శబ్దమాత్ర గుణముగలదిగను, వాయువు స్పర్శమాత్ర గుణముగలదిగను, తేజస్సు రూపమాత్రగుణము గలదిగను, జలము రసమాత్ర గుణముగలదిగను, భూమి గంధమాత్ర గుణముగలదిగను నుండెనని భావము. ఈ సూక్ష్మభూతములవలన సూక్ష్మదేహములు (లేక) లింగశరీరములు గలుగుచున్నవి. సూక్ష్మభూతముల పరస్పరాంశముల యొక్క కలయిక వలన స్థూలభూతములు ఏర్పడుచున్నవి.

శ్లో॥ అపంచీకృతభూతేభ్యో జాతం సప్తదశాంగకమ్,
సంసారకారణం లింగ మాత్మనో భోగసాధనమ్. 339

తా॥ పంచీకరణముచేయబడని సూక్ష్మభూతములవలన లింగశరీరముత్పన్నమాయెను. ఇందు శ్రోత్రము మున్నగు (రాబోవు-శ్లోకమున చెప్పబడు) పదునేడు అవయవములుగలవు. ఇదియే జీవుని సంసార ప్రాప్తికి కారణమును, సుఖదుఃఖాద్యనుభవమునకు సాధనమును నగుచున్నది

శ్లో॥ శ్రోత్రాది పంచకంచైవ వాగాదీనాం చ పంచకమ్,
ప్రాణాది పంచకం బుద్ధి మనసీ లింగ ముచ్యతే. 340

తా॥ శ్రోత్రము, నేత్రము, చర్మము, నాలుక, ముక్కు అను నైదు పంచజ్ఞానేంద్రియములును, వాక్కు, చేయి. కాలు, వాయువు, ఉపస్థ అను నైదు కర్మేంద్రియములును, ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము అను నైదు వాయువులును, మనస్సు, బుద్ధియు ఈ పదేనేడును గలిసి లింగ శరీరమని చెప్పబడుచున్నవి,

శ్లో॥ శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణాఖ్యాని పంచ జాతాని,
ఆకాశాదీనాం సత్త్వాంశేభ్యో ధీన్ద్రియాణ్యనుక్రమతః.

తా॥ తమోగుణ ప్రధానమగు ప్రకృతివలన సూక్ష్మభూతము లుత్పన్నములైనవి. కారణగుణములు కార్యమునందు సంక్రమించును గాన పంచభూతములు గుణత్రయాత్మకములగుచున్నవి. అందు ఆకాశము యొక్క సత్వాంశమువలన శ్రోత్రేన్ద్రియమును, వాయువుయొక్క సత్వాంశమువలన త్వగిన్ద్రియమును, తేజస్సుయొక్క సత్వాంశమువలన చక్షురిన్ద్రియమును, జలముయొక్క సత్వాంశమువలన జిహ్వేన్ద్రియమును, భూమియొక్క సత్వాంశమువలన ఘ్రాణేన్ద్రియమును క్రమముగా నుద్భవించినవి.

శ్లో॥ ఆకాశాదిగతాః పంచ సాత్వికాంశాః పరస్పరమ్,
మిళితైర్వాఽన్తః కరణ మభవ త్సర్వకారణమ్. ౩౪౨

తా॥ ఆకాశాది పంచభూతముల సత్వాంశము లైదింటియొక్క సంమేళనమువలన సర్వ సంసార కారణమగు అన్తఃకరణముత్పన్న మాయెను. వ్యష్టిసత్వాంశముల వలన జ్ఞానేంద్రియము లుద్భవించినవని పూర్వము చెప్పబడినది.

శ్లో॥ ప్రకాశకత్వా దేతేషాం సాత్వికాంశత్వ మిష్యతే,
ప్రకాశకత్వం సత్వస్య స్వచ్ఛత్వేన యతస్తతః. ౩౪౩

తా॥ సత్వగుణము నిర్మలమైన దగుటచే ప్రకాశించు స్వభావము గలదియు, ప్రకాశింపజేయు స్వభావముగలదియు నగుచున్నది. జ్ఞానేన్ద్రియములకును, నన్తఃకరణమునకును ఘటపటాది పదార్థములను భాసింప జేయు సామర్థ్యముగలదు గాన నయ్యవి భూతములయొక్క సత్వాంశముల వలననే యుత్పన్నములైనవని నిశ్చయింపబడుచున్నది.

శ్లో॥ తదన్తః కరణం వృత్తిభేదేన స్యాచ్చతుర్విధమ్,
మనోబుద్ధి రహంకార శ్చిత్తం చేతి తదుచ్యతే. ౩౪౪

తా॥ ఆ యంతఃకరణము తన యందలి వృత్తుల భేదముచే నాలుగు విధములై - మనస్సు - బుద్ధి - అహంకారము - చిత్తము అను నామములచే వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ సంకల్పా న్మన ఇత్యాహుః బుద్ధిరర్థస్య నిశ్చయాత్,
అభిమానా దహంకారః చిత్తమర్థస్య చిత్తనాత్. 384

తా॥ అన్తఃకరణమొక్కటియే సంకల్ప వికల్ప సంశయాదులతో గూడుకొనినప్పుడు మనస్సనియు, ఆయా విషయములను నిర్ణయించునప్పుడు బుద్ధియనియు, దేహేన్ద్రియాదులందు 'నేను' అను నభిమానము గలిగియున్నప్పుడు 'అహం' కారమనియు విషయములను స్మరించుచు, వాని స్వరూపమును సతతము నాలోచించుచుండునపుడు చిత్తమనియు చెప్పబడుచున్నది.

శ్లో॥ మనస్యపిచ బుద్ధౌచ చిత్తాహంకారయోః క్రమాత్,
అన్తర్భావోఽత్ర బోద్ధవ్యః లింగలక్షణ సిద్ధయే. 386

తా॥ లింగ శరీరమునకు 'పదునేడు' అంగములు గలవని పూర్వము చెప్పబడినది. జ్ఞానేంద్రియములైదు-కర్మేంద్రియములైదు-ప్రాణవాయువులైదు. వీనితో మనోబుద్ధిచిత్తాహంకారములను నాల్గింటిని చేర్చినచో పందొమ్మిది యగును ఇందుకై చిత్తమును మనస్సునందును, అహంకారమును బుద్ధియందును అంతర్భూతముగా గ్రహించినచో పదునేడంగములు గలదియను మాట సమన్వితముగా నుండును.

శ్లో॥ చిన్తనం చ మనోధర్మః సంకల్పాది ర్యథా తతః,
అన్తర్భావో మనస్యేవ సమ్యక్చిత్తస్య సిద్ధ్యతి. 387

శ్లో॥ దేహాదావహమిత్యేవ భావో దృఢతరో ధియః,
దృశ్యతేఽహంకృతే స్తస్మా దన్తర్భావోఽత్ర యుజ్యతే.

తా॥ సంకల్ప వికల్పాదులవలె చిన్తన మనునదియును మనో ధర్మమె కావున చిత్తమునకు మనస్సునందే యన్తర్భావము ఉచితము. అటులనే దేహేన్ద్రియాదులందు 'నేను' అనునిశ్చితాభిప్రాయము బుద్ధికి సంబన్ధించిన దగుటచే నంహంకారము బుద్ధిలో నన్తర్భావము చెందు ననుటయు యుక్తి యుక్త మగుచున్నది.

శ్లో॥ తస్మాదేవతు బుద్ధేః
కర్తృత్వం తదితరస్య కరణత్వం,
సిద్ధ్య త్యాత్మన ఉభయో
ర్విద్యాత్సంసార కారణం మోహాత్. ౩౮౯

తా॥ కర్తయగు నహంకారము బుద్ధియం దంతర్భూతమైనది కావుననే బుద్ధికి కర్తృత్వంబును మిగిలిన ప్రాణ జ్ఞాన కర్మేన్ద్రియములకు కరణత్వమును సిద్ధించుచున్నది. అనగా ప్రాణవాయువులను, జ్ఞాన కర్మేన్ద్రియములను సాధనములనుగా చేసికొని బుద్ధియే పుణ్యపాప కర్మల నాచరించుచున్నదని భావము. కావుననే తైత్తిరీయ శ్రుతి "విజ్ఞానం యజ్ఞం తనుతే, కర్మాణి తనుతేఽపి చ" అని నుడువుచున్నది. ఇట్టి బుద్ధేన్ద్రియాదులందు "నేను" "నాది" యను నభిమానమే జీవునకు సంసారప్రాప్తికి కారణమగుచున్నది.

శ్లో॥ విజ్ఞానమయకోశస్స్యాత్ బుద్ధి ర్జ్ఞానేన్ద్రియై స్సహ,
విజ్ఞానప్రచురత్వేనాఽ ప్యాచ్ఛాదకతయాఽఽ త్మనః,
విజ్ఞానమయకోశోఽయ మితి విద్వద్భి రుచ్యతే. ౩౭౦

తా॥ నేత్రము మున్నగు నైదుజ్ఞానేన్ద్రియములతో గూడిన బుద్ధియే విజ్ఞానమయకోశమగుచున్నది. ఇయ్యది జ్ఞాన మధికముగా గలది యగుటచేతను ఒఱ ఖడ్గము నావరించునటుల. ఆత్మస్వరూపము నావరించున దగుటచేతను విజ్ఞానమయకోశమని వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ అయం మహానహంకారవృత్తిమాన్ కర్తృలక్షణః,
సర్వసంసారనిర్వోఢా విజ్ఞానమయశబ్దభాక్. 350

తా॥ ఈ విజ్ఞానమయకోశము దేహేన్ద్రియాదులయందు 'నేను' అను నభిమానము గలదియు, సర్వకార్యములయందు 'నేను కర్త' నను భావము గలదియునై సకల సంసారమును నిర్వహించుచున్నది.

శ్లో॥ అహం మమేత్యేవ సదాఽభిమానమ్
దేహేన్ద్రియాదౌ కురుతే గృహాదౌ,
జీవాభిమానః పురుషోఽయ మేవ
కర్తాచ భోక్తాచ సుఖీచ దుఃఖీ 352

తా॥ ఈ విజ్ఞానమయకోశమే జీవుడు, పురుషుడు అని వ్యవహరింపబడుచున్నదై దేహేన్ద్రియాదులందు నేననియు, గృహవిత్తకళత్రాదులందు 'నాది' యనియు నభిమానము గలిగి, పుణ్యపాప కర్మల నాచరించునదియు, కర్మఫలముల ననుభవించునదియునై సుఖదుఃఖములు గలదియగుచున్నది.

శ్లో॥ స్వవాసనాప్రేరిత ఏవ నిత్యమ్
కరోతి కర్మోభయలక్షణం చ,
భుంక్తే తదుత్పన్నఫలం విశిష్టమ్
సుఖంచ దుఃఖంచ పరత్ర చాఽత్ర. 353

తా॥ విజ్ఞానమయ కోశాభిమాని యగు జీవుడు తన జన్మాన్తర సంస్కారములచే ప్రేరేపించబడుచున్నవాడై పుణ్య పాప కర్మల నాచరించుచు తత్ఫలములగు సుఖదుఃఖములను ఇహపర లోకములందు అనుభవించుచున్నాడు.

శ్లో॥ నానాయోనిసహస్రేషు జాయమానో ముహుర్ముహుః,
మ్రియమాణో భ్రమత్యేవ జీవ స్సంసారమండలే. ३५४

తా॥ జీవుడు తన పుణ్యపాప కర్మల ననుసరించి తత్ఫలానుభవము కొఱకు పలువిధములగు బ్రాహ్మణాది పుణ్యయోనులందును శ్వసూకరాది పాపయోనులందును జన్మించి, మరణించుచున్నవాడై సంసారమను గొప్పసుడియందు భ్రమించుచున్నాడు.

శ్లో॥ మనో మనోమయః కోశో భవేత్ జ్ఞానేన్ద్రియైః సహ,
ప్రాచుర్యం మనసో యత్ర దృశ్యతేఽసౌ మనోమయః.

తా॥ నేత్రము మున్నగు నైదు జ్ఞానేంద్రియములతో గూడుకొనిన మనస్సు మనోమయ కోశమన బడుచున్నది. ఇందు మనస్సు ప్రధానముగా పనిచేయును. విజ్ఞానమయ కోశమునందు బుద్ధికి ప్రాధాన్యము.

శ్లో॥ చింతావిషాదహర్షాద్యాః కామాద్యా అస్య వృత్తయః
మనుతే మనసైవైషః ఫలం కామయతే బహిః,
యతతే కురుతే భుఙ్క్తే తన్మన స్సర్వకారణమ్. ३५६

తా॥ చింత - శోకము - హర్షము - కామము - క్రోధము - లోభము - మోహము - మదము - మాత్సర్యము మున్నగు నవన్నియు మనోధర్మములగుచున్నవి. మఱియు జీవుడు మనస్సుచేతనే సంకల్పించును, కోరును, ప్రయత్నించును, విషయజాతమును, వశపఱచుకొనును, అనుభవించును. తజ్జన్యములగు పుణ్యపాపముల నొందును. తత్ఫలములగు సుఖదుఃఖముల ననుభవించును. కావున జీవునియొక్క ప్రపంచ వ్యవహారమునకంతకును, మనస్సే కారణమగుచున్నది.

శ్లో॥ మనో హ్యాముష్య ప్రవణస్య హేతుః
అన్త ర్బహిశ్చార్థ మనేన వేత్తి,

శ్రుణోతి జిఘ్రత్యమునైవ చేక్షతే
వక్తి స్పృశత్యత్తి కరోతి సర్వమ్. 358

తా॥ జీవుని యొక్క సకల వ్యవహారములకును మనస్సే కారణమగుచున్నది. జీవుడు తన మనస్సుచేతనే ఆన్తరంగిక విషయములను, బాహ్యవిషయములను గ్రహించుచున్నాడు. వినుట, ఆఘ్రాణించుట, చూచుట, మాటాడుట, స్పృశించుట, భుజించుట మున్నగు కార్యముల నన్నింటిని మనస్సుతోడనే చేయుచున్నాడు. కావున సర్వకార్యములకును మనస్సే కారణమనుట నిశ్చయము.

శ్లో॥ బన్ధశ్చ మోక్షో మనసైవ పుంసామ్
అర్థోఽ ప్యనర్థో ఽప్యమునైవ సిద్ధ్యతి,
శుద్ధేన మోక్షో మలినేన బన్ధః
వివేకతో ఽర్థో హ్యవివేకతో ఽన్యః. 359

తా॥ పురుషులకు బన్ధమోక్షములును, అర్థానర్థములును, మనస్సువలననే కలుగుచున్నవి. మనస్సు సత్కర్మానుష్టానముచే పరిశుద్ధమగునేని మోక్షమును, రాగద్వేషాదులచే కలుషితమగునేని సంసారబన్ధమును నేర్పడుచున్నవి. అటులనే యుక్తాయుక్త వివేకమువలన ధర్మార్థకామము లనెడి పురుషార్థములును, వివేకము లేమిచే నరకము నందుగాని, పశుపక్ష్యాది జన్మములందుగాని దుఃఖప్రాప్తియు సంభవించుచుండును.

శ్లో॥ రజస్తమోభ్యాం మలినం త్వశుద్ధమ్
అజ్ఞానజం సత్త్వగుణేన రిక్తమ్,
మనస్తమోదోషసమన్వితత్వాత్
జడత్వ మోహాలసతాప్రమాదైః,
తిరస్కృతం సన్న తు వేత్తి వాస్తవమ్
పదార్థతత్వం హ్యుపలభ్యమానమ్. 360

తా॥ అజ్ఞాన కార్యములగు పంచ సూక్ష్మభూతముల యొక్క సత్త్వాంశల సమష్టివలన మనస్సు (అన్తఃకరణము) ఏర్పడినదని పూర్వము చెప్పబడినది. ఇట్టి మనస్సు సత్త్వగుణము చాల తక్కువగా గలదై రజస్తమోగుణములచే నపరిశుద్ధమగునప్పుడు మలిన మనస్సని వ్యవహరింప బడును. ఆ కాలమున తమోగుణములగు జాడ్యము, మోహము, మాంద్యము, ప్రమాదము లోనగు దోషములచే దిరస్కరింపబడినదై పదార్థములయొక్క యథార్థస్వరూపమును గ్రహింప నేరకుండును.

శ్లో॥ రజోదోషై ర్యుక్తం యది భవతి విక్షేపకగుణైః
ప్రతీపైః కామాద్యై రనిశ మభిభూతం వ్యథయతి,
కథంచి త్సూక్ష్మార్థానగతిమదపి భ్రామ్యతి భృశమ్
మనో దీపో యద్వ త్ప్రబలమరుతా ధ్వస్త మహిమా.

తా॥ మనస్సు స్వయముగా సూక్ష్మవిషయములను గ్రహింప సమర్థమైనదైనను రజోగుణదోషములగు చిన్తా విషాద హర్షాదుల చేతను, కామక్రోధాద్యరిషడ్వర్గము చేతను దిరస్కరింపబడుచున్నదై పెనుగాలిచే చలింపజేయబడిన ప్రదీపమువలె నిరంతరము పరిభ్రమించుచుండును.

శ్లో॥ తతో ముముక్షు ర్భవబన్ధముక్త్యై
రజస్తమోభ్యాంచ తదీయకార్యైః,
వియోజ్య చిత్తం పరిశుద్ధసత్త్వమ్
ప్రియం ప్రయత్నేన సదైవ కుర్యాత్. ౩౬౧

తా॥ కావున మోక్షవాంఛగల మానవుడు తనచిత్తమునురజస్తమో గుణములనుండియు, వాని కార్యములనుండియు నివారించి సత్త్వగుణ ప్రధానముగాచేయవలయును. అనగా లోకశాస్త్ర గర్హితములగు రాజస

తామస కర్మముల నాచరింపక శాస్త్రవిహితములగు సత్కర్మలనె నిరన్తర మనుష్ఠించుచుండవలయును. ఇట్లైనచో త్వం లో సంసారబన్ధమునుండి విడుదల పొందగలడు.

శ్లో॥ గర్భావాసజనిప్రణాశన జరా వ్యాధ్యాదిషు ప్రాణినామ్
యద్దుఃఖం పరిదృశ్యతే చ నరకేతచ్ఛిన్తయిత్వాముహుః,
దోషానేవ విలోక్యసర్వవిషయే ష్వాశాంవిముచ్యాభితః
చిత్తగ్రన్థివిమోచనాయసుమతిస్సత్త్వంసమాలంబతామ్.

తా॥ బుద్ధిమంతుడగు పురుషుడు, ప్రాణులకు, తల్లి గర్భమున నివాసము-జన్మము-వ్యాధి-విపత్తులు-ముదిమి-మరణము-నరకము మున్నగు వానియందు గలుగు దుఃఖమును బాగుగ పలుమారు లాలోచించి, దోష భూయిష్ఠములగు సకల విషయములందును నాసక్తిని విడిచి, దేహేన్ద్రియ సంఘాతమునందలి యభిమానము విడిపోవుటకొరకై సత్త్వగుణము నవలంబించి చిత్తమును ప్రసన్న మొనరించుకొనవలయును.

శ్లో॥ యమేషు నిరతో యస్తు నియమేషు చ యత్నతః,
వివేకిన స్తస్య చిత్తం ప్రసాద మభిగచ్ఛతి. ౩౬౩

తా॥ ఏ పురుషుడు యుక్తాయుక్త వివేకముగలవాడై అహింసా వ్రతము, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము మున్నగు యమములను, శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ధ్యానము మొదలగు నియమములను నిరన్తర మవలంబించియుండునో అట్టి పురుషుని యొక్క చిత్తము నిర్మలమగుచున్నది.

శ్లో॥ ఆసురీం సంపదం త్యక్త్వా భజే ద్యో దేవసంపదమ్,
మోక్షైక కాంక్షయా నిత్యం తస్య చిత్తం ప్రసీదతి. ౩౬౪

తా॥ ఎవడు కేవలము మోక్షమునే కోరుచున్నవాడై దంభ దర్పాది రూపమగు నా సురసంపదను పరిత్యజించి శమదమాది రూప

మగు దైవసంపద నాశ్రయించి యుండునో అట్టివాని చిత్తము నిర్మలమగును.

శ్లో॥ పరద్రవ్య పరద్రోహ పరనిందా పరస్త్రియః,
నాలంబతే యస్య చిత్తం తస్య చిత్తం ప్రసీదతి. 3౬౫

తా॥ ఎవని చిత్తము, పరద్రవ్యమును, పరద్రోహమును, పరనిందను. పరకాంతలను గోరకుండునో వాని చిత్తము పరిశుద్ధ మగుచున్నది.

శ్లో॥ ఆత్మవ త్సర్వభూతేషు య స్సమత్వేన పశ్యతి,
సుఖం దుఃఖం వివేకేన తస్య చిత్తం ప్రసీదతి. 3౬౬

తా॥ ఏ పురుషుడు యోగ్యమగు బుద్ధితో సకల జీవుల యందలి సుఖదుఃఖములను తనసుఖదుఃఖములతో సమానముగా భావించుచుండునో ఆ పురుషుని చిత్తము ప్రశాన్తి నొందుచున్నది.

శ్లో॥ అత్యంతం శ్రద్ధయా భక్త్యా గురు మీశ్వర మాత్మని,
యో భజ త్యనిశం క్షాన్త స్తస్య చిత్తం ప్రసీదతి. 3౬౭

తా॥ ఏ మానవుడు నిరంతరము శ్రద్ధాభక్తులతో సర్వదుఃఖములను సహించుచు తన చిత్తమున గురుపరమేశ్వరులను ధ్యానించుచుండునో అట్టివాని చిత్తము ప్రసన్నమగుచున్నది.

శ్లో॥ శిష్టాన్న మీశార్చన మార్యసేవామ్
తీర్థాటనం స్వాశ్రమధర్మనిష్ఠామ్,
యమానుసక్తిం నియమానువృత్తిమ్
చిత్తప్రసాదాయ వదన్తి తద్జ్ఞాః. 3౬౮

తా॥ ప్రతిదినమందును దేవయజ్ఞము మొదలగు పంచయజ్ఞముల నాచరించి తచ్ఛిష్టమగు నాహారమును భుజించుటయును. ఈశ్వరారాధన

యును, పెద్దలను సేవించుటయును, పుణ్యతీర్థముల సేవించుటయు, వర్ణాశ్రమధర్మముల నాచరించుచుండుటయును, యమనియమముల నవలంబించుటయును మున్నగు నవన్నియు చిత్తశుద్ధికి సాధనములగుచున్నవని శాస్త్రవేత్తలగు మహానుభావులు చెప్పుచున్నారు. కావున మూముక్షు జనులందఱును పైని చెప్పబడిన కార్యముల నాచరించుచున్నచో త్వరలో చిత్తశాన్తి నొందగలరు.

శ్లో॥ కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్ష విదాహినామ్,
పూతిపర్యుషితాదీనాం త్యాగః సత్త్వాయ కల్పతే. ౩౯౯

తా॥ చేదు, పులుపు, ఉప్పు, కారము మున్నగునవి అధికముగాగల పదార్థములను పాకానంతరము చిరకాలము నిలువయున్న పదార్థములను, దుర్గంధపదార్థములను, పరిత్యజించి యోగ్యములగు రసయుక్తపదార్థములను చవిగల పదార్థములను స్వీకరించుచున్న యెడల సత్త్వగుణ మభివృద్ధినొందును.

శ్లో॥ శ్రుత్యాః తత్త్వ పురాణానాం సేవయా సత్త్వవస్తునః,
అనువృత్త్యా చ సాధూనాం సత్త్వవృద్ధిః ప్రజాయతే.

తా॥ స్వాధ్యాయాధ్యయనము వలనను, పరమాత్మ తత్త్వమును బోధించు పురాణముల యందలి విషయముల ననుసంధానముచేసికొనుచుండుట వలనను, సాత్త్వికాహారములను భుజించుచుండుట వలనను, రాగద్వేషవర్జితులై జితేన్ద్రియులగు మహానుభావుల పాదసేవ చేయుట వలనను బాగుగా సత్త్వగుణ మభివృద్ధి నొందును.

శ్లో॥ యస్య చిత్తం నిర్విషయం హృదయం యస్య శీతలమ్,
తస్య మిత్రం జగత్సర్వం తస్య ముక్తిః కరస్థితా. ౩౭౦

తా॥ ఎవ్వనికి ఏ విధమైన కోరికలును లేవో, ఎవ్వని చిత్తము రాగద్వేషాది రహితమై నిర్మలముగా నుండునో వానికి సకల జగంబును మిత్రభావమున నుండును. అట్టివాడు సులభముగా ముక్తిని పొందగలడు.

శ్లో॥ హిత పరిమిత భోజీ నిత్య మేకాంతసేవీ
సకృదుచితహితోక్తిః స్వల్పనిద్రావిహారః,
అనునియమనశీలో యో భవత్యుక్తకాలే
స లభత ఇహ శీఘ్రం సాధుచిత్తప్రసాదమ్. 322

తా॥ సత్త్వగుణమును, ఆరోగ్యమును వృద్ధిపొందించు నట్టి యాహారమును మితముగా భుజించువాడును, విజనప్రదేశమున నొంటిగా నుండు వాడును, పరహితకరములగు వాక్యములను మితముగామాటలాడు వాడును, నియతములగు నిద్రావిహారములు గలవాడును, (నియతమగు నిద్రయనగా, రాత్రి 10 గంటలనుండి తెల్లవారు జామున 4 గంటలవరకు నిద్రించి పగలు నిద్రింపకుండుట) (నియత విహారమన దినమునకు 8 మైళ్ళకన్న ఎక్కువ నడువకుండుట) యోగశాస్త్ర నియమముల ననుసరించి ప్రాణాయామము నాచరించువాడును నగు మానవుడు శీఘ్ర కాలముననే చిత్తశుద్ధిని పొందగలడు.

శ్లో॥ చిత్తప్రసాదేన వినాఽవగన్తుమ్
బద్ధో నశక్నోతి పరాత్మతత్త్వమ్,
తత్త్వాఽవగత్యా తు వినా విముక్తిః
న సిధ్యతి బ్రహ్మసహస్రకోటిషు. 323

తా॥ మానవుడు చిత్తశుద్ధిలేక, పరమాత్మ స్వరూపమును తెలిసికొననేరడు. పరమాత్మ స్వరూపము తెలియంగక వేయికోట్ల కల్పములకైనను ముక్తి సిద్ధింపనేరదు.

శ్లో॥ మనోఽప్రసాదః పురుషస్యబన్ధః
మనః ప్రసాదః భవబన్ధముక్తిః,
మనః ప్రసాదాఽధిగమాయ తస్మాత్
మనోనిరాసం విదధీత విద్వాన్. 324

తా॥ పలుమాటలేల? చిత్తము రాగద్వేషములచే కలుషితమగు నప్పుడు సంసారబన్ధ మేర్పడుననియును, శమదమాదులచే పరిశుద్ధమగు నప్పుడు సహజమగు ముక్తి వ్యక్తమగుననియును సర్వవేదాన్తసిద్ధాన్తము. కావున ముముక్షుజనులు మనోదోషముల నన్నిటిని నివర్తింప జేసికొనుటకై సర్వవిధముల యత్నింపవలయును.

శ్లో॥ పంచానామేవ భూతానాం
రజోంఽశేభ్యో ఽభవన్ క్రమాత్,
వాక్పాణిపాదపాయూప
స్థాని, కర్మేన్ద్రియాణ్యను. 325

తా॥ ఆకాశము మున్నగు పంచసూక్ష్మభూతములయొక్క వ్యష్టిగతములగు రజోగుణాంశములనుండి క్రమముగా వాక్పాణిపాదపాయూపస్థలను నైదును కర్మేన్ద్రియములు జన్మించినవి.

శ్లో॥ సమస్తేభ్యోరజోఽంశేభ్యోవ్యోమాదీనాంక్రియాత్మకాః,
ప్రాణాదయ స్సముత్పన్నాః పంచాఽప్యన్తరవాయవః.

తా॥ ఆకాశాది పంచసూక్ష్మ భూతములయొక్క రజోగుణ భాగముల సమష్టి నుండి "ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము" అను నైదు వాయువులు జన్మించినవి. ఇవి శరీరములోపల సంచరించు స్వభావము గలవి.

శ్లో॥ ప్రాణః ప్రాగ్గమనేన స్యాత్ అపానోఽ వాగ్గమనేన చ,
వ్యానస్తు విష్వగ్గమనాత్ ఉత్క్రాన్త్యా దాన ఇష్యతే.

శ్లో॥ అశితాన్నరసాదీనాం సమీకరణధర్మతః,
సమాన ఇత్యభిప్రేతో వాయు ర్య స్తేషు పంచమః.

తా॥ శరీరమునందు హృదయమునకు పైభాగమున సంచరించు నది ప్రాణవాయువు. క్రిందిభాగమున సంచరించునది అపానవాయువు. శరీరమందలి సమస్త నాడులయందును సంచరించునది వ్యానవాయువు. నాభిదేశముననుండి, భుజింపబడిన పదార్థముల సారమును సప్తధాతువులనుగా పరిణమింపజేయునది సమానవాయువు. కంఠదేశమున నుండునది ఉదానవాయువు. ఇది మరణకాలమునందు ప్రాణేన్ద్రియాదులను శరీరము నుండి ఉత్క్రమింపజేయును. ఈ సంగతి యంతయు ప్రశ్నోపనిషత్తు నందు బాగుగా బోధింపబడినది.

శ్లో॥ క్రియైవ దృశ్యతే ప్రాయః ప్రాణకర్మేన్ద్రియేష్వలమ్,
తతస్తేషాం రజోఽంశేభ్యో జనిరంగీకృతా బుధైః. 329

శ్లో॥ రాజసీంతు క్రియాశక్తిం తమశ్శక్తిం జడాత్మికామ్,
ప్రకాశరూపిణీం సత్త్వశక్తిం ప్రాహు ర్మనీషిణః. 330

తా॥ ప్రాణము మున్నగు పంచవాయువుల యందును వాక్కు మున్నగు పంచకర్మేన్ద్రియముల యందును చలనక్రియయే విశేషముగా కనబడుచున్నది. కావున నవి యన్నియు పంచసూక్ష్మభూతములయొక్క రజోగుణభాగములవలననే యుత్పన్నములైనవని నిర్ధారణచేయుచున్నారు. మరియు వ్యాసాది మహర్షులు రజస్సత్త్వతమోగుణముల స్వరూపమును పరిశీలించి, రజోగుణము క్రియాశక్తి ప్రధానమై చలనాదిక్రియలనుకలిగించు ననియు, సత్త్వగుణము జ్ఞానశక్తి ప్రధానమై సుఖము, ప్రకాశము

మున్నగు వానిని కలిగించు ననియు, తమోగుణము జడశక్తి ప్రధానమై ఆలస్యము, నిద్ర, మాంద్యము, ప్రమాదము మున్నగు వానిని కలిగించు ననియు చెప్పుచున్నారు. కావున ప్రాణవాయువులును, కర్మేంద్రియము లును రజోగుణ జన్యము లనుట నిర్వివాదము.

శ్లో॥ ఏతే ప్రాణాదయః పంచ పంచ కర్మేంద్రియై స్సహ,
భవే త్ప్రాణమయః కోశః స్థూలో యేనైవ చేష్టతే. ౩౮౧

తా॥ పూర్వమందు చెప్పబడిన పంచప్రాణవాయువులును, పంచ కర్మేంద్రియములును కలిసి ప్రాణమయకోశమనబడుచున్నది. ఈ ప్రాణ మయకోశము చేతనే, స్థూలశరీరము (అన్నమయకోశము) పనిచేయుచున్నది.

శ్లో॥ య ద్య న్నిష్పాద్యతే కర్మ పుణ్యం వా పాప మేవవా,
వాగాదిభిశ్చ వపుషా తత్ప్రాణమయకర్తృకమ్. ౩౮౨

తా॥ శరీరముచేతను, జ్ఞానకర్మేంద్రియములచేతను ఏ యే పుణ్య పాపకర్మములు చేయబడుచున్నవో వాని కన్నిటికిని ప్రాణమయకోశమే ప్రవర్తకమగుచున్నది.

శ్లో॥ వాయునోచ్చాలితో వృక్షో నానారూపేణ చేష్టతే,
తస్మి న్వినిశ్చలే సోఽపి నిశ్చల స్స్యా ద్యథా తథా. ౩౮౩

శ్లో॥ ప్రాణకర్మేంద్రియై ర్దేహః ప్రేర్యమాణః ప్రవర్తతే,
నానాక్రియాసు సర్వత్ర విహితాఽవిహితాదిషు. ౩౮౪

తా॥ వృక్షము గాలిచే కదల్పబడి యనేక విధముల కదలును. ఆ గాలి కదలకున్న తానును కదలకుండును. అట్లే దేహము, ప్రాణ వాయువుల చేతను, కర్మేంద్రియములచేతను ప్రేరేపించబడుచు పలువిధ ములగు విధినిషేధ కార్యములయందు ప్రవర్తించును. ప్రాణ కర్మేంద్రియ

ములు నిరుద్ధములగు కాలమున (అనగా సమాధి దశయందు) దేహమును నిశ్చలమగుచుండును.

శ్లో॥ కోశత్రయం మిళితైత్వేత ద్వపుస్స్యా త్సూక్ష్మమాత్మనః,
అతిసూక్ష్మతయా లీన స్యాత్మనో గమకత్వతః. ౩౮౫

శ్లో॥ లింగమి త్యుచ్యతే స్థూలాపేక్షయా సూక్ష్మ మిష్యతే,
సర్వం లింగవపు ర్జ్ఞాత మేకధీవిషయత్వతః. ౩౮౬

తా॥ పూర్వమందు చెప్పబడిన ప్రాణమయ మనోమయ విజ్ఞానమయకోశములు మూడును కలిసి జీవాత్మకు లింగ శరీర మగుచున్నది. ఇయ్యది బుద్ధిగుహాయందు గూఢముగనున్న ఆత్మస్వరూపమును సూచించునదగుటచే లింగశరీరమనియు, స్థూలదేహము నపేక్షించి సూక్ష్మమగుటచే సూక్ష్మశరీరమనియు ప్రసిద్ధి కెక్కినది. మఱియు ప్రాణమయ మనోమయ విజ్ఞానమయకోశములు మూడును కలిసి బుద్ధియందు ఏకరూపమున భాసించునదగుటచే నీమూటికిని కలిపి లింగశరీరమని పేరు కల్గినది.

శ్లో॥ సమష్టి స్స్యా త్తరుగణః సామాన్యేన వనం యథా,
ఏత త్సమష్ట్యుపహితం చైతన్యం సకలం విభు,
హిరణ్యగర్భ స్సూత్రాత్మా ప్రాణ ఇత్యపి పండితాః.

తా॥ పలురకములగు వృక్షములయొక్క సముదాయము 'వనము'ని వ్యవహరింపబడునట్లుగా, లింగశరీరము లన్నిటితోడను గూడుకొనిన చైతన్యము హిరణ్యగర్భుడనియు, "సూత్రాత్మ" యనియు, "ప్రాణము"నియు శాస్త్రములయందు వ్యవహరింపబడు చున్నది.

శ్లో॥ హిరణ్మయే బుద్ధిగర్భే ప్రచకాస్తి హిరణ్యవత్,
హిరణ్యగర్భ ఇత్యస్య వ్యపదేశ స్తతో మతః. ౩౮౮

శ్లో॥ సమస్తలింగదేహేషు సూత్రవ న్మణిపంక్తిషు,
వ్యాప్య స్థితత్వాత్సూత్రాత్మా ప్రాణనాత్ప్రాణఉచ్యతే.

తా॥ ప్రకాశరూపమగు బుద్ధిగర్భంబున ప్రతిబింబరూపముచే బంగారమువలె ప్రకాశించుచున్నవాడు గావున 'హిరణ్యగర్భ' డనియు, మణిహారములందు దారమువలె సకల లింగశరీరము లందును సూక్ష్మరూపమున వ్యాపించియున్నవాడు గావున 'సూత్రాత్మ' యనియు, లింగశరీరముల నన్నిటిని వాని వాని యందుగల సంస్కారముల ననుసరించి యాయా కార్యములందు ప్రవర్తింపజేయుచున్నాడు గాన ప్రాణమనియు నీ సమష్టి లింగ శరీరాభిమాని వ్యవహరింపబడుచున్నాడు.

శ్లో॥ నైకధీవిషయత్వేన లింగం వ్యష్టి ర్భవత్యథ,
యదేత ద్వ్యష్ట్యుపహితం చిదాభాససమన్వితమ్. ౩౯౦

శ్లో॥ చైతన్యం తైజస ఇతి నిగద న్తి మనీషిణః,
తేజోమయాన్తఃకరణోపాధిత్వేనైవ తైజసః. ౩౯౧

తా॥ సమస్త లింగదేహములందును నభిమానముగల చైతన్యము, హిరణ్యగర్భాది నామములచే పూర్వము వర్ణింపబడినది. లింగ శరీరములనేకము లగుటచే నొక్కొక్క లింగశరీరమునకు ప్రత్యేకముగా వ్యష్టి లింగశరీర మనిపేరు. ఇట్టి వ్యష్టిలింగ శరీరముతో గూడుకొనినదై యందు ప్రతిఫలించిన చైతన్యము తైజసు డనబడుచున్నది. అనగా వ్యష్టిలింగ శరీరాభిమానియగు పురుషుడు, తేజస్సువలె స్వచ్ఛమగు అన్తఃకరణము ఉపాధిగాగలవాడగుటచే తైజసు డనబడుచున్నాడనిభావము.

శ్లో॥ స్థూలాత్సూక్ష్మతయా వ్యష్టే
రస్యాః సూక్ష్మవపు ర్మతమ్,

అస్య జాగరసంస్కార
మయత్వా ద్వపు రుచ్యతే. ౩౨౭

తా॥ ఈ లింగశరీరము స్థూలశరీరముకంటె సూక్ష్మమైనది గాన సూక్ష్మమనియును, జాగ్రదవస్థయందలి అనుభవము వలన గలిగిన సంస్కారములే స్వరూపముగా గలది గాన శరీరమనియు చెప్పబడు చున్నది. లింగశరీరమునకు స్థూలావయవములు లేకున్నను ప్రాతిభాసికావయవములు కలవు కాన శరీర మనెడి వ్యవహారముపపన్నమగుచున్నది.

శ్లో॥ స్వప్నే జాగరకాలీన వాసనాపరికల్పితాన్,
తైజసో విషయాన్ భుంక్తే సూక్ష్మార్థాన్ సూక్ష్మవృత్తిభిః.

తా॥ వ్యష్టిలింగ శరీరాభిమాని యగు తైజసుడు స్వప్నావస్థయందు జాగ్రదవస్థ యందలి గృహారామా ద్యనుభవములయొక్క సంస్కారములచే కల్పితములగు సూక్ష్మపదార్థ విషయములను సూక్ష్మములగు మనో వృత్తులచే ననుభవించుచున్నాడు.

శ్లో॥ సమష్టే రపిచ వ్యష్టేః సామాన్యేనైవ పూర్వవత్,
అభేదఏవ జ్ఞాతవ్యః జాత్యైకత్వే కుతోభిదా. ౩౨౮

తా॥ పూర్వము 325+326 శ్లోకములలో, ఈశ్వరోపాధియగు సమష్ట్యజ్ఞానమునకును, జీవోపాధియగు వ్యష్ట్యజ్ఞానమునకును, వనవృక్షన్యాయముచే భేదములేదని చెప్పబడినది. అటులనే ప్రకృతమందును సమష్టిలింగ శరీరమునకును, వ్యష్ట్యలింగశరీరమునకును సమాన ధర్మములనేకము లుండుటచే నభేదము నెఱుంగ వలయును. జాతియొక్కటియగు నప్పుడు భేదముండ నేరదుగదా?

శ్లో॥ ద్వయో రుపాధ్యో రేకత్వే తయో రప్య భిమానినోః,
సూత్రాత్మన స్తైజసస్య హ్యభేదః పూర్వవన్మతః. ౩౨౯

తా॥ సమష్టి వ్యష్టి జ్ఞానములు రెండును నొకటి యగుటచేత తదభిమానులగు ఈశ్వర ప్రాజ్ఞు లిరువురకును నభేదమని పూర్వము వర్ణింపబడినది. (323 శ్లోకములో,) అటులనే సమష్టిసూక్ష్మశరీర, వ్యష్టిసూక్ష్మశరీరములు రెండును నభిన్నములగుటచే తదభిమానులగు హిరణ్యగర్భ తైజసుల కుభయులకును భేదము లేదని శాస్త్రములందు నిశ్చయింపబడినది.

శ్లో॥ ఏవం సూక్ష్మప్రపంచస్య ప్రకార శ్శాస్త్రసమ్మతః,
అథ స్థూలప్రపంచస్య ప్రకారః కథ్యతే శ్రుణు. 326

తా॥ ఇట్లు సూక్ష్మప్రపంచముయొక్క స్వరూపము నిరూపింపబడినది. ఇక స్థూలప్రపంచముయొక్క స్వరూపము వర్ణింపబడుచున్నది గాన శ్రద్ధతో వినవలయును.

శ్లో॥ తాన్యేవ సూక్ష్మభూతాని వ్యోమాదీని పరస్పరమ్,
పంచీకృతాని స్థూలాని భవన్తి శ్రుణు తత్క్రమమ్.

తా॥ పూర్వమందు చెప్పబడిన ఆకాశాదిపంచసూక్ష్మభూతము లేపరస్పరము పంచీకరణము చేయబడినవై స్థూలభూతములగుచున్నవి. ఆ పంచీకరణపద్ధతిని వినుము. భూతముల పంచీకరణక్రమము రాబోవు శ్లోకములలో వివరింపబడుచున్నది.

శ్లో॥ ఖాదీనాం భూత మేకైకం సమమేవ ద్విధాద్విధా,
విభజ్య భాగం తత్రాద్యం త్యక్త్వా భాగంద్వితీయకమ్.
శ్లో॥ చతుర్ధా సువిభజ్యాథ త మేకైకం వినిక్షిపేత్,
చతుర్ణాం ప్రథమే భాగే క్రమేణ స్వార్థ మంతరా. 328

తా॥ ఆకాశము మున్నగు నైదు భూతములలో నొక్కొక్క భూతమును రెండు సమభాగములుగా చేయవలయును. అందు మొదటి భాగమును నొకచోటనుంచి రెండవ భాగమును మరల నాలుగుభాగములుగా

జేయవలయును. ఈ నాల్గుభాగములను తమతమ ప్రథమార్థభాగములను విడిచి ఇతర భూతములయొక్క మొదటి యర్థభాగములలో నొక్కొక్కటిగా జేర్పవలయును. ఇట్లు చేయగా సూక్ష్మభూతములైదును పంచీకృతములగును.

శ్లో॥ తతో వ్యోమాది భూతానాం భాగాః పంచ భవన్తి తే,
స్వ స్వార్థభాగే నాన్యేభ్యః ప్రాప్తం భాగచతుష్టయమ్.
సంయోజ్య స్థూలతాంయాన్తివ్యోమాదీనియథాక్రమమ్.

తా॥ ఆకాశాది భూతములయొక్క ప్రథమార్థభాగములైదును ఇతర భూతములయొక్క ద్వితీయార్థ భాగములలోని నాల్గవ భాగములతో కూడుకొనినవై స్థూల స్వరూపమును చెందుచున్నవి. ఇవియె స్థూల భూతములనియు, పంచమహాభూతములనియు ననబడుచున్నవి.

శ్లో॥ అనేనోద్భూతగుణకం భూతం వక్ష్యే ఽవధారయ. ౨౦౧
శబ్దైకగుణ ఆకాశః శబ్దస్పర్శగుణోఽనిలః,
తేజశ్శబ్దస్పర్శరూపైః గుణవత్కారణం క్రమాత్. ౨౦౨
ఆపశ్చతుర్గుణాశ్శబ్దస్పర్శరూపరసైః క్రమాత్,
ఏభిశ్చతుర్భిర్గంధేన సహాపంచగుణామహీ. ౨౦౩

తా॥ పంచీకరణముచే భూతములకు గలిగిన గుణము లెవ్వియన, ఆకాశమునకు శబ్దమును, వాయువునకు శబ్దస్పర్శములను రెండు గుణములును, తేజస్సునకు శబ్దస్పర్శరూపములను మూడు గుణములును, జలమునకు శబ్దస్పర్శరూపరసములను నాల్గు గుణములును భూమికి శబ్దస్పర్శరూపరస గంధములను నైదు గుణములును నగుచున్నవి.

శ్లో॥ ఆకాశాంశతయా శ్రోత్రం శబ్దం గృహ్ణాతి తద్గుణమ్,
త్వఙ్మారుతాం శకతయా స్పర్శం గృహ్ణాతి తద్గుణమ్. ౨౦౪

తేజోఽంశకతయా చక్షూ రూపం గృహ్ణాతి తద్గుణమ్,
అబంశకతయా జిహ్వా రసం గృహ్ణాతి తద్గుణమ్,
భూమ్యంశకతయాఘ్రాణం గంధం గృహ్ణాతి తద్గుణమ్.

తా॥ వెనక 341 వ శ్లోకమునందు శ్రోత్రాదిజ్ఞానేంద్రియము లైదును ఆకాశాది పంచభూతములయొక్క సాత్త్వికభాగముల వలన నుత్పన్నములైనవని చెప్పబడినది. కావుననే శ్రోత్రేంద్రియము ఆకాశము యొక్క సాత్త్వికభాగమువలన పుట్టినదగుటచే నాకాశగుణమగు శబ్దమును గ్రహించుచున్నది. అటులనే త్వగిన్ద్రియము వాయ్వంశ జాతమగుటచే వాయుగుణమగు స్పర్శమును గ్రహించుచున్నది. నేత్రేన్ద్రియము తేజస్సుయొక్క సాత్త్వికాంశమువలనపుట్టినదగుటచేతేజోగుణమగు రూపమును గ్రహించుచున్నది. రసనేన్ద్రియము జలాంశ జాతమగుటచే జలగుణమగు రసమును గ్రహించుచున్నది. ఘ్రాణేన్ద్రియము భూమియొక్క సాత్త్వికాంశమువలన పుట్టినదగుటచే భూమిగుణమగు గంధమును గ్రహించుచున్నది.

శ్లో॥ కరోతి ఖాంశకతయా వాక్ శబ్దోచ్చారణక్రియామ్.
వాయ్వంశకతయా పాదా గమనాదిక్రియా పరౌ,
తేజోఽంశకతయా వాణీ వహ్న్యాద్యర్చనతత్పరౌ. ౪౦౭
జలాంశకతయో పస్థో రేతోమూత్రవిసర్గకృత్,
భూమ్యంశకతయా పాయుః కఠినం మల ముత్సృజేత్.

తా॥ పూర్వము ప్రాణమయకోశమును నిరూపించు సమయమున 375 వ శ్లోకమునందు వాగాది కర్మేన్ద్రియము లైదును ఆకాశాది పంచభూతములయొక్క రజోగుణ భాగములవలన నుత్పన్నములైన వని వర్ణింపబడినది. అందువలననే వాగింద్రియము ఆకాశముయొక్క రజోగుణ భాగమువలన పుట్టిన దగుటచే నాకాశ గుణమగు శబ్దము నుచ్చరించు

చున్నది. పాదములు వాయువుయొక్క రజోగుణ భాగమువలన నుత్పన్నములైన వగుటచే గమనాగమనాది కార్యముల నొనరించుచున్నవి. హస్తములు తేజస్సుయొక్క రజోగుణభాగమువలన పుట్టిన వగుటచే నగ్న్యాది దేవతల నారాధించుచున్నవి. ఉపస్థేన్ద్రియము జలముయొక్క రజోగుణ భాగమువలన పుట్టినదగుటచే రేతోమూత్రముల విడుచుచున్నది. పాయ్వింద్రియము భూమియొక్క రజోగుణభాగజాతమగుటచే మలమును విసర్జించుచున్నది.

శ్లో॥ శ్రోత్రస్య దైవతం దిక్స్యాత్ త్వచో వాయు ర్దృశోరవిః,
జిహ్వాయా వరుణో దైవం ఘ్రాణస్య త్వశ్వినావుభౌ.

శ్లో॥ వాచోఽగ్ని ర్హస్తయో రిన్ద్రః పాదయోస్తు త్రివిక్రమః,
పాయోర్మృత్యు రుపస్థస్య త్వధిదైవం ప్రజాపతిః. ౪౧౧

శ్లో॥ మనసో దైవతం చన్ద్రో బుద్ధే ర్దైవం బృహస్పతిః,
రుద్ర స్త్వహంకృతే ర్దైవం క్షేత్రజ్ఞ శ్చిత్తదైవతమ్. ౪౧౨

తా॥ శ్రోత్రమునకు దిక్కును, చర్మమునకు వాయువును, నేత్రమునకు సూర్యుడును, నాలుకకు వరుణుండును, నాసికకు అశ్వినులును, వాక్కునకు నగ్నియు, హస్తములకు ఇన్ద్రుండును, పాదములకు త్రివిక్రముండును, పాయువునకు మృత్యువును, ఉపస్థమునకు ప్రజాపతియు, మనస్సునకు చంద్రుండును, బుద్ధికి బృహస్పతియు, అహంకారమునకు రుద్రుండును, చిత్తమునకు క్షేత్రజ్ఞుండును, క్రమముగా నధిదైవతములగుచున్నారు.

శ్లో॥ దిగాద్యా దేవతా స్సర్వాః ఖాదిసత్త్వాంశసంభవాః,
సంధితా ఇన్ద్రియస్థానే ష్విన్ద్రియాణి సమంతతః. ౪౧౩
నిగృహ్ణాన్త్యనుగృహ్ణన్తి ప్రాణి కర్మానురూపతః,

తా॥ ఆకాశాది పంచభూతముల యొక్క సాత్త్వికభాగముల వలన పుట్టిన దిగాది దేవతలందఱును పరమేశ్వరునిచే నాయా యిన్ద్రియ స్థానములందు పరిపాలకులుగా నియమింపబడినవారై జీవుల యొక్క పూర్వకర్మముల ననుసరించి నిగ్రహానుగ్రహముల నొనరించుచున్నారు. అనగా పాప ప్రాబల్యమున్నచో నాయా ఇన్ద్రియ సామర్థ్యమును ప్రతిబన్ధించుచుందురు. పుణ్యాతిశయమువలన నాయా యిన్ద్రియములకు సామర్థ్యాతిశయమును కలిగించుచుందురని భావము.

శ్లో॥ శరీరకరణగ్రామ ప్రాణాహ మధిదైవతమ్,
పంచైతే హేతవ ప్రోక్తాఃనిష్పత్తౌ సర్వకర్మణామ్. ౪౧౩

తా॥ శరీరము – జ్ఞానేన్ద్రియకర్మేంద్రియములు – పంచప్రాణములు – ఆదిత్యుడు మున్నగు నిన్ద్రియాధిష్ఠానదైవతములు – అహంకారము అను నీ యైదును పుణ్య పాప కర్మాచరణమునకు సాధనము లగుచున్నవి. *

శ్లో॥ కర్మానురూపేణ గుణోద్గమో భవేత్
గుణానురూపేణ మనఃప్రవృత్తిః,
మనోఽనుగై స్తై రుభయాత్మకేన్ద్రియైః
నివర్త్యతే పుణ్య మపుణ్య మత్ర. ౪౧౪

---

* శ్లో॥ పంచేమాని మహాబాహో కారణాని నిబోధ మే,
సాంఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్.
శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్,
వివిధాశ్చ పృథక్చేష్టాః దైవంచైవాత్ర పంచమమ్.
శ్లో॥ శరీరవాఙ్మనోభి ర్యత్కర్మ ప్రారభతే నరః,
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః.
—భగవద్గీత. 18–అ

తా॥ జీవులయొక్క జన్మాన్తర కర్మముల ననుసరించి సత్త్వరజ స్తమోగుణము లుదయించును. ఆయా గుణముల కనురూపముగా మనోవృత్తు లేర్పడుచుండును. మనోవృత్తుల ననుసరించి ప్రవర్తించు స్వభావముగల జ్ఞాన కర్మేంద్రియములచే పుణ్యపాప కర్మము లాచరింపబడు చున్నవి.

శ్లో॥ కరోతి విజ్ఞానమయోఽభిమానమ్
కర్తాఽహమేవేతి తదాత్మనా స్థితః,
ఆత్మా తు కించి న్నకరోతి సాక్షీ
నకారయత్యేవ తటస్థవ త్సదా. ౪౧౫

తా॥ విజ్ఞానమయ కోశాభిమానియగు జీవుడు దేహేన్ద్రియ సంఘాతముతో తాదాత్మ్యము నొందినవాడై ప్రపంచ వ్యవహారములందు కర్తయగుచున్నాడు. ఆత్మచైతన్యము మాత్రము సాక్షిరూపమై ఉదాసీనునివలెనే వ్యవహారమునకును కర్తగాని, ప్రేరకముగాని గాకున్నది.

శ్లో॥ ద్రష్టా శ్రోతా వక్తా కర్తా భోక్తా భవత్యహంకారః,
స్వయమేతద్వికృతీనాం సాక్షీ నిర్లేపఏవాత్మా. ౪౧౬

తా॥ అహంకారము ఆయా యిన్ద్రియములతో తాదాత్మ్యము నొంది చూచునదియు, వినునదియు, మాటలాడునదియు స్పృశించునదియు నగుచు, సర్వవ్యవహారములకును కర్తయై కర్మఫలముల ననుభవించుచున్నది. ఇక నాత్మయన్ననో సర్వవికారములకును సాక్షిరూపుడై దేనియందును సంగము నొందకున్నాడు.

శ్లో॥ ఆత్మన స్సాక్షిమాత్రత్వం నకర్తృత్వం నభోక్తృతా,
రవివ త్ప్రాణిభి ర్లోకే క్రియమాణేషు కర్మసు. ౪౧౭

తా॥ లోకమున సకల ప్రాణులును తమతమ పనులను నిర్వర్తించుకొనుచుండగా సూర్యుడు సాక్షిమాత్రుడై చూచుచుండునేగాని తాను

(కర్మలను) చేయువాడుగాని వాని ఫలముల ననుభవించువాడుగాని కాకున్నాడు. అటులనే పరమాత్మయు, లోకవ్యవహారములందు సాక్షిమాత్రుడై కర్తృత్వభోక్తృత్వ వర్జితుడగుచున్నాడు.

శ్లో॥ నహ్యార్కః కురుతే కర్మ నకారయతి జంతవః,
స్వస్వభావానురోధేన వర్తన్తే స్వస్వకర్మసు.
తథైవ ప్రత్యగాత్మాపి రవివ న్నిష్క్రియాత్మనా
ఉదాసీనతయా వాస్తే దేహాదీనాం ప్రవృత్తిషు. ౭౧౫

తా॥ సూర్యుడుస్వయముగానే పనియు నేమియు చేయడు. ఇతరులను పనిచేయ ప్రేరేపింపడు మరేమనిన జీవులు తమతమ పూర్వజన్మములందలి సంస్కారముల ననుసరించి వారివారి కార్యముల నాచరించుకొనుచున్నారు. ఇంతియేకాని జీవులుచేయు పనులందు సూర్యునకెంతమాత్రము(ను) సంగములేదు. అటులనే ప్రత్యగాత్మయు, సూర్యునివలె నిష్క్రియుడై దేహేంద్రియా మనఃప్రాణ కార్యములందు సంగరహితుడగుచున్నాడు.

శ్లో॥ అజ్ఞాత్వైవం పరం తత్త్వం మాయామోహితచేతసః,
స్వాత్మ న్యారోపయ న్త్యేత త్కర్తృత్వా ద్యన్యగోచరమ్.

తా॥ ఈ విధమగు పరమ యాథార్థ్యమును గ్రహింపనేరనివారై మాయామోహితులగు మూఢజనులు, దేహము, ఇన్ద్రియములు, మనస్సు, ప్రాణములు మున్నగువానికి సంబన్ధించిన కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములను నిర్వికారములగు నాత్మయందు ఆరోపించుచున్నారు.

శ్లో॥ ఆత్మస్వరూప మవిచార్య విమూఢబుద్ధిః
ఆరోపయ త్యఖిలమేత దనాత్మకార్యమ్,

స్వాత్మన్యసంగచితి నిష్క్రియవేవ చన్ద్రే
దూరస్థ మేఘకృతధావనవత్ భ్రమేణ. ౪౨౦

తా॥ బాలురు, మేఘములు పరుగిడుచుండగా చంద్రుడు పరుగిడుచున్నాడని పొరబడుచుందురు. అటులనే మూఢజనులందరును దేహేంద్రియాదులయొక్క కార్యముల నన్నిటిని జ్ఞానరూపమై సర్వసంగవర్జితమై నిష్క్రియమగు నాత్మస్వరూపమునం దారోపించుచున్నారు.

శ్లో॥ ఆత్మానాత్మవివేకం స్ఫుటతర మగ్రే నివేదయిష్యామః,
ఇమమాకర్ణయవిద్వన్ జగదుత్పత్తి ప్రకారమావృత్త్యా.

తా॥ పండితుడవగు నోశిష్యరత్నమా? మేము నీకు ఆత్మానాత్మ వివేకమును స్పష్టముగా ముందు వర్ణింపనున్నారము. దానికి పూర్వమున ప్రపంచ సృష్టిక్రమమును మరల బాగుగా నాకర్ణింపుము.

శ్లో॥ పంచీకృతేభ్యః ఖాదిభ్యోభూతేభ్య స్త్వీశితురీశితుః,
సముత్పన్న మిదం స్థూలం బ్రహ్మాండం సచరాచరమ్.

తా॥ పరమేశ్వరుని సంకల్పముచే పంచీకృతములగు పంచమహాభూతములవలన చరాచరాత్మకమగు నీస్థూల ప్రపంచమంతయు నుత్పన్నమాయెను.

శ్లో॥ వ్రీహ్యాద్యోషధయ స్సర్వాః
వాయుతేజోఽంబుభూమయః,
సర్వేషా మప్యభూదన్నం
చతుర్విధశరీరిణామ్. ౪౨౩

తా॥ జరాయుజాది భేదముచే నాలుగు విధములగు సకల జంతువులకును, ధాన్యవిశేషములును, ఓషధివిశేషములును, వాయువు, తేజము, జలము, భూమియు నాహారమగుచున్నవి.

శ్లో॥ కేచిన్మారుతభోజనాః ఖలు పరే చన్ద్రార్క తేజోఽశనాః
కేచిత్తోయకణాశినోఽపరిమితాః కేచిత్తుమృద్భక్షకాః,
కేచిత్పర్ణశిలాతృణాదనపరాః కేచిత్తు మాంసాశినః
కేచిద్వ్రీహియవాన్నభోజనపరాః జీవ న్త్యమీ జన్తవః.

తా॥ బ్రహ్మాండమునందు కొన్ని జంతువులు వాయువును భక్షించునవియు, మరికొన్ని సూర్యచంద్రుల కిరణకాంతులను భుజించునవియు, కొన్ని జలబిందువులను పానము చేయునవియు, మరికొన్ని మృత్తును భక్షించునవియు, కొన్ని యాకులను, గులకరాళ్ళను, గడ్డిని దినునవియు, మరికొన్ని మాంసమును దిననవియు. కొన్ని వ్రీహియవాది ధాన్యముల యన్నమును భుజించునవియునై జీవయాత్రను గడుపుకొనుచున్నవి. ఇది సర్వప్రసిద్ధము.

శ్లో॥ జరాయుజాండజ స్వేదజోద్భిజ్జాఖ్యా శ్చతుర్విధాః,
స్వస్వకర్మానురూపేణ జాతా స్తిష్ఠన్తి జన్తవః. ౪౨౫

తా॥ ప్రాణులు తమ తమ పూర్వజన్మ కర్మానుసారముగా జరాయుజములు అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు అని నాలుగు విధములుగా జన్మించుచున్నవి.

శ్లో॥ యేఽత్రజాతా జరాయుభ్యః తేనరాద్యా జరాయుజాః
అండజాస్తే స్యు రండేభ్యో జాతా యే విహగాదయః.

శ్లో॥ స్వేదా జ్జాతా స్స్వేదజా స్తేయూకాలూతాదయోఽపిచ,
భూమిముద్భిద్య యే జాతా ఉద్భిజ్జా స్తే ద్రుమాదయః.

తా॥ మావివలన బుట్టినట్టి మనుష్యులు, పశువులు మున్నగునవి జరాయుజములనియు, గ్రుడ్డువలన జన్మించునట్టి పక్షులు, సర్పములు

లోనగునవి అండజములనియు, చెమటవలననుత్పన్నములగు పేలు, నల్లులు, దోమలు మున్నగునవి స్వేదజములనియు, భూమిని భేదించుకొని పుట్టునట్టి చెట్లు-తీగలు-పొదలు మున్నగునవి ఉద్భిజ్జములనియు చెప్పబడుచున్నవి.

శ్లో॥ ఇదం స్థూలవపు ర్జాతం భౌతికం చ చతుర్విధమ్,
సామాన్యేన సమష్టిస్స్యా దేకధీవిషయత్వతః. ౪౨౮

తా॥ జరాయుజాది భేదములచే నాలుగు విధములుగానున్న ప్రాణులయొక్క స్థూలశరీర సముదాయమంతయును, సమానధర్మములు గలదై స్థూలశరీర మను నొక్కటిరీతి బుద్ధిలో స్ఫురించుచుండుటచే సమష్టి యగుచున్నది.

శ్లో॥ ఏతత్సమష్ట్యవచ్ఛిన్నం చైతన్యం స్థూలసంయుతమ్,
ప్రాహు ర్వైశ్వానర ఇతి విరాడితిచ వైదికాః .౪౨౯

తా॥ ఈ సకల ప్రాణులయొక్క స్థూలశరీర సముదాయముతో గూడిన చైతన్యమునే వైశ్వానరుడనియు విరాట్టనియు పండితులునుడువుచున్నారు.

శ్లో॥ వైశ్వానరో విశ్వనరే ష్వాత్మత్వే నాభిమానతః,
విరాట్ స్యాత్ వివిధత్వేన స్వయమేవ విరాజనాత్ .

తా॥ ఆత్మచైతన్యము సకలప్రాణి శరీరములందును "నేను, నేన"ను నభిమానముగలదగుటవలన వైశ్వానరుడనియు, స్వయముగానే పలువిధములగు ప్రపంచరూపమున భాసించుచున్నదగుటవలన విరాట్టనియు వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ చతుర్విధం భూతజాతం తత్తజ్జాతివిశేషతః,
నైకధీవిషయత్వేన పూర్వవ ద్వ్యష్టి రిష్యతే. ౪౩౧

తా॥ జరాయుజాది భేదముచే నాలుగు విధములగు జీవకోటి యంతయును స్వగతములగు మనుష్యత్వాది జాతి విశేషములను పురస్కరించుకొని పలువిధములుగా భాసించుచున్నదగుటచే వేఱువేఱుగ (ప్రత్యేకముగా) ఒక్కొక్క వ్యక్తిరూపమున వ్యష్టియను నామముచే వ్యవహరింప బడుచున్నది.

శ్లో॥ సాభాస వ్యష్ట్యుపహితం తత్తాదాత్మ్య ముపాగతమ్,
చైతన్యం విశ్వ ఇత్యాహుః వేదాన్తనయకోవిదాః.౭౩౨

తా॥ చిదాభాస సహితమగు వ్యష్టిస్థూలశరీరముతో గూడుకొనినదై దానియందు 'నేన'ను నభిమానమును పొందియున్న చైతన్యము విశ్వుడను పేర వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ విశ్వో ఽస్మిన్ స్థూలదేహేతు స్వాభిమానేన తిష్ఠతి,
యత స్తతో విశ్వ ఇతి నామ్నా సార్థో భవత్యయమ్.

తా॥ సంస్కృతమునందు విశ్వశబ్దమునకు 'సమస్తము' అని అర్థము. ప్రకృతమున చైతన్యము స్థూలశరీరమునందంతటను (ఆపాదమస్తకము) నేనను నభిమానము గలదియై యుండుటచే నీ చైతన్యమునకు విశ్వుడను నామధేయము సమంజసము (సార్థకము) అగుచున్నది.

శ్లో॥ వ్యష్టి రేషాఽస్య విశ్వస్య భవతి స్థూలవిగ్రహః,
ఉచ్యతేఽన్నవికారత్వాత్కోశోఽన్నమయఇత్యయమ్.

తా॥ కరచరణాది సమేతమగు స్థూలశరీరమే విశ్వునియొక్క వ్యష్టి శరీరమనబడుచున్నది. ఇది అన్నమువలన పుట్టిపెరుగుచున్నదగుటచే నన్నమయ కోశమని వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ దేహోఽయం పితృభుక్తాన్న వికారాచ్ఛుక్రశోణితాత్,
జాతః ప్రవర్ధతేఽ న్నేన తదభావే వినశ్యతి. ౭౩౫

శ్లో॥ తస్మా దన్నవికారిత్వేనాఽయ మన్నమయో మతః,
ఆచ్ఛాదకత్వా దేతస్యాఽప్యసేః కోశవ దాత్మనః. ౪౩౭

తా॥ ఈస్థూలశరీరము తల్లిదండ్రులు భుజించిన అన్నముయొక్క పరిణామములగు శుక్లశోణితముల సంయోగమువలన నుత్పన్నమగుచున్నది. అన్నముచేతనే వృద్ధినొందుచున్నది. అన్నము లేకున్న నశించుచున్నది. ఈ విధమున నన్వయ వ్యతిరేకములచే నన్న ప్రధాన (వికార) మగుటచే నన్నమయ మనియు, ఖడ్గమునకు వొఱవలె నాత్మస్వరూపమున కావరకమైన దగుటచే కోశమనియు నీ దేహము వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ ఆత్మనః స్థూలభోగానా మేత దాయతనం విదుః,
శబ్దాదీఽ విషయాన్ భుఙ్క్తే స్థూలాన్ స్థూలాత్మనిస్థితః,
బహిరాత్మాతతస్థూలభోగాయతన ముచ్యతే. ౪౩౮

తా॥ ఆత్మ స్థూల శరీరమునందుండి, బాహ్యములగు శబ్దాది స్థూల విషయముల ననుభవించుచున్నాడు. గాన ఈ యన్నమయకోశము "స్థూల భోగాయతన" మను నామమున నొప్పుచున్నది.

శ్లో॥ ఇన్ద్రియై రుపనీతానాం శబ్దాదీనా మయం స్వయమ్,
దేహేన్ద్రియమనోయుక్తో భోక్తేత్యాహు ర్మనీషిణః. ౪౩౯

తా॥ జీవాత్మ, దేహము, ఇన్ద్రియములు, మనస్సు మున్నగు ననాత్మ పదార్థములయందు తాదాత్మ్యము నొందియున్నవాడై శ్రోత్రాదీన్ద్రియములచే గ్రహింపబడిన శబ్దాదివిషయముల ననుభవించుచున్నాడు. అందుచే జీవుడు భోక్తయను నామమున వ్యవహరింపబడుచున్నాడు.

శ్లో॥ ఏకో నవద్వారవతీహ దేహే
సౌధే మహారాజ ఇవాత్మవర్తైః,

సంసేవ్యమానో విషయోపభోగాన్
ఉపాధిసంస్థో బుభుజేఽయ మాత్మా. ౪౩౯

తా॥ లోకమున సార్వభౌముడు అనేక ద్వారములు గల మేడ యందు నివసించును. భృత్యులు లోకవ్యవహారము సర్వమును నివేదించుచు పరిచరించుచుందురు. ఆతడపారములగు విషయభోగముల ననుభవించును. అటులనే యాత్మయు రెండు నేత్రగోళకములు, రెండు శ్రోత్రవివరములు, రెండునాసాపుటములు, ముఖము, పాయూపస్థములుఅను తొమ్మిది ద్వారములు (రంధ్రములు) గల దేహమున 'నేను'ను నభిమానము పొంది యున్నవాడై నేత్రము మున్నగు ఇన్ద్రియములచే రూపాది విషయ ప్రదర్శనముల మూలమున సేవింపబడుచు విషయభోగముల ననుభవించుచున్నాడు.

శ్లో॥ జ్ఞానేన్ద్రియాణి నిజదైవతచోదితాని
కర్మేన్ద్రియాణ్యపి తథా మన ఆదికాని,
స్వస్వప్రయోజనవిధౌ నియతాని సన్తి
యత్నేన కింకరజనా ఇవ తం భజన్తే. ౪౪౦

తా॥ జ్ఞానేన్ద్రియ కర్మేన్ద్రియములును, మనోబుద్ధి చిత్తాహంకారములును తమ తమ యధిదైవతములచే ప్రేరేపింపబడుచున్నవై తమ తమ కార్యముల నతిశ్రద్ధతో నాచరించుచు భృత్యులవలె ఆత్మను సేవించుచున్నవి.

శ్లో॥ యత్రోపభుఙ్క్తే విషయాన్ స్థూలాన్ నేష మహామతిః,
అహం మమేతి సైషాఽస్యాఽవస్థా జాగ్రదితీర్యతే. ౪౪౧

తా॥ ఈ యాత్మ (విశ్వుడు) యే యవస్థయందు దేహేన్ద్రియసంఘాతమున నేననియు, భార్యాపుత్రాదులందు "నావి" యనియు నభిమానము గలిగి బహువిషయాసక్తుడై బాహ్యభోగముల ననుభవించుచుండునో ఆ యవస్థ జాగ్రదవస్థయని చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏతత్సమష్టివ్యష్ట్యో శ్చోభయో రప్యభిమానినోః,
తద్విశ్వవైశ్వానరయో రభేదః పూర్వవన్మతః. ౨౨౧

తా॥ పూర్వము 325 వ శ్లోకమున వర్ణింపబడిన వనవృక్షన్యాయము చొప్పున. వ్యష్టిసమష్టిస్థూలశరీరములకును, తదభిమానవంతులగు విశ్వవైశ్వానరులకును భేదమెంతమాత్రము లేదని గ్రహింపనగును. (అందుచేతనే మాండూక్య శ్రుతియందు జాగ్రదవస్థాభిమానియగు విశ్వునియొక్క స్వరూపమును వర్ణించు సందర్భమున వైశ్వానరపదము ప్రయోగింపబడినది.)

శ్లో॥ స్థూలసూక్ష్మకారణాఖ్యాః ప్రపంచా యే నిరూపితాః,
తే సర్వేఽపి మిళిత్వైకః ప్రపంచస్తు మహాన్ భవేత్.

తా॥ ఇంతవరకు గడచిన గ్రంథములో స్థూలము, సూక్ష్మము, కారణము అను నామములచే మూడువిధములగు ప్రపంచములు వర్ణింపబడినవి. ఇవి యన్నియును జేరి వ్యవహారకాలమున ఒక్కటియే మహాప్రపంచమగుచున్నది.

శ్లో॥ మహాప్రపంచావచ్ఛిన్నం విశ్వప్రాజ్ఞాదిలక్షణమ్,
విరాడాదీశపర్యన్తం చైతన్యం చైకమేవ తత్. ౨౨౨

తా॥ వ్యష్టిరూపమున విశ్వుడు, తైజసుడు, ప్రాజ్ఞుడు అను నామములు గలదియు, సమష్టిరూపమున వైశ్వానరుడు (విరాట్టు) హిరణ్యగర్భుడు, ఈశ్వరుడు అను నామములు గలదియునై, మహాప్రపంచముతో గూడుకొనిన చైతన్యమంతయు నొక్కటియే యగుచున్నది.

శ్లో॥ యదనాద్యన్త మవ్యక్తం చైతన్య మజ మక్షరమ్,
మహాప్రపంచేన సహాఽవివిక్తం సదయో ఽగ్నివత్,

శ్లో॥ తత్సర్వం ఖల్విదం బ్రహ్మేత్యస్య వాక్యస్య పండితైః,
వాచ్యార్థ ఇతి నిర్ణీతం వివిక్తం లక్ష్య ఇత్యపి. ౪౪౭

తా॥ స్వభావముచే జన్మనాశవర్జితమును, అద్వయపరహితమును, ఇన్ద్రియాగోచరమును అగుచైతన్యము మాయావశమునవ్యవహారదశయందు ఇనుముతో జేరిన యగ్నివలె స్థూలసూక్ష్మకారణరూపమగు మహాప్రపంచముతో తాదాత్మ్యము నొందియున్నది. ఇట్టిచైతన్యము "సర్వంఖల్విదం బ్రహ్మ" అను శ్రుతి వాక్యమునకు, (ఈకనబడు జగమంతయు బ్రహ్మమే యను నర్థము గలదానికి) వాచ్యార్థమగుననియు, ప్రపంచాభిమాన రహితమగు నిర్గుణచైతన్యము, లక్ష్యార్థమగు చున్నదనియు వేదాన్తశాస్త్రజ్ఞులు వచించుచున్నారు.

శ్లో॥ స్థూలా ద్యజ్ఞానపర్యన్తం కార్యకారణలక్షణమ్,
దృశ్యం సర్వ మనాత్మేతి విజానీహి విచక్షణ ?. ౪౪౮

తా॥ జాగ్రదవస్థయందు స్థూలప్రపంచమును స్వప్నావస్థయందు సూక్ష్మప్రపంచమును భాసించుచున్నవి. సుషుప్త్యవస్థయందు "నాకేమియు తెలియదు" అను సార్వజనీనానుభవము ననుసరించి కారణ ప్రపంచము లేక అజ్ఞానము భాసించుచున్నది. ఈయజ్ఞానమే సర్వసంసార కారణము. దీనివలననే స్థూలసూక్ష్మ ప్రపంచములు పుట్టుచున్నవి. ఈ విధమున కార్యకారణాత్మకమగు ప్రపంచత్రయ మంతయు సర్వద్రష్టయగునాత్మచే చూడబడుచున్నది.— చూడబడునది, చూచువాని స్వరూపము గా నేరదు గదా ? అందుచే నో పండితుడవగు శిష్యుడా! దృశ్యమగు మహాప్రపంచ మంతయు నాత్మవస్తువుగా నేరదని గ్రహింపుము.

శ్లో॥ అన్తఃకరణ తద్వృత్తి ద్రష్టృ నిత్య మవిక్రియమ్,
చైతన్యం యత్తదాత్మేతి బుద్ధ్యా బుద్ధ్యస్వసూక్ష్మయా.

తా॥ ప్రపంచ వ్యవహారముల కన్నిటికి సాక్షియగు సూర్యభగవానునివలె, అన్తఃకరణమునకును ఆ యన్తఃకరణ వృత్తులగు కామ సంకల్పాదులకును సాక్షిభూతమై నిత్యమై జన్మాదిసర్వవిక్రియా శూన్యమగు జ్ఞానస్వరూపమున వెలుగొందుచున్న చైతన్యమే యాత్మయని నిశ్చలబుద్ధిచే నెఱుంగుము.

శ్లో॥ ఏష ప్రత్యక్స్వప్రకాశో నిరంశోఽ-
సంగ శ్శుద్ధ స్సర్వ దైకస్వభావః,
నిత్యాఽఖండానందరూపో నిరీహః
సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ. ౨౨౯

తా॥ ఈ యాత్మ అనృత జడదుఃఖాత్మకములగు అన్నమయాది పంచకోశములకంటె విలక్షణమైన సచ్చిదానంద స్వరూపముగలవాడును, తనంతట తానే ప్రకాశించు (స్వభావముగల) వాడును, ఆకాశమువలె నవయవరహితుండును, నిర్లేపుండును, నిర్మలుండును, కాలత్రయమునందును, నేకరూపమున నుండువాడును, పరిపూర్ణానందరూపుండును, సర్వసంకల్ప వర్జితుండును సాక్షిమాత్రుండును జ్ఞానస్వరూపుండును, నిర్గుణుండును, అద్వితీయుండును నగుచున్నాడు.

శ్లో॥ నైవ ప్రత్యగ్జాయతే వర్ధతే నో
కించి న్నాపక్షీయతే నైతి (వ)నాశమ్,
ఆత్మా నిత్య శ్శాశ్వతోఽయం పురాణః
నాఽసౌహన్యో హన్యమానే శరీరే. ౨౩౦

తా॥ ఆత్మ ఘటాదులవలె పుట్టువాడు గాని వృక్షాదులవలె వృద్ధిఁ బొందువాడుగాని, దేహాదులవలె క్షీణించువాడుగాని, నశించువాడుగాని కానేరడు. కావుననే ఈ యాత్మ సత్యస్వరూపుండును, శాశ్వతుండును

ఎల్లపుడు నొక్క విధముననుండువాడనునై, దేహము మరణాది వికార ములనొందినను తాను మాత్రము వికారముల నొందకున్నాడు.

శ్లో॥ జన్మాస్తిత్వవివృద్ధయః పరిణతి శ్చాపక్షుతి ర్నాశనమ్
దృశ్యస్యైవ భవన్తిషడ్వికృతయోనానావిధావ్యాధయః,
స్థూలత్వాదిచ నీలతాద్యపి మితిర్వర్ణాశ్రమాదిప్రథాః
దృశ్యన్తే వపుషో నచాత్మన ఇమే తద్విక్రియాసాక్షిణః.

తా॥ పుట్టుట, పుట్టిన పిమ్మటనే యుండుట (పుట్టకకు పూర్వము లేకుండి, పుట్టిన తరువాతనే ఉనికిగలిగియుండుట) పెరుగుట, మార్పు జెందుట కృశించుట, నశించుట, యనుషడ్భావవికారములును, అటులనే జ్వరము మున్నగు పలువిధ వ్యాధులను, లావుగానుండుట సన్నగా నుండుట యను ధర్మములును, నలుపు, పసుపు మున్నగు గుణములును, హ్రస్వత్వ దీర్ఘత్వాది పరిమాణంబును, వర్ణాశ్రమాది వ్యవహారములును నివి యన్నియు దృశ్యమై జడమగు దేహమునకే కాని, సర్వవిక్రియా సాక్షియగు నాత్మకు సంభవింపనేరవు

శ్లో॥ అస్మిన్నాత్మ న్యనాత్మత్వ మనాత్మన్యాత్మతాం పునః,
విపరీతతయాఽధ్యస్య సంసరన్తి విమోహితః. ౨౫౭

తా॥ ఆత్మ సత్యజ్ఞానానందస్వరూపుడు, అనాత్మ-అనగా దేహము ఇన్ద్రియములు, మనస్సు, ప్రాణము మున్నగునవి అనృత జడదుఃఖాత్మ కములు. ఇట్టియెడ జీవులు అజ్ఞానమువలన ఆత్మధర్మములగు సచ్చిదానన్ద ములను దేహాదులందును, దేహాది ధర్మములగు అసత్యత్వ జాడ్యదుఃఖాదు లను ఆత్మయందును ఆరోపించి జన్మ జరామరణాత్మకమగు సంసారము ననుభవించుచున్నారు. (ఆత్మయందు దేహాదులకును, వాని ధర్మములకును స్వరూపముచేతనే యధ్యారోపము దేహాదులందు మాత్రము ఆత్మధర్మము లగు సచ్చిదానందములకే యారోపముగాని, ఆత్మస్వరూపమునకు ఆరోప

ము లేదు. లోకమున రజ్జుసర్పస్థలమునందు—త్రాటియందు సర్పత్వధర్మము లకును, సర్పమునందు రజ్జుధర్మములగు దైర్ఘ్యాదులకును అధ్యారోపమే గాని, రజ్జుస్వరూపమున కారోపము లేకుండుట ప్రత్యక్షసిద్ధము. కావుననే భ్రాన్తి తొలగిన పిమ్మట త్రాడు మిగులుచున్నది. అటులనే బ్రహ్మజ్ఞానముచే జ్ఞానతత్కార్యములు నివర్తింపగా ఆత్మస్వరూపము పరిశిష్టమగుచున్నది.)

శ్లో॥ భ్రాన్త్యా మనుష్యోఽహమహం ద్విజోఽహమ్
తదజ్ఞోఽహ మజ్ఞోఽహ మతీవ పాపీ,
భ్రష్టోఽస్మి శిష్టోస్మి సుఖీచ దుఃఖీ
త్యేవం విముహ్యాఽత్మని కల్పయన్తి. ౪౫౩

తా॥ ప్రాణులు అజ్ఞానముచే నాత్మానాత్మ వివేకము లేనివారై నేను మనుష్యుడను, నేను ద్విజుడను, నేను మూఢుడను, నేను జ్ఞానిని, నేను పాపాత్ముడను, నేను స్వధర్మము నాచరింపని భ్రష్టుడను, నేను శాస్త్రవిధు ననుసరించువాడను, నేను సుఖదుఃఖములు గలవాడను, అని ఈ విధముగ అనాత్మ పదార్థములగు దేహము మనస్సు మున్నగువాని యొక్క ధర్మముల నాత్మ యందారోపించుకొనుచున్నారు.

శ్లో॥ అనాత్మనో జన్మజరామృతిక్షుధా –
తృషాసుఖక్లేశభయాది ధర్మాన్,
విపర్యయేణ హ్యతథావిధేఽస్మిన్
ఆరోపయ న్త్యాత్మని బుద్ధిదోషాత్. ౪౫౪

తా॥ అనాద్యజ్ఞాన మోహితులగు జనులు, స్వభావముచే జననాదులు లేని యాత్మయందు జన్మజరామరణాదులగు దేహధర్మములను, ఆకలి దప్పికలు మున్నగు ప్రాణధర్మములను, సుఖము, దుఃఖము, భయము,

(శోకము, మోహము) లోనగు నంతఃకరణ ధర్మములను నారోపించు చున్నారు.

శ్లో॥ భ్రాన్త్యా యత్ర యదధ్యాసః తత్కృతేన గుణేన వా,
దోషేణాఽప్యణుమాత్రేణ స న సంబధ్యతే క్వచిత్.

తా॥ కల్పిత పదార్థములయొక్క గుణదోషము కల్పనాధార వస్తువునకు ఎంతమాత్రమును సంబంధింపనేరవు. ముత్యపుచిప్పయందు కల్పింపబడిన వెండియందుగల "విలువ" మున్నగు గుణములు ముత్యపుచిప్పకుగాని, త్రాటియందు కల్పితమగు సర్పమునందుగల "విషము" మున్నగు దోషములు త్రాటికిగాని సంభవింపకుండుట సర్వజన ప్రత్యక్షము. కావున ప్రకృతమందును, ఆత్మయందు అజ్ఞానముచే కల్పితములగు దేహాదులయొక్క జన్మజరాది ధర్మములు ఆత్మకు నేమాత్రమును సంబంధింప నేరవని భావము.

శ్లో॥ కిం మరుర్మృగతృష్ణాంబుపూరేణార్ద్రీత్వ మృచ్ఛతి,
దృష్టిసంస్థితపీతేన శంఖః పీతాయతే కిము
బాలకల్పితనైల్యేన వ్యోమ కిం మలినాయతే. ౨౫౬

తా॥ జలములేని యిసుక ప్రదేశమునందు సూర్యకిరణములు ప్రతిఫలించినవై జలమువలె భాసించుచుండును. దీనిని చూచి మృగములు నీరను నాశచే పరుగిడు చుండును. అట్టి మృగకల్పితమగు జలముచే నా చవిటినేల తడువనేరదు గదా? అట్లే కామిల రోగముగలవారలకు పైత్యదోషముచే నేత్రములందు పసుపు వర్ణమేర్పడి దానిద్వారా స్వచ్ఛమగు తెల్లని శంఖము పచ్చనిదిగా భాసించుచుండును. కాని యావిధమగు పసుపువర్ణముచే శంఖము పచ్చనిదిగా మారిపోదుగదా? మరియు మూఢజనులు దూరదోషముచే నాకాశమును నల్లనిదానినిగా గ్రహించుచున్నారు. దానంజేసి యాకాశము నల్లనిది గాదుగదా. ఈ విధమగు లోకానుభవ

ముచే, కల్పిత వస్తుగత గుణదోషములు ఆధార వస్తువునకు సంబంధింప-
వనుట నిశ్చయము.

శ్లో॥ ప్రత్యగాత్మ న్యవిషయేఽ నాత్మాధ్యాసః కథం ప్రభో!
పురో దృష్టే హి విషయేఽ ధ్యస్యన్తి విషయాన్తరమ్.

తా॥ కడచిన గ్రన్థమున, సచ్చిదానన్దాత్మకమగు నాత్మచైతన్య-
స్వరూపమునందు, అనృత జడ దుఃఖాత్మకములగు దేహేన్ద్రియాదులకును, వాని ధర్మములగు జరామరణాదులకును ఆరోపము గలదని చెప్పబడినది. అయ్యది లోకానుభవమునకు విరుద్ధముగా నుండుటచే సంశయిత చిత్తుడైన శిష్యుడు ప్రశ్నించుచున్నాడు. శిష్య సంశయముల నివారింప సమర్థుడవగు నో యాచార్య స్వామీ? లోకమున జనులు-ఎదుట చక్షురాదీన్ద్రియములకు కనబడునట్టి త్రాడు, శుక్తి మున్నగు పదార్థములందు పాము, వెండి మున్నగు వానిని తద్ధర్మములను ఆరోపించుచున్నారు. ఇట్టికాడ నే యింద్రియములకును గనబడనిదై ప్రత్యగ్రూపమగు సచ్చిదానంద చైతన్యమునందు తద్విలక్షణములైన దేహేంద్రియాదులకును వాని ధర్మములకును అధ్యాస మెట్లు సంభవించునో సెలవిమ్మని గోరెదను.

శ్లో॥ తద్దృష్టం శుక్తిరజ్జ్వాదౌ సాదృశ్యాద్యనుబన్ధతః [illegible]

శ్లో॥ పరత్ర పూర్వదృష్ట స్యాఽవభాసః స్మృతిలక్షణః,
అధ్యాసః స కథం స్వామిన్ భవే దాత్మన్యగోచరే.

తా॥ స్వామీ! లోకమునందు ముత్యపు చిప్పకును, వెండికిని-ధావళ్యమను ధర్మము సమానముగా నుండుటచేతను, త్రాటికిని పామునకును, పొడుగుగా నుండుట వంకరగా నుండుట మున్నగు సమాన ధర్మములుండుటచేతను, అధ్యాసము యుక్తమగుచున్నది ఇంకను ఆత్మానాత్మల కన్ననో పరస్పర సామ్యమినుమంతయు లేమింజేసి యన్యోన్యాధ్య

ధ్యాసమెట్లు సంభవించును ? మరియును అధ్యాసమనగా నెదుట కనబడు నట్టి యొకానొక వస్తువునందు (శుక్తిక మున్నగుదానియందు) పూర్వము చూడబడిన యొకానొక వస్తువుతో (రజతము మున్నగు దానితో) సమాన మగు వస్తువు (రజతాదికము) నిర్వచింప వీలుగాని ప్రాతిభాసిక రూప ముతో నుత్పన్నమగుట గదా ! ఇట్టి యధ్యాసము ఇన్ద్రియములకు గోచరింపని యాత్మవిషయమున నెట్లు పొసగును.

శ్లో॥ నానుభూతః కదాఽ ప్యాత్మాఽ ననుభూతస్య వస్తునః,
సాదృశ్యం సిధ్యతి కథ మనాత్మని విలక్షణే. ౭౬౦

తా॥ ఆత్మానాత్మలకు రెండింటికిని అనాద్యజ్ఞాన వశమున అన్యోన్యాధ్యాసము గలదని గురువులచే చెప్పబడినది. అట్టియెడ - ఆత్మ శుక్తికవలె దృశ్యముగాని దగుటచే దానియందు ననాత్మ పదా ర్థములగు బుద్ధీన్ద్రియాదులకు, రజతాదులకువలె అధ్యాసమెట్లు సంభ వించునను శాంకచే ప్రథమ ప్రశ్న చేయబడినది. ఇక నిచట, బుద్ధీ న్ద్రియాదులు శుక్తికవలె దృశ్యములైనప్పటికిని, ఆత్మమాత్రము ఎన్నడును రజతాదికమువలె అనుభవ విషయమైనది గాకుండుటచేతను, అనృత జడదుఃఖాత్మకములగు అనాత్మపదార్థములకును, సచ్చిదానన్దాత్మకమగు నాత్మకును పోలిక (సాదృశ్యము) ఎంతమాత్రము లేకుండుటచేతను, అనాత్మయందు ఆత్మాధ్యాసము గలదని చెప్పుట యెట్లు సంభవించునని ద్వితీయప్రశ్న చేయబడుచున్నది.

శ్లో॥ అనాత్మన్యాత్మతాధ్యాసఃకథమేష సమాగతః,
నివృత్తిః కథమేతస్య కేనోపాయే సిధ్యతి. ౭౬౧

తా॥ స్వామీ ! అనాత్మ పదార్థములగు బుద్ధీన్ద్రియ శరీరాదు లందు ఆత్మధర్మములగు సచ్చిదానన్దములకు ఆరోపమెట్లు గలిగినది ? ఆ యారోపము తొలగుటకు ఉపాయ మెయ్యది !

శ్లో॥ ఉపాధియోగ ఉభయో స్సమవ వేశజీవయోః,
జీవస్యైవ కథం బన్ధో నేశ్వరస్యాస్తి తత్కథమ్?. ౪౬౭

తా॥ ఈ అధ్యాసమునకు ఉపాధి సంబన్ధమే కారణమగునేని ఈశ్వరునకు మాయయను నుపాధిసంబన్ధమును, జీవునకు అవిద్య (తత్కార్యములగు పంచకోశములు) యను నుపాధి సంబన్ధమును సమానముగా నే యుండగా తన్మూలమగు సంసారబన్ధము జీవునకు మాత్రమే యుండి యీశ్వరునకు నెట్లు లేదాయెను?

శ్లో॥ ఏతత్సర్వం దయాదృష్ట్యా కరామలకవత్ స్ఫుటమ్,
ప్రతిపాదయ సర్వజ్ఞ! శ్రీగురో! కరుణానిధే!. ౪౬౮

తా॥ సర్వజ్ఞుడును, దయాసముద్రుడును సర్వసద్గుణ సంపన్నుడును నగు ఓయాచార్యవర్యా? తాము దయాదృష్టిచే నా యడిగిన దంతయు కరచేతి యందలి యుసిరికపండువలె స్పష్టముగా బోధించి నా హృదయమునందలి సంశయగ్రన్థిని విచ్ఛిన్నము గావింప వేడుకొనుచున్నాను.

శ్లో॥ న సావయవ ఏకస్య నాత్మావిషయ ఇష్యతే. ౪౬౯
అస్యాత్మప్రత్యయార్థత్వా దపరోక్షాచ్చ సర్వశః,
ప్రసిద్ధి రాత్మనో ఽస్త్యేవ న కస్యాఽపి చ దృశ్యతే.

తా॥ ప్రపంచమునందు, అవయవములుగల ఘటపటాది పరిచ్ఛిన్న పదార్థములన్నియు చక్షురాదీన్ద్రియములకు గోచరములగుచున్నవి. ఇక నాత్మయన్ననో సర్వవ్యాపకమగు నిరవయవ పదార్థమగు నిరవయవ పదార్థమగుటచే నే యిన్ద్రియములకును స్ఫురింపకున్నది. అయినను, సర్వప్రాణులకును 'నేను' 'నేన'ను చిత్తవృత్తిలో స్ఫురించుచున్నదగుట చేతను జీవులకు స్వస్వరూపమగుటవలన నిత్యప్రత్యక్షమైనదగుట చేతను, ఆత్మస్వరూప మనుభవ విషయమగుచునే యున్నది.

శ్లో॥ ప్రత్యయే నాహ మస్మీతి హ్యస్తి ప్రత్యయ ఆత్మని,
న కస్యాఽపి స్వసద్భావే ప్రమాణ మభికాంక్ష్యతే.

తా॥ ప్రతి ప్రాణికిని 'నేను ఉన్నాను' అను జ్ఞానము నిత్యసిద్ధమై యున్నది. ఇట్టి జ్ఞానమునందు ఆత్మస్వరూపము స్ఫురించుచున్న దగుటచే "నేయిన్ద్రియములకును గోచరముగాని యాత్మయందు అనాత్మాధ్యాసము కలుగుట యెట్లు" అను చోద్యమున కవకాశము లేదు. మరియు లోకమున ఘటపటాదులను గ్రహించుటకు చక్షురాది ప్రమాణము లపేక్షితములగు చున్నవి గాని "నేనుగలన"ను విషయమున నెవరికిని ప్రమాణాన్తరాపేక్ష లేదు. కావున నాత్మయందు నాత్మాధ్యాసము పపన్నమే యగుచున్నది.

శ్లో॥ మాయాకార్యై స్తిరోభూతో నైష ఆత్మాఽనుభూయతే,
మేఘబృన్దై ర్యథా భాను స్తథా ఽయ మహమాదిభిః.

తా॥ మేఘములచే నావరింపబడిన సూర్యుడు స్పష్టముగా నెట్లు భాసింపకున్నాడో మాయా కార్యములగు అన్తఃకరణాదులచే నావృతుడగు నాత్మయు అటులనే స్ఫుటముగా తెలియబడకున్నాడు.

శ్లో॥ పురస్థఏవ విషయే వస్తున్యధ్యస్యతా మితి,
నియమో న కృత స్సద్భిః భ్రాన్తి రేవాత్రకారణమ్.

శ్లో॥ దృగాద్యవిషయే వ్యోమ్ని నీలతాది యథా ఽబుధాః,
అధ్యస్య న్తితథైవాస్మి న్నాత్మన్యపిమతిభ్రమాత్. ౧౯౯

తా॥ శాస్త్రములందును లోకానుభవమునందును, అధ్యాసమునకు అజ్ఞానమే మూలకారణముగా నిర్ణయింపబడుచున్నదిగాని ఆరోపాధిష్ఠానమగు పదార్థము యెదుటనున్నయెడలనే అధ్యాసము కలుగుట కవకాశము కలదను నియమము కనబడకున్నది మరియు - ప్రపంచమునందు మూఢజనులు ప్రత్యక్షముకాని ఆకాశమునందు నైల్యాదిధర్మముల నారోపించు

చున్నారు. కావున మాయా మోహిత చిత్తులగు మానవులు అసంగ సచ్చిదానంద స్వరూపుడగు ఆత్మయందు అనృతజడ దుఃఖాత్మకమగు (దేహాది) ప్రపంచమును ఆరోపించుటలో విరోధమేమియు లేదు.

శ్లో॥ అనాత్మ న్యాత్మతాధ్యాసే న సాదృశ్య మపేక్ష్యతే,
పీతోఽయం శంఖ ఇత్యాదౌ సాదృశ్యం కి మపేక్షితమ్.

శ్లో॥ నిరుపాధిభ్రమేష్వస్మిన్ నైవాఽపేక్షా ప్రదృశ్యతే,
సోపాధిష్వేవ తద్దృష్టం రజ్జుసర్పభ్రమాదిషు. ౪౭౧

తా॥ "శంఖము పచ్చగా నున్నది" మున్నగు స్థలములందు సాదృశ్యముతో పనిలేనట్లుగా, అంతఃకరణాదులందు ఆత్మధర్మాధ్యాస స్థలములందును సాదృశ్యాపేక్ష యొంతమాత్రమును లేదు. మరియు భ్రమలు-నిరుపాధికములనియు, సోపాధికములనియు రెండు విధములు. అందు అధిష్ఠాన జ్ఞానము కలుగగనే నివర్తించెడివి నిరుపాధికములు. త్రాటియొక్క జ్ఞానము కలుగగనే పాము పోవుచున్నది గాన నియ్యది నిరుపాధిక భ్రమ యనబడుచున్నది. ఇక నెచ్చట అధిష్ఠానజ్ఞానము కలిగిన పిమ్మట కూడ భ్రాన్తి తొలగకుండునో యచ్చట సోపాధికభ్రమ యగుచున్నది. మరుభూమి తెలియబడినను జలభ్రాన్తి కలుగుచునే యుండునుగాన నది సోపాధిక భ్రమ యనబడుచున్నది. ఇట్టియెడ రజ్జుసర్పము మున్నగు కొన్ని నిరుపాధిక భ్రమలందు మాత్రమే అధిష్టానారోపితములకు సాదృశ్యము గనబడుచున్నది గాని సర్వభ్రమలందును సాదృశ్యము నియతముగా గాన రాకున్నది. కావున ఆత్మాంతఃకరణములకు పోలిక (సాదృశ్యము) యేమియు లేకుండుటచే అన్తఃకరణమునందు ఆత్మధర్మముల కధ్యాసమెట్లు కలిగినద"ని శంకింపదగదు.

శ్లో॥ తథాఽపి కించి ద్వక్ష్యామి సాదృశ్యం శ్రుణు తత్పరః,
అత్యన్తనిర్మల సూక్ష్మ ఆత్మాఽయ మతిభాస్వరః.

శ్లో॥ బుద్ధి స్తథైవ సత్త్వాత్మా సాభాసా భాస్వరాఽమలా,
సాన్నిధ్యా దాత్మవద్భాతి సూర్యవత్ స్ఫటికోయథా.

తా॥ పూర్వశ్లోకములందు చెప్పబడిన రీతిగా, ఆత్మానాత్మల యొక్క అన్యోన్యాధ్యాసమునందు సాదృశ్యాపేక్ష లేదు. ఐనను ఆత్మానాత్మలకు రెంటికిని పోలిక కొంతగలదు. ఎట్లు అన - ఆత్మచైతన్యము నిర్మలము సూక్ష్మము ప్రకాశస్వరూపమును అగుచున్నది ఆదే విధమున ప్రకృతియొక్క సత్త్వగుణ కార్యమగు బుద్ధియు రజస్తమోగుణ మాలిన్య వర్జితమై దర్పణమువలె స్వచ్ఛస్వరూపముగలది యగుచున్నది. కనుకనే దీనియందు సర్వవ్యాపకమగు నాత్మచైతన్యము ప్రతిఫలించుచున్నది. ఇట్టి చైతన్య ప్రతిబింబోపేతమగుబుద్ధి, సూర్యకిరణ సాన్నిధ్యమువలన సూర్యునివలె భాసించు స్వభావముగల స్ఫటికమువలె ఆత్మసాన్నిధ్యమున ఆత్మవలె భాసించుచున్నది. కావుననే ఆత్మానాత్మలయొక్క పరస్పరావివేకమువలన 'జీవ'ను అధ్యాసము కలుగుచున్నది.

శ్లో॥ ఆత్మాభాసా తతో బుద్ధిః బుద్ధ్యాభాసం తతో మనః,
అక్షాణి మన ఆభాసా న్యక్షాభాస మిదం వపుః,
అతఏవాత్మతా బుద్ధిః దేహాక్షాదా వనాత్మని. ౪౭౪

తా॥ పూర్వశ్లోకమునందు చెప్పబడిన రీతిగా ఆత్మప్రతిబింబోపేత మగు బుద్ధి ఆత్మసాన్నిధ్యమువలన ఆత్మవలె భాసించుచున్నది. అటులనే బుద్ధి సాన్నిధ్యమున మనస్సు, మనస్సాన్నిధ్యమున ఇన్ద్రియములు, ఇన్ద్రియ సాన్నిధ్యమున శరీరమును క్రమముగా నాత్మప్రకాశసంబన్ధముగలవై ఆత్మవలె ప్రకాశించుచున్నవి. అందువలననే మాయామోహితులకు దేహేన్ద్రియాద్య నాత్మపదార్థములందు ఆత్మత్వభ్రాన్తి గలుగుచున్నది. లోకవ్యవహారమున పాలలో నుంచబడిన ఇన్ద్రనీలమాణిక్యము యొక్క కాన్తి పాలయందంతటను వ్యాపించుచున్నది. మరియు కొన్ని కంచు

పాత్రలను ఒకదానిలో నొకటి యుంచి నిప్పుమీద పెట్టినచో నా యగ్ని యొక్క వేడిమి యుత్తరోత్తర క్రమముగా నాపాత్ర లన్నిటియందును సంక్రమించుచుండుట ప్రసిద్ధముగానున్నది. ఆ విధముననే బుద్ధీన్ద్రియాదులతో గూడుకొనిన పంచకోశములందును నాత్మాభాసము సంక్రమించుటం జేసి వానియందుఆత్మభావము గలుగుచున్నదని తాత్పర్యము. ఈవిషయము బృహదారణ్యక షష్ఠాధ్యాయభాష్యమునందు ఆత్మస్వరూపమును నిర్ణయించు సందర్భమున బాగుగా వివరింపబడినది)

శ్లో॥ మూఢానాం ప్రతిబింబాదౌ బాలానా మివ దృశ్యతే,
సాదృశ్యం విద్యతే బుద్ధా వాత్మనో ఽధ్యాసకారణమ్.

తా॥ బాలురకు దర్పణము, మణిప్రదేశము మున్నగువానియందు ప్రతిఫలించిన తమ శరీరములందు తామను బుద్ధి కలుగనట్లు, అజ్ఞానులకు ఆత్మప్రతిబింబోపేతములగు బుద్ధీన్ద్రియశరీరాదులందు 'నేన' ను బుద్ధి కలుగుచున్నది. కావున, అధ్యాస స్థలములందు సాదృశ్యమావశ్యకమని యంగీకరించి నప్పటికిని, పూర్వోక్తవిధమున బుద్ధీన్ద్రియాదులందు ఆత్మ సాదృశ్యముండుటచే ఆత్మాధ్యాసముపపన్నమే యగును.

శ్లో॥ అనాత్మ న్యహమిత్యేవం యోఽయ మధ్యాస ఈరితః,
స్యా దుత్తరోత్తరాధ్యాసే పూర్వపూర్వస్తు కారణమ్,
సుప్తిమూర్ఛోత్థితేష్వేవ దృష్టః సంసారలక్షణమ్,
అనాది రేషా ఽవిద్యాఽతః సంస్కారోపిచ తాదృశః.

తా॥ నిద్రనుండియు మూర్ఛనుండియు మేల్కాంచిన వారలకు దేహేన్ద్రియ శరీరాదులందు 'నే' నను అధ్యాస కలుగుచున్నది. ఈ యధ్యాసము నిద్రాదులకు పూర్వముగల నేనను అధ్యాసముయొక్క సంస్కారమువలననే పుట్టుచున్నది. ఇటులనే పూర్వజన్మమునందలి అధ్యాసమును, తత్పూర్వజన్మములందలి యధ్యాసములయొక్క సంస్కా

రములవలననే పుట్టుచున్నది. ఈ విధమైన అధ్యాసయుతత్సంస్కారములు అనాది సిద్ధములగుచున్నవి. ఈ రెంటికిని అనాద్యవిద్యయే మూలకారణమని గ్రహింపవలెను.

శ్లో॥ అధ్యాసబాధాఽఽగమనస్య కారణమ్
శృణు ప్రవక్ష్యామి సమాహితాత్మా,
యస్మాదిదం ప్రాప్త మనర్థజాతమ్
జన్మాప్యయవ్యాధిజరాదిదుఃఖమ్. ४२२

తా॥ ఈ యధ్యాసమువలననే జనులను జన్మవ్యాధి జరావిపత్తి మరణములను దుఃఖపరంపరలు సంక్రమించుచున్నవి. కావున నిట్టి యధ్యాసప్రాప్తికి కారణమును వివరముగా చెప్పనున్నాను. శ్రద్ధతో నాకర్ణింపుము. దుఃఖకారణమును బాగుగా గ్రహించినచో దానిని నివారింప జేసికొనుట సులభమౌగదా!

శ్లో॥ ఆత్మోపాధే రవిద్యాయాః అస్తి శక్తిద్వయం మహత్,
విక్షేప ఆవృతి శ్చేతి యాభ్యాం సంసార ఆత్మనః. ४२३

తా॥ ఆత్మోపాధి యగు అవిద్యకు ఆవరణము విక్షేపము అను రెండు శక్తులుగలవు. ఈ రెంటిచేతనే ఆత్మకు సంసారము సంక్రమించినది.

శ్లో॥ ఆవృతి స్తమస శ్శక్తిః తద్ధ్యావరణకారణమ్
మూలావిద్యేతి సా ప్రోక్తా యయాసమ్మోహితంజగత్.

తా॥ అవిద్య, సత్త్వరజస్తమోగుణములచే స్వరూపముగా గలది. ఈ మూడు గుణములలో తమోగుణము ఆత్మస్వరూపము నావరించు స్వభావముగలదై యున్నది. ఇట్టి తమోగుణశక్తియే, ఆవరణశక్తియనియు మూలావిద్యయనియు పండితులచే వ్యవహరింపబడుచున్నది. ఇద్దాని

చేతనే ప్రాణి నికాయము మోహమునొందినదై స్వాత్మ స్వరూపము నెఱుంగ లేకున్నది.

శ్లో॥ వివేకవా నప్యతియశాస్త్రికోఽపి
శ్రుతాత్మతత్త్వోఽపిచ పండితోఽపి,
శక్త్యా యయా సంవృతబోధదృష్టిః
ఆత్మాన మాత్మస్థ మిమం న వేద ౪౮౦

తా॥ ఆవరణశక్తియొక్క సామర్థ్యమిట్టిదని చెప్పఁగలవిగాకున్నది. వివేకవంతులును మంచిచెడ్డలను గ్రహించు సామర్థ్యముగలవారును, ఊహాపోహ కుశలురును శాస్త్రపాండిత్యము గలవారై సద్గురువులవలన నాత్మతత్త్వమును గ్రహించినవారును నగు విద్వాంసులు సైతము అజ్ఞాన మోహితులై చిత్తమున ప్రతిఫలించుచు నిరంతరము 'నేను నేన'ని భాసించుచున్న యాత్మస్వరూపమును తెలియజాలకున్నారు.

శ్లో॥ విక్షేపనామ్నీ రజస స్తు శక్తిః
ప్రవృత్తిహేతుః పురుష స్య నిత్యమ్,
స్థూలాదిలింగాన్త మశేష మేతత్
యయా సదాత్మన్యసదేవ సూయతే. ౪౮౧

తా॥ అవిద్యయొక్క రజోగుణశక్తియే విక్షేపశక్తి యనబడుచున్నది. ఇయ్యది సచ్చిదానన్ద స్వరూపుడగు పరమాత్మయందు, అన్నృత జడదుఃఖాత్మకమగు నిఖిల ప్రపంచమును నిర్మించినదై జీవునియొక్క సంసార ప్రవృత్తికి హేతువగుచున్నది.

శ్లో॥ నిద్రా యథా పూరుష మప్రమత్తమ్
సమావృణోతీయ మపి ప్రతీచమ్,

తథా౽౽వృణో త్యావృతిశక్తి రన్తః
విక్షేపశక్తిం పరిజృంభయన్తీ. ౪౮౨

తా॥ నిద్రయనునది, జాగ్రత్సంస్కారములతో గూడుకొనిన స్వాప్నికశక్తిని విజృంభింపజేయుచు జాగరూకుడైయున్న పూరుషుని నావరించునట్లుగా (పరవశునిజేయునట్లుగా) ఆవరణశక్తియు, కర్తృత్వ భోక్తృత్వాది సర్వవ్యాపార హేతుభూతమగు విక్షేపశక్తిని పెంపొందించుచు సర్వసాక్షియై సచ్చిదానన్ద స్వరూపమున భాసించుచున్న ఆత్మ స్వరూపము నావరించుచున్నది.

శ్లో॥ శక్త్యా మహత్యా౽౽వరణాభిధానయా
సమావృతే సత్యమలస్వరూపే,
పుమా ననాత్మ న్యహ మేవ ఏవే-
త్యాత్మత్వబుద్ధిం విదధాతి మోహాత్. ౪౮౩

తా॥ సర్వసంగ రహితమగు ఆత్మయొక్క సచ్చిదానన్దస్వరూపము ప్రబలమైన యావరణశక్తిచే నావరింపబడినదికాగా పిమ్మట విక్షేపశక్తిచే నిర్మింపబడిన బుద్ధ్యాదులు శరీరాదులందు జీవుడు అవివేకమువలన 'నేన'ని యాత్మభావము నారోపించుకొనుచున్నాడు.

శ్లో॥ యథా ప్రసుప్తిప్రతిభాసదేహే
స్వాత్మత్వధీ రేవ తథాహ్యనాత్మనః,
జన్మాప్యయక్షుద్భయతృట్శ్రమాదీన్
ఆరోపయత్యాత్మని తస్య ధర్మాన్. ౪౮౪

తా॥ జీవుడు స్వప్నావస్థయందలి ప్రాతిభాసిక శరీరమునందు 'నేను' అను భావముగలవాడై దాని ధర్మములను తన యందు ఆరోపించుకొనునట్లుగా జాగ్రదవస్థయందలి శరీరాదులందును 'నేనను' భావము

[illegible] దేహధర్మములగు జన్మ మరణములను, ప్రాణధర్మములగు ఆకలి దప్పులను, మనోధర్మములగు భయసంకల్పాదులను, ఇన్ద్రియధర్మము లగు [illegible], ఆత్మస్వరూపమునందారోపించుకొనుచున్నాడు.

శ్లో॥ విక్షేపశక్త్యా పరిచోద్యమానః
కరోతి కర్మాణ్యుభయాత్మకాని,
భుంజాన ఏతత్ఫల మప్యుపాత్తమ్
పరిభ్రమత్యేవ భవాంబురాశౌ. ౧౪౫

తా॥ జీవుడు విక్షేపశక్తిచే ప్రేరేపితుడై పుణ్య పాప కర్మల నాచరించుచు, వానివలన కలుగు తత్కర్మఫలరూప సుఖదుఃఖములను, జీవ మనుష్య తిర్యగాది జన్మములం దనుభవించుచున్నవాడై సంసారసముద్ర మున ఘటీయంత్రమువలె ఎడతెంపులేక సంచరించుచున్నాడు.

శ్లో॥ అధ్యాసదోషా త్సముపాగతో ఽయమ్
సంసారబన్ధః ప్రబలః ప్రతీచః,
యద్యోగతః క్లిశ్యతి గర్భవాస
జన్మాప్యయక్లేశభయై రజస్రమ్. ౧౪౬

తా॥ అనాత్మ ఆత్మలయొక్క వివేకము లేకుండుటయే అధ్యాసము. అట్టి అధ్యాస దోషమువలన జీవాత్మకు సంసారమను మహాబన్ధము ప్రాప్తించినది. దానివలననే జననమరణభయ దుఃఖాదులచే నిరన్తరము బాధించుచున్నాడు

శ్లో॥ అధ్యాసో నామ ఖల్వేషః వస్తునో యో ఽన్యథాగ్రహః,
స్వాభావికభ్రాన్తిమూలం సంసృతే రాదికారణమ్. ౧౪౭

తా॥ సచ్చిదానన్ద రూపమున వెలుగొందుచున్న ఆత్మస్వరూపమును అనాత్మవస్తువులగు దేహేన్ద్రియాదులనుగా భావించుటయే (గ్రహిం

చుటయే) అధ్యాసమనబడుచున్నది. ఈ యధ్యాసము, అనాద్యజ్ఞానము వలన పుట్టినదై శోక మోహాది సంసారమునకు మూలకారణమగుచున్నది.

శ్లో॥ సర్వానర్థస్య తద్బీజం యోఽన్యథాగ్రహ ఆత్మనః,
తత స్సంసారసంపాతః స న్తత క్లేశలక్షణః. ౨౮౭

తా॥ ఆత్మకు దేహేన్ద్రియాదులయందుగలిగినవిపరీత జ్ఞానమే సర్వానర్థ కారణమగుచున్నది. దానివలననే నిరన్తరదుఃఖదాయకమగు సంసారబన్ధము సంభవించినది.

శ్లో॥ అధ్యాసా దేవ సంసారో నష్టే ఽధ్యాసే న దృశ్యతే,
తదేతదుభయం స్పష్టం పశ్య త్వం బద్ధముక్తయోః.

తా॥ వత్సా! వేయిమాటలేల? ఆత్మకు అనాత్మపదార్థములందుగల 'నేను' 'నాది'యను తాదాత్మ్యాధ్యాసయే సంసారమున కంతకును ప్రధాన కారణమగుచున్నది. ఇందుకు లోకమే సాక్ష్యము. ఎట్లనగ లోకమున దేహేన్ద్రియాదులందు 'నేన'నియు, భార్యాపుత్రాదులందు 'నావి' యనియు భ్రమగల మూఢజనులు పుణ్యపాపకర్మల నాచరించుచు, సుఖదుఃఖమయమగు సంసారమునందే పొరలాడుచున్నారు. ఇక మరికొందఱు మహానుభావులు శరీరాదులందును జాయాపుత్రాదులందును అహంకారమమకారములు లేనివారై సర్వకర్మముల సన్న్యసించి సుఖదుఃఖశోకమోహాది సంసారబన్ధ వినిర్ముక్తులై జీవించియుండగనే బ్రహ్మనన్దామృతము నాస్వాదించుచున్నారు. కావున పైవిధమగు లోకానుభవము ననుసరించి అన్వయవ్యతిరేక దృష్టాన్తములచే అధ్యాసయే సంసార మూలకారణమని నిశ్చయించుకొని తన్నివృత్తికొరకై ప్రయత్నింపవలయును. వ్యాధి నిదానమును గ్రహించినగాని చికిత్సచేయ వీలగును.

శ్లో॥ బద్ధం ప్రవృత్తితో విద్ధి ముక్తం విద్ధి నివృత్తితః,
ప్రవృత్తిరేవ సంసారో నివృత్తి ర్ముక్తి రిష్యతే. ౨౯౦

తా॥ మరియు నే మానవుడు నిరంతరము లోకవ్యవహారము లందు లగ్నచిత్తుడై ఇహపరలోక భోగసాధనములగు లౌకిక వైదిక కర్మల నాచరించుచుండునో అట్టివాడు సంసారబద్ధుడనియు, ఏ పురుషుడు సత్కర్మానుష్ఠానముచే నిర్మలమైన యంతఃకరణము గలవాడై బ్రహ్మభిన్నముగ భాసించుచున్న ప్రపంచమంతయు మాయాకల్పితమని నిశ్చయించుకొని పుణ్యపాపాత్మక నిఖిలకర్మముల నుండి నివృత్తిని పొందుచుండునో, అట్టిపురుషుడు సంసారబంధ నిర్ముక్తుడగు జీవన్ముక్తుడనియు గ్రహింపనగును. కావుననే శ్రుతిస్మృతులన్నియు. విషయ ప్రవృత్తియే సంసారమనియు విషయ నివృత్తియే ముక్తియనియు వాక్రుచ్చుచున్నవి.

శ్లో॥ ఆత్మన స్సోఽయ మధ్యాసో మిథ్యాఽజ్ఞానపురస్సరః,
అసత్కల్పోఽపి సంసారం తనుతే రజ్జుసర్పవత్. ౪౯౧

తా॥ అజ్ఞానమూలమున పుట్టిన యీ యధ్యాసము పరమార్థదృష్టిచే, లేనిదైయైనను, వ్యవహారదశయందు ఆత్మకు సుఖదుఃఖాది రూపమగు సంసారమును గలిగించుచున్నది. ఇందుకు దృష్టాంతమేమన – ప్రపంచము నందు, త్రాటిలో పాము నిజముగ లేనిదైనను, భ్రాంతిచేత కల్పింపపడినదై భయము, వణకు మున్నగు వానిని పుట్టించుచున్నది గదా!

శ్లో॥ ఉపాధియోగసామ్యేఽపి జీవ వత్పరమాత్మనః,
ఉపాధిభేదాన్నో బన్ధఃతత్కార్యమపికించన. ౪౯౨

తా॥ జీవునకు 'మనస్సు'ను నుపాధియు, ఈశ్వరునకు మాయయను నుపాధియు సమానముగా నుండగా, జీవునికీసంసారబన్ధమేల కలిగెను? ఈశ్వరున కేలకలుగలేదు. అని వెనుక 461 వ శ్లోకములో శిష్యునిచే నొక ప్రశ్నచేయబడినది. దాని కిచ్చుట సమాధానము చెప్పబడుచున్నది. జీవేశ్వరుల కిరువురకును ఉపాధిసంబన్ధము సమానముగానే యున్నను, ఈశ్వరునియొక్క ఉపాధియగు మాయయందుగల

యొకానొక విశేషమును పురస్కరించుకొని, ఈశ్వరునకు ఆవరణవిక్షేప రూపమగు సంసారబన్ధము సంభవింపకున్నది.

శ్లో॥ అస్యోపాధి శ్శుద్ధస త్త్వప్రధానా
మాయా యత్ర త్వస్య నాఽస్త్యల్పభావః,
స త్త్వస్యైవోత్కృష్టతా తేన బన్ధో
నో విక్షేప స్తత్కృతో లేశమాత్రః. ౪౯౩

తా॥ ఈశ్వరునకు, సత్వగుణప్రధానమగు మాయ, యుపాధియగుచున్నది. ఇయ్యది సర్వవ్యాపకమైనది. సత్త్వగుణాధిక్యముచే తిరస్కరింపబడిన రజస్తమోగుణములు గలది. కావుననే యీ మాయోపాధికుడగు నీశ్వరుడు సర్వవ్యాపకుడును సర్వజ్ఞుడునునై తమోరజః కార్యములగు ఆవరణ విక్షేపములు లేనివాడగుచున్నాడు.

శ్లో॥ సర్వజ్ఞో ఽప్రతిబద్ధబోధవిభవ
స్తేనైవ దేవ స్స్వయమ్
మాయాం స్వా మవలంబ్య
నిశ్చలతయా స్వచ్ఛన్దవృత్తిః ప్రభుః,
సృష్టి స్థిత్యదన ప్రవేశ
యమన వ్యాపారమత్రేచ్ఛయా
కుర్వన్ క్రీడతి తద్రజ స్తమ
ఉభే సంస్తభ్య శక్త్యా స్వయా. ౪౯౪

తా॥ ఈశ్వరునియొక్క ఉపాధి మాయ. ఇయ్యది శుద్ధసత్వగుణ ప్రధానమైనదగుటచే రజస్తమోగుణములను రెంటిని వాని కార్యములగు నావరణ విక్షేపాదులను ప్రతిబన్ధించుచు పరిచ్ఛిన్నభావమును విడనాడి సర్వవ్యాపకమగుచున్నది. ఇట్టి మాయయందు ప్రతిఫలించిన

యీశ్వరుడు జీవునకువలె ప్రతిబన్ధము లేమియు లేమింజేసి, సర్వవ్యాపకుండును సర్వజ్ఞుండును సత్యసంకల్పుండును నై సమస్త ప్రపంచము యొక్క సృష్టిస్థితిలయముల నొనరించుచున్నాడు. మరియు తానె యన్తఃకరణము లందు (జీవుడనుపేర) జీవరూపమున ప్రవేశించినవాడై యన్తర్యామి స్వరూపమున సర్వజీవులను వారివారి పూర్వకర్మముల ననుసరించి పుణ్యపాప కృత్యములందు ప్రేరేపించుచున్నాడు. ఈ విధమున పరమేశ్వరు డొక్కడే సర్వాత్మాదితముగు ప్రపంచమునందు బహురూపముల విహరించుచున్నాడు.

శ్లో॥ తస్మా దావృతివిక్షేపౌ కించి త్కర్తుం న శక్నుతః,
స్వయమేవ స్వతన్త్రోఽసౌ తత్ప్రవృత్తినిరోధయోః.

తా॥ పూర్వశ్లోకమునందు చెప్పబడిన రీతిగా పరమేశ్వరుడు సర్వస్వతంత్రుడై రజోగుణ తమోగుణములను ప్రవర్తింపజేయుటకును, నివర్తింపజేయుటకును, సమర్థుడై యున్నాడు. కావున నే వాటి కార్యములగు ఆవరణ విక్షేపములకులోనుగాకున్నాడు.

శ్లో॥ రజస స్తమస శ్చైవ ప్రాబల్యం సత్త్వహానతః,
జీవోపాధౌ తతో జీవే తత్కార్యం బలవత్తరమ్. ౪౯౬

తా॥ జీవుని యుపాధియగు నన్తఃకరణము నందలి సత్త్వగుణము. రజోగుణతమోగుణములచే తిరస్కరింపబడిన దగుటచే, తమోరజః కార్యములగు నావరణ విక్షేపములకు జీవుడు లోనగుచున్నాడు. అనగా జీవునకు ఆత్మస్వరూపభావము లేకుండుటయు, కర్తృత్వభోక్తృత్వాదివిపరీతభావము గలుగుటయు సంభవించిన వని భావము.

శ్లో॥ తేన బన్ధోఽస్య జీవస్య సంసారోఽపి చ తత్కృతః,
సంప్రాప్త సర్వదా యత్ర దుఃఖం భూయ స్స ఉచ్యతే.

తా॥ పూర్వశ్లోకమున చెప్పబడిన రీతిగా జీవోపాధియగు నన్తః కరణమునందు సత్త్వగుణము స్వల్పమై రజస్తమములు మిక్కుటముగా నున్నందుననే జీవునకు సంసారబన్ధము సంభవించినది కావుననే జీవుడు నిరన్తరము జన్మ మరణ జరారోగాది దుఃఖముల ననుభవించుచున్నాడు.

శ్లో॥ ఏతస్య సంసృతే ర్హేతు రధ్యాసో ఽర్థవిపర్యయః,
అధ్యాసమూల మజ్ఞాన మాహు రావృతిలక్షణమ్. ౧౯౮

తా॥ జీవునియొక్క సంసారమున కంతకును, ఆత్మాఽనాత్మల యొక్క వివేకమువలన గలిగిన యధ్యాసమే మూలకారణమగుచున్నది. ఈ యధ్యాసమన్ననో, ఆత్మస్వరూపము నావరించు స్వభావముగల అజ్ఞానమువలన పుట్టుచున్నది. కావున నజ్ఞానమే సర్వానర్థ బీజమని యెఱుంగనగును.

శ్లో॥ అజ్ఞానస్య నివృత్తిస్తు జ్ఞానేనైవ నకర్మణా,
అవిరోధితయా కర్మ నైవాఽజ్ఞానస్య బాధకమ్. ౧౯౯

తా॥ లోకమున పరస్పర విరోధముగల పదార్థములకు అన్యోన్యము నివర్త్యనివర్తక భావము కనుపించుచున్నది. చీకటి తన విరోధి యగు సూర్యాది ప్రకాశమువలననే గదా తొలగిపోవుచున్నది అటులనే అజ్ఞానముగూడ తన విరోధియగు జ్ఞానమువలననే నశించును. గాని, విరోధములేని కర్మలవలన నశింపనేరదు.

శ్లో॥ కర్మణా జాయతే జంతుః కర్మణైవ ప్రలీయతే,
కర్మణః కార్య మేవైషా జన్మమృత్యుపరంపరా. ౨౦౦

తా॥ దేవతలు పుణ్యకర్మములవలనను, పశ్వాదులు పాపకర్మముల వలనను, మనుష్యులు పుణ్యపాప మిశ్రకర్మములవలనను జన్మించి తత్తద్భోగముల ననుభవించుచు తుదకు కర్మ విశేషములవలననే మృతినొందు

చున్నారు. ఈవిధముగ ప్రాణులయొక్క జన్మమరణపరంపర యంతయు కర్మముల వలననే యేర్పడుచున్నది.

శ్లో॥ నైతస్మాత్కర్మణః కార్య మన్య దస్తి విలక్షణమ్,
అజ్ఞానకార్యం తత్కర్మ యతో ఽజ్ఞానేన వర్ధతే. ౫౦౧

తా॥ కర్మలకు, జన్మమృత్యు పరంపర యను కార్యమును సంపాదించుట కంటె మరియొక కార్యమేమియు గానరాదు. ఇట్టి కర్మలు, దేహేంద్రియ కళత్రాదులందుగల 'నేను' 'నాది' యను నజ్ఞానముచే నాచరింపబడుచున్నవై ఉత్తరోత్తరాభివృద్ధి నొందుచున్నవి గాన నజ్ఞాన కార్యము లనుటలో సందియము లేదు.

శ్లో॥ యద్యేన వర్ధతే తేన నాశ స్తస్య న సిద్ధ్యతి,
యేన యస్య సహాఽవస్థా నిరోధాయ న కల్పతే,
నాశకత్వం తదుభయోః కో నుకల్పయితుం క్షమః. ౫౦౨

తా॥ లోకమున నొకానొక వస్తువు, దేనితో తాను కలసి యుండునో దానిని గాని, దేనిచేత తాను వృద్ధినొందుచుండునో దానిని గాని నశింపచేయ లేదు. అటులనే ప్రకృతమున కర్మయనునది అభిమానాత్మకమగు నజ్ఞానముతో కలసి యుండి దానివలననే వృద్ధినొందుచున్న దగుటచే నాయజ్ఞానమును నశింపచేయనేరదు. ఇట్టియెడ నజ్ఞానము కర్మల వలన నివర్తించునని వచించుట సమంజసముగా నేరదుగదా!

శ్లో॥ సర్వం కర్మాఽవిరోధ్యేవ సదాఽజ్ఞానస్య సర్వథా,
తతోఽజ్ఞానస్య విచ్ఛిత్తిః కర్మణా నైవ సిద్ధ్యతి. ౫౦౩

తా॥ పూర్వమందు చెప్పబడిన రీతిగా, కర్మయనునది యేవిధమున జూచినను అజ్ఞానమునకు శత్రువు గాకున్నది. కావున కర్మలవలన నజ్ఞాన మెన్నటికిని నశింపనేరదు.

శ్లో॥ యస్య ప్రధ్వంసజనకో యత్సంయోగోఽస్తి తత్క్షణే,
తయోరేవ విరోధిత్వం యుక్తం భిన్నస్వభావయోః. ౫౦౪

శ్లో॥ తమః ప్రకాశయో ర్యద్వ త్పరస్పరవిరోధితా,
అజ్ఞాన జ్ఞానయో స్తద్వ దుభయోరేవ దృశ్యతే. ౫౦౫

తా॥ లోకమున నేవస్తువునకు, ఏవస్త్వంతరముతో సంయోగ సంబన్ధము కలుగగనే వినాశము కలుగుచున్నదో ఆ రెండిటికే విరోధము యుక్తమగుచున్నది. అయ్యది చీకటి వెలుతురులందు గోచరించుచున్నది. వెలుతురు పుట్టినతోడనే చీకటి నశించుచున్నదిగదా! అటులనే భిన్న స్వభావముగల జ్ఞానాఽజ్ఞానములకే పరస్పర-విరోధముపపన్నముగాని పోష్యపోషకములై కలసి యుండెడి కర్మాఽజ్ఞానములకు రెండిటికిని విరోధ మేమియు లేదు.

శ్లో॥ న జ్ఞానేన వినా నాశ స్తస్య కేనాఽపి సిద్ధ్యతి,
తస్మా దజ్ఞానవిచ్ఛిత్త్యై జ్ఞానం సంపాదయే త్సుధీః. ౫౦౬

తా॥ కావున జ్ఞానముచేగాక మరి దేనిచేతను అజ్ఞానము నశింపనేరదు. అందుచేత ముముక్షువగు పండితుడు అజ్ఞానముయొక్క నాశముకొరకు సద్గురువుల వలన జ్ఞానమును సంపాదించుకొనవలయును.

శ్లో॥ ఆత్మానాత్మవివేకేన జ్ఞానం సిద్ధ్యతి నాఽన్యథా,
యుక్త్యాఽఽత్మానాత్మనో స్తస్మా త్కరణీయం వివేచనమ్.

తా॥ సచ్చిదానన్ద స్వరూపుడగు నాత్మయు, అనృత జడదుఃఖాత్మకమగు బుద్ధీన్ద్రియ శరీరాది ప్రపంచమును, ఈ రెండును అవిద్యావశమున నేకరూపముగ భాసించుచున్నవి. ఈ రెండింటియొక్క వివేకము చేతనే జ్ఞానముత్పన్నమగును కావున ముముక్షువులు, శాస్త్రాచార్యోపదిష్టములగు సద్ధేతువులచే ఆత్మానాత్మలను రెండిటిని బాగుగా వివేచింప

తలయును. ఏకరూపమున కలసియున్న క్షీరనీరములను రాజహంస విడదీయ గలుగుచున్నది గదా. అటులనే ఆత్మానాత్మలను వేరువేరుగ భావనచేయు మహానుభావులు పరమహంస లనబడుచున్నారు.

శ్లో॥ అనాత్మ న్యాత్మతాబుద్ధిగ్రన్థి ర్యేన విదీర్యతే,
ఆత్మాఽనాత్మవివేకార్థం వివాదోఽయం నిరూప్యతే.
యేనాఽత్మాఽనాత్మనో స్తత్వం వివిక్తంప్రస్ఫుటాయతే.

తా॥ ఆత్మానాత్మవివేకమువలన, అనాత్మపదార్థములగు దేహేన్ద్రియాదులందుగల (ఆత్మభావము) 'నేన' ను భావము తొలగిపోవును. కావున నట్టి యాత్మాఽనాత్మ వివేకము ముముక్షువులకు సులభముగా గలుగుటకొఱకై ప్రపంచమునందు ఆత్మస్వరూపనిరూపణమునకు బద్ధకంకణులైన పలువురయొక్క వాదములు వర్ణింపబడుచున్నవి. ఈ వాదములయొక్క పరమార్థమును బాగుగా గ్రహించినచో ఆత్మాఽనాత్మల రెండింటియొక్కయు తత్త్వము సువ్యక్తమగును.

శ్లో॥ మూఢా అశ్రుతవేదాన్తాః స్వయంపండితమానినః. ౨౦౯
ఈశప్రసాదరహితాః సద్గురోశ్చ బహిర్ముఖాః,
వివదన్తి ప్రకారం తం శృణు వక్ష్యామి సాదరమ్. ౨౧౦

తా॥ లోకమున కొందరు, శ్రుతిస్మృతిచోదితములగు సత్కర్మముల నాచరింపకుండుటచే, సద్గురువులయొక్కయు సర్వేశ్వరుని యొక్కయు అనుగ్రహమునకు పాత్రులుగాని వారలై భార్యాపుత్రాది బాహ్యపదార్థములందే, నిరన్తర మభిమానముగల వారగుచు వేదశాస్త్రముల నభ్యసింపక, తమంతట తామె మహాపండితుల మని నిశ్చయించుకొని, తమతమ అభిప్రాయముల కనుగుణముగ శ్రుతిస్మృతి న్యాయముల నన్వయించుచు బ్రహ్మస్వరూప నిర్ధారణ విషయమై వివాదమూ

లనొసరించుచున్నారు. వారి వాదముల వివరించెదను గాన సమాహిత చిత్తుడవై యుక్తాయుక్తముల విచారింపుము.

శ్లో॥ అత్యన్తపామరః కశ్చిత్పుత్ర ఆత్మేతి మన్యతే,
ఆత్మనివ స్వపుత్రేఽపి ప్రబలప్రీతిదర్శనాత్. ౫౧౧

పుత్రే తు పుష్టే పుష్టోఽహం నష్టే నష్టోఽహ మిత్యతః
అనుభూతి బలాచ్చాఽపి యుక్తితోఽపి శ్రుతేరపి. ౫౧౨

"ఆత్మావైపుత్రనామాఽసీ"త్యేవం చ వదతి శ్రుతిః,
దీపా ద్దీపో యథా తద్వత్పితుః పుత్రః ప్రజాయతే. ౫౧౩

పితు ర్గుణానాం తనయే బీజాంకురవ దీక్షణాత్,
అతోఽయం పుత్ర ఆత్మేతి మన్యతే భ్రాన్తిమత్తమః.

తా॥ పామరుడగు పండితుడొకడు, పుత్రుడే తన యాత్మ స్వరూపమని తలంచుచున్నాడు. మరియు తననిశ్చయమున కనుకూలములగు ప్రత్యక్షానుమానాగమములను మూడు ప్రబలప్రమాణములను ప్రదర్శించుచున్నాడు. ఎట్లన ప్రత్యక్షమనగా లోకానుభవము. లోకమున, తండ్రియగు ప్రతి మనుజుడును, తన పుత్రునియందు (తనకు తనయందు గలిగినంత) పరమప్రేమను గలిగియుండి, యతడు సుఖపడుచున్న తాను, సుఖిననియు, అతడు దుఃఖపడుచున్న తాను దుఃఖితుడననియు. భావించుచున్నాడు. ఇట్టి లోకానుభవము, పుత్రుడు ఆత్మగానిచో సంభవింప నేరదుగదా!

ఇక ననుమాన ప్రమాణమనగా యుక్తులచే నొకవిషయమును నిర్ధారణ చేయుట. అది యెట్లన ఎవడు, ఎవని యందలి గుణములను గలిగియున్నాడో నాడు, వాని యాత్మస్వరూపమగుచున్నాడు ప్రకృతమున, పుత్రుడు తండ్రియందలి గుణములు గలవాడగుటచే తండ్రియొక్క

ఆత్మయనుట నిస్సంశయము. మరియు విత్తనము నందలి యవయవములు (అంకురమునందు) వృక్షమునందు వ్యాపించునటుల పితృగతగుణములు పుత్రునియందు భాసించుచున్నవిగదా? కావున పుత్రుడే యాత్మ యనుట యుక్తము. ఇంతియగాక. దీపమునందుగల గుణరూపములు (కాల్చుటయు, ప్రకాశించుటయు) దానివలన పుట్టిన మరియొక దీపమునందు సంక్రమించునటుల, తండ్రియందుగల, యెరుపు మొదలగు రూపమును, ఔదార్యపరాక్రమాది గుణములును, పుత్రునియందు సంక్రమించుచున్నవి. మరియు 'ఆత్మావై పుత్రనామాఽసి' మొదలగు శ్రుతులు పుత్రుడే యాత్మయని వక్కాణించుచున్నవి. కావున పైవిధములగు ప్రమాణములచే 'పుత్రుడు' ఆత్మయగునని పామరుడు భ్రమపడుచున్నాడు.

శ్లో॥ తన్మతం దూషయత్యన్యః పుత్ర ఆత్మా కథంత్వితి,
ప్రీతిమాత్రా త్కథం పుత్ర ఆత్మాభవితు మర్హతి. ౫౧౫
అన్యత్ర వీక్ష్యతే ప్రీతిః క్షేత్రపాత్రధనాదిషు,
పుత్రా ద్విశిష్టా దేహేఽస్మిన్ ప్రాణినాం ప్రీతి రిష్యతే.
ప్రదీప్తే భవనే పుత్రం త్యక్త్వా జన్తుః పలాయతే,
తం విక్రీణాతి దేహార్థం ప్రతికూలం నిహన్తిచ. ౫౧౬
తస్మా దాత్మాతు తనయో నభవేచ్ఛ కదాచన,
గుణరూపాదిసాదృశ్యం దీపవ న్నసుతే పితుః. ౫౧౭
అవ్యంగా జ్జాయతే వ్యంగః సుగుణాదపి దుర్గుణః,
ఆభాసమాత్రాస్తాస్సర్వాయుక్తయోఽప్యుక్తయోఽపిచ.
పుత్రస్య పితృవ ద్గేహే సర్వకార్యేషు వస్తుషు,
స్వామిత్వాద్యోతనాయాఽస్మి న్నాత్మత్వ ముపచర్యతే.

శ్లో॥ శ్రుత్యాతు ముఖ్యయా వృత్త్యా పుత్ర ఆత్మేతి నోచ్యతే,
ఔపచారిక మాత్మత్వం పుత్రే తస్మా న్నముఖ్యతః.
అహం పదప్రత్యయార్థో దేహ ఏవ న చేతరః,
ప్రత్యక్షః సర్వజన్తూనాం దేహోఽహ మితినిశ్చయః.
ఏషపురుషోఽన్నరసమయ ఇత్యపిచశ్రుతిః,
పురుషత్వం వదత్యస్య స్వాత్మాహి పురుష స్తతః. ౫౭౩
ఆత్మాయం దేహఏవేతి చార్వాకేణ వినిశ్చితమ్. ౫౭౪

తా॥ పూర్వోక్తమగు పుత్రాత్మవాదమును నిరాకరించుచు దేహమే 'ఆత్మ' యని చార్వాకుడు చెప్పుచున్నాడు - ఎట్లన - ఆత్మలక్షణములు లేనిపుత్రుడు ఆత్మగానేరడు. ఆత్మయందుగల ప్రేమ, పుత్రునియందు గన బడుచుండుటచే పుత్రుడే ఆత్మ యగునని చెప్పునెడల, ధనము, గృహము, పొలము మున్నగు వానియందుకూడ ప్రేమకనబడుచుండుటచే నా ధనాదులు కూడ ఆత్మ గావలయునుగదా! మరియు లోకానుభవమును పరిశీలించినచో ప్రతి ప్రాణికిని పుత్రునియందుకంటె దేహమునందు పరమ ప్రేమ కనబడుచున్నది. అగ్నిచే గృహము దగ్ధమగునెడల పుత్రునికూడ పరిత్యజించి మానవుడు తనదేహమును రక్షించుకొనుచున్నాడు. దారిద్ర్య దశయందు తన దేహమును పోషించుట కొరకై పుత్రుని పరులకు విక్రయించుచున్నాడు. ఇంతియగాక తమకు విరుద్ధముగా సంచరించెడి పుత్రుని వధించెడి వారు కూడగలరు. కావున పుత్రుడు ఆత్మయనుట యుక్తముగాదు.

మరియు పుత్రాత్మవాది, తండ్రియొక్క గుణరూపములు పుత్రుని యందు కనబడుచుండుటచే పుత్రుడు తండ్రియొక్క యాత్మస్వరూపమగునని యనుచున్నాడు. కాని యా వాదమంత బాగుగాలేదు. ఏలయన లోకమున కరచరణాది సర్వశరీరావయవ సమేతుడగు తండ్రికి,

కరములలో చరణములలో, మరి యుతరావయవములలో లేని పుత్రులు జన్మించుచున్నారు. సుందరులగు తండ్రులకు కురూపులగు పుత్రులు పుట్టుచున్నారు గుణవంతులకు గుణహీనులు సంభవించుచున్నారు. కావున ప్రతివాదియొక్క వాదము లన్నియు న్యాయవిరుద్ధములే యగుచున్నవి. ఇకను "ఆత్మావై పుత్రనామాసి" యను శ్రుతియొక్క యభిప్రాయము పుత్రుడు ఆత్మయనిగాదు. మరియేమన, ప్రపంచమునగృహక్షేత్రవిత్తాదుల యందన్నిటియందును, తండ్రికివలె పుత్రునకు సర్వాధికారములు గలవని తెలుపుటకొరకై పుత్రుడే యాత్మయని గౌణముగా వ్యవహరింపబడినది. అందుచే నెన్నటికిని పుత్త్రుడు ముఖ్యమగు నాత్మగా నేరడు.

ముఖ్యమగు నాత్మ దేహముగాని మరి యేదియుగాదు. కావుననే సకల ప్రాణులును, దేహమే నేనను నిశ్చయముతో నున్నవి. ఇందులకు శ్రుతిగూడ ననుకూలముగా నున్నది. తైత్తిరీయోపనిషత్తు నందలి "సవాఏషపురుషోఽన్నరసమయః" అను వాక్యము అన్న వికారమగు నీ దేహమే పురుషుడని చెప్పుచున్నది. పురుషుడన నాత్మయే గదా! కావున నైవిధములగు ప్రమాణములవలన దేహమే యాత్మయని చార్వాకుడు నిర్ణయించుచున్నాడు.

శ్లో॥ తన్మతం దూషయత్యన్యో ఽసహమానః పృథగ్జనః,
దేహ ఆత్మా కథంనుస్యా త్పరతన్త్రో హ్యచేతనః॥ ౫౭॥
ఇన్ద్రియై శ్చాల్యమానోఽయం చేష్టతే న స్వతఃక్వచిత్,
ఆశ్రయ శ్చక్షురాదీనాం గృహ వద్గృహమేధినామ్.
బాల్యాదినానావస్థావాన్ శుక్లశోణితసంభవః,
అతః కదాఽపి దేహస్య నాత్మత్వ ముపపద్యతే. ౫౮

తా॥ ఇన్ద్రియములే యాత్మయని వాదించు మరియొక పామరుడు పూర్వమందు చెప్పబడిన దేహాత్మవాదమును ఖండించుచున్నాడు- ఎట్లన-

దేహము జడము. (ఇయ్యది) స్వయముగా తనంతట తాను యేపనిని చేయ లేదు. చేతనములగు జ్ఞానకర్మేన్ద్రియములచే చలింపజేయబడుచున్నదై దర్శన భాషణాది వ్యాపారముల నొనరించుచున్నది. మరియు నీదేహము, గృహస్థులకు గృహము ఆశ్రయమగునటుల చక్షురాదీన్ద్రియములకు ప్రధానాశ్రయమై యున్నది. బాల్యము, యౌవనము, కౌమారము, వార్ధక్యము మున్నగు ననేక పరిణామములు కలిగియున్నది. మాతా పితరుల యొక్క శుక్లశోణిత సంయోగమువలన పుట్టుచున్నది, కావున నట్టి దేహ మెన్నటికి నాత్మగాదగదు.

శ్లో॥ బధిరోఽహంచ కాణోఽహం మూక ఇత్యనుభూతితః,
ఇన్ద్రియాణి భవన్త్యాత్మా యేషా మస్త్యర్థవేదనమ్.

తా॥ లోకమునందు నేను చెవిటివాడను గాన నాకు వినబడదు. నేను గ్రుడ్డివాడను గాన వస్తువుల జూడజాలను. నేను మూగవాడను గాన మాటలాడలేను. అను ననుభవముల ననుసరించి యాలోచించినచో పదార్థ జ్ఞానము ఇన్ద్రియములకే కలదని తెలియుచున్నది. కావున పదార్థములను, గ్రహించెడి చక్షురాదీన్ద్రియములే ఆత్మయనియెఱుంగవలయును.

శ్లో॥ ఇన్ద్రియాణాం చేతనత్వం దేహప్రాణాః ప్రజాపతిమ్,
ఏత మేత్యోత్యూచురితి శ్రుత్యైవ ప్రతిపాద్యతే. ౫౨౯
యతస్తస్మాదిన్ద్రియాణాం యుక్తమాత్మత్వ మిత్యముమ్,
నిశ్చయం దూషయత్యన్యోఽసహమానః పృథగ్జనః. ౫౩౦

తా॥ ఛాన్దోగ్యమనిషత్తు నందలి పంచమాధ్యాయ ప్రథమఖండమున ప్రాణములన్నియు (ఇన్ద్రియములు) మనస్సు తమతమ గొప్పతనమును గురించి వివాదపడి, తుదకు తమ తండ్రియగు బ్రహ్మదేవునియొద్దకుబోయి యడిగినవని చెప్పబడుచున్నది. కావున నింద్రియములుచేతనములని శ్రుతిచే

యంగీకరించుచున్నది. ఇందుచే నింద్రియములే యాత్మయగునని ఇన్ద్రి యాత్మవాది నిశ్చయించుచున్నాడు. ఈ మతమును మరియొకడు (ప్రాణాత్మవాది) దూషించుచున్నాడు.

శ్లో॥ ఇన్ద్రియాణి కథం త్వాత్మా కరణాని కుఠారవత్,
కరణస్య కుఠారాదే శ్చేతనత్వం నహీష్యతే. ౫౩౧

శ్రుత్యాఽధిదేవతావాద ఇన్ద్రియేషూపచర్యతే,
న తుసాక్షాదిన్ద్రియాణాం చేతనత్వ ముదీర్యతే. ౫౩౨

అచేతనస్య దీపాదే రర్థాభాసకతా యథా,
తథైవ చక్షురాదీనాం జడానా మపిసిద్ధ్యతి. ౫౩౩

తా॥ లోకమున, వృక్షాదులను ఛేదించుటకు కుఠారాదులు (గొడ్డలి మొదలగునవి) సాధనములగుచున్నట్లుగా, ఘటపటాదులను గ్రహించుటకు చక్షురాదీన్ద్రియములు సాధనములగుచున్నవి. కుఠారాది సాధనములు జడములుగా నుండుట నిర్వివాదాంశము. అటులనే తత్తద్వస్తు విజ్ఞాన సాధనములగు ఇన్ద్రియములు గూడ నచేతనములే కావలయును. అచేతనములగు దీపాదులు పదార్థములను ప్రకాశింపజేయుచున్నట్లుగా నచేతనములగు ఇన్ద్రియములు ఆ యా విషయములను గ్రహించుచుండుటలో విరోధమేమియు లేదు. ఈ విధమున నిన్ద్రియములు అచేతనములని నిర్ణయించిన యెడల, ఇన్ద్రియములు చేతనములను నాశయమెంతో, వాని యొక్క పరస్పర వివాదమును, బ్రహ్మయొద్దకు పోయి యడుగుటను ప్రతిపాదించుచున్న ఛాన్దోగ్య శ్రుతియెట్లు పొసగుననగా, ఛాన్దోగ్య శ్రుతి-ఇన్ద్రియాధిష్ఠాన దేవతలయొక్క వివాదమును ఇన్ద్రియముల యందారోపించి గౌణముగా నిన్ద్రియములు కలహించినవని చెప్పినదిగాని, సాక్షాత్తుగా ఇన్ద్రియములు చేతనములని చెప్పలేదు. కావున సర్వవిధముల నచేతనములగు నిన్ద్రియములు 'ఆత్మ' గానేరవు.

శ్లో॥ ఇన్ద్రియాణాం చేష్టయితా ప్రాణోఽయం పంచవృత్తికః,
సర్వావస్థాస్వవస్థావాన్ యో(సో)ఽయమాత్మత్వమర్హతి.
అహం క్షుధావాన్ తృష్ణావా నిత్యాద్యనుభవాదపి.

శ్లో॥ శ్రుత్యాఽన్యోఽన్తర ఆత్మా
ప్రాణమయ ఇతీర్యతే యస్మాత్
తస్మాత్ప్రాణ స్యాత్మత్వం యుక్తం
న కరణాఖ్యానామ్. ౫౩౫

తా॥ ఇక నాత్మ యేది యనగా, జ్ఞానేంద్రియ కర్మేన్ద్రియము లను వాని వాని పనులయందు ప్రవర్తింపజేయునదియు, ప్రాణాపాన వ్యానోదాన సమానములను నైదువ్యాపారములతో గూడినదియు, పుట్టినది మొదలు మరణమువరకునుండు, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థల యందును, బాల్యయౌవన కౌమార వార్థక్యదశలయందును, నిరన్తరముండు నదియు నగు ప్రాణము, 'ఆత్మయగుచున్నది. కావుననే లోకులందఱును 'నేను ఆకలిగొన్నవాడను' 'నేను దప్పికగలవాడను' అని యనుచున్నారు. ఆకలి దప్పికలు రెండును ప్రాణధర్మములు గదా! మరియు తైత్తిరీయక శ్రుతి యందు అన్నమయకోశమునకు లోపలనున్న ప్రాణమయకోశమే ఆత్మ యని చెప్పబడుచున్నవి. కావున ప్రాణమే ఆత్మయగునుగాని, ఇన్ద్రియ ములు ఆత్మగా నేరవు.

శ్లో॥ ఇతినిశ్చయ మేతస్య దూషయత్యపరో జడః,
భవత్యాత్మా కథం ప్రాణో వాయు రేవైష ఆన్తరః. ౫౩౬

శ్లో॥ బహిర్యాత్యన్తరాయాతి భస్త్రికావాయువన్ముహుః,
న హితంవాఽహితంవా స్వ మన్యద్వా వేదకించన.

శ్లో॥ జడస్వభావ శ్చపలః కర్మయుక్తశ్చ సర్వదా,
ప్రాణస్య భానం మనసి స్థితే సుప్తే న దృశ్యతే. ౫౩౮

తా॥ పూర్వప్రతిపాదితమగు ప్రాణాత్మవాదమును మన ఆత్మనాది యొక మరియొక వాదమును ప్రతిఘటించుచున్నాడు—ఎట్లన—ప్రాణమనగా దేహములోపల సంచరించు వాయు విశేషము. ఇది జడము (అచేతనము) కావుననే తనయొక్కగాని, పరులయొక్కగాని మంచి చెడుగుల నెఱిగె మాత్రము నెఱుంగకున్నది. మరియు నీ ప్రాణము కమ్మరివాని కొలిమి నూదు తిత్తిలోని గాలివలె నిరంతరము శరీరమునుండి వెలుపలికి బోవుచు శరీరములోనికి ప్రవేశించుచు నున్నది. కావుననే అతి చంచల స్వభావము గలిగి యున్నది.

ఇంతియేగాక జాగ్రత్స్వప్నముల యందు మనస్సు పనిచేయుచున్నప్పుడు ప్రాణము సంచరించుచున్నటుల తెలియబడుచున్నదిగాని, సుషుప్తి (గాఢనిద్ర) యందు మనస్సు ప్రచారరహితమైనది కాగా ప్రాణవాయువు యొక్క సత్తయైనను తెలియబడుట లేదు. కావున నిట్టి యనేక దోషభూయిష్ఠమగు ప్రాణము సర్వదోషవర్జితమైన యాత్మస్వరూపము కాజాలదు.

శ్లో॥ మనస్తు సర్వం జానాతి సర్వవేదనకారణమ్,
యత్తస్మా న్మనఏవాత్మా ప్రాణస్తు న కదాచన. ౫౩౯
సంకల్పవానహం చిన్తావానహంచ వికల్పవాన్,
ఇత్యాద్యనుభవాద‘‘న్యో ఽన్తరఆత్మా మనోమయః’’.
ఇత్యాదిశ్రుతిసద్భావా ద్యుక్తా మనస ఆత్మతా. ౫౪౦

తా॥ బాగుగా విచారించిన యెడల ‘మనస్సు’ ఆత్మయనుట యుక్తము. ఏలయనగా ఇన్ద్రియములచే గ్రహించబడిన శబ్దాది విషయ

ముల నన్నిటిని మనస్సే తెలిసికొనుచున్నది. మనస్సు పనిచేయకున్నచో, ఇన్ద్రియములు విషయములను గ్రహింప లేకున్నవి గదా! కావున సర్వ విజ్ఞాన కారణమగు మనస్సు ఆత్మయనుటలో ననుమానమింతయు లేదు. మరియు లోకానుభవమున నేను సంకల్పములు గలవాడననియు, నేను వికల్పములు గలవాడననియు, నేను చిన్తావంతుడననియు మున్నగు జనవాదములు ప్రసిద్ధముగా నున్నవి. సంకల్పవికల్పాదులన్నియు మనోధర్మములని గదా వేదాన్త సంప్రదాయము. వేయేల! - శ్రుతియే సాక్షాత్తుగా ప్రాణమయ కోశమునకు లోపలనున్న మనోమయ కోశమే ఆత్మయని నుడువుచున్నది. కావున పలువిధములగు పై కారణములచే మనస్సే ఆత్మయని చెప్పుట సమంజసము.

శ్లో॥ ఇతినిశ్చయ మేతస్య దూషయ త్య పరోజడః,
కథం మనస ఆత్మత్వం కరణ స్య దృగాదివత్. ౫౮౨
కర్తృప్రయోజ్యం కరణం న స్వయంతు ప్రవర్తతే,
కరణప్రయోక్తా యః కర్తా సఏవాత్మత్వ మర్హతి. ౫౮౩
ఆత్మా స్వతన్త్రః పురుషో న ప్రయోజ్యః కదాచన ౫౮౪

తా॥ పూర్వవర్ణితమగు మన ఆత్మవాదమును బౌద్ధుడు దూషించుచున్నాడు — ఎటులనగా మనస్సు ఆత్మగా నేరదు. ఇది జడము. చక్షురాదీన్ద్రియములు ఏరీతిగా విషయములను తెలిసికొనుటకు సాధనములగుచున్నవో మనస్సు గూడ నటులనే విషయ విజ్ఞానమునకు సాధనమగుచున్నది సాధన మనునది చేతనుడగు కర్తచే ప్రయోగింపబడ దగినదియే కాని తనంతట తాను మాత్రము ఏ పనియందును ప్రవర్తింపలేదు. ఆత్మయన్ననో స్వతన్త్రమైనది. అది దేనిచేతను ప్రేరేపింపబడునదిగాదు. కావున మనస్సు ఇన్ద్రియములు మున్నగు సాధనములను ప్రేరేపించునట్టి శరొకటి ఆత్మయగునుగాని, సాధనమగు మనస్సు ఎన్నటికిని ఆత్మగానేరదు.

శ్లో. అహం కర్తా ఽస్మ్యహం భోక్తా సుఖీత్యనుభవాదపి,
బుద్ధి రాత్మా భవత్యేవ బుద్ధిధర్మో హ్యహంకృతిః. ౨౮౨

శ్లో. అన్యో ఽన్తర ఆత్మా విజ్ఞానమయ ఇతి వదతి నిగమః,
మనోమయాదపి చ భిన్నం విజ్ఞానమయం కర్తృరూపమాత్మానమ్.
విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతే ఽపి చ,
ఇత్యస్య కర్తృతా శ్రుత్యా ముఖతః ప్రతిపాద్యతే,
తస్మాన్ముక్తా ఽత్మతా బుద్ధే రితి బౌద్ధేన నిశ్చితమ్.

నా బుద్ధి స్వతన్త్రమైనదై మన ఇన్ద్రియాదులను వాని వాని పనులందు ప్రవేశింపజేయుచున్నది. కావున నిట్టి బుద్ధియే ఆత్మయనుట యుక్తము. ఇందుకు లోకానుభవము ప్రబలసాక్ష్యము. లోకమున జనులందరును, నేను, లౌకిక వైదిక కర్మల నాచరించుచుండువాడననియు, నేను పుణ్యపాప ఫలముల ననుభవించువాడననియు, నేను సుఖము గలవాడననియు, మొదలగు వాక్యములను పలుకుచున్నారు. కర్తృత్వ భోక్తృత్వాది ధర్మములన్నియు బుద్ధికి సంబన్ధించినవేగదా! అందుచే బుద్ధియే ఆత్మయగును. మరియు సర్వప్రమాణ మూర్ధన్యమగు తైత్తిరీయక శ్రుతి, మనోమయ కోశమునకు లోపలనుండు విజ్ఞానమయమే ఆత్మయనియు ఆ విజ్ఞానమే సర్వవైదిక లౌకికకర్మల నాచరించుచున్నదనియు చెప్పుచున్నది. విజ్ఞానమనగ బుద్ధియేగదా! కావున సర్వవిధముల బుద్ధియే ఆత్మయగుచున్నదని బౌద్ధమతస్థులు నిర్ణయించుచున్నారు.

శ్లో. ప్రాభాకర స్తార్కికశ్చ తావుభావప్యమర్షయా,
తన్నిశ్చయం దూషయతో బుద్ధి రాత్మా కథం త్వితి.
బుద్ధే రజ్ఞాన కార్యత్వాత్ వినాశిత్వా త్ప్రతిక్షణమ్.

తా॥ పూర్వమీమాంసామత ప్రవర్తకుడగు ప్రాభాకరుడును, తార్కికుడును వీరిరువురు పూర్వోక్తమగు బౌద్ధమతమును ఖండించుచున్నారు. ఎందుచేతననగా బుద్ధి యనునది ప్రతిక్షణమును పుట్టి నశించుచుండును. ఇయ్యది అజ్ఞానముయొక్క కార్యము. ఆత్మయన్ననో నిత్యము. అది మరియొక దానివలన పుట్టునట్టి కార్యముగాదు, కావున అజ్ఞాన కార్యము నశ్వరమునగు బుద్ధి ఆత్మగానేరదు.

శ్లో॥ బుద్ధ్యాదీనాం చ సర్వేషా మజ్ఞానే లయదర్శనాత్,
అజ్ఞోఽహ మిత్యనుభవా దాస్త్రీబాలాదిగోచరాత్,
భవత్యజ్ఞానమేవాత్మా న తు బుద్ధిః కదాచన. ౫౬౦

తా॥ ఇక నేది యాత్మ యనగా అజ్ఞానమే ఆత్మయగును. ఏల యనగా సుషుప్తికాలమునందు బుద్ధి మొదలగు సర్వేంద్రియములును, అజ్ఞానమునందు లయించుచున్నవి. ఆత్మ సర్వలయాధారమని కదా శాస్త్రసంప్రదాయము. మరియు ప్రపంచమున పడింతులు, పామరులు అందరును "నేను అజ్ఞుడను నాకేమియు తెలియదు" అని వ్యవహరించుచున్నారు. కావున సర్వానుభవసిద్ధమగు నజ్ఞానమే ఆత్మయగునుగాని బుద్ధి ఆత్మకా దగదు.

శ్లో॥ విజ్ఞానమయా దన్యం
త్వాఽఽనందమయం పరం తథాప్యాత్మానమ్,
అన్యోఽంతరఆత్మాఽఽనందమయ
ఇతివదతి వేదోఽపి. ౫౬౧

తా॥ మరియు తైత్తిరీయక శ్రుతి, విజ్ఞానమయకోశమునకు లోపలనున్న ఆనన్దమయకోశమే ఆత్మయని చెప్పుచున్నది. ఆనందమయమనగా దుఃఖాభావరూపమగు నజ్ఞానమే గదా! కావున అజ్ఞానమే ఆత్మయనుటయు క్తము.

శ్లో॥ దుఃఖప్రత్యయశూన్యత్వా దానందమయతా మతా,
బుద్ధ్యాదిసకలం సుప్తా వజ్ఞానే ప్రవిలీయతే. ౫౫౨
దుఃఖనోఽపి సుషుప్తౌతు ఆనందమయతా తతః,
సుప్తా కించి న్నజానా మీాత్యనుభూతిశ్చ దృశ్యతే. ౫౫౩
యతఏవ మతోఽయుక్తా హ్యజ్ఞాన స్యాత్మతా ధ్రువమ్.

తా॥ సుషుప్తి కాలమున, ఇన్ద్రియములు, బుద్ధి మున్నగునవన్నియు అజ్ఞానమునందు లయించుచున్నవి. కావుననే ఇన్ద్రియాదుల వలన సంభవించెడి దుఃఖము లేవియు ఆత్మకు కనబడకున్నవి. దుఃఖములు లేకుండుటయే కదా! ఆనన్దానుభవమగుచున్నది : అందువలననే జాగ్రత్స్వప్నము లందు పలు దుఃఖముల ననుభవించుచున్నవారు గూడ గాఢనిద్ర (సుషుప్తి) యందు దుఃఖవర్జితులగుచున్నారు. ఇట్టి సుషుప్తియందు అజ్ఞానము తప్ప మరియొక్కటి యేమియు గోచరము కాదు. కనుకనే నిద్రనుండి లేచిన ప్రతివారును, నాకేమియు తెలియలేదని చెప్పుచున్నారు. పై విధములగు పలుప్రమాణములచే అజ్ఞానమే ఆత్మయని తోచుచున్నది.

శ్లో॥ ఇతి తన్నిశ్చయం భాట్టాః దూషయన్తి స్వయుక్తిభిః,
కథ మజ్ఞానమేవాత్మా జ్ఞానం చాఽప్యుపలభ్యతే.
జ్ఞానాఽభావే కథం విద్యా రజ్ఞోఽహ మితిచాఽజ్ఞతామ్.

తా॥ పూర్వమందు వర్ణింపబడిన (ప్రాభాకరుని యొక్కయు, తార్కికుని యొక్కయు) అజ్ఞానాత్మవాదమును, భాట్టమతస్థులు నిరాకరించుచున్నారు. ఎట్లనగా—అజ్ఞాన మొక్కటియే 'ఆత్మ' యెట్లగును? సుషుప్తికాలమున ఆత్మయందు అజ్ఞానముతో పాటు జ్ఞానంబును గలదు. కానిచో మరియొకటి, అజ్ఞానానుభవ కాలమునందు జ్ఞానము లేకున్నచో జనులు "మేమజ్ఞులము" అని తమ యజ్ఞత్వమునైన నెట్లు గ్రహింప గలుగుదురు? కావున అజ్ఞానమే కేవలము ఆత్మయని చెప్పుట బాగుగా లేదు.

శ్లో॥ అస్వాప్సం సుఖమేవాఽహం నజానామ్యత్ర కించన,
ఇత్యజ్ఞానమపి జ్ఞానం ప్రబుద్ధేషు ప్రదృశ్యతే. ౫౫౬

శ్లో॥ ప్రజ్ఞానఘనఏవానన్ద మయ ఇత్యపి శ్రుతిః,
ప్రబ్రవీ త్యుభయాత్మత్వమాత్మనస్స్వయ మేవసా. ౫౫౭

శ్లో॥ ఆత్మాఽతశ్చిజ్జడతనుః ఖద్యోత ఇవ సమ్మతః,
నకేవలా జ్ఞానమయో ఘటకుడ్యాది వజ్జడః. ౫౫౮

తా॥ సుషుప్తియనగా గాఢనిద్ర. ఇట్టి నిద్రనుండి మేల్కాంచిన ప్రతివారును, నేను సుఖముగా నిద్రించితిననియు, నాకేమియు నిద్రలో తెలియలేదనియు చెప్పుచున్నారు. సుషుప్తియందు జ్ఞానాజ్ఞానముల రెంటియొక్కయు, అనుభవము లేకున్నచో, పై విధములగు జన వాక్యములు సంభవింపనేరవుగదా! మరియు మాండూక్యశ్రుతి స్పష్టముగా సుషుప్తియందు ఆత్మ, మనస్సు వలన గలిగెడు విశేష విజ్ఞానము లేమియు లేకుండజేసి, ఆనందము మిక్కుటముగా గలవాడై జ్ఞానాజ్ఞాన స్వరూపుడగుచున్నాడని చెప్పుచున్నది. అనగా సుషుప్తికాలమునందు స్థూల సూక్ష్మశరీరములు రెండును కారణ శరీరమగు అజ్ఞానమునందు లయించుటచే నట్టి యజ్ఞానమును, నాకేమియు తెలియదను అనుభవము గలవాడగుటచే జ్ఞానమున్ను ఈ రెండును నిద్రలో గలవు కావున, మిణుగురుపురుగు ఏ రీతిగా కొంత ప్రకాశమును, కొంత అప్రకాశమును గలిగియున్నదో అటులనే ఆత్మగూడ జ్ఞానాజ్ఞానములు రెండును కలసి స్వరూపముగా గలవాడు గాని ఘటపటాదులవలె కేవల జడస్వరూపుడుగాడు. అటులైనచో ప్రపంచవ్యవహారము లేమియు సంభవింపనేరవు గదా!

శ్లో॥ ఇతి నిశ్చయమేతేషాం దూషయ త్యపరో జడః,
జ్ఞానాజ్ఞానమయస్స్వాత్మా కథం భవితు మర్హతి. ౫౫౯

పరస్పరవిరుద్ధత్వా త్తేజ స్తిమిరవ త్తయోః.
సామానాధికరణ్యం వా సంయోగోవా సమాశ్రయః,
తమః ప్రకాశవత్ జ్ఞానా జ్ఞానయో ర్నహి సిద్ధ్యతి. ౫౬౦

తా॥ పూర్వోక్తమగు భాట్టమతమును, (సాంఖ్యమతుడు) శూన్యాత్మవాది త్రోసిపుచ్చుచున్నాడు. ఎందుచేత ననగా- జ్ఞానాజ్ఞానములు రెండును చీకటి వెలుతురులవలె పరస్పరము భిన్నస్వభావములు గలవియగుచున్నవి కావుననే ఈ రెండింటికిని, కుండ, బట్ట రెండునూ కలసి భూమిమీద నుండునట్లుగా, ఒకచోటనుండుటగాని, రెండుచేతులుకలసి కొనునట్లుగా, కలసి కొనియుండుటగాని, శరీరము దాని యవయవములు పరస్పరము ఒకదాని నొకటి ఆశ్రయించియున్నట్లుగా ఒకటి నొకటి ఆశ్రయించు కొని యుండుటగాని సంభవింప నేరదు అందుచే జ్ఞానాజ్ఞానాత్మవాదము ఎంత మాత్రమును ఆదరణీయము గాదు.

శ్లో॥ అజ్ఞాన మపి విజ్ఞానం బుద్ధిర్వాఽపిచ తద్గుణాః,
సుషుప్తౌ నోపలభ్యన్తే యత్కించిదపి వాపరమ్. ౫౬౧
మాత్రాది లక్షణం కింతు శూన్యమేవోపలభ్యతే,
సుషుప్తౌ నాఽన్యద స్త్యేవ నాఽహమప్యాస మిత్యను.
సుప్తోత్థిత జనై స్సర్వై శ్శూన్యమేవాఽనుస్మర్యతే,
య త్తత శ్శూన్యమేవాత్మా నజ్ఞానా జ్ఞానలక్షణః. ౫౬౨

తా॥ ఇక నేది ఆత్మయనుట యుక్తమనగా, సుషుప్తియందు, జ్ఞానముగాని, అజ్ఞానముగాని, బుద్ధిగాని, బుద్ధిగుణములగు కామసంకల్పాదులు గాని, ఇన్ద్రియములుగాని, ఇన్ద్రియవిషయములగు శబ్దస్పర్శాదులు గాని యేమియులేవు. మరి, శూన్యమొక్కటియే గలదు. కనుకనే నిద్ర నుండి మేల్కొంచిన వారందఱును, 'సుషుప్తియందు శూన్యము తప్ప

మరి యెద్దియు లేదనియు శూన్యమునజూచెడి నేను కూడ లేనే లేననియు జెప్పుచున్నారు. కాన సర్వజనానుభవ గోచరమగు శూన్యమే ఆత్మయగునుగాని భాట్టులు చెప్పిన చొప్పున జ్ఞానాజ్ఞాన ద్వయము ఆత్మగా నేరదు.

శ్లో॥ వేదేనాఽప్యసదేవేద మగ్ర ఆసీ దితిస్ఫుటమ్,
నిరుచ్యతే యతస్తస్మా చ్ఛూన్యస్యైవాత్మతామతా.

శ్లో॥ అసన్నేవ ఘటః పూర్వం జాయమానః ప్రదృశ్యతే,
నహికుంభః పురైవాన్తః స్థిత్వోదేతిబహిర్ముఖః. ౫౬౫

శ్లో॥ యత్తస్మా దసత స్సర్వం సదిదం సమజాయత,
తత స్సర్వాత్మనా శూన్య మేవాత్మత్వంసమర్హతి. ౫౬౬

తా॥ మరియు ఛాన్దోగ్యశ్రుతి స్పష్టముగా, ఈ కనబడుచున్న ప్రపంచమంతయు సృష్టికి పూర్వము శూన్యముగానే యుండి అట్టి శూన్యమునుండియే నామరూపభేదములచే పలువిధములుగా జన్మించుచున్నదని చెప్పుచున్నది. లోకానుభవమున జూచినను, కుండ మొదలగు వస్తువు లన్నియు తాము పుట్టుటకు పూర్వము లేకున్నవై పుట్టుచున్నవి గదా! అట్లుగాక పూర్వమునందున్నవియే పుట్టునెడల కుమ్మరి దండము చక్రము మున్నగున వన్నియు వ్యర్థములే యగును గదా. కావున నన్ని విధములను పరిశీలింపగా శూన్యమే ఆత్మయగుచున్నది.

శ్లో॥ ఇత్యేవం పండితమ్మన్యైః పరస్పర విరోధిభిః,
తత్తన్మ తానురూపాఽల్ప శ్రుతియుక్త్యనుభూతిభిః.
నిర్ణీత మతజాతాని ఖండితాన్యేవ పండితైః,
శ్రుతిభిశ్చా ప్యనుభవై ర్బాధకైః ప్రతివాదినామ్. ౫౬౭

శ్లో॥ యత స్తస్మా త్సుపుత్రాదేః శూన్యాంతస్య విశేషతః,
సుసాధిత మనాత్మత్వం శ్రుతియుక్త్యనుభూతిభిః. ౫౬౯

తా॥ ఈ విధముగా, శాస్త్రపాండిత్యము లేని మూఢులందరును తామే పండితులమని గర్వించి పుత్రుడు మొదలు శూన్యమువరకునుండు దానిలో నేదియో యొకటియే ఆత్మయని ప్రమాణములవలె భాసించెడి యనుభవములచేతను, తర్కములచేతను, వేదవాక్యములచేతను, వాదించు చున్నారు. వీరి వాదములన్నియు, వేదశాస్త్రవిదులగు విద్వాంసులచే తాత్పర్యోపేతములగు శ్రుతివాక్యములను, ప్రతివాదులకు ప్రతికూలములగు ప్రత్యక్షాది ప్రమాణములను, అవలంబించి, నిరాకరింపబడినవి. కావున పుత్రుడు మొదలు శూన్యమువరకు నుండునదంతయు ఆత్మకంటె భిన్నమేగాని, ఆత్మగానేరదు.

శ్లో॥ నహి ప్రమాణాన్తర బాధితస్య
యాథార్థ్య మంగీక్రియతే మహద్భిః,
పుత్రాదిశూన్యాంత మనాత్మతత్త్వమ్
ఇత్యేవ విస్పష్ట మత స్సుజాతమ్. ౫౭౦

తా॥ ఒక ప్రమాణముచే (సత్యమని) నిర్ణయింపబడినదైనప్పటికిని ప్రబలములగు ప్రమాణాన్తరములచే సత్యముగాదని నిరాకరింపబడిన పదార్థమును ప్రమాణమునుగా, పండితులు స్వీకరింపరు. గాన పుత్రాది శూన్యాంతమంతయు నాత్మస్వరూపము గానేరదని తెస్సగా నిర్ణయింపబడినది.

శ్లో॥ సుషుప్తికాలే సకలే విలీనే
శూన్యంవినా నాఽన్యదిహోపలభ్యతే,
శూన్యం త్వనాత్మా న తతః పరః కో౽
ప్యాత్మాభిధాన స్త్వనుభూయతేఽర్థః. ౫౭౧

శ్లో॥ యద్యస్తి చాత్మా కిమునోపలభ్యతే
సుప్తౌ యథా తిష్ఠతి కిం ప్రమాణమ్,
కిం లక్షణోఽసౌ సకథం నబాధ్యతే
ప్రబాధ్యమానే ప్యహ మాదిషుస్వయమ్. ౫౮౨

తా॥ ఈ విధమున శూన్యము గూడ నాత్మగాదని గురువు ఉపదేశించిన పిమ్మట శిష్యుడు సందిగ్ధచిత్తుడై తన సందేహములను వెల్లడించుచున్నాడు-గాఢనిద్రయందు దేహేన్ద్రియాది ప్రపంచమంతయును కనబడుట లేదు. అట్టియెడ శూన్యము తప్ప ఆత్మయను పదార్థ మెద్దియును ప్రసిద్ధముగా లేదు. సుషుప్తిలో ఆత్మయున్నచో నేల కనబడదు? కావున నో స్వామీ! గురువర్యా! సుషుప్తియందు ఆత్మయున్న దనుటకు ప్రమాణమేమి? ఆయాత్మ కేమి స్వరూపము? బుద్ధి మున్నగున వన్నియును గాఢనిద్రయందు బాధింపబడుచుండగా ఆ యాత్మ తాను మాత్రమేల బాధింపబడకున్నది.

శ్లో॥ ఏతత్సంశయ జాతం మే హృదయగ్రన్థి లక్షణమ్,
భిన్ధి యుక్తి మహాఖడ్గ ధారయా కృపయా గురో! ౫౮౩

తా॥ ఓ ఆచార్య ప్రభూ! తమరు నా యందు దయయుంచి, ఊడ తీయుటకు వీలుగాని, త్రాటిముడివలె బాధించుచున్న నా సంశయములను శాస్త్రానుభవ సమ్మతములగు యుక్తి ఖడ్గములచే ఛేదింపవలయునని వేడుకొనుచున్నాను.

శ్లో॥ అతిసూక్ష్మ తరః ప్రశ్నః తవాఽయం సదృశో మతః,
సూక్ష్మార్థ దర్శనం సూక్ష్మ బుద్ధిష్వేవ ప్రదృశ్యతే.
శ్రుణువక్ష్యామి సకలం యద్యత్పృష్టం త్వయాధునా,
రహస్యం పరమం సూక్ష్మం జ్ఞాతవ్యంచ ముముక్షుభిః.

తా॥ అంతట గురుం డిట్లనుచున్నాడు. నాయనా ఈచేసిన ప్రశ్నము ప్రతిభాశాలివగు నీకు దగియున్నది. సూక్ష్మబుద్ధిగలవారలకే యిట్టి సూక్ష్మవిషయము గోచరించునుగాని, బాహ్యవిషయాసక్తచిత్తులగు మందమతులకు స్ఫురింపదుగదా! కావున నీ వడిగిన దంతయు చక్కగా చెప్పెదను. ఈ చెప్పబోవు విషయము పరమరహస్యమును శాస్త్రసారమును, సకలముముక్షువులకును తెలిసికొనదగినదియు నగుచున్నది. కావున శ్రద్ధతో వినుము.

శ్లో॥ బుద్ధ్యాది సకలం సుప్తౌ వనులీయస్య కారణే,
అవ్యక్తే వటవద్బీజే తిష్ఠ త్యవిక్రతాఽఽత్మనా,
తిష్ఠత్యేవ స్వరూపేణ నతు శూన్యాయతే జగత్. ౫౭౭

తా॥ మఱ్ఱిచెట్టు సూక్ష్మరూపముతో తనకు మూలకారణమగు విత్తనమునం దుండునట్లుగా, సుషుప్తికాలమునందు బుద్ధీన్ద్రియ శరీరాది రూపమగు ప్రపంచమంతయు సూక్ష్మరూపమును జెంది స్వకారణమగు అజ్ఞానమున గ్రహింపశక్యముగాని స్వరూపముతో నుండునుగాని శూన్యమగుట లేదు.

శ్లో॥ క్వచి దంకురరూపేణ క్వచిద్బీజాత్మనా వటః,
కార్యకారణరూపేణ యథా తిష్ఠ త్యద స్తథా. ౫౭౮
అవ్యాకృతాత్మనాఽవస్థాం జగతో వదతి శ్రుతిః,
సుషుప్త్యాదిషు తద్భేదం వక్త్యవ్యాకృత మిత్యసౌ. ౫౭౯
ఇమ మర్థ మవిజ్ఞాయ నిర్ణీతం శ్రుతియుక్తిభిః,
జగతోఽదర్శనం శూన్య మితిప్రాహు రతద్విదః. ౫౮౦

తా॥ మఱియు మఱ్ఱిచెట్టు ఒకప్పుడు మొలక, ఆకులు, కొమ్మలు మొదలగువానిచే స్థూలరూపమునను, మఱియొకప్పుడు సూక్ష్మమగు బీజ

రూపమునను ఉండును. అటులనే ఈ ప్రపంచము కూడ సృష్టికాలము నందు నామరూపములచే స్థూలముగా కనబడుచున్నదై సుషుప్తి మూర్ఛా ప్రళయకాలములందు సూక్ష్మరూపమును జెందుచున్నది. కనుకనే అప్పుడు స్ఫుటముగా గనబడుటలేదు. ఈ యర్థమునే బృహదారణ్యక శ్రుతి 'అవ్యాకృత'మను శబ్దముచే బోధించుచున్నది. ఈ విధముగా శ్రుతియుక్తు లచే నిర్ణయింపబడిన విషయమును గ్రహింపలేనివారై కొందరు మూఢులు సుషుప్త్యాదులందు జగత్తు కనబడకుండుటనే శూన్యమని వాదించు చున్నారు.

శ్లో॥ నాఽసతస్సతఉత్పత్తిః శ్రూయతే నచదృశ్యతే,
ఉదేతి నరశృంగాత్కిం ఖపుష్పాత్కిం భవిష్యతి. ౫౮౧

తా॥ ఇటు పిమ్మట 'శూన్యమునుండియే జగత్తుపుట్టుచున్న'దని యెడి శూన్యవాదమునకు సమాధాన మియ్యబడుచున్నది. - లేనిదాని వలన (ఉన్న) వస్తువు పుట్టుటయనునది యెచ్చటను, ఎన్నడును, కన్న దియును, విన్నదియును గాదు. మనుష్యునకు కొమ్ములను ఆకాశమునందు పుష్పములను ఎన్నడును సంభవింపవుగదా! శూన్యములగు నిట్టి ఖపుష్ప నరవిషాణాదులవలన మఱియొక భావపదార్థమేది జన్మించును? ఏమియు పుట్టదని భావము.

శ్లో॥ ప్రభవతి నహి కుంభోఽవిద్యమానో మృదశ్చేత్
ప్రభవతుసికతాయా వాఽథవా వారిణోవా,
నహి భవతి చ తాభ్యా మన్యథా క్వాపి తస్మాత్
యత ఉదయతి యోఽర్థోఽ స్తత్ర తస్య స్వభావః.

తా॥ తనపుట్టుకకు పూర్వము మృత్తునందు యే విధమునను లేనట్టి కుండ, మృత్తువలన బుట్టనేరదు. అట్లు పుట్టునెడ నా కుండ (ఇసుక వలనగాని, జలమువలన గాని యేల పుట్టకున్నది? లేని కుండయే పుట్టు

నెడల) జలాదులవలన గూడ పుట్టవలయును గదా! కాని ఏ విధమునను అటుల పుట్టుటలేదు. అందుచే దేనివలన, ఏ పదార్థము పుట్టునో దానియం దా పదార్థము సూక్ష్మరూపమునసుండి యున్నదని తప్పక యొప్పుకొనవలయును.

శ్లో॥ అన్యథా విపరీతం స్యాత్కార్యకారణ లక్షణమ్,
నియతం సర్వశాస్త్రేషు సర్వలోకేషు సర్వతః. ౫౮౩

తా॥ కార్యముయొక్క స్వభావము కారణమునందు లేని యెడల సకలశాస్త్రములందు జెప్పబడుచున్నట్టియు సకల లోకములందు జూడ బడుచున్నట్టియు, సర్వపదార్థములందును ప్రసిద్ధమై యున్న "ఇది దీని యొక్క కార్యము. ఇది దీనియొక్క కారణము ననియెడి" కార్యకారణ భావమంతయు విరుద్ధమై పోగలదు.

శ్లో॥ కథ మసత స్సజ్జాయేతేతి శ్రుత్యా నిషిద్ధ్యతే తస్మాత్,
అసత స్సజ్జననం నో ఘటతే మిథ్యైవ శూన్యశబ్దార్థః.

తా॥ మరియు ఛాన్దోగ్యోపనిషత్తునందలి ఆరవ ప్రపాఠకమునందు "ఉద్దాలకుడను మహర్షి తనపుత్రుడగు శ్వేతకేతువునకు బ్రహ్మస్వరూప మును పదేశించుచు సృష్టికి పూర్వము సద్రూపమగు బ్రహ్మ మొక్కటియే కలదని చెప్పి-పిమ్మట-శూన్యవాదులు కొందరు సృష్టికి పూర్వము శూన్యమే కలదనియు, ఆ శూన్యమునుండియే ఈ స్థూలమగు ప్రపంచ మంతయు పుట్టుచున్నదనియు చెప్పుదురుగాని, అది యేతమాత్రమును సంభవింపదుగదా! నాయనా! కుమారా! అని శూన్యవాదమును నిరాక రించి తుదకు సత్యమగు బ్రహ్మమే సర్వజగత్కారణమని సిద్ధాంతముచేసి చెప్పెను" అని గలదు. కావున సుషుప్తికాలమునను, సృష్టికి పూర్వకాల మునను సూన్యమే గలదనియు, ఆ శూన్యమునుండియే జాగ్రత్స్వప్నము లందు కనబడుచున్న ప్రపంచమంతయు పుట్టుచున్నదనియు జేసెడి వాదము లంత మాత్రమును యథార్థముగా నేరవు.

శ్లో॥ అవ్యక్తశబ్దితే ప్రాజ్ఞే సత్యాత్మ న్యత్ర జాగ్రతి,
కథం సిద్ధ్యతి శూన్యత్వం తస్మిన్ భ్రాన్తశిరోమణే!. ౫౦౫

తా॥ ఓయి భ్రాన్తులలో నగ్రేసరుడా! సుషుప్తికాలము నందు జ్ఞానస్వరూపుకును సత్యస్వరూపుడును నగు ఆత్మ అవ్యక్తమను శబ్దముచే వ్యవహరింపబడుచున్నవాడై మేల్కొంచి యుండగా నప్పుడు శూన్యభావమెట్లు సంభవించును? సంభవించదుగదా?

శ్లో॥ సుషుప్తౌ శూన్యమేవేతి కేన పుంసా తవేరితమ్,
హేతునానుఽమితం కేన కథం జ్ఞాతం త్వయోచ్యతామ్.
ఇతి పృష్టే మూఢతమో వదిష్యతి కి ముత్తరమ్. ౫౦౬

శ్లో॥ నైవానురూపకం లింగం వక్తావా నాఽస్తికశ్చన,
సుషుప్తి స్థిత శూన్యస్య బోద్ధా కోన్యాత్మనః పరః?.

తా॥ మఱియు నో శూన్యవాదీ! సుషుప్తియందు శూన్యమే కలదని యే పురుషుడు నీకు చెప్పినాడు? ఏ హేతువుచే నీవు ఊహించితివి? నీవు స్వయముగా నెట్లెఱింగితివి? అని శూన్యవాదిని నిల్వదీసి వేదాన్తి యడిగినచో నా మూఢుడు సమాధానమేమి చెప్పగలడు? సుషుప్తియందు శూన్యమే కలదని సాక్ష్యము చెప్పువాడెవడును లేడుగదా! తర్కముచే నూహించుటకైనను చిహ్నమేమియులేదుగదా! ఇట్టియెడఆత్మయొక్కడే సుషుప్తియందు సర్వాభావమును గ్రహించువాడుగానున్నాడనియు తదితర మేమియు లేదనియూ నిర్ణీతమగుచున్నది.

శ్లో॥ స్వేనాఽనుభూతం స్వయమేవ వక్తి
స్వసుప్తికాలే స్థితశూన్యభావమ్,

తత్రస్వసత్తా మనవేక్ష్య మూఢః
స్వస్యాఽపి శూన్యత్వ మయం బ్రవీతి. ౫౮౮

తా॥ జీవాత్మ - నిద్రకాలమునందు తనచేత ననుభవింపబడిన సర్వపదార్థాభావమునే తాను జాగ్రదవస్థయందు చెప్పుచున్నాడు. దీనిచే నూన్యమునకు ద్రష్టగా తానున్నాడని తెలియుచున్నది. ఇట్టియెడ మూఢుడగు నే శూన్యాత్మవాది నిద్రయందలి తన యునికిని మఱచిన వాడై తాను కూడ లేననిభ్రమించి వ్యర్థముగా శూన్యవాదము నొనరించు చున్నాడు.

శ్లో॥ అవేద్యమాన స్స్వయమన్యలోకైః
సౌషుప్తికం ధర్మమవైతి సాక్షాత్,
బుద్ధ్యాద్యభావస్యచ యోఽత్ర బోద్ధా
సఏవ ఆత్మా ఖలు నిర్వికారః. ౫౮౯

తా॥ జీవాత్మ - గాఢనిద్రాకాలమునందు, తాను ఇతరులెవ్వరి చేతలు తెలియబడినివాడై స్వాత్మానందము ననుభవించుచు, బుద్ధీన్ద్రియా దుల యొక్క లేకుండుటకు సాక్షిగా నున్నాడు. నిజముగా నాలోచించి నచో, కర్తృత్వము మున్నగు వికారములన్నియు, బుద్ధీన్ద్రియాదులకు సంబన్ధించినవేగాని ఆత్మకు సంబన్ధించినవి గావుకదా. కనుకనే సుషుప్తి కాలమునందు బుద్ధీన్ద్రియాదులన్నియు సూక్ష్మభావమును చెందినవికాగా, ఆత్మ నిర్వికారుడై యున్నాడు.

శ్లో॥ యస్యేదం సకలం విభాతి మహసాసత్యస్స్వయంజ్యోతిమః
సూర్యస్యేవ కిమస్తి భాసకమిహ ప్రజ్ఞాదిసర్వంజడమ్,
నహ్యర్కస్య విభాసకం క్షితితలే దృష్టం తథైవాత్మనః
నాఽన్యఃకోఽప్యనుభాస కోఽభవితానాఽతఃపరఃకశ్చన.

తా॥ సూర్యుడు లోకమునందలి పదార్థముల నన్నింటిని ప్రకాశింప జేయుచున్నాడుగాని సూర్యుని మాత్రము ఏ వస్తువును భాసింపజేయ కున్నది. అటులనే సచ్చిదానన్దరూపమగు నాత్మచైతన్యజ్యోతిస్సు చే తనచే కనబడుచున్న యీ ప్రపంచమంతయు భాసించుచున్నదిగాని జడములగు బుద్ధీన్ద్రియాదులచే నాత్మచైతన్యము ప్రకాశింప చేయబడుటలేదు. బాగుగా విచారించినచో సూర్యమండలము మున్నగు నవన్నియు జడములే. ఇవి యన్నియు ఆత్మప్రకాశముతో గూడుకొనిన వగుటం జేసి యితరవస్తువులను భాసింపజేయ గలుగుచున్నవి. అందుచే ఆత్మప్రకాశరూపమగు నాత్మచైతన్య మొక్కటియే బుద్ధీన్ద్రియ శరీరాదులందు జీవరూపమున నభివ్యక్తమై రూపశబ్దాది విషయముల ననుభవించుచున్నది గాన దానిని భాసింపజేసెడి మరియొక వస్తువేమియు లేదని గ్రహింపవలయును.

శ్లో॥ యేనానుఽ భూయతే సర్వం జాగ్రత్స్వప్న సుషుప్తిషు,
విజ్ఞాతార మిమం కోను కథం వేదితు మర్హతి. ౫౯౧

తా॥ జాగ్రదవస్థయందలి స్థూలప్రపంచమునకును, స్వప్నమునందలి సూక్ష్మప్రపంచమునకును, సుషుప్తియందలి అజ్ఞానమునకును, సాక్షిగా నున్నవాడై ఆత్మయే సకల విషయములను తెలిసికొనుచున్నాడు. ఇట్టి యాత్మను ఎవడైనను ఎట్లు తెలిసికొనగలడు? ఆత్మకంటె భిన్నుడగు వేరొక జ్ఞాతలేకుండుటచే ఆత్మ, తెలిసికొనువాడేగాని తెలియబడువాడు గాడు.

శ్లో॥ సర్వస్య దాహకో వహ్నిః వహ్నే ర్నాఽన్యోఽస్తిదాహకః.
యథా; తథాఽఽత్మనో జ్ఞాతుః జ్ఞాతా కోఽపి నదృశ్యతే.

తా॥ లోకమున, అగ్నియే సకల పదార్థములను దహింపజేయుచున్నది గాని, అగ్నిని దహింపజేయునది మరియొకటిలేదు – అట్లే సకల ప్రపంచమును తెలిసికొనువాడైన ఆత్మను తెలిసికొనువాడు వేరొకడులేడు.

శ్లో॥ ఉపలభ్యేత కేనాయము పల్యుపలబ్ధా స్వయం తతః,
ఉపలబ్ధ్యంతరాభావా న్నాయ మాత్మోపలభ్యతే. ౫౯3

తా॥ ఈ యాత్మయే, సకలమును తెలిసికొనువాడును, గ్రహించువాడును, పొందువాడునుగాని, ఈ యాత్మను తెలిసికొనువాడుగాని, గ్రహించువాడుగాని, పొందువాడుగాని మరియొకడు లేడు. అందుచే నాత్మ తెలియబడుట లేదు

శ్లో॥ బుద్ధ్యాదివేద్య విలయా దయమేక ఏవ
సుప్తో నపశ్యతి శృణోతి నవేత్తి కించిత్,
సౌషుప్తికస్య తమసః స్వయమేవ సాక్షీ
భూత్వాఽత్ర తిష్ఠతి సుఖేన చ నిర్వికల్పః. ౫౯౪

తా॥ జాగ్రదవస్థయందు రూపాది విషయములను గ్రహించుటకు చక్షురాదీన్ద్రియములును, మంచిచెడుగుల నాలోచించుటకు బుద్ధియును ఆత్మకు సాధనములుగానున్నవి. గాఢనిద్రాకాలమునందు ఈబుద్ధీన్ద్రియాదులన్నియు తమ కారణమగు నజ్ఞానమున లయించుటంజేసి ఆత్మనిర్వికారుడై అజ్ఞానమునకు సాక్షిగానుండి, సుఖము ననుభవవించుచున్నాడు. అట్టియెడ నేత్రము లేమింజేసి దేనిని చూడకున్నాడు. శ్రోత్రము లేకుండుట వలన దేనిని వినకున్నాడు. బుద్ధిలయించుటవలన నద్దానిని ఆలోచింపకున్నాడు. జాగ్రత్స్వప్నములందు బుద్ధీన్ద్రియాదులన్నియు ఆత్మచే చూడబడుచున్నవి యగుచునే తాము ఇతర విషయములను గ్రహించుచున్నవి. సుషుప్తియందు ఇవి యన్నియు సూక్ష్మభావమును జెందుటంజేసి యాత్మ విషయ విశేష విజ్ఞానరహితుడై సుఖముగానున్నాడని భావము.

శ్లో॥ సుషుప్తావాత్మ సద్భావే ప్రమాణం పండితోత్తమాః,
విదుః స్వప్రత్యభిజ్ఞాన మాబాలవృద్ధసమ్మతమ్. ౫౯౫

తా॥ సుషుప్తియందు ఆత్మకలదని చెప్పుటకు, బాలురు, వృద్ధులు పండితులు, పామరులు మున్నగు జనులందఱయొక్కయూ అనుభవమే ప్రబలప్రమాణమని పండితులు వచించుచున్నారు.

శ్లో॥ ప్రత్యభిజ్ఞాయ మానత్వాత్ లింగమత్రానుమాపకమ్,
స్మర్యమాణస్య సద్భావః సుఖమస్వాప్స మిత్యయమ్.
పురానుభూతౌ నోచేత్తు స్మృతే రనుదయోభవేత్,
ఇత్యాది తర్కయుక్తిశ్చ సద్భావే మాన మాత్మనః.

తా॥ ప్రతి మానవుడును "నేను సుఖముగా నిద్రించితిన"ని చెప్పుచున్నాడు. నిద్రాకాలమునందు 'నేన' నువాడను, సుఖానుభవమును లేనియెడల మేల్కొంచిన పిమ్మట నేను సుఖముగా నిద్రించితి నని చెప్పుట సంభవింపనేరదు. ఈ మానవులు చెప్పెడి 'నేను సుఖముగా నిద్రించితి నను మాట స్మృతి యనబడుచున్నది. స్మృతికి పూర్వము అనుభవము తప్పక యుండి తీరవలయును. కావున నిట్టి తర్కయుక్తివలన గూడ నిద్రయందు ఆత్మకలదని నిశ్చితమగుచున్నది.

శ్లో॥ యత్రాత్మనోఽ కామయితృత్వబుద్ధిః
స్వప్నానపేక్షాఽపిచ తత్సుషుప్తమ్,
ఇత్యాత్మసద్భావ ఉదీర్యతేఽత్ర
శ్రుత్యాఽపి తస్మాచ్ఛ్రుతిరత్ర మానమ్. ౫౯౦

తా॥ మరియు మాండూక్యశ్రుతి—ఏకాలమునందు ఆత్మ కోరికలు లేనివాడుగను, కలలను కనని వాడుగనునున్నాడో యదిసుషుప్తస్థానమగును. అని చెప్పుచున్నది సుషుప్తియందు ఆత్మలేనిచో శ్రుతిచెప్పిన విశేషణములు రెండును సంభవింపనేరవు. కావున నన్నివిధములనుగాఢనిద్రయందు ఆత్మ కలదని యేర్పడుచున్నది.

శ్లో॥ ఏతైః ప్రమాణై రస్తీతి జ్ఞాతస్సాక్షితయాబుధైః,
ఆత్మాఽయం కేవలశ్శుద్ధ స్సచ్చిదానందలక్షణః. ౬౦౦

తా॥ పూర్వప్రదర్శితములగు ప్రత్యక్షాను మానాగమములను మూడు ప్రమాణములచేతను సుషుప్తియందు అజ్ఞానమునకు సాక్షిగా ఆత్మ కలడని పండితులు తెలిసికొనుచున్నారు. ఈ యాత్మ స్వస్వరూపముచే సజాతీయ విజాతీయ స్వగత భేదరహితుడును, మాయాతత్కార్యసంబన్ధ వర్జితుడును సచ్చిదానందమూర్తియు నగుచున్నాడు.

శ్లో॥ సత్త్వచిత్త్వాఽఽనందతాది లక్షణం ప్రత్యగాత్మనః,
కాలత్రయేఽప్యబాధ్యత్వం సత్త్వం నిత్యస్వరూపతః.

శ్లో॥ శుద్ధచైతన్యరూపత్వం చిత్త్వం జ్ఞానస్వరూపతః,
అఖండసుఖరూపత్వ మానందత్వ మితీర్యతే ౬౦౨

తా॥ అన్నగత జడదుఃఖాత్మకములగు పంచకోశములకంటె విలక్షణముగా భాసించుచున్న ఆత్మకు సచ్చిదానందములే స్వరూపము. ఆత్మ నిత్యస్వరూపుడై మూడు కాలములందును నాశములేని వాడగుటచేసద్రూపు డనియు, జ్ఞాన (ప్రకాశ) స్వరూపుడగుటచే శుద్ధచిద్రూపుడనియు గంగా ప్రవాహమువలె తెంపులేని సుఖమే స్వరూపముగా గలవాడగుటచే ఆనందరూపుడనియు వేదశాస్త్రములందు వ్యవహరింపబడుచున్నాడు.

శ్లో॥ అనుస్యూతాఽత్మన స్సత్తా జాగ్రత్స్వప్న సుషుప్తిషు,
అహమస్మీ త్యతో నిత్యోఽభవత్యాత్మాఽయమవ్యయః

శ్లో॥ సర్వదాఽ ప్యాసమిత్యేవా ఽభిన్నప్రత్యయ ఈక్ష్యతే,
కదాఽపి నాఽస మిత్యస్మా దాత్మనో నిత్యతామతా.

తా॥ జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలందు మూడిటియందును 'నేనున్నాడ' నను అనుభవముచే ఆత్మయొక్క యునికి అనువర్తమానమగు

చూచియున్నది. మరియు ప్రతి ప్రాణియందును, 'ఎల్లప్పుడు నేనుకలన'ని యేకరూపమగు ననుభవమే కనబడుచున్నదిగాని ''నేనొకానొకప్పుడు లేను'' అను భావము గాన రాకున్నది. కావున నాత్మ నిత్యుడను మాట నిస్సంశయము.

శ్లో॥ ఆయాతాసు గతాసు శైశవముఖావస్థాసు జాగ్రన్ముఖా
స్వన్యాస్వప్యఖిలాసువృత్తిషుధియో దుష్టాస్వదుష్టాస్వపి,
గంగాభంగపరంపరాసు జలవ త్సత్త్వానువృత్త్యా త్మనః
తిష్ఠత్యేవసదాస్థిరాఽహమహమి త్యేకాఽత్మతాసాక్షిణః.

తా॥ గంగానదియందు వేలకొలది తరంగములు వచ్చుచు పోవుచు నున్నను జలము మాత్రమవిచ్ఛిన్నముగా, నిరంతరము ఉండుచునే యున్నది. అటులనే బాల్యయౌవన కౌమారవార్ధక్యదశలును, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును, పుణ్యపాపరూపములగు బుద్ధి వృత్తులును–ఇవి మొదలగు స్థూలసూక్ష్మశరీరధర్మము లనేకములు పుట్టుచునశించుచున్నను ఆత్మమాత్రము నిరన్తరము 'నేనునేన'ను రూపమున నిర్వికారుడై స్థిరముగానున్నాడు.

శ్లో॥ ప్రతిపదమహమాదయో విభిన్నాః
క్షణపరిణామితయా వికారిణస్తే,
నపరిణతి రముష్య నిష్కళత్వాత్
అయమవికారి తయైవ నిత్యఆత్మా. ౬౦౩

తా॥ అహంకారము, బుద్ధి మున్నగు అన్తఃకరణ వృత్తి విశేషము లన్నియు సావయవ పదార్థము లగుటచే ప్రతిక్షణము నందును మార్పు చెందుచున్నవి. ఇక ఆత్మయన్ననో నిరవయవుడగుటచే నే విధములగు మార్పులను చెందనివాడై నిత్యస్వరూపు డగుచున్నాడు.

శ్లో॥ య స్స్వప్నమద్రాక్షు మహాం సుఖం యో౽
స్వాప్సం సపవా౽స్మ్యథ జాగరూకః,
ఇత్యేవ మచ్ఛిన్నతయా౽నుభూయతే
సత్తా౽త్మనో నా౽స్తి హి సంశయో౽త్ర. ౬౦౭

తా॥ ప్రతి మానవుడును—ఏ నేను స్వప్నదశయందు కలలను గాంచితినో, ఏ నేను సుషుప్తికాలమునందు సుఖముగా నిద్రించితినో, ఆ నేను ఇప్పుడు జాగ్రదవస్థయందు, దేహేన్ద్రియాదులతో బాహ్యవ్యవహారముల నాచరించుచున్నాను" అని చెప్పుచున్నాడు. అందుచే మూడు దశలందును, ఆత్మ 'నేను నేన'ను స్వరూపముతో ననుసరించియే యున్నాడని నిశ్చితమగుచున్నది. ఈ విషయములో సందియమిసుమంతయు లేదు.

శ్లో॥ శ్రుత్యుక్తా షోడశకలా శ్చిదాభాసస్య నాత్మనః,
నిష్కలత్వా న్నా౽స్యలయ స్తస్మాన్నిత్యత్వ మాత్మనః.

తా॥ శ్రుతులయందు 'షోడశకలః పురుషః' అని చెప్పబడుటచే, ఆత్మ-అవయవములు గలవాడనియు, అందుచే ననిత్యుడనియు నిశ్చితమగుచున్నది ఇట్టియెడ ఆత్మ నిత్యుడను మాటయెట్లు పొసగగలదని యొడి శంకకు సమాధానము చెప్పబడుచున్నది. షోడశకలలు అనగా ప్రాణము, శ్రద్ధ, ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, భూమి, ఇన్ద్రియము, మనస్సు, అన్నము, వీర్యము, తపస్సు, మన్త్రములు, కర్మము, లోకములు, నామము అనునవి – ఇవి యన్నియు భగవత్సృష్టములై శరీరత్రయమునకు సంబన్ధించినవగుచున్నవి–ఇట్టి శరీరత్రయమునందు ఆత్మ ప్రతిబింబమైన జీవుడు 'నేను' 'నేన'ను నభిమానముతో నున్నాడు. అందుచే నీ ప్రతిబింబరూపుడగు చిదాభాసుడు గూడ షోడశకలలు గలవాడని వ్యవహరింపబడుచున్నాడు. ఇక బింబరూపుడగు ఆత్మమాత్రము

నిష్కలుడు (నిరవయవుడు) అగుటచే వతనికి నాశము లేదు గాన, ఆత్మ నిత్యుడను మాటకు విరోధమేమియు లేదు.

శ్లో॥ జడప్రకాశకస్సూర్యః ప్రకాశాత్మైవనోజడః,
బుద్ధ్యాది భాసక స్తస్మాచ్చిత్స్వరూప స్తథామతః. ౬౦౯

తా॥ లోకమునందు జడములగు ఘటపటాది పదార్థములను భాసింపజేయు వాడగు సూర్యుడు ప్రకాశస్వరూపుడేగాని జడస్వరూపు డెట్లుగాడో, అట్లే అచేతనములగు బుద్ధీన్ద్రియ శరీరాదులను ప్రకాశింప జేయుచు వానిని జ్ఞానవంతములనుగా జేయుచున్న ఆత్మజ్ఞానస్వరూపుడే కాని తద్భిన్నుడుగా నేరడు.

శ్లో॥ పృథ్వ్యాదేస్తు జడస్య నైవఘటతే భానం స్వత స్సర్వదా
సూర్యాదిప్రభయా వినా క్వచిదపి ప్రత్యక్షమేత త్తథా,
బుద్ధ్యాదేరపినస్వతోఽస్త్యణురపిస్ఫూర్తి ర్వినైవాత్మనా
సోఽయంకేవలచిన్మయశ్శ్రుతఇతోభానుర్యథాఽజ్ఞయః.

తా॥ సూర్యచంద్రాదులయొక్క కాంతి లేకున్నచో భూమి మొదలగు జడపదార్థము లెంత మాత్రమును ప్రకాశింపనేరవు. అట్లే ఆత్మచైతన్య ప్రకాశసంబన్ధము లేకున్నచో, అచేతనములగు బుద్ధీన్ద్రియ శరీరాదులును తమంతట తామెంత మాత్రమును భాసింపనేరవు. కావున సూర్యుడు ప్రకాశస్వరూపు డగుచున్నట్లుగా, ఆత్మయు జ్ఞానస్వరూపు డగుచున్నాడు.

శ్లో॥ స్వభాసనేవాఽన్య పదార్థభాసనే
నాఽర్కః ప్రకాశాన్తర మీహదిచ్ఛతి,
స్వబోధనే వాఽప్యహమాది బోధనే
తథైవ చిద్ధాతు రయం పరాత్మా. ౬౧౧

తా॥ సూర్యుడు తాను ప్రకాశించుటకుగాని, ఇతర వస్తువులను ప్రకాశింపజేయుటకుగాని తనకు సహాయముగా మరియొక వస్తువుయొక్క ప్రకాశము నెంతమాత్రమును అపేక్షింపకున్నాడు. అటులనే స్వప్రకాశ స్వరూపుడగు ఆత్మకూడ తన్ను తాను తెలిసికొనుటకుగాని, తనకంటె భిన్నములగు బుద్ధీన్ద్రియాదులను తెలిసికొనుటకుగాని, వేఱొక సహాయము నపేక్షింపకున్నాడు.

శ్లో॥ అన్యప్రకాశం నకిమప్యపేక్ష్య
యతోఽయ మాభాతి నిజాత్మనైవ
తత స్స్వయం జ్యోతి రయం చిదాత్మా
నహ్యాత్మభానే పరదీప్త్యపేక్షా. ౬౧౨

తా॥ ఈ యాత్మ అగ్ని సూర్యాదులయొక్క ప్రకాశము నెంతమాత్రము నపేక్షింపక, గాఢాన్ధకారమునందు కూడ తనంతట తాను 'నేను నేను' అను రూపమున భాసించుచున్నవాడగుటచే శ్రుతులయందు స్వయంజ్యోతిస్స్వరూపుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ యం నప్రకాశయతి కించి దినోఽపి చన్ద్రః
నో విద్యుతో వహ్నిర యం మితాభః,
యం భాన్తమేత మనుభాతి జగత్సమస్తమ్
సోఽయం స్వయం స్ఫురతి సర్వదశాసు చాత్మా. ౬౧౩

తా॥ సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు, మెఱుపులు, అగ్నిహోత్రుడు (స్వల్పకాంతిగలవాడు) మున్నగు నవన్నియు నే యాత్మను ప్రకాశింపజేయ నేరకున్నవో, మరియు నీ కనబడు సూర్యచన్ద్రాదులతో గూడుకొనిన ప్రపంచమంతయు ఏ యాత్మ ప్రకాశముచేతనే భాసించుచున్నదో, అట్టి ఆత్మ, స్వయం ప్రకాశస్వరూపుడై బాల్యజాగ్రదాది సర్వావస్థలయందును 'నేను నేను' ను రూపమున భాసించుచున్నాడు.

శ్లో॥ ఆత్మన స్సుఖరూపత్వా దానం దత్వం స్వలక్షణమ్,
పరప్రేమాస్పదత్వేన సుఖరూపత్వ మాత్మనః. ౬౧౪

తా॥ ఆత్మసుఖరూపుడు గాన ఆనందరూపత్వము ఆత్మలక్షణమగు చున్నది. నిరతిశయమగు ప్రేమకు విషయుడగుటచే ఆత్మకు సుఖరూపత్వము సిద్ధమగుచున్నది.

శ్లో॥ సుఖహేతుషు సర్వేషాం ప్రీతి స్సావధి రీక్ష్యతే,
కదాఽపి నాఽవధిః ప్రీతేః స్వాత్మని ప్రాణినాం క్వచిత్.

తా॥ సకల ప్రాణులకును, సుఖసాధనములగు భార్యాపుత్రాదుల యందుగల ప్రేమ, పరిమితముగా గనబడుచున్నదిగాని తన ఆత్మ స్వరూపమునందైననో అపరిమితముగా గనబడుచున్నది. కావున ఆత్మ పరమ ప్రేమాశ్రయుడనుట నిస్సంశయము.

శ్లో॥ క్షీణేన్ద్రియస్య జీర్ణస్య సంప్రాప్తోత్క్రమణస్య వా,
అస్తి జీవితు మేవాశా స్వాత్మాప్రియతమోయతః.

తా॥ మరియు ప్రతిప్రాణియు, తన యాత్మస్వరూపమునందే సర్వోత్కృష్టమగు ప్రేమను గలిగియున్నది. కనుకనే, చక్షురాదీన్ద్రియ సామర్థ్యము లేనివాడును, కరచరణాద్యవయవ వర్జితుడును, ముసలివాడును మరణమునకు సిద్ధముగా నున్నవాడును, కూడ ఇంకను జీవింప వలయుననియే కోరుచున్నాడు.

శ్లో॥ ఆత్మాఽతః పరమప్రేమాస్పద స్సర్వశరీరిణామ్,
యస్య శేషతయా సర్వ ముపాదేయత్వ మృచ్ఛతి. ౬౧౭

తా॥ లోకమునప్రతిప్రాణియు భార్యాపుత్రగృహక్షేత్రాదులనన్నిం టిని తన నిమిత్తమే సంపాదించుకొనుచున్నాడు కావున సర్వవస్తువులును తనకు ఉపయోగించు నెడలనే స్వీకార్యములగుచున్నవి. ఇందువలన సకల

జీవులకును తనయందు (ఆత్మస్వరూపమునందు) నిరతిశయమగు ప్రేమగల దని నిశ్చితమగుచున్నది.

శ్లో॥ ఏష ఏవ ప్రియతమః పుత్రాదపి ధనాదపి,
అన్యస్మా దపి సర్వస్మా దాత్మాఽయం పరమాన్తరః.

తా॥ ఈయాత్మయె పుత్రవిత్త కళత్రాదులన్నిటికంటెను మిక్కిలి ప్రియుండగుచున్నాడు—అనగా ప్రతి జీవునకును, భార్యాపుత్రాదులందు గల ప్రేమకంటె తన స్వరూపమునందే యధికమగు ప్రేమ కనబడుచుండు టచే ఆత్మస్వరూపమే సర్వపదార్థములకంటె పరమ ముఖ్యమైనదియు నత్యంత సన్నిహితమైనదియు నగుచున్నది.

శ్లో॥ ప్రియత్వేన మతం తత్తు యత్సదాఽనాఽప్రియంనృణామ్,
విపత్తావపి సంపత్తౌ యథాఽత్మాన తథా పరః. ౬౧౯

తా॥ సకల మానవులకును ఏ వస్తువు సర్వకాల సర్వావస్థల యందును అప్రియముగా నుండునో అదియే ప్రియతమమగుచున్నది. భార్యా పుత్రాదులు, సంపత్కాలమునందు ప్రియులును విపత్కాలమునందు అప్రియులును అగుచున్నారు. కావున నవిప్రియతమము లనబడవు, ఆత్మ యన్ననో సర్వకాలములందును ప్రియుండే అగుచున్నాడు. అందుచే నాత్మ స్వరూప మొక్కటియే ప్రియతమ మని గ్రహింపనగును.

శ్లో॥ ఆత్మా ఖలుప్రియతమోఽసుభృతాం య దర్థాః,
భార్యాత్మజాప్తగృహవిత్తముఖాః పదార్థాః
వాణిజ్యకర్షణగవాఽవన రాజసేవా—
భైషజ్యక ప్రభృతయో వివిధాః క్రియాశ్చ. ౬౨౦

తా॥ లోకమునందు భార్య-పుత్రులు-బన్ధువులు-మిత్రులు-గృహము ధనము మొదలగు పదార్థములును వర్తకము-వ్యవసాయము-గోరక్షణము—

రాజసేవ-వైద్యము మొదలగు వ్యాపారములు ఇవి యన్నియూ తన (ఆత్మ) ప్రయోజనము కొరకే స్వీకరింపబడుచున్నవి. కావున నిట్టి తన కంటె ప్రియతమమగు మరియొక వస్తువెద్దియూ లేదు.

శ్లో॥ ప్రవృత్తిశ్చ నివృత్తిశ్చ యచ్చ యావచ్చ చేష్టితమ్,
ఆత్మార్థమేవ నాఽన్యార్థం నాఽతః ప్రియతమః పరః.

తా॥ లోకమున ప్రతి ప్రాణియూ తన కొఱకే అనుకూలములగు పనులందు ప్రవర్తించుచున్నాడు. ప్రతికూల వ్యాపారములనుండి నివర్తించుచున్నాడు. ఇంతియేగాదు. ఎవడు ఏ పని నెంతగా జేసినను తన ప్రయోజనము కొఱకే కాని, ఇతరుల ప్రయోజనము కొఱకుగాదు. ఇట్లే శ్రుతులు కూడ నుడువుచున్నవి. కావున నాత్మస్వరూపముకంటె ప్రియమగునది యేదియూను లేదు.

శ్లో॥ తస్మా దాత్మా కేవలానందరూపః
యత్సర్వస్మా ద్వస్తునః ప్రేష్ఠఉక్తః,
యోవా అస్మాన్మన్యతేఽన్యం ప్రియం యమ్
సోఽయం తస్మా చ్ఛోకమేవాను భుఙ్క్తే. ౬౨౨

తా॥ పూర్వశ్లోకమునందు చెప్పబడిన రీతిగా ఆత్మయే సర్వ పదార్థములకంటె మిక్కిలి ప్రియుడని నిశ్చితమగుటచే ఆత్మ పరమసుఖ స్వరూపుడనుటయందు సంశయ మెంతమాత్రము లేదు. ఈ విషయమును గ్రహింపనేరక, యే పురుషులు, తమ స్వరూపముకంటె భిన్నులగు భార్యాపుత్రాదులనే ప్రియులనుగా తలంచుచున్నారో, వారు ఆభార్యాపుత్రాదులవలన (ఎప్పటికైనను నశించువారలగుటచే) దుఃఖమునే పొందుచున్నారు.

శ్లో॥ అపరః క్రియతే ప్రశ్నఃమయాఽయంకృమ్యతాంప్రభో?,
అజ్ఞవా గపరాధాయ కల్పతేన మహాత్మనామ్. ౬౨౩

తా॥ ఈ విధముగా చెప్పబడిన గురువాక్యమును విని శిష్యుం డిట్లడిగెను- స్వామీ! నేనింకొక ప్రశ్నము చేయుచున్నాను. పూజ్య పాదులు దానిని క్షమింప వేడుకొనుచున్నాను. నాబోటి మూఢులయొక్క ప్రశ్నవాక్యము తమవంటి పెద్దలకు తప్పుగా దోపనేరదుగదా.

శ్లో॥ ఆత్మాఽన్యః సుఖ మన్యచ్చ నాత్మనః సుఖరూపతా,
ఆత్మఽన సుఖమాశాస్యం యతతే సకలో జనః. ౬౨౮

శ్లో॥ ఆత్మన సుఖరూపత్వే ప్రయత్నః కిము దేహినామ్,
ఏష మే సంశయః స్వామిన్ ! కృపయైవ నిరస్యతామ్.

తా॥ స్వామీ! ఆత్మ (తాను) వేఱు. సుఖము వేఱు. ఆత్మ (తాను) సుఖస్వరూపుడు గాడు. కనుకనే ప్రతిప్రాణియు తనకంటె భిన్నమగు సుఖముయొక్క లాభము కొఱకు పలువిధములగు ప్రయత్నముల నాచరించుచున్నది. అట్లుగాక తానే సుఖరూపుడగు నెడ ప్రాణులకు సుఖార్థము ప్రయత్నముతో పనియేమిగలదు? ఏమియులేదు అని నాకు సంశయముగలదు. దీనిని తమరు దయతో నివారింప ప్రార్థితులు.

శ్లో॥ ఆనందరూప మాత్మాన మజ్ఞాత్వైవ పృథగ్జనః,
బహి స్సుఖాయ యతతే నతుకశ్చి ద్విదన్ బుధః. ౬౨౯

శ్లో॥ అజ్ఞాత్వైవహి నిక్షేపం భిక్షామటతి దుర్మతిః,
స్వవేశ్మని నిధిం జ్ఞాత్వా కోనుభిక్షా మటేతు సుధీః. ౬౩౦

తా॥ దేహేంద్రియాదులందు 'నేన'ను నభిమానముగల పామరుడు యథార్థముగ తాను ఆనందరూపుడని యెఱుంగక ఇతరములైన భార్యాపుత్రాది నశ్వర పదార్థములవలన, సుఖముకొరకు ప్రయత్నించుచున్నాడు గాని- తాను ఆనందరూపుడని తెలిసికొనిన పండితు డెవడును, బాహ్యసుఖమునకై యత్నింపడు-ఎట్లనగా తనయింటియందు తన పూర్వులచే దాప

బడిన ధన కలశముగలదని యెఱుంగని బుద్ధిహీనుడు బిచ్చమెత్తుకొను చుండునుగాని, తన యింటియందు గల ధననిక్షేపమును గుర్తించిన బుద్ధిశాలి బిచ్చమెత్తుకొనడుగదా ? కావున నో శిష్యా ! పామరులగు జనులు ఆత్మకంటె సుఖము భిన్నమని భ్రమింతురు, ప్రయత్నింతురు గాని పండితు లెంతమాత్రము భ్రమింపరు. సుఖమునకై యత్నింపరు.

శ్లో॥ స్థూలంచ సూక్ష్మంచ వపు స్స్వభావతః
దుఃఖాత్మకం స్వాత్మతయా గృహీత్వా,
విస్మృత్యచ స్వం సుఖరూప మాత్మనః
దుఃఖప్రదేభ్య స్సుఖమజ్ఞ ఇచ్ఛతి. ౬౨౮

తా॥ స్థూలసూక్ష్మశరీరములు రెండును స్వభావముచే దుఃఖరూపములు, అజ్ఞాను లిట్టి శరీర ద్వయమునే తమ స్వరూపమని భ్రమించి, సుఖరూపమగు స్వాత్మస్వరూపమును మరచి దుఃఖప్రదములగు దారాపుత్రాదులవలన తమకు సుఖము నపేక్షించుచున్నారు.

శ్లో॥ నహి దుఃఖప్రదం వస్తు సుఖం దాతుం సమర్హతి,
కిం విషం పిబతో జన్తో రమృతత్వం ప్రయచ్ఛతి. ౬౨౯

తా॥ దుఃఖప్రదులగు భార్యాపుత్రాదులు ఎన్నటికిని సుఖప్రదులుగానేరరు. మరణము నొసంగెడి విషము, తన్ను త్రాగిన ప్రాణికి మరణరాహిత్యము నొసగనేరదుగదా !

శ్లో॥ ఆత్మాఽన్య స్సుఖమన్యత్స్యా దితి నిశ్చిత్య పామరః,
బహి స్సుఖాయ యతతే సత్యమేవ నసంశయః. ౬౩౦

తా॥ ఇటులుండగా తాను వేఱు, సుఖము వేఱు-అని నిశ్చయించి వివేకములేని మానవుడు, నిశ్చయముగా భార్యాపుత్రాదులవలన గలిగెడి బాహ్యసుఖమునకై యత్నించుచున్నాడు. సందియము లేదు.

శ్లో॥ ఇష్టస్య వస్తునో ధ్యాన దర్శనా ద్యుపభుక్తిషు,
ప్రతీయతే య ఆనన్ద స్సర్వేషా మిహదేహినామ్. ౬౩౧

శ్లో॥ సవస్తు ధర్మోనో యస్మా న్మనస్యేవోపలభ్యతే,
వస్తు ధర్మస్య మనసి కథం స్యా దుపలంభనమ్. ౬౩౨

శ్లో॥ అన్యత్ర త్వన్యధర్మాణా ముపలంభో నదృశ్యతే,
తస్మా న్నవస్తు ధర్మోయ మానందస్తు కదాచన. ౬౩౩

తా॥ ప్రపంచమునందు సకలప్రాణులకును ప్రియములైన భార్యాది పదార్థములను, సంకల్పించునప్పుడును, చూచునప్పుడును, అనుభవించునప్పుడును మనస్సునందు ఆనందము కలుగుచున్నది. ఈ యానందము దేనిదని విచారించినచో - భార్యాది వస్తువులయొక్క ధర్మముగా నేరదు. ఆనందము వస్తుధర్మమే యగు నెడల రూపము మున్నగునవివలె ఆ వస్తువునందే కనబడవలయునుగాని, మనస్సునందు భాసింపగూడదు. వస్త్రము యొక్క ధర్మములు కుండయందు కనబడుటలేదుగదా. కావున ఆనందము మనస్సునందు స్ఫురించుచున్నదగుటచే నది వస్తుధర్మము గా నేరదు.

శ్లో॥ నాఽప్యేవ ధర్మోమనసోఽ సత్యర్థే తత దర్శనాత్,
అసతి వ్యంజకే వ్యంగ్యం నోదేతీతిచ మన్యతామ్.

తా॥ భార్యాది పదార్థములు లేనప్పుడు ఆనందము గోచరింపమిచే నియ్యది మనోధర్మంబును గానేరదు. సుఖము మొదలగు ధర్మమును వ్యక్తముచేయు వస్తువు లేకున్నపుడు సుఖాది ధర్మము కనబడనేరదని లోకానుభవముచే గ్రహింపనగును. మరియు ఆనందము మనోధర్మమే యైనచో భార్యాది పదార్థములు లేనప్పుడు కూడ నానందము కలుగవలయునుగదా!

శ్లో॥ పత్న్యర్థేఽపిచ నో దేతి హ్యానందస్తూక్తలక్షణః,
సత్యపి వ్యంజకే వ్యంగ్యా నుదయో నైవ సమ్మతః.
శ్లో॥ దురదృష్టాధికం నాఽత్ర ప్రతిబన్ధః ప్రకల్ప్యతామ్,
ప్రియస్య వస్తునో లాభే దురదృష్టం న సిద్ధ్యతి. ౬౩౬

తా॥ మరియు ఒకనొకప్పుడు భార్యాది వస్తువులు సమీపమున నున్నప్పటికిని ఆనందము గలుగకున్నది. కావున విషయములు ఆనందమున కభివ్యంజకములను మాటయు సమంజసముగాకున్నది. దీపమున్నప్పటికిని చీకటి పోకున్నది యనునట్లుగా, ఆనందాభివ్యంజకమగు విషయము యొక్క సాన్నిధ్యమున్నను ఆనందము గలుగకున్నది యనుమాట శాస్త్ర సమ్మతముగా నేరదు. అందుచే "విషయము ఆనందమును వ్యక్తపరచునను మాటయుక్తముగా లేదు-మరియు ఆనంద జనకమైన వస్తువున్నను ఆనందము గలుగకుండు విషయమై జన్మాంతర పాపకర్మము మొదలగు ప్రతిబన్ధము గలదని చెప్పుటయు దగదు. పాపరూప ప్రతిబన్ధనముండు నెడ ప్రియ వస్తువు లభించుటయే సంభవింపదుగదా!

శ్లో॥ తస్మా న్నమానసో ధర్మో నిర్గుణత్వా న్నచాత్మనః
కింతు పుణ్యస్య సాన్నిధ్యా దిష్టస్యాపిచ వస్తునః.
శ్లో॥ సత్త్వప్రధానే చిత్తేఽస్మి న్నాత్మైవ ప్రతిబింబతి,
ఆనందలక్షణ స్స్వచ్ఛే పయసీవ సుధాకరః. ౬౩౭

తా॥ కాబట్టి యీ యానందము మనోధర్మంబునుగాదు. ఆత్మగుణ రహితుడుగాన ఆత్మధర్మమునుగాదు. వెనుక చెప్పిన చొప్పున వస్తుధర్మంబునుగాదు. మరియేమనగా ఫలోన్ముఖమగు పూర్వకృత పుణ్యకర్మము యొక్కయు (దానిచే సంపాదింపబడిన) ప్రియమైన భార్యాది వస్తువు యొక్కయు సాన్నిధ్యంబున, నిర్మలమగు జలమునందు జంద్రునివలె (రజస్తమోగుణములచే దిరస్కరింపబడనిదై) సత్త్వగుణ ప్రధానమైన

చిత్తమునందు ఆనందరూపుడగు నాత్మ ప్రతిబింబించుచున్నాడు. ఈ యానంద ప్రతిబింబమే విషయానంద మనబడుచున్నది.

శ్లో॥ సోఽయ మాభాస ఆనంద శ్చిత్తే యః ప్రతిబింబితః,
పుణ్యోత్కర్షాపకర్షాభ్యాం భవత్యుచ్చావచస్స్వయమ్.

తా॥ పూర్వమందు చెప్పబడిన రీతిగా చిత్తమునందు ప్రతిఫలించిన విషయానందము పుణ్యకర్మముయొక్క హెచ్చుతగ్గులచే తానును హెచ్చుతగ్గులగుచున్నది. ఇయ్యది ఆనందమువలె భాసించునదగుటచే నాభాసానంద మనబడుచున్నది.

శ్లో॥ సార్వభౌమాది బ్రహ్మాన్తం శ్రుత్యాయః ప్రతిపాదితః,
సతుయిష్ణుః సాతిశయః ప్రక్షీణే కారణే లయమ్. ౬౮౧
యాత్యేష విషయానందః యస్తు పుణ్యైకసాధనః,

తా॥ తైత్తిరీయక శ్రుతి - భూలోకమునందలి సకలభోగ సమన్వితుడగు సార్వభౌముడు మొదలుకొని బ్రహ్మలోకాధిపతియగు హిరణ్యగర్భుని పర్యన్తముగల యానందము, ఉత్తరోత్తరము శతగుణాధికమని చెప్పుచున్నది. ఈ యానందము పుణ్యతారతమ్యముచే నతిశయముగలదై తనకు కారణమగు పుణ్యము నశింప తానును నశించుచున్నది. ఈ విధమువ పుణ్యసాధనముచే గలిగెడి యానందము విషయానంద మనబడుచున్నది

శ్లో॥ యేతు వైషయికానందం భుంజతే పుణ్యకారిణః. ౬౮౧
దుఃఖంచ భోగకాలేఽపి తేషా మస్తే మహత్తరమ్,
సుఖం విషయసంపృక్తం విషసంపృక్తభక్తవత్, ౬౮౨

తా॥ పుణ్యము నాచరించి, దాని ఫలమగు విషయానందము ననుభవించువారలకు, భోగ కాలమునందును, భోగాంతమునందును దుఃఖము

తప్పదు. యెట్లనగా, కొందఱు ఆనందము ననుభవించునప్పుడు తమకంటె నధికానందము ననుభవించు వారలను జూచి పరితపించుచుందురు. మరి కొందరు, 'ఈ యానంద, మేక్షణమున నశించునో' యనియు, 'యేశత్రువులు దీనికి ప్రతిబన్ధమును కలిగించుదురో' యనియు దుఃఖించుచుందురు. కావున విషముతో గూడుకొనిన యన్నమువలె విషయసంపర్కమువలన గలుగు నానందమును దుఃఖప్రదమే యగుచున్నది.

శ్లో॥ భోగకాలేఽపి భోగాన్తే దుఃఖమేవ ప్రయచ్ఛతి,
సుఖముచ్చావచత్వేన క్షయిష్ణుత్వభయేన చ. ౬౭౩
భోగకాలే భవేన్నౄణాం బ్రహ్మాది పదభాజినామ్,
రాజాఽస్థానప్రతిష్టానాం తారతమ్యం మతం యథా.
తథైవ దుఃఖం జన్తూనాం బ్రహ్మాది పదభాజినామ్,
నకాంక్షణీయం విదుషా తస్మాద్వైషయికం సుఖమ్.

తా॥ విషయ సుఖము, ఎచ్చు తగ్గులుగలది యగుటచేతను, నశించు స్వభావము గలది యగుటచేతను, అనుభవకాలమునందును, అనుభవాంతమునందును మనుజులకు దుఃఖమునే గలిగించుచున్నది. మరియు రాజాస్థానమును, బొందినవారలకు సుఖదుఃఖానుభవమున తారతమ్య మెట్లుగలదో, యట్లే బ్రహ్మాదిదేవతా పదవులను పొందిన వారలకును సుఖదుఃఖములందు తరతమభావము గలదు. కావున పరవైరాగ్యసంపన్నుడైన ముముక్షువగు విద్వాంసుడు బ్రహ్మాదిపదవీ సుఖములనుగూడ వాంఛింపగూడదు.

శ్లో॥ యోఽబింబభూత ఆనందః స ఆత్మాఽనంద లక్షణః,
శాశ్వతో నిర్భయః పూర్ణో నిత్యఏకోఽపి నిర్ద్వయః.

తా॥ పూర్వమందు చెప్పబడిన (విషయసంబన్ధ జనితమగు) ప్రతిబింబానందమునకు బింబస్థానీయమైన యానందమే ఆత్మయగుచున్నది. ఈ

యాత్మానందము భయవర్జితమును, భయరహితంబును, పరిపూర్ణంబును, సర్వకాలస్థాయియు, సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యంబును నగుచున్నది.

శ్లో॥ లక్ష్యతే ప్రతిబింబేనా ऽऽ భాసానందేన బింబవత్,
ప్రతిబింబో బింబమూలో వినా బింబం నసిద్ధ్యతి. ౬౪౭
యత్తతో బింబ ఆనందః ప్రతిబింబేన లక్ష్యతే,
యుక్త్యైవా ऽ పండితజనైర్నకదా ऽ ప్యనుభూయతే. ౬౪౮

తా॥ దర్పణమునందు ప్రతిఫలించిన ముఖప్రతిబింబముచే బింబభూతమగు ముఖము గ్రహింపబడునట్లుగా అంతఃకరణమునందు ప్రతిఫలించిన ప్రతిబింబానందముచే బింబభూతమగు నాత్మానంద మూహింపబడుచున్నది. బింబములేని ప్రతిబింబముండనేరదుగదా! ఇట్టియెడ దేహాభిమానులగు పామరులు సంసారకాలమున ప్రతిబింబానందము ననుభవించుచున్నారుగాని, బింబభూతమగు నానందము ననుభవింపకున్నారు

శ్లో॥ అవిద్యాకార్యకరణ సంఘాతేషు పురోదితః,
ఆత్మా జాగ్రత్యపిస్వప్నే నభవత్యేష గోచరః. ౬౪౯

తా॥ పూర్వశ్లోకములందు వర్ణింపబడిన రీతిగా ఆనందస్వరూపుడగు నీయాత్మ జాగ్రత్స్వప్న దశల రెండిటియందును, మాయాకార్యములగు దేహేంద్రియాది సముదాయములందు (జీవుడను పేరితో ప్రతిబింబరూపమున నున్నప్పటికిని) సహజమగు బింబానంద స్వరూపముతో స్ఫురింతకున్నాడు.

శ్లో॥ స్థూలస్యాऽపిచ సూక్ష్మస్య దుఃఖరూపస్య వర్ష్మణః,
లయే సుషుప్తౌ స్ఫురతి ప్రత్యగానందలక్షణః. ౬౫౦

తా॥ సుషుప్తికాలమునందు, దుఃఖరూపములైన స్థూలసూక్ష్మ శరీరములు రెండును తమ కారణమగు నవిద్యయందు, సూక్ష్మభావమును జెందుచున్నవి. ఇట్టియెడ ఆనందరూపుడగు నంతరాత్మ గోచరించు చున్నాడు.

శ్లో॥ నహ్యత్రవిషయః కశ్చి న్నాఽపి బుద్ధ్యాది కించన,
ఆత్మైవ కేవలానంద మాత్ర స్తిష్ఠతి నిర్ద్వయః. ౬౫౧

తా॥ ఈ గాఢనిద్రయందు శబ్దాది విషయములుగాని, బుద్ధిని యాదులుగా నేమియు నొక్కటియు లేదు. మరియేమి కలదనిన-అద్వితీయుడగు నాత్మయొక్కడే యానందమాత్ర స్వరూపమున గలడు.

శ్లో॥ ప్రత్యభిజ్ఞాయతే సర్వై రేవసుప్తోత్థితై ర్జనైః,
సుఖమాత్రతయా నాఽత్ర సంశయం కర్తు మర్హసి.

శ్లో॥ త్వయాఽపి ప్రత్యభిజ్ఞాతం సుఖమాత్రత్వ మాత్మనః,
సుషుప్తా దుత్థితవతా సుఖ మస్వాప్స మిత్యను. ౬౫౩

తా॥ కావుననే ఓ శిష్యా! నిద్రించిలేచిన జనులందరును, నిద్రయందు తాను (ఆత్మ) సుఖమాత్ర స్వరూపుడనై యుంటినని తలంచుచున్నారు. నీవును నిద్రించి మేల్కాంచిన పిమ్మట నేను సుఖముగా నిద్రించితినని స్మరించుచున్నావుగదా! కావున సుషుప్తికాలమునందు ఆత్మ ఆనందస్వరూపుడై భాసించుచున్నాడనుట నిస్సంశయము

శ్లో॥ దుఃఖా భావస్సుఖమితి యదుక్తం పూర్వవాదినా,
అనాఘ్రాతోపనిషదా తదసారం మృషావచః. ౬౫౪

శ్లో॥ దుఃఖాభావస్తు లోష్టాదా విద్యతే నాఽనుభూయతే,
సుఖలేశోఽపి సర్వేషాం ప్రత్యక్షం తదిదం ఖలు. ౬౫౫

తా॥ ఇది యిట్లుండగా వెనుక 552 వ శ్లోకమున దుఃఖము లేకుండుటయే సుఖమగునని ప్రతివాదిచే చెప్పబడిన వాక్యము సారము లేనిదియు నసత్యమునగుచున్నది ఏలననగా దుఃఖాభావము మృత్పిండాదులయందు గలదుగాని వానియందు సుఖమును మాత్రంబును లేదుగదా! మరియు దుఃఖము లేకుండుటయే సుఖమగునేని సుషుప్తినుండి మేల్కాంచి ప్రతివారును నిద్రాకాలమునందు దుఃఖము లేదనియే చెప్పవలయునుగాని, 'సుఖము ననుభవించితిని' 'సుఖముగా నిద్రించితి'నని చెప్పుట కుదురనేరదు. కావున దుఃఖము లేకుండుటయే సుఖమని వాదించు ప్రతివాది, లోకానుభవముగాని, ఉపనిషద్విజ్ఞానముగాని, యెంత మాత్రమును లేనివాడని నిశ్చితమగుచున్నది.

శ్లో॥ సదయం హ్యేవమేవేతి ప్రస్తుత్య వదతి శ్రుతిః,
సద్ఘనోఽయం చిద్ఘనోఽయ మానందఘన ఇత్యపి. ౫౫౬

శ్లో॥ ఆనందఘన తామస్య స్వరూపం ప్రత్యగాత్మనః,
ధన్యైర్మహాత్మభిః క్ష్మైః బ్రహ్మవిద్భి స్సముత్తమైః. ౫౫౭

శ్లో॥ అపరోక్షతయా చాత్మా సమాధావనుభూయతే,
కేవలానంద మాత్రత్వే నైవ మత్ర న సంశయః, ౫౫౮

తా॥ శ్రుతి, ప్రాణులయందలి దయతో, ఆత్మ నుద్దేశించి, "యితడు, సత్యస్వరూపుడనియు, జ్ఞానస్వరూపుడనియు, ఆనంద స్వరూపుడనియు" నిరూపించుచు నాత్మస్వరూపమును నానంద ఘన మైన దానినిగానే చెప్పుచున్నది. మరియు ధన్యులగు మహానుభావులు స్వవర్ణాశ్రమ విహితకర్మానుష్ఠానముచే నిర్మలమైన తమ యంతఃకరణము నందు సమాధికాలమున నాత్మ స్వరూపమును నానంద స్వరూపముగనే సాక్షాత్కరించుకొనుచున్నారు. కావున నాత్మ ఆనంద స్వరూపుడను టలో సందియ మెంతయు లేదు.

శ్లో॥ స్వస్వోపాధ్యనురూపేణ బ్రహ్మాద్యా స్సర్వజన్తవః,
ఉపజీవ న్త్యముష్యైవ మాత్రా మానందలక్షణామ్.

తా॥ చతుర్ముఖబ్రహ్మ మొదలగు సకలప్రాణులును ఈ పరమాత్మ యొక్క యానందరూపమగు నంశమునే తమ తమ యన్తఃకరణముల యొక్క నైర్మల్యము ననుసరించి యనుభవించుచున్నవి.

శ్లో॥ ఆస్వాద్యతే యో భక్ష్యేషు సుఖకృన్మధురో రసః,
సగుడస్యైవ నోతేషాం మాధుర్యం విద్యతే క్వచిత్.

శ్లో॥ తద్వద్విషయసాన్నిధ్యా దానందో యః ప్రతీయతే,
బింబానందాంశ విస్ఫూర్తి రేవాఽసౌ న జడాత్మనామ్.

తా॥ జిలేబి మున్నగు భక్ష్యములను భుజించుచుండగా వాని యందు మాధుర్యము అనుభవింపబడుచున్నది. ఈ మాధుర్యము బెల్లముదే గాని భక్ష్యములదిగాకున్నది. అట్లే భార్యాపుత్రాది విషయములు సమీపమున నుండగా మనస్సునందు స్ఫురించెడి ఆనందము, బింబస్థానముననున్న యాత్మానందము యొక్క యంశమే కాని, జడమగు మనస్సునకుగాని, భార్యాపుత్రాదులకుగాని సంబంధించినది కానేరదు.

శ్లో॥ యస్యకస్యాఽపి యోగేన యత్ర కుత్రాఽపి దృశ్యతే,
ఆనంద స్సపరస్యైవ బ్రహ్మణ స్స్ఫూర్తిలక్షణః. ౬౬౨

శ్లో॥ యథా కువలయోల్లాసః చన్ద్రస్యైవ ప్రసాదతః,
తథాఽఽనన్దయోఽప్యేషాం స్ఫురణా దేవ వస్తునః.

తా॥ ఏ విషయముయొక్క సంబన్ధముచే నైనను ఏ ప్రాణియందైనను గనబడు నానందము పరమాత్మయొక్క స్ఫురణరూపమే కాని వేఱుగాదు. మరియు చంద్రునియొక్క ప్రకాశము వలననే కలువలు వికసించు

చున్నట్లు ఆత్మానంద ప్రకాశమువలననే సకల ప్రాణులకును ఆనంద మందయించుచున్నది.

శ్లో॥ సత్త్వం చిత్త్వం తథాఽనందః స్వరూపం పరమాత్మనః,
నిర్గుణస్య గుణాయోగాత్ గుణాస్తు నభవన్తితే. ౬౬౪

తా॥ సత్త్వము (త్రికాలములయందు నేకరూపమున నుండుట) జ్ఞానము, ఆనందంబును పరమాత్మకు స్వరూపంబే కాని గుణంబులు గానేరవు. ఏలయన నిర్గుణునకు గుణములుండ నేరవుగదా! అట్లుగాక సత్త్వచిత్త్వానందములు గుణములే యగునేని, 'పరమాత్మ అద్వితీయుడు గుణరహితుడు' అని బోధించెడి శ్రుతులకు విరోధమువాటిల్లును.

శ్లో॥ విశేషణం తు వ్యావృత్త్యై ఖలు ద్రవ్యాన్తరే సతి,
పరమాత్మాఽద్వితీయోఽయం ప్రపంచస్యమృషాత్వతః.
వస్త్వంతరస్యాఽభావేన నవ్యావృత్త్యైః కదాచన. ౬౬౫

కేవలో నిర్గుణశ్చేతి నిర్గుణత్వం నిరుచ్యతే,
శ్రుత్యైవ న తతి స్తేషాం గుణత్వ ముపపద్యతే. ౬౬౬

తా॥ లోకమునందు నల్లకలువ అనుమాటలో 'నల్ల' అనునది, విశేషణము. 'కలువ' అనునది విశేష్యము. 'నల్ల' అనుమాట ఎఱ్ఱ కలువను నిషేధించుటకై యుపయోగించుచున్నది. ఎఱ్ఱకలువయే లేనిచో 'నల్లకలువ' అని చెప్పవలసిన యవసరముండదు. ఇక నాత్మ విషయమున విశేషణమెద్దియు నుపయోగపడదు - ఏమనగా కనబడుచున్న ప్రపంచమంతయు పరమార్థమున నసత్యమైనదగుటచే పరమాత్మ తప్ప మరియొక పదార్థమెద్దియు వాస్తమునలేదు. అందుచే వస్త్వంతరమునందు బ్రహ్మలక్షణము ప్రసరింప కుండుటకొరకై బ్రహ్మకు విశేషణ ముండ వలయుననెడి నియమమెంత మాత్రము లేదు. మరియు కైవల్యశ్రుతి-ఆత్మ- 'అద్వితీయుడు' 'గుణరహితుడు' 'సాక్షిమాత్రుడు' అని నుడువుచున్నది.

కావున సత్త్వచిత్త్వానందములు పరమాత్మకు స్వరూపమే కాని గుణములుగా నేరవు

శ్లో॥ ఉష్ణత్వం చ ప్రకాశశ్చ యథావహ్నే స్తథాఽత్మనః,
సత్త్వచిత్త్వాఽనందతాది స్వరూప మితి నిశ్చితమ్ ౬౬౭

తా॥ 'వేడిమి' 'వెలుతురు' ఈరెండును అగ్నికెట్లు స్వరూపమో అట్లే—ఉండుట—జ్ఞానము—ఆనందము—అనంతత్వము—పరిశుద్ధత్వము మొదలగు నవియు నాత్మకు స్వరూపమేయని, శ్రుతులచేతను బ్రహ్మనిష్ఠులచేతను నిర్ణయింపబడినది.

శ్లో॥ అతఏవ సజాతీయ విజాతీయాది లక్షణః,
భేదో నవిద్యతే వస్తు న్యద్వితీయే పరాత్మని. ౬౬౮

తా॥ ఆత్మకంటె భిన్నముగా గనబడుచున్న ప్రపంచమంతయు నసత్యమైనదగుటవలనను, ఆనందాదులు గుణములుగాక, ఆత్మస్వరూపమే అగుటవలనను, అద్వితీయుడగు పరాత్మయందు సజాతీయ విజాతీయ స్వగతరూపమైన భేదమేమియు లేదు. మామిడిచెట్టునకు తనయందలి ఆకులు, పూవులు, కాయలు, కొమ్మలు మున్నగువానిచే స్వగతభేద మును, నిమ్మచెట్టు, కొబ్బరిచెట్టు మున్నగు చెట్లవలన సజాతీయభేదమును, రాళ్ళు, గోడలు మున్నగువానివలన విజాతీయభేదమును ఏర్పడుచున్నది. ఆ విధముగా ఆత్మకు భేదమేదియు గానరాదు. ఏలనగా ఆత్మ—నిరవయవుడును, నిర్గుణుండును నగుటచే స్వగతభేదము లేదు. శ్రుతిప్రామాణ్యము ననుసరించి మరియొక ఆత్మ లేకుండుటచే సజాతీయభేదము లేదు. ఆత్మభిన్నమగు ప్రపంచమంతయు కల్పితమైన దగుటచే విజాతీయభేదమును లేదు.

శ్లో॥ ప్రపంచస్యాఽపవాదేన విజాతీయ కృతాభిధా,
నేష్యతే తత్ప్రకారం తే వక్ష్యామి శ్రుణు సాదరమ్.

తా॥ పరమాత్మయందు కల్పితమగు ప్రపంచమును (రాబోవు శ్లోకములందు చెప్పబడు రీతిగా) నిషేధించుటచే విజాతీయభేదము నిరాకరింపబడుచున్నది. ఆ విధానమంతయు నీకెరింగించెదను గాన నోశిష్యా! నీవు శ్రద్ధతో వినుము.

శ్లో॥ అహే ర్గుణావివ ర్తస్య గుణమాత్రస్య వస్తుతః,
వివర్తస్యాఽస్య జగత స్సన్మాత్రత్వేన దర్శనమ్. ౬౭౦
అపవాద ఇతి ప్రాహు రద్వైతబ్రహ్మదర్శినః. ౬౭౧

తా॥ త్రాటియందు కల్పింపబడినదై వాస్తవముచే త్రాటికంటె వేఱుగాని సర్పమును, త్రాడునుగా జూచునట్లు, పరమాత్మయందు కల్పితమై పరమాత్మకంటె వేఱుగాలేని ప్రపంచమును పరమాత్మమాత్రముగా జూచుట యపవాద మనబడునని పరమాత్మ తత్త్వజ్ఞులు పలుకుచున్నారు.

శ్లో॥ వ్యుత్క్రమేణ తదుత్పత్తే ర్ద్రిష్టవ్యం సూక్ష్మబుద్ధిభిః,
ప్రతీతస్యాఽస్య జగత స్సన్మాత్రత్వం సుయుక్తిభిః. ౬౭౨

తా॥ తైత్తిరీయ శ్రుతియందు, ఆత్మవలన ఆకాశము, ఆకాశమువలన వాయువు, వాయువువలన తేజస్సు, తేజస్సువలన జలము, జలమువలనభూమి, భూమివలన వ్రీహియవాదులును, వానివలన కార్యకరణ సంఘాతాత్మకములగు శరీరములును క్రమముగా నుత్పన్నములైనవని చెప్పబడియున్నది. ఇట్టియెడ బుద్ధిమంతులగు పండితులు శాస్త్రీయములగు యుక్తులచే సృష్టిక్రమమునకు విపరీత క్రమముగా ప్రపంచమంతయు ఆత్మమాత్రమే యని యూహింపవలయును.

శ్లో॥ చతుర్విధం స్థూలశరీరజాతమ్
తదోఘ్భజ్య మన్నాది తదాశ్రయాది,

బ్రహ్మాండమేత త్సకలం స్థవిష్ఠమ్
ఈక్షేత పంచీకృతభూతమాత్రమ్. ౬౨౩

తా॥ అండజములు, స్వేదజములు, ఉద్భిజ్జములు, జరాయుజములు అని నాలుగు విధములగు స్థూలశరీరములును, వానికి భోజ్యమగు నాహారాదికమును వానికి ఆధారభూతములగు గృహక్షేత్రాదులును, ఈ రీతిగా స్థూలమగు నీ బ్రహ్మాండమంతయును పంచీకృత పంచమహాభూతముల వలన నుత్పన్నమైన దగుటచే పంచమహాభూతములకంటె వేఱుగాలేదని కాంచనగును.

శ్లో॥ యత్కార్య రూపేణ యదీక్ష్యతే తత్
తన్మాత్ర మేవాఽత్ర విచార్యమాణే,
మృత్కార్యభూతం కలశాది సమ్యక్
విచారితం సన్నమృదో విభిద్యతే. ౬౨౪

తా॥ మన్నుయొక్క కార్యమైన కుండను బాగుగా విచారింతుమేని నయ్యది మన్నుకంటె వేఱుకాదని నిశ్చితమగుచున్నది. ఈ విధముననే ప్రపంచమునందు ఏది దేని కార్యమో, అది దానికంటె వేఱుకాదని యేర్పడుచున్నది.

శ్లో॥ అన్త ర్బహిశ్చాఽపి మృదేవ దృశ్యతే
మృదో న భిన్నం కలశాది కించన,
గ్రీవాదిమద్య త్కలశం తదిత్థమ్
నవాచ్యమేతచ్చ మృదేవనాఽన్యత్. ౬౨౫

తా॥ ఘటమును బాగుగా విమర్శించి చూచిన లోపలను వెలుపలను, అంతటను మృత్తేగాని దానికంటె నితరమేమియును గనబడదు. కంఠము పొట్ట మొదలగు నవయవములు గలది కలశమగు నని చెప్పినను

గ్రీవాదులు గూడ మృత్తే యగుటచే మృత్తుకంటె వేఱుగా కలశమను స్వరూపము నిరూపింపశక్యముగా నేరదు.

శ్లో॥ స్వరూపత స్తత్కలశాది నామ్నా
మృదేవ మూఢై రభిధీయతే తతః,
నామ్నోహి భేదో నతు వస్తుభేదః
ప్రదృశ్యతే తత్ర విచార్యమాణే. ౬౭౬

తా॥ స్వరూపముచేత మృత్తు అయిన దానినే మూర్ఖులు 'కుండ' 'మూకుడు' మొదలగు నామములచే చెప్పుచున్నారు. ఇందు విచారింపగా 'కుండ' 'మూకుడు' అను మాటలకే భేదముగాని, మృత్తునకు మాత్రము భేదమేమియు లేదు.

శ్లో॥ తస్మాద్ధి కార్యం నకదాఽపి భిన్నమ్
స్వకారణా దస్తి యత స్తతోఽంగ,
య ద్భౌతికం సర్వమిదం తథైవ
తద్భూతమాత్రం నతతోఽపి భిన్నమ్. ౬౭౭

తా॥ పూర్వమందు చెప్పబడిన రీతిగా కార్యము కారణముకంటె వేఱుగా నేరదని తేలుపడినది. కనుకనే ఓవత్సా! కనబడుచున్న ప్రపంచమంతయు ఏ భూతములవలన పుట్టినదో ఆభూతముల స్వరూపమాత్రమే అగునుగాని అంతకంటె వేఱుగా నేరదు.

శ్లో॥ తచ్చాఽపి పంచీకృత భూతజాతమ్
శబ్దాదిభిః స్వస్వగుణైశ్చ సార్థమ్,
వపూంషి సూక్ష్మాణిచ సర్వ మేతత్
భవత్యపంచీకృత భూతమాత్రమ్. ౬౭౮

తా॥ పంచీకరణము చేయబడిన స్థూలభూతములును, వాని గుణము లగు శబ్దస్పర్శరూప రసగంధములును, జ్ఞానేంద్రియములైదు, కర్మేంద్రియములైదు, పంచప్రాణములు, మనోబుద్ధులనను పదునేడింటితో కూడుకొనిన లింగశరీరములును, ఇవియన్నియు, పంచీకరణము చేయబడని పంచసూక్ష్మభూతముల వలన గలిగినవి. కాబట్టి యివి యన్నియు సూక్ష్మభూతమాత్రములే యగునుగాని వానికంటె భిన్నములు గా నేరవు.

శ్లో॥ తద ప్యపంచీకృత భూతజాతమ్
రజ స్తమ స్సత్త్వ గుణైశ్చ సార్థమ్,
అవ్యక్తమాత్రం భవతి స్వరూపతః
సా భాస మవ్యక్త మిదం స్వయంచ. ౬౨౯

శ్లో॥ ఆధారభూతం యదఖండ మాద్యమ్
శుద్ధం పరంబ్రహ్మ సదైకరూపమ్,
సన్మాత్రమేవాఽ స్త్యథ నో వికల్పః
సతః పరం కేవల మేవ వస్తు. ౬౩౦

తా॥ పంచీకరణము చేయబడని పంచసూక్ష్మ భూతంబులును వానికి కారణములగు సత్త్వరజ స్తమోగుణంబులును జేరి స్వరూపముచే తమకు మూలకారణమగు ప్రకృతియే యగుచున్నవి అంతకంటె వేఱుగా కున్నవి బ్రహ్మప్రతిబింబముతో గూడుకొనిన యీ ప్రకృతియు, తన కాధారంబగు పరబ్రహ్మ మాత్రమె యగుచున్నది అట్టి పరబ్రహ్మము, సర్వదోషవర్జితమును, సర్వకాల స్థాయియు, సకలవికల్ప రహితంబును అద్వితీయంబునునై సచ్చిదానంద స్వరూపమున వెలుగొందుచున్నది.

శ్లో॥ ఏకశ్చన్ద్రో సద్వితీయో యథా స్యాత్
దృష్టే ర్దోషాదేవ పుంస స్తథైకం,

బ్రహ్మాఽద్వైత ద్బుద్ధిదోషేణ నానా
దోషే నష్టే భాతి వస్త్వేక మేవ. ౬౮౧

తా॥ పురుషునకు దృష్టిదోషము వలన ఒక్కడగు చన్ద్రుడు ఇద్దఱు వలె గనబడుచున్నాడు. దృష్టిదోషమంతయు నౌషధ సేవచే నశింపగా నొక్కడే చన్ద్రుడు భాసించుచున్నాడు. అట్లే సచ్చిదానన్ద పరబ్రహ్మంబును, బుద్ధియొక్క రజస్తమోదోషముల వలన పలువిధములుగా భాసించుచున్నను సత్కర్మానుష్ఠానము వలన బుద్ధిదోషములన్నియు నశింపగా నిర్మలమగు నంతఃకరణమునందు ఏక రూపముననే భాసించును.

శ్లో॥ రజ్జౌ స్వరూపాధిగమేన సర్పధీః
రజ్జ్వాం విలీనాతు యథా తథైవ,
బ్రహ్మాఽవగత్యాతు జగత్ప్రతీతిః
తత్రైవ లీనాతు సహాభ్రమేణ. ౬౮౨

తా॥ త్రాటియందు అజ్ఞానముచే కల్పితమగు సర్పబుద్ధి, త్రాటి యొక్క స్వరూపము తెలియగానే, త్రాటియందే లయించుచున్నది. అనగా, త్రాడుతప్ప పాము కనబడదు. అట్లే బ్రహ్మయందు అజ్ఞానముచే కల్పితమగు ప్రపంచమంతయును, బ్రహ్మసాక్షాత్కారము కలుగగనే, తనదగు నామరూప క్రియాస్వరూపము పరిత్యజించి స్వోత్పత్తి హేతువగు నజ్ఞానముతో గలసి బ్రహ్మమునందు లయించుచున్నది.

శ్లో॥ భ్రాన్త్యోదిత ద్వైత మతిప్రకాశాన్
సదేక మేవాఽస్తి సదాఽ ద్వితీయమ్,
తతో విజాతీయకృతోఽత్ర భేదః
న విద్యతే బ్రహ్మణి నిర్వికల్పే. ౬౮౩

తా॥ బ్రహ్మము నాశ్రయించుకొని బ్రహ్మమునే ఆవరించిన అజ్ఞానముచే కల్పింపబడిన ప్రపంచమంతయును బ్రహ్మజ్ఞానముచేనివారింపబడగా నంతట ద్వితీయ వస్తురహితమగు సద్రూపమైనబ్రహ్మము మాత్రము మిగులుచున్నది. ఇట్టి సచ్చిదానంద బ్రహ్మము సర్వవికల్పనావర్జితమైనదగుటచే దీనియందు (అనృతజడదుఃఖాత్మకమగు) విజాతీయ ప్రపంచము వలన నేర్పడు భేదములేదు.

శ్లో॥ యదా ఽస్త్యుపాధి స్తదభిన్న ఆత్మా
తదా సజాతీయ ఇవాఽవభాతి,
స్వప్నార్థత స్తస్య మృషాత్మకత్వాత్
తదప్రతీతౌ స్వయమేవ చాత్మా,
బ్రహ్మైక్యతామేతి పృథ జ్నభాతి
తత స్సజాతీయకృతో నభేదః. ౬౮౪

తా॥ ప్రపంచము కల్పితమైనదగుటచే తత్ప్రయుక్తమగు విజాతీయ భేదము బ్రహ్మమునందు లేకున్నను బ్రహ్మతో సమానుడగు జీవుడు ప్రత్యక్షముగా భాసించుచుండుటచే తత్ప్రయుక్తమగు సజాతీయ భేదమేల సంభవింపదను నాశంకకు సమాధానము చెప్పబడుచున్నది. అజ్ఞానకాలమునందు కల్పింపబడిన బుద్ధీన్ద్రియ శరీరాది రూపమగు నుపాధియందు ప్రతిఫలించి దాని ధర్మములతో తాదాత్మ్యాభిమానము నొందిన బ్రహ్మ ప్రతిబింబమే జీవుడనబడుచున్నాడు. ఈ ప్రతిబింబరూపుడగు జీవుడు తన యుపాధి యున్నంత కాలము బ్రహ్మకంటె వేఱుగా తత్సమానుడు వోలె భాసించు చున్నాడు. కాని స్వప్నమునందలి శరీరేన్ద్రియాదులవలె, వ్యావహారిక బుద్ధీన్ద్రియ శరీరాదులును అజ్ఞాన కల్పితములగుటచే జ్ఞానముచే నవియన్నియు విలయము నొందగా నుపాధి లేమింజేసి ప్రతిబింబ జీవుడు బింబభూత సచ్చిదానంద పరబ్రహ్మముతో

నైక్య నొందుచున్నాడు. అట్టికాలమునందు బ్రహ్మకంటె వేఱుగాజీవుడు లేకుండుటంబట్టి బ్రహ్మమునందు సజాతీయ భేదముకూడ లేదని నిశ్చిత మగుచున్నది.

శ్లో॥ ఘటాఽభావే ఘటాకాశో మహాకాశో యథా తథా,
ఉపాధ్యభావే త్వాత్మైవ స్వయం బ్రహ్మైవ కేవలమ్.

తా॥ కుండయందున్న ఆకాశము ఘటాకాశ మనబడుచున్నది. కుండ నశింపగా, ఆ ఘటాకాశము మహాకాశమే యగుచున్నది. అట్లే బుద్ధీంద్రియ శరీరాదులను నుపాధియందు ప్రతిఫలించిన బ్రహ్మచైతన్యము జీవుడన బడుచున్నాడు. అయుపాధి జ్ఞానాగ్నిచే నశింపగా జీవుడు బ్రహ్మమే యగుచున్నాడు.

శ్లో॥ పూర్ణఏవ సదాఽకాశో ఘటే సత్యప్యసత్యపి,
నిత్యపూర్ణస్య మహతో (నభసః)విచ్ఛేదః కేన సిద్ధ్యతి.

తా॥ ఘటము ఉన్నను లేకున్నను, ఆకాశము ఎల్లప్పుడును పరిపూర్ణ స్వరూపముననే యుండును ఇట్టి సర్వవ్యాపకమగు నాకాశమునకు దేనిచేతను తెంపు కలుగ నేరదు.

శ్లో॥ అచ్ఛిన్న శ్ఛిన్నవద్భాతి పామరాణాం ఘటాదినా,
గ్రామక్షేత్రా ద్యవధిభి ర్భిన్నేవ వసుధా యథా. ౬౮౭

శ్లో॥ తథైవ పరమం బ్రహ్మ మహతాం చ మహత్తమమ్,
పరిచ్ఛిన్న మివాభాతి భ్రాన్త్యాకల్పిత వస్తునా. ౬౮౮

తా॥ స్వభావముచే తెంపులేని యాకాశము ఘటాది వస్తువులచే పరిచ్ఛిన్నమైనది వలె పామరులకు భాసించు చున్నది. మరియు అఖండమగు భూమియే, గ్రామములు, నగరములు, పొలములు మున్నగువాని యొక్క పొలిమేరలచే భిన్నభిన్నముగా గనబడుచున్నది. అదేవిధముగా

పరబ్రహ్మంబును స్వభావముచే నాకాశముకంటె గూడ వ్యాపకమైనను భ్రాన్తి కల్పితములగు బుద్ధీన్ద్రియ శరీరాదులచే పరిచ్ఛిన్నమైనదివోలె ప్రకాశించుచున్నది.

శ్లో॥ తస్మాద్బ్రహ్మాత్మనో ర్భేదః కల్పితో నతు వాస్తవః,
అతఏవ ముహుశ్శ్రుత్యా హ్యేకత్వం ప్రతిపాద్యతే.

తా॥ కావున జీవ బ్రహ్మదులకు గల భేదము, బుద్ధీన్ద్రియ, శరీరాద్యుపాధులయొక్క సంబన్ధము వలన కల్పితమైనదేగాని, వాస్తవముగానేరదు. అందుచేతనే, శ్రుతి - 'జీవుడేబ్రహ్మము' 'జీవుడేబ్రహ్మము' అని పలుమార్లు జీవబ్రహ్మలకు ఏకత్వమును బోధించుచున్నది.

శ్లో॥ బ్రహ్మాత్మనో స్తత్వమసీ త్యద్వయత్వోపపత్తయే,
ప్రత్యక్షాది విరోధేన వాచ్యయో ర్నోపయుజ్యతే,
తత్త్వం పదార్థయో రైక్యం లక్ష్యయో రేవ సిద్ధ్యతి.

తా॥ 'తత్త్వమసి' యను మహావాక్యమునందు, జీవబ్రహ్మలిరువురకును నభేదము బోధంపబడుచున్నది. కాని యీ జీవబ్రహ్మైక్యమనునది ప్రత్యక్ష ప్రమాణమునకు విరుద్ధముగానున్నది. ఏలయనగా ప్రత్యక్ష ప్రమాణముచే ప్రాణు౦డలకును తాను (జీవుడు) వేఱనియు, బ్రహ్మ వేఱనియు నిస్సందేహముగాతోచుచున్నది. అట్లేఅనుమాన ప్రమాణముచే జూచినను కించిజ్జుడగు జీవుడు సర్వజ్ఞ బ్రహ్మచైతన్యముగానేరడనియు సర్వజ్ఞమగు బ్రహ్మచైతన్యము, కించిజ్జుడగు జీవుడుగానేరడనియు, నిశ్చితమగుచున్నది. కావున నిట్టి విరోధమును పరిహరించుటకొరకై శాస్త్రమునందు లక్షణావృత్తి నంగీకరించి తత్త్వం పదములయొక్క లక్ష్యార్థమగు చైతన్యమాత్రమున కైక్యము బోధింపబడు చున్నది. అనగా శబ్దమునకు, వాచ్యార్థము, లక్ష్యార్థము అని రెండు అర్థములు గలవు. అందు 'తత్త్వమసి' అను వాక్యమునందలి 'తత్' అను పదమునకు మాయతో

గూడుకొని సర్వజ్ఞమును, సర్వవ్యాపకమునూనైన బ్రహ్మచైతన్యము వాచ్యార్థము. మాయా సంబన్ధములేనిదై నిర్గుణమైన బ్రహ్మచైతన్యము లక్ష్యార్థము. అట్లే 'త్వమ్' అను పదమునకు, అన్తఃకరణముతో గూడుకొనినదై కించిజ్ఞమును పరిచ్ఛిన్నమూనైన జీవచైతన్యము వాచ్యార్థమును, అన్తఃకరణ సంబన్ధరహితమైన చైతన్యము లక్ష్యార్థమును నగుచున్నది. ఇట్టియెడ జీవబ్రహ్మపదములయొక్క వాచ్యార్థము పరస్పర విరుద్ధమైనదగుటచే, వాచ్యార్థము కుదురనప్పుడు లక్ష్యార్థము ననుసరింపవలయును ననెడి శాస్త్రసంప్రదాయము ననుసరించి, తత్త్వంపదములకు లక్ష్యార్థమును స్వీకరించినచో విరుద్ధ ధర్మవర్జితమగు చైతన్యమాత్రమునకు ఏకత్వము పపన్నమగుచున్నది.

శ్లో॥ స్యాత్తత్త్వం పదయోః స్వామి న్నర్థః కతి విధోమతః,
పదయోః కోను వాచ్యార్థో లక్ష్యార్థ ఉభయోశ్చకః.

శ్లో॥ వాచ్యైకత్వ వివక్షాయాం విరోధః కః ప్రతీయతే,
లక్ష్యార్థయో రభిన్నత్వే సకథం వినివర్తతే. ౬౭-౨

శ్లో॥ ఏకత్వ కథనే కావా లక్షణాఽత్రో రరీకృతా,
ఏతత్సర్వం కరుణయా సమ్యక్ త్వం ప్రతిపాదయ.

తా॥ గురువుచే నీరీతిగా బోధింపబడిన శిష్యుడు తనకు గలిగిన యనుమానముల నడుగుచున్నాడు. స్వామీ! తమచే బోధింపబడిన 'తత్త్వమసి' యను వాక్యమునందలి 'తత్' 'త్వం' అను పదములకు ఎన్ని విధములగు నర్థములుగలవు? అందు వాచ్యార్థమేది? లక్ష్యార్థమేది? వాచ్యార్థముల కభేదము చెప్పగా నేమి విరోధము ప్రాప్తించును? లక్ష్యార్థముల కభేదమును చెప్పినచో నావిరోధమెట్లు నివర్తించును? మఱియు శాస్త్రమునందు జహల్లక్షణ, అజహల్లక్షణ జహదజహల్లక్షణ యని లక్షణావృత్తి మూడువిధములుగా నున్నది. అందు 'తత్త్వమసి' యను వాక్యములో

నేలకుణావృత్తిని స్వీకరింపవలయును? ఈ విధములగు నాశంకల నన్నిటిని ఓ గురువర్యా! తమరు నివారింప వలయునని వేడుకొనుచున్నాను.

శ్లో॥ శ్రుణుష్వాఽవహితో విద్వన్! అద్యతే ఫలితం తపః,
వాక్యార్థ శ్రుతిమాత్రేణ సమ్య గ్జ్ఞానం భవిష్యతి.

తా॥ పండితుడవగు నో వత్సా! నీ వడిగిన దంతయు చెప్పెదను నిశ్చలచిత్తుడవై వినుము. నీ పూర్వపుణ్యము ఫలించినది ఏలయనగా 'తత్త్వమసి' యను మహావాక్యార్థమును విని నంతమాత్రముననే సర్వసంసార మోచకమగు బ్రహ్మజ్ఞాన మూదయించును. కావున నట్టి వాక్యార్థము నాకర్ణింపుము.

శ్లో॥ యావన్న తత్త్వం పదయో రర్థః సమ్య గ్విచార్యతే,
తావ దేవ నృణాం బన్ధో మృత్యుసంసారలక్షణః. ౭౬౫

తా॥ మరియు మానవులు ఎంతవరకు 'తత్' 'త్వమ్' అను పదముల యర్థమును శాస్త్రసంప్రదాయ పూర్వకముగా విచారింపరో అంతవరకే వారలకు అనాత్మ పదార్థములగు దేహేన్ద్రియాదులందు 'నేన'ను భ్రాన్తిసిద్ధమగు బన్ధము కలుగుచున్నది. ఇట్టి బన్ధమువలననే స్వర్గ మనుష్యాది లోకములందు జన్మమరణాది రూపమగు సంసారము ననుభవించుచున్నారు.

శ్లో॥ అవస్థా సచ్చిదానన్దాఽ ఖండైక రసరూపిణీ,
మోక్షః సిద్ధ్యతి వాక్యార్థాఽ పరోక్షజ్ఞానత స్సతామ్.

తా॥ 'తత్త్వమసి' యను మహావాక్యార్థ విచారము వలన కలిగిన 'నేను బ్రహ్మము నగుచున్నా' నను జ్ఞానముచే సత్పురుషులకు సచ్చిదానంద బ్రహ్మరూపమగు మోక్షము సిద్ధించుచున్నది.

శ్లో॥ వాక్యార్థ ఏవ జ్ఞాతవ్యో ముముక్షో ర్భవముక్తయే,
తస్మా దవహితో భూత్వా శ్రుణు వక్ష్యే సమాసతః.

తా॥ సంసారబన్ధమునుండి విడుదలను గోరువారలకు 'తత్త్వమసి' మున్నగు మహావాక్యముల యొక్క తాత్పర్యార్థమును తెలిసికొనుట ముఖ్యావసరము కావున నట్టి మహావాక్యార్థమునంతయును చెప్పెదను. నీవు నిశ్చల చిత్తుడవై వినుము.

శ్లో॥ అర్థా బహువిధాః ప్రోక్తాః వాక్యానాంపండితో త్తమైః,
వాచ్యలక్ష్యాది భేదేన ప్రస్తుతం శ్రూయతాం త్వయా.

తా॥ 'తత్త్వమసి' మొదలగు మహావాక్యములకు వాచ్యార్థము, లక్ష్యార్థము, తాత్పర్యార్థము నను భేదముచే ననేకవిధములగు నర్థములు పండితులచే చెప్పబడినవి. అందు ప్రకృతార్థమును వినుము.

శ్లో॥ వాక్యే తత్త్వ మసీత్యత్ర విద్యతే యత్పదత్రయమ్,
తత్రాదౌ విద్యమానస్య తత్పదస్య నిగద్యతే. ౬౯౯

శ్లో॥ శాస్త్రార్థకోవిదై రర్థో వాచ్యో లక్ష్య ఇతి ద్విధా,
వాచ్యార్థం తే ప్రవక్ష్యామి పండితై ర్య ఉదీరితః. ౭౦౦

తా॥ 'తత్త్వమసి' యను మహావాక్యమునందు 'తత్' 'త్వం' 'అసి' యను మూడు పదములు గలవు. అందు మొదటిదగు 'తత్' అను పదమునకు పండితులచే వాచ్యార్థము, లక్ష్యార్థము నని రెండర్థములు చెప్పబడు చున్నవి. వానిలో ప్రకృతము వాచ్యార్థమును జెప్పెద వినుము.

శ్లో॥ సమష్టిరూప మజ్ఞానం సాభాసం సత్త్వబృంహితమ్,
వియదాది విరాడంత స్వకార్యేణ సమన్వితమ్. ౭౦౧

శ్లో॥ చైతన్యం తదవచ్ఛిన్నం సత్యజ్ఞానాది లక్షణమ్,
సర్వజ్ఞత్వేశ్వరత్వాన్త ర్యామిత్వాది గుణై ర్యుతమ్.
జగ త్సృష్టిత్వావితృత్వ సంహర్తృత్వాది ధర్మకమ్,
సర్వాత్మనా భాసమానం యదమేయ గుణై శ్చ తత్.
అవ్యక్త మపరం బ్రహ్మ వాచ్యార్థ ఇతి కథ్యతే. ౨౦౩

తా॥ సమష్టి కారణ శరీరరూపమగు నజ్ఞానము సత్త్వగుణ మధికముగాగలదై చైతన్యముయొక్క ప్రతిబింబముతో గూడుకొని ఆకాశము మొదలుకొని స్థూలసమష్టి బ్రహ్మాండోపాధికుడగు విరాట్టు వఱకుగల సమస్త ప్రపంచమును నిర్మించుచున్నది. ఇట్టి అజ్ఞానముతో గూడుకొనిన సచ్చిదానంద చైతన్యము సగుణ బ్రహ్మమనబడుచున్నది. ఈ సగుణ బ్రహ్మము తన యుపాధియగు నజ్ఞాన సంబన్ధమువలన సకల విషయముల నెఱుంగునదియు, సర్వసామర్థ్యములు గలదియు, నిఖిల ప్రాణులను నియమించునదియునై ప్రపంచముయొక్క సృష్టి స్థితి లయముల నొనరించుచున్నది. ఇట్టి యపర బ్రహ్మమె తత్పదమునకు వాచ్యార్థమని చెప్పబడుచున్నది.

శ్లో॥ నీల ముత్పల మిత్యత్ర హ్యాస్తి వాక్యార్థ సంగతిః,
తథా తత్త్వమసీ త్యత్ర నాఽస్తివాక్యార్థ సంగతిః.౨౦౪

తా॥ 'నల్లకలువ' అనుచోట 'నల్ల' అను పదార్థమునకును 'కలువ' అను పదార్థమునకును, రెండిటికిని విశేషణ విశేష్యభావముచే నన్వయము కుదురుచున్నది. ఆ విధముగా 'తత్త్వమసి' యను వాక్యమునందు 'తత్' 'త్వం' అను పదములు రెండును పరస్పర విరుద్ధార్థములు గలవగుటచే 'అసి' అని అభేదాన్వయరూపమగు వాక్యార్థము కుదురకున్నది.

శ్లో॥ పటాద్వ్యావర్తతే నీల ఉత్పలేన విశేషితః,
శౌక్ల్యా ద్వ్యావర్తతే నీలే నోత్పలం తు విశేషితమ్.

ఇత్థ మన్యోఽన్య భేదస్య వ్యావర్తకతయా తయోః,
విశేషణ విశేష్యత్వ సంసర్గ స్యేతరస్యవా. ౨౦౭

వాక్యార్థత్వే ప్రమాణాంతరవిరోధో నవిద్యతే,
అత స్సంగచ్ఛతే సమ్యగ్వాక్యార్థో బాధవర్జితః. ౨౦౮

తా॥ నీలోత్పల మనుచోట నీల శబ్దార్థమగు నీలవర్ణము. ఉత్పల శబ్దార్థమగు కలువతో కూడుకొనినదై నీల వస్త్రమును నివర్తింప జేయుచున్నది. ఆట్లే కలువ, నీలవర్ణముతో గూడు కొనినదై తెల్లకలువను నివారించుచున్నది. ఈ రీతిగా నీలోత్పల పదార్థములు రెండును, విశేషణ విశేష్య భావసంబంధముచే గాని అభేదసంబంధముచేగాని అన్వయము నొందుచున్నవై నల్లకలువయను జ్ఞానమును గలిగించుచున్నవి. ఇందువలన నల్లకలువ యనుచోట నన్వయమునకు విరోధమేదియు లేదు.

శ్లో॥ ఏవం తత్త్వ మసీత్యత్ర వాక్యాఽర్థో న సమంజసః,
తదర్థస్య పరోక్షత్వాది విశిష్టచితేఽపి. ౨౦౯
త్వ మర్థస్యాఽ పరోక్షత్వా దివిశిష్టచితేరపి,
తథైవాఽన్యోన్య భేదస్య వ్యావర్తకతయా తయోః.
విశేషణ విశేష్యస్య సంసర్గ స్యే తరస్యవా,
వాక్యార్థత్వే విరోధోఽస్తి ప్రత్యక్షాది కృత స్తతః
సంగచ్ఛతే న వాక్యార్థ స్తద్విరోధం చ వచ్మితే. ౨౧౦

తా॥ ఈ రీతిగా 'తత్త్వమసి' యనుచోట వాక్యార్థము సంగతముగా నేరదు. ఎందుచేతనన కారణము జెప్పెద వినుము. 'తత్' అను పదమునకు ప్రత్యక్షముగా నట్టియు, సర్వజ్ఞత్వ సర్వవ్యాపకత్వాది ధర్మములు గలిగి నట్టియు, నీశ్వర చైతన్యము వాచ్యార్థ మగుచున్నది. 'త్వమ్' అను

పదమునకు ప్రత్యక్షమైనట్టియు కించిజ్ఞత్వ పరిచ్ఛిన్నత్వాది ధర్మవిశిష్ట మగునట్టియూ జీవచైతన్యము వాచ్యార్థ మగుచున్నది. పరస్పర విరుద్ధ ధర్మములుగల ఇట్టి రెండు చైతన్యములకును, పరస్పరము విశేషణ విశేష్యభావమునుగాని, తాదాత్మ్యసంబన్ధమునుగాని జెప్పినచో ప్రత్యక్షాది విరోధ మేర్పడుచున్నది. అందుచే వాక్యార్థమనుపపన్న మగుచున్నది. ఆ విరోధమును జెప్పుచున్నాను వినుము.

శ్లో॥ సర్వేశత్వ స్వతన్త్రత్వ సర్వజ్ఞత్వాదిభి ర్గుణైః,
సర్వోత్తమ స్సత్యకామ స్సత్యసంకల్ప ఈశ్వరః. ౭౦౧
తత్పదార్థ స్త్వమర్థస్తు కించిజ్ఞో దుఃఖజీవనః,
సంసార్యయం తద్గతికో జీవః ప్రాకృతలక్షణః. ౭౦౨
కథ మేకత్వ మనయో ర్ఘటతే విపరీతయోః,
ప్రత్యక్షేణ విరోధోఽయ ముభయో రుపలభ్యతే. ౭౦౩

తా॥ తత్పదమునకు ఈశ్వరుడు అర్థము. ఇతడు సకల లోకముల నియమించుట, స్వాతన్త్ర్యము గలిగియుండుట, సర్వవిషయముల నెఱుంగుట, మున్నగు గుణములుగలవాడై, సత్యకాముడును సత్యసంకల్పుడు నగుచున్నాడు. కావుననే సర్వశ్రేష్ఠుడు ఈశ్వరుడు. ఇక 'త్వం' పదము నకు జీవుడు అర్థము. జీవుడు స్వల్పజ్ఞానము గలవాడు. ప్రకృతియొక్క సత్త్వరజస్తమోగుణములకు వశుడై దుఃఖమయ మగు సంసారము ననుభ వించుచున్నాడు. కర్మల నాచరించుచు తత్ఫల ప్రదుడగు నీశ్వరునకు పరతన్త్రుడగుచున్నాడు. ఈవిధమైన విరుద్ధస్వరూప స్వభావములు గల జీవేశ్వరుల కిరువురకును ప్రత్యక్షసిద్ధమగు విరోధముండుటం జేసి యభేదము సంభవింప నేరదు.

శ్లో॥ విరుద్ధ ధర్మాక్రాన్తత్వాత్పరస్పర విలక్షణౌ,
జీవేశౌ వహ్నితుహినా వివశబ్దార్థతోఽపిచ. ౭౦౪

శ్లో॥ ప్రత్యక్షాది విరోధస్స్యా దిత్యైక్యే తయోః పరిత్యక్తే,
శ్రుతిజనిత విరోధో భవతి మహాన్ స్మృతివచనవిరోధశ్చ.

తా॥ జీవేశ్వరు లిరువురును కించిజ్జ్ఞత్వము, సర్వజ్ఞత్వము మున్నగు విరుద్ధ ధర్మములు గలవారగుటచే 'అగ్ని' 'మంచు' నను శబ్దముచేతను అర్థముచేతను గూడ భిన్నులగుచున్నారు. ఇట్టి జీవేశ్వరులకు ఐక్యము చెప్పినచో ప్రత్యక్షాది ప్రమాణములు విరోధించునని తలచి జీవేశ్వరైక్యమును పరిత్యజించితిమేని "జీవేశ్వరులిరువురు నొకటియే యని యుద్ఘోషించుచున్న" శ్రుతి స్మృతులకు గొప్పవిరోధము వాటిల్లును.

శ్లో॥ శ్రుత్యా త్వైక్యైకత్వ మనయోః స్వాత్మైక్యేన సిద్ధ్యతే,
మహావాక్యత్వ మసీత్యస్మా దంగీకార్యం శ్రుతేర్వచః.

తా॥ కావున సృష్టి యెడ సకల శంకా శూన్యమును సర్వప్రమాణ మూర్ధన్యమును నగు శ్రుతి వాక్యము అంగీకరింపబడ దగియున్నది. అది యెట్లనిన ఛాందోగ్య శ్రుతి యుపక్రమోప సంహారములచే 'తత్త్వమసి' యను మహావాక్యమునందు జీవేశ్వరులకు అభేదమును బోధించుచున్నది. కావున నదియే ముముక్షు జనులకు స్వీకార్యమగును.

శ్లో॥ వాక్యార్థత్వే విశిష్టస్య సంసర్గస్య చ వా పునః,
అయథార్థతయా సోఽయం వాక్యార్థో న మతః శ్రుతేః.

తా॥ 'తత్త్వమసి' యనుచోట సర్వజ్ఞత్వకించిజ్జ్ఞత్వాది ధర్మములు గల చైతన్యద్వయముగాని, చైతన్యద్వయ సంబంధముగాని ('తత్త్వమసి' యను వాక్యమునకు) అర్థమగునని చెప్పినచో నట్టియర్థము, మాయాకల్పిత ధర్మములతో గూడుకొనిన చైతన్యమునకు సంబంధించినది గాన అసత్యమైన దగుటచేసి శ్రుతిసమ్మతము గాకున్నది.

శ్లో॥ అఖండైకరసత్వేన వాక్యార్థః శ్రుతిసమ్మతః,
స్థూలసూక్ష్మ ప్రపంచస్య సన్మాత్రత్వం పునః పునః.

శ్లో॥ దర్శయిత్వా సుషుప్తౌ సద్బ్రహ్మ భిన్నత్వ మాత్మనః,
ఉపపాద్య సదేకత్వం ప్రదర్శయితు మిచ్ఛయా. ౨౬౯

శ్లో॥ ఐతదాత్మ్య మిదం సర్వ మిత్యుక్త్వైవ సదాత్మనోః,
బ్రవీతి శ్రుతిరేకత్వం బ్రహ్మణోఽద్వైతసిద్ధయే. ౨౭౦

తా॥ 'తత్త్వమసి' యను వాక్యమునందు-విరుద్ధ ధర్మవర్జితులగు జీవబ్రహ్మములకు నభేదాన్వయమే తాత్పర్యాభిప్రాయము. కనుకనే ఛాందోగ్య శ్రుతి-సద్రూపమగు బ్రహ్మ మొక్కటియే సృష్టికి పూర్వమునందు గలదని చెప్పి యా బ్రహ్మాశ్రితమగు మాయాశక్తివలన స్థూలసూక్ష్మ ప్రపంచ ముత్పన్నమగుచున్నదనియు నుత్పన్నమైన ప్రపంచమునందలి శరీరకరణము లందు బ్రహ్మమే జీవుడను పేర నభివ్యక్తమగుచున్నదనియు జెప్పుచున్నది. ఇంతియగాక, కార్యమగు ప్రపంచము కారణమైన బ్రహ్మముకంటె వేఱుగా లేదని "యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృన్మయం విజ్ఞాతగ్ం స్యాద్వాచారంభణమ్ వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం" అని మొదలగు వాక్యములందు మృల్లోహకృష్ణాయస దృష్టాంతములచే నిరూపించి, పిమ్మట ప్రతిబింబరూపుడగు జీవుడు బింబభూతమగు సద్రూప బ్రహ్మముతో నభిన్నుడు కనుకనే ప్రతిదినమందును సుషుప్తికాలమున బ్రహ్మముతో నేకీభవించుచున్నాడని "సతా సోమ్య తదా సంపన్నో భవతి" యను వాక్యముచే బోధించుచున్నది. మరియు నీ విషయమున గలిగెడి లౌకిక సందేహముల నివారించుటకొరకై యనేక దృష్టాంతముల ప్రదర్శించుచు, తొమ్మిది పర్యాయములు "ఐతదాత్మ్య మిదగ్ం సర్వం తత్సత్యగ్ం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో!" యను వాక్యములందు, ప్రపంచము బ్రహ్మముకంటె భిన్నముగ లేదనియు. జీవుడు బ్రహ్మస్వరూపుడే యనియు నిర్ధారణచేసి బ్రహ్మము యొక్క అద్వితీయత్వమును ప్రతిపాదన జేయుచున్నది.

శ్లో॥ సతి ప్రపంచే జీవేవాఽ ద్వైతత్వం బ్రహ్మణః కుతః,
అత స్తయో రఖండత్వ మేకత్వం శ్రుతిసమ్మతమ్. ౭౨౧

తా॥ ప్రపంచముగాని, జీవుడుగాని, బ్రహ్మము కంటె వేఱుగా నున్నచో బ్రహ్మముయొక్క అద్వితీయత్వ ముపపన్నము కానేరదుగాన జీవప్రపంచములు రెండును, బ్రహ్మాభిన్నములు కావనియే శ్రుతియొక్క ముఖ్యాభిప్రాయము.

శ్లో॥ విరుద్ధాంశ పరిత్యాగాత్ ప్రత్యక్షాది ర్న బాధతే,
అవిరుద్ధాంశ గ్రహణం న శ్రుత్యాఽపి విరుధ్యతే. ౭౨౨

తా॥ ప్రపంచము బ్రహ్మముయొక్క కార్యమగుటచే బ్రహ్మము కంటె వేఱుగా లేకున్నను, జీవబ్రహ్మ లిరువురును విరుద్ధధర్మములు గలవారలగుటచే వారికువురకు నైక్యమును జెప్పినచో ప్రత్యక్షాది ప్రమాణ విరోధమును చెప్పకున్నచో శ్రుతివిరోధమును వాటిల్లును గదా యను నాశంకకు సమాధానము చెప్పబడుచున్నది. 'తత్త్వమసి' యను స్థలమునందు తత్త్వంపదార్థములయొక్క విరుద్ధ ధర్మములగు సర్వజ్ఞత్వ కించిజ్జత్వాదులను పరిత్యజించినచో, ప్రత్యక్షాది ప్రమాణములకు విరోధము వాటిల్లదు. అట్లు విరుద్ధధర్మములను విడువగా నవశిష్టమగు చైతన్యమునకు నభేదమును స్వీకరించినచో శ్రుతి విరోధమును సంభవింప నేరదు.

శ్లో॥ లక్షణాఽ భ్యుపగ న్తవ్యా తతో వాక్యార్థసిద్ధయే,
వాచ్యార్థాఽనుపపత్త్యైవ లక్షణాఽ భ్యుపగమ్యతే.

తా॥ కావున ప్రత్యక్షాది విరోధముచే 'తత్త్వమసి' యనుచోట తత్త్వంపద వాచ్యార్థముల కభేదముపపన్నముగానేరదు గాన లక్షణావృత్తి నంగీకరింపవలయును. వాచ్యార్థము కుదురనప్పుడు లక్షణావృత్తి నంగీక

రింపవలయునని శాస్త్రము బోధించుచున్నది. అట్లు లక్షణావృత్తిని స్వీకరించి విరుద్ధ ధర్మములను విడనాడినచో వాక్యార్థము సమంజసమగుచున్నది.

శ్లో॥ సంబంధాఽనుపపత్త్యాచ లక్షణేతి జగు ర్బుధాః,
గంగాయాం ఘోషఇత్యాదౌ యా జహల్లక్షణామతా.
న సా తత్త్వమసీ త్యత్ర వాక్యవిషా ప్రవర్తతే,
గంగాయా అపిఘోషస్యా ధారాధేయత్వ లక్షణమ్.
సర్వో విరుద్ధో వాక్యార్థ స్తత్ర ప్రత్యక్షత స్తతః,
గంగాసంబంధవ త్తీరే లక్షణా సంప్రవర్తతే. ౭౨౬
తథా తత్త్వమసీ త్యత్ర చైతన్యైకత్వలక్షణే,
వివక్షితే తు వాక్యార్థేఽ పరోక్షత్వాది లక్షణః. ౭౨౭
విరుధ్యతే భాగమాత్రో నతు సర్వోవిరుధ్యతే,
తస్మాజ్జహల్లక్షణాయాః ప్రవృత్తిర్నాఽత్రయుజ్యతే.
వాచ్యార్థస్యతు సర్వస్యత్యాగేన ఫలమీాత్స్యతే,
నారికేళఫలస్యేవ కఠినత్వధియా నృణామ్. ౭౨౮
గంగాపదం యథాస్వార్థం త్యక్త్వాలక్షయతే తటమ్,
తత్పదం త్వంపదం వాపి త్యక్త్వాస్వార్థం తథాఽఖిలమ్.
తదర్థం వాత్వమర్థం వాయది లక్షయతి స్వయమ్,
తదా జహల్లక్షణాయాః ప్రవృత్తి రుపపద్యతే. ౭౩౦

తా॥ పదములయొక్క వాచ్యార్థములకు పరస్పరము, అన్వయముగాని, సంబంధముగాని కుదురుటకు వీలు లేనప్పుడు, మరియొక అర్థమును

స్వీకరింపవలయును. దీనినే లక్షణావృత్తి యందురు. అదియెట్లనగా, "మంచెలు అఱచుచున్నవి" యనుచోట జడములగు మంచెలు అఱచుట యనునది అన్వయింప నేరదు గాన, లక్షణావృత్తిచే నర్థమును పరికల్పించి మంచెలందున్న పురుషులు అఱచుచున్నారని చెప్పబడుచున్నది. అట్లే 'గంగయందు గొల్లపల్లె' యను చోట గంగానదికిని, గొల్లపల్లెకును ఆధారాధేయ భావసంబంధమనుపపన్నముగాన, లక్షణావృత్తిచే గంగా పదమునకు గంగాతీరమను నర్థమును స్వీకరించుటవలన 'గంగయొద్దున గొల్లపల్లె' యను నర్థము సమంజసమగుచున్నది. ఇట్టి లక్షణావృత్తి జహల్లక్షణ, అజహల్లక్షణ, జహదజహల్లక్షణ (లేక) భాగత్యాగ లక్షణ యని మూడు విధములుగా నున్నది. అందు, — తన యర్థమును సంపూర్ణముగా పరిత్యజించి మరియొక యర్థమును స్వీకరించునెడ, జహల్లక్షణ ప్రవర్తించుచున్నది ఎట్లన, 'గంగయందు గొల్లపల్లె' యనుచోట గంగా పదము తన యర్థమగు ప్రవాహమును పరిత్యజించి గంగా — తీరమను నర్థమును బోధించుచున్నది.

ఇక నెచ్చట ప్రకృతార్థమును పరిత్యజింపకయే మరియొక అర్థము చేర్చుకొనబడునో యచట అజహల్లక్షణ యగుచున్నది. అదియెట్లనగా, శోణో ధావతి = ఎఱుపు పరుగెత్తుచున్నది యనుచోట శోణపదము తన యర్థమగు ఎఱుపురంగును విడువక, ఎఱుపురంగుగల దేవదత్తుడను పురుషుని బోధించుచున్నది.

ఎచ్చట స్వార్థమునందలి విరుద్ధాంశమును పరిత్యజించి, మిగిలిన యవిరుద్ధాంశము గ్రహింపబడునో అచ్చట జహదజహల్లక్షణ యేర్పడుచున్నది. ఉదాహరణము — సోఽయం దేవదత్తః' యనుచోట 'సః' అను మాటకు, అన్య దేశ కాలముల యందున్న దేవదత్తుడు అర్థము — 'అయం' అను మాటకు ప్రకృత దేశకాలముల యందున్న దేవదత్తుడు అర్థము. ఇట్టి యెడ, విరుద్ధ దేశ కాల సంబంధముగల దేవదత్తు లిరువురకును అభేదము

నుపపన్నముగాన తదిదంశబ్దార్థముల యందలి విరుద్ధాంశమును భిన్న దేశ కాలములను విడనాడినచో, మిగిలిన దేవదత్త-దేహ మఖండ మగుచున్నది.

ఇట్లే యిచట – 'తత్త్వమసి' యనుచోట జహల్లక్షణావృత్తి నాశ్రయించి ప్రత్యక్షార్థము నంతను పరిత్యజించుటకు వీలుకాదు. వైభాగము కఠినముగా నున్నదను భావముచే గొబ్బున దాయను పరిత్యజించినచో ప్రయోజనమేమియు లేనట్లుగా తత్త్వం పదార్థములు రెండును విరుద్ధముగా నున్నవని తలచి వాచ్యార్థమును రెండిటిని సంపూర్ణముగా విడిచిన చో ముముక్షువులకు కలిగెడి ప్రయోజన మేమియు లేకపోవుచున్నది గదా!

శ్లో॥ న శంకనీయ మిత్యాచార్యైః జ్ఞాతార్థేన హి లక్షణా,

తత్త్వదం త్వం పదం వాఽపి శ్రూయతే చ ప్రతీయతే,

తదర్థశ్చ కథం తత్ర సంప్రవర్తేత లక్షణా. 232

తా॥ కొందరు 'తత్త్వమసి' యనుచోట 'తత్త్వం' పదములును, వాని యర్థములును తెలియబడు చుండగా తెలియబడు విషయమునందు, లక్షణావృత్తితో బనిలేదని సామాన్య దృష్టిచే శంకించుచుందురు. కాని వారి శంకకు తావులేదు. ఏలయనగా తత్త్వం పదార్థములు, స్ఫురించుచున్నప్పటికిని, విరుద్ధ ధర్మములతో కూడియున్న వగుటచే నారెండు చైతన్యములకును, 'అసి' యను పదముచే బోధింపబడుచున్న యభేదము కుదురనేరదు గాన నది కుదురుట కొరకై లక్షణావృత్తిని తప్పక స్వీకరింపవలయును

శ్లో॥ అత్ర శోణో ధావతీతి వాక్యవ న్న ప్రవర్తతే. 233

అజహల్లక్షణా వాఽపి సాఽజహల్లక్షణా యథా,

గుణస్య గమనం లోకే విరుద్ధం ద్రవ్య మన్తరా. 234

అతస్త మపరిత్యజ్య తద్గుణాశ్రయ లక్షణః,

లక్ష్యాది ష్వశ్యతే తత్ర లక్షణాఽసౌ ప్రవర్తతే. 235

వాక్యే తత్త్వమసీత్యత్ర బ్రహ్మాత్మైకత్వ బోధకే,
పరోక్షత్వాఽపరోక్షత్వాది విశిష్టచితో ర్ద్వయోః. ౨౩౭
ఏకత్వ రూపవాక్యార్థో విరుద్ధాంశ త్యాగ విసర్జనాత్,
నసిధ్యతి యత స్తస్మా న్నాఽజహల్లక్షణా మతా. ౨౩౮

తా॥ 'తత్త్వమసి' యను వాక్యమునందు 'శోణోధావతి' యను వాక్యమునందువలె, అజహల్లక్షణావృత్తిని గూడ నంగీకరించుటకు వీలు లేదు. ఏలయనగా—'శోణోధావతి' = 'ఎరుపు పరుగెత్తుచున్నది' యను చోట ఎరుపు అను గుణము ఏదియో యొక ద్రవ్యసంబద్ధము లేకుండ పరిగెత్తుట యసంభవము గాన 'శోణః' అనుపదము 'ఎరుపు గుణము' అను తన యర్థమును పరిత్యజింపకయే ఎరుపు గుణముగల దేవదత్తుడు మున్నగు ద్రవ్యమును బోధించుచున్నది. ఇట్టి స్థలములయందు స్వీకరింపబడుచున్న లక్షణావృత్తి అజహల్లక్షణ యనబడుచున్నది. ఇక 'తత్త్వమసి' యను వాక్యమునందు మాత్రము తత్త్వంపదార్థముల యందలి విరుద్ధ ధర్మములగు పరోక్షత్వ ప్రత్యక్షత్వాదులను విడువకున్నచో 'అసి' యను పదముచే బోధింపబడుచున్న జీవబ్రహ్మైక్యము సంభవింప నేరదు. గాన అజహల్లక్షణావృత్తి నంగీకరించుటకు వీలులేదు.

శ్లో॥ తత్పదం త్వంపదం చాఽపి స్వకీయాఽర్థ విరోధినమ్,
అంశ సమ్య క్పరిత్యజ్య స్వాఽవిరుద్ధాంశ సంయుతమ్.
తదర్థం వా త్వమర్థం వా సమ్య గ్లక్షయతి స్వయమ్,
భాగలక్షణ యా సాధ్యం కిమ స్తీతి నశంక్యతామ్. ౨౩౯

తా॥ తత్త్వమసి' యను మహావాక్యమునందు తత్త్వం పదములకు రెండింటికిని వేదాంతులచే భాగత్యాగ లక్షణ స్వీకరింపబడుచున్నది. దీనిని కొందరు ప్రతిఘటించుచున్నారు. ఎట్లనగా, తత్త్వంపదముల

రెండిటిలో నేయొక్క పదమైనను, లక్షణావృత్తిచే, తన యర్థముతో విరోధించెడి పదార్థాంతరాంశమును పరిత్యజించి మిగిలిన యవిరుద్ధాంశముతో గూడుకొనిన, తత్పదార్థమునుగాని త్వంపదార్థమునుగాని బాగుగా బోధించుచుండగా, రెండు పదములకును భాగత్యాగ లక్షణనే స్వీకరింప వలయునని యాక్షేపించుచున్నారు. ఈ యాక్షేపము సంభవింపదని పై శ్లోకమున చెప్పబడుచున్నది.

శ్లో॥ అవిరుద్ధం పదార్థాంతరాంశం స్వాంశం చ తత్కథమ్,
ఏకం పదం లక్షణయా సంలక్షయితు మర్హతి. ౭౮౦

శ్లో॥ పదాంతరేణ సిద్ధాయాం పదార్థ ప్రమితౌ స్వతః,
తదర్థ ప్రత్యయాపేక్షా పునర్లక్షణయా కుతః ?. ౭౮౧

తా॥ ఏదైన నొక పదము తన యర్థమును మాత్రము బోధింప గలుగును గాని తనతో విరోధించెడి మరియొక పదార్థము సంగలి యంశమును పరిత్యజించి దాని యందలి యవిరుద్ధాంశమును, తన యంశమును రెంటినిగూడ బోధింపశక్తి లేని దగుచున్నది. ఇట్టియెడ 'తత్త్వమసి' యను చోట తత్త్వంపదముల రెంటిలోనే యొక్క పదమైనను స్వావిరుద్ధ పదాన్తరార్థమును బోధింపగల దనుట యసంభవము. మరియు రెండు పదములయొక్క అర్థమును, ఒకే పదము బోధించు చెడ ద్వితీయపదము వ్యర్థమే యగుచున్నది గదా ! అందుచే తత్త్వమసి యను మహావాక్యము నందు తత్త్వం పదములు రెండునుండుట వలనను, పదమునకు పదాన్తరా విరుద్ధార్థమును బోధించు సామర్థ్యము లేకుండుటవలనను, రెండుపదము లకును లక్షణావృత్తి నంగీకరింపవలయును గాని, ఒక పదమునకే లక్షణ యొప్పిన జాలుననుటకు వీలు లేదు.

శ్లో॥ తస్మాత్తత్త్వమసీ త్యత్ర లక్షణా భాగలక్షణా,
వాక్యార్థస త్త్వాఖండైక్య రసతా సిద్ధయే మతా. ౭౮౨

తా॥ కావున 'తత్త్వమసి' యనుచోట తత్త్వం పదార్థములకు రెండిటికిని అద్వితీయమగు సచ్చిదానంద చైతన్యరూపత్వము సిద్ధించుట కొరకై భాగత్యాగ లక్షణయే యంగీకరింపబడుచున్నది.

శ్లో॥ భాగం విరుద్ధం సంత్యజ్యాఽవిరోధో లక్ష్యతే యదా,
సా భాగలక్షణేత్యాహు ర్లక్షణాజ్ఞా విచక్షణాః. ౨౪౩

తా॥ ఎచ్చట ప్రకృతార్థమునందు విరోధించుచున్న యంశమును విడిచి విరోధములేని మిగిలిన యంశము గ్రహింపబడుచుండునో యచ్చట భాగత్యాగ లక్షణావృత్తి యగుచున్నదని పండితులు చెప్పుచున్నారు.

శ్లో॥ సోఽయం దేవదత్త ఇతి వాక్యం వాక్యార్థ ఏవ వా,
దేవదత్తైక్య రూపస్య వాక్యార్థా నవబోధకమ్. ౨౪౪
దేశకాలాది వైశిష్ట్యం విరుద్ధాంశం నిరస్య చ,
అవిరుద్ధం దేవదత్త దేహమాత్రం స్వలక్షణమ్. ౨౪౫
భాగలక్షణయా సమ్య గ్లక్షయ త్యనయా యథా,
తథా తత్త్వమసీత్యత్ర వాక్యం వాక్యార్థ ఏవ వా. ౨౪౬
పరోక్షత్వా పరోక్షత్వా ద్విశిష్టచితో ర్ద్వయోః,
ఏకత్వరూప వాక్యార్థ విరుద్ధాంశ ముపస్థితమ్. ౨౪౭
పరోక్షత్వాఽపరోక్షత్వ సర్వజ్ఞత్వాది లక్షణమ్,
బుద్ధ్యాది స్థూలపర్యన్త మావిద్యక మనాత్మకమ్ ౨౪౮
పరిత్యజ్యాఽవిరుద్ధాంశం శుద్ధచైతన్య లక్షణమ్,
వస్తు కేవలసన్మాత్రం నిర్వికల్పం నిరంజనమ్,
లక్షయత్యనయా సమ్య గ్భాగలక్షణయా తతః. ౨౪౯

శ్లో॥ సర్వోపాధి వినిర్ముక్తం సచ్చిదానంద మద్వయమ్,
నిర్విశేషం నిరాభాస మతాదృశ మనీదృశమ్. ౭౫౦

అనిర్దేశ్య మనాద్యంత మనంతం శాంత మచ్యుతమ్,
అప్రతర్క్య మవిజ్ఞేయం నిర్గుణం బ్రహ్మశిష్యతే. ౭౫౧

తా॥ 'సోఽయం దేవదత్తః' అను వాక్యమునందు 'సః' అను పదమునకు అన్యదేశకాలములందున్న దేవదత్తుఁడను, 'అయం' అను పదమునకు ప్రకృత దేశకాలములందున్న దేవదత్తుఁడను అర్థము. ఇట్టి దేవదత్తులిరువురును విరుద్ధదేశకాల సంబంధము గలవారలగుటచే నభిన్నులగుట యసంభవము కావుననిచ్చట భాగత్యాగలక్షణ నాశ్రయించి, విరుద్ధాంశములగు భిన్న దేశకాలములను పరిత్యజించి, యవిరుద్ధమగు దేవదత్తుని దేహమాత్రమును గ్రహించుటవలన వాక్యార్థము సమంజస మగుచున్నది. అటులనే 'తత్త్వమసి' యను మహావాక్యమునందు గూడ భాగత్యాగలక్షణచే విరుద్ధాంశములగు పరోక్షత్వ ప్రత్యక్షత్వ సర్వజ్ఞత్వ కించిజ్ఞత్వాద్యనాత్మధర్మముల నన్నింటిని పరిత్యజించి యవిరుద్ధమగు చైతన్యమాత్రమును గ్రహించినచో నంతట మాయా కల్పిత సకల ప్రపంచ ధర్మవర్జితంబును సచ్చిదానందాత్మకంబునునగు నిర్గుణ పరబ్రహ్మము పరిశిష్టమగుచున్నది.

శ్లో॥ ఉపాధి వైశిష్ట్యకృతో విరోధః
బ్రహ్మాత్మనో రేకతయాఽధిగత్యా,
ఉపాధివైశిష్ట్య ఉదస్యమానే
నకశ్చి దప్యస్తి విరోధ ఏతయోః. ౭౫౨

తా॥ సంసారకాలమునందు జీవునకు అన్తఃకరణమను నుపాధియొక్క సంబంధమును ఈశ్వరునకు మాయ యను నుపాధియొక్క సంబన్ధ

మును నుండుటంజేసి జీవేశ్వరులకు విరోధము భాసించుచున్నది. ఇక జ్ఞానకాలమునందు జీవబ్రహ్మైక్యజ్ఞానముచే అన్తఃకరణము, మాయయనను నుపాధిద్వయము విలయము నొందగా తత్సంబన్ధ నిమిత్తకమగు జీవేశ్వర భేదమును నశించుచున్నది.

శ్లో॥ తయో రుపాధిశ్చ విశిష్టతాచ
తద్ధర్మ భాక్త్వం చ విలక్షణత్వమ్,
భ్రాన్త్యాకృతం సర్వమిదం మృషైవ
స్వప్నార్థవ జ్జాగ్రతి నైవ సత్యమ్. ౭౫౩

తా॥ వివేకముచే నాలోచించినచో జీవేశ్వరులకు గల అన్తఃకరణము – మాయ యను నుపాధులును, ఆ యుపాధుల సంబన్ధమును, ఆ యుపాధుల యొక్క ధర్మములగు కించిజ్ఞత్వము – మర్త్యత్వము, సర్వజ్ఞత్వము – అమర్త్యత్వము మున్నగునవి పొందుటయు ఒకడు బద్ధుడగుటయు, మఱియొకడు ముక్తుడటయు నిది యంతయు నవిద్యాకల్పితమై స్వప్నమునందలి పదార్థములవలె నసత్యమగుచున్నది. కావున నేమేలుకొనిన పిమ్మట స్వప్న పదార్థము లసత్యమగునట్లుగా జ్ఞానము కలుగగనే ప్రపంచమంతయు నసత్యమే యగుచున్నది.

శ్లో॥ నిద్రాసూత శరీరధర్మ
సుఖదుఃఖాది ప్రపంచోఽపివా,
జీవేశాదభిదాపి హా నచ
ఋతం కర్తుం క్వచి చ్ఛక్యతే,
మాయాకల్పిత దేశకాల
జగదీశాది భ్రమ స్తాదృశః
కో భేదోఽ_స్త్యనయోర్ద్వయోస్తు
కతమ స్సత్యోఽ_న్యతః కోభవేత్. ౭౫౪

తా॥ స్వప్నకాలమునందు నిద్రాశక్తిచే శరీరములు వాని ధర్మములగు సుఖదుఃఖాదులు జీవులు. ఈశ్వరుడు జీవేశ్వరులకుగల భేదము మున్నగునవి గల ప్రపంచము కల్పింపబడుచున్నది. ఇట్టి ప్రపంచము సత్యము గాదని మేలుకొనగనే నిశ్చితమగుచున్నది. ఇక జాగ్రత్కాలమునందు మాయా శక్తి విలాస కల్పితమగు, దేశకాల జగదీశ్వరాది ప్రపంచమును, స్వప్నప్రపంచ తుల్యముగ జేయుచున్నది. కావున భేదమేమియు లేమింజేసి స్వప్నజాగ్రత్ప్రపంచములు రెండును నసత్యములేగాని, జాగ్రత్ప్రపంచము సత్యమనియు, స్వప్నప్రపంచ మనృతమనియు గ్రహింపవీలు లేదు.

శ్లో॥ న స్వప్నజాగరణయో రుభయో ర్విశేషః
సందృశ్యతే క్వచిదపి భ్రమజై ర్వికల్పైః,
యద్దృష్టిదర్శనముఖై రతఏవ మిథ్యా
స్వాప్నో యథా నను తథైవహి జాగరోఽపి. ౭౫౫

తా॥ చూచువాడు చూచుట చూడబడునది మున్నగు భ్రాన్తిజనిత పదార్థము లన్నియు సమానముగా నుండుటచే స్వప్న-జాగ్రదవస్థలకు రెండిటికిని భేదమేమియు లేదు. కావున స్వప్నమువలె జాగ్రదవస్థయు నసత్యమనుట నిశ్చయము.

శ్లో॥ అవిద్యా కార్యత స్తుల్యౌ ద్వావపి స్వప్నజాగరౌ,
ద్రష్టృదర్శన దృశ్యాది కల్పనోభయత స్సమా. ౭౫౬

తా॥ స్వప్నజాగ్రదవస్థలు రెండును అజ్ఞాన నిర్మితములగుచున్నవి. ఈ రెండిటియందును-చూచువాడు, చూచుట, చూడబడునది మున్నగు వ్యవహారమంతయు సమానముగా నున్నది. కావున నీరెండవస్థలును నిర్విశేషములు.

శ్లో॥ అభావ ఉభయో స్సుప్తౌ సర్వై రప్యనుభూయతే,
న కశ్చిదనయో ర్భేద స్తస్మా న్మిథ్యాత్వ మర్హతః.

తా॥ సర్వజనులును, గాఢనిద్రయందు స్వప్న జాగ్రదవస్థలు రెండును లేవని గ్రహించుచున్నారు. కావున విశేషమేమియు లేమింజేసి స్వప్న జాగరణములు రెండును నసత్యములే.

శ్లో॥ భ్రాన్త్యా బ్రహ్మణి భేదోఽయం సజాతీయాది లక్షణః,
కాలత్రయేఽపి హేవిద్వన్! వస్తుతో నైవ కశ్చన. ౨౫౮

తా॥ పండితుడవగు నో శిష్యుడా! జాగ్రదవస్థయందు భాసించుచున్న – సజాతీయ విజాతీయ స్వగత భేదరూపమగు విశేషమంతయు స్వభావము చే సర్వవిశేషరహితమగు పరబ్రహ్మమునందు అజ్ఞానముచే కల్పింపబడుచున్నది. అందుచే నీ ప్రపంచ మే కాలమునందును సత్యముగా లేదని గ్రహింపనగును.

శ్లో॥ యత్ర నాఽన్యత్పశ్యతీతి శ్రుతి ర్ద్వైతం నిషేధతి,

కల్పితస్య భ్రమాద్భూమ్ని మిథ్యాత్వావగమాయతత్.

తా॥ 'యత్రనాఽన్యత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి నాఽన్యద్విజానాతి సభూమా' అను ఛాన్దోగ్య శ్రుతి సర్వవ్యాపకంబును సచ్చిదానంద రూపంబును నగు బ్రహ్మమునందు చూచువాడు - చూచుట - చూడబడునది. వినువాడు – వినుట – వినబడునది మొదలగు సంసార ధర్మముల నన్నిటిని నివారించుచున్నదై కనబడుచున్న ప్రపంచమంతయు మాయచే పరికల్పితమగుట వలన సత్యము గానేరదని బోధించుచున్నది.

శ్లో॥ యత స్తతో బ్రహ్మసదద్వితీయమ్
వికల్పశూన్యం నిరుపాధి నిర్మలమ్,
నిరంతరానందఘనం నిరీహమ్
నిరాస్పదం కేవల మేకమేవ. ౨౬౦

తా॥ బ్రహ్మమునందు కల్పితమగు ప్రపంచమంతయు నసత్యమగుటంజేసి బ్రహ్మమొక్కటియే శాశ్వతంబును సర్వవికల్ప వివర్జితం

బును సకలోపాధి శూన్యంబును సర్వకామ రహితంబును సతతానంద స్వరూపంబును నగుచున్నది.

శ్లో॥ నైవాఽస్తి కాచన భిదా నగుణప్రతీతిః
నోవాక్ప్రవృత్తి రపివా నమనఃప్రవృత్తిః,
యత్కేవలం పరమశాన్త మనన్త మాద్యమ్
ఆనందమాత్ర మవభాతి సదద్వితీయమ్. ౭౬౧

తా॥ పరబ్రహ్మము అద్వైతసహితంబుగను, ఆనందరూపంబుగను త్రికాలాబాధ్యంబుగను, సర్వోత్తమంబుగను భాసించుచున్నది. ఇట్టి బ్రహ్మమునందు శబ్దప్రవృత్తి హేతువులగు జాతిగుణ క్రియాసంజ్ఞలను నవి లేమింజేసి వాక్కులు బ్రహ్మమును బోధింప లేకున్నవి మనస్సు చింతింప లేకున్నది.

శ్లో॥ యదిదం పరమం సత్యం తత్త్వం సచ్చిత్సుఖాత్మకమ్,
అజరామరణం నిత్యం సత్యమేత ద్వచో మమ. ౭౬౨

తా॥ నాయనా! శిష్యా! సచ్చిదానందరూపంబును, జరామరణ శూన్యంబునునగు నే బ్రహ్మముగలదో ఆ బ్రహ్మమవే నీవగుచున్నావు. నా మాట నిజము.

శ్లో॥ నహి త్వం దేహోఽసా వసురపిచ వాఽ క్షనికరః
మనోవా బుద్ధిర్వా క్వచిదపి తథాఽహంకృతిరపి,
నచైషాం సంఘాత స్త్వముభవసి విద్వన్ శృణుపరమ్
యదేతేషాం సాక్షీ స్ఫురణ మమలం తత్త్వ మసి హి.

తా॥ కావునచే పండితుడవగు నో శిష్యా! ఈ స్థూలదేహము గాని, ప్రాణాపానాది పంచప్రాణములుగాని, చక్షురాదీన్ద్రియములుగాని, మనోబుద్ధ్యహంకారములుగాని నీవు కానేరవు. ఇంతియగాదు. ఈదేహే న్ద్రియాదులయొక్క సముదాయంబును నీవు గాకున్నావు. ఇకనేమన

దేహేన్ద్రియాదుల కన్నిటికిని భిన్నమై సాక్షిరూపమున భాసించుచున్న పరబ్రహ్మమవే నీవగుచున్నావు.

శ్లో॥ యజ్జాయతే వస్తు తదే భవ వర్ధతే
తదేవ మృత్యుం సముపైతి సకాలే,
జన్మైవ తేనాఽస్తి తథైవ మృత్యుః
నాఽస్త్యేవ నిత్యస్య విభో రజస్య. ౭౬౪

తా॥ లోకమునందు, దేహము మున్నగు నేపదార్థము పుట్టుచున్నదో అదియే వృద్ధినొందుచున్నది. మార్పు చెందుచున్నది. క్షీణించుచున్నది. తుదకు నదియే నశించుచున్నది. ఇక నీవు మాత్రము (ఓ శిష్యా!) నిత్యంబును వ్యాపకంబును నగు బ్రహ్మస్వరూపుడ వగుటంజేసి నీకు పుట్టుక గాని, వృద్ధిగాని, క్షయముగాని, మృత్యువుగానిలేదు. జన్మాది వికారము లన్నియు ననాత్మపదార్థములకు సంబన్ధించి నవియేగాని, త్రికాలాబాధ్యమగు నాత్మపదార్థమునకు ఎంతమాత్రమును సంభవింపనేరవని భావము.

శ్లో॥ తవైవ దేహోఽజనిత స్సవవ
సమేధతే నశ్యతి కర్మయోగాత్,
త్వమే తదీయా స్వఖిలా స్వవస్థా
స్వవస్థిత స్సాక్ష్యసి బోధమాత్రః. ౭౬౫

తా॥ తా॥ ఓ పండితుడా! నీదు దేహమే జన్మించి, క్రమముగా వృద్ధినొందుచున్నదై తుదకు కర్మవశమున నశించుచున్నది గాని, నీవు మాత్రము ఈ దేహసంబన్ధములగు సకలావస్థలయందును సాక్షిగా నున్నవాడవై జ్ఞానమాత్ర స్వరూపుడవగుచున్నావు. ఇకను అజ్ఞానులన్నచో దేహతాదాత్మ్యము నొందినవారై దేహధర్మములగు జన్మమరణాదులను తనయం దారోపించుకొను చున్నారు.

శ్లో॥ యత్స్వప్రకాశ మఖిలాత్మక మాసుషుప్తేః
ఏకాత్మనాఽహ మహ మిత్యవభాతి నిత్యమ్,
బుద్ధే స్సమస్త వికృతే రవికారి బోద్ధృ
యద్బ్రహ్మ తత్త్వమసి కేవల బోధమాత్రమ్. ౭౬౬

తా॥ ఓ పండితుడా! నీయొక్క యథార్థస్వరూపమును జెప్పెద వినుము. ఏబ్రహ్మము, తనం తన ప్రకాశించునదియు, నఖిలజగదాత్మకమైనదియు నగుచు జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను సకలావస్థలందును 'నేను నేనని' నిరంతరము భాసించుచున్నదో, ఏ బ్రహ్మము, బుద్ధి వృత్తుల కన్నింటికిని సాక్షిగానుండి వానిని, గ్రహించుచున్నదో అట్టి జ్ఞానైక స్వరూపమగు బ్రహ్మస్వరూపుడవు నీవగుచున్నావు.

శ్లో॥ స్వాత్మ న్యనస్త మయసంవిదికల్పితస్య
వ్యోమాది సర్వజగతః ప్రదదాతి సత్తామ్,
స్ఫూర్తిం స్వకీయ మహసా వితనోతి సాక్షాత్
యద్బ్రహ్మతత్త్వమసి కేవల బోధమాత్రమ్. ౭౬౭

తా॥ ఏ బ్రహ్మము, నిత్యచైతన్య స్వరూప మైనదై తనయందు మాయచే కల్పితమగు నాకాశాది ప్రపంచమున కంతకును సత్తాస్ఫూర్తుల నిచ్చుచున్నదో చిద్రూపమగునట్టి బ్రహ్మమే నీవగుచున్నావు.

శ్లో॥ సమ్య క్సమాధి నిరతై ర్విమలాం తరంగే
సాక్షా దవేక్ష్య నిజతత్త్వ మపారసౌఖ్యమ్,
సంతుష్యతే పరమహంసకులై రజస్రమ్
యద్బ్రహ్మ తత్త్వమసి కేవల బోధమాత్రమ్. ౭౬౮

తా॥ పరమహంస పరివ్రాజకులగు సన్న్యాసులు, హంసలు, క్షీరనీరములను విభజించునట్లుగా ఆత్మానాత్మ పదార్థములను వేఱుజేసి,

చిత్తవృత్తుల నన్నింటిని నిరోధించి సమాధికాలమునందు తమ నిర్మలాన్తః కరణమున ఏ బ్రహ్మానందము ననుభవించుచున్నారో అట్టి బ్రహ్మస్వరూపుడవు నీవగుచున్నావు.

శ్లో॥ అన్త ర్బహి స్స్వయ మఖండిత మేకరూప
మారోపితార్థవ దుదంచతి మూఢబుద్ధేః,
మృత్స్నాదివ ద్విగతవిక్రియ మాత్మవేద్యమ్
యద్బ్రహ్మ తత్త్వమసి కేవల బోధమాత్రమ్. ౭౬౯

తా॥ ఏ బ్రహ్మము తనకు లోపలను వెలుపలను నంతటను నేక రూపమున భాసించుచున్నదై మూఢజనులకు మాత్రము మట్టియందు కల్పింపబడిన కుండ మూకుడు మున్నగు పదార్థములవలె నామరూపాత్మక మగు ప్రపంచాకారముగా తోచుచున్నప్పటికినీ స్వస్వరూపముచే మాత్రము నిర్వికారంబును, తనకు తానె తెలియునదియును నగుచున్నదో అట్టి జ్ఞానస్వరూపంబగు బ్రహ్మమే నీవగుచున్నావు.

శ్లో॥ శ్రుత్యుక్త మవ్యయ మనన్త మనాదిమధ్య
మవ్యక్త మక్షర మనాశ్రయ మప్రమేయమ్,
ఆనందసద్ఘన మనామయ మద్వితీయమ్
యద్బ్రహ్మ తత్త్వమసి కేవల బోధమాత్రమ్. ౭౭౦

తా॥ మరియు శ్రుతులందు ఏ బ్రహ్మము ఆద్యన్తరహితమనియు, సచ్చిదానంద రూపమనియు, ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరింపని దనియు, స్వస్వరూపముననే నిల్చియుండునదిగాని వేరొక ఆధార మేమియు లేదనియు సకలదోషవర్జితంబనియు, నద్వితీయంబనియును చెప్పబడుచున్నదో అట్టి జ్ఞానమాత్ర స్వరూపంబగు బ్రహ్మమువె నీవగుచున్నావు.

శ్లో॥ శరీరతద్యోగ తదీయ ధర్మాద్యారోపణం భ్రాన్తి
వశాత్త్వయీదం నవస్తుతః కించి దత స్త్వజ స్త్వమ్
మృత్యోర్భయం క్వాఽస్తి తతోఽసి పూర్ణః. ౨౨౧

తా॥ ఓ పండితుడా! యధార్థముచే బ్రహ్మస్వరూపుడవగు నీయందు స్థూలసూక్ష్మ కారణశరీరములును, వానితో తదాత్మసంబన్ధమును వాని ధర్మములగు జననమరణాదులును ఇవి యన్నియు నజ్ఞానముచే నారోపింపబడినవియే గాని వాస్తవములు గానేరవు. కావున నిజముచే నీకు పుట్టువు లేదు. పుట్టువులేని వానికి మృత్యుభయ మెట్లు సంభవించును? సంభవింపనేరదు. అందుననే జన్మమరణ వర్జితుడవగు నీవు ఆకాశమువలె సర్వవ్యాపకుడవగుచున్నావు.

శ్లో॥ యద్వద్దృష్టం భ్రాన్తిమత్యా స్వదృష్ట్యా
తత్త త్సమ్య గ్వస్తుదృష్ట్యా త్వమేవ,
తత్తో నాఽన్య ద్వస్తు కించిత్తు లోకే
కస్మా ద్భీతిస్తే భవేదద్వయస్య. ౨౨౨

తా॥ స్వప్నకాలమునందు చూడబడుచున్న పదార్థములన్నియు చూచువానికంటె వేఱుగా లేనట్లుగా నితరకాలము లందును భ్రాన్తిచే చూడబడుచున్న శరీరము మున్నగు పదార్థములన్నియు ద్రష్టయగు నాత్మకంటె భిన్నముగాకున్నవి. కావున నట్టి యాత్మస్వరూపుడవగు నో పండితుడా! నీకంటె వేఱగు వస్తువేమియు లేనందున నద్వితీయ బ్రహ్మమవగు నీకు భయ మెంతమాత్రమును లేదు.

శ్లో॥ పశ్యత్స్వహ మేవేదం సర్వమి త్యాత్మనాఽఖిలమ్,
భయం స్యాద్విదుషః కస్మాత్స్వస్మాన్న భయమిష్యతే.

తా॥ కనబడుచున్న ప్రపంచమంతయు నాత్మస్వరూపముకంటె వేఱుగా లేదని గ్రహించిన జ్ఞానికి తనకంటె భిన్నమగు వస్త్వంతరము

లేమింజేసి భయము గలుగట కెంతమాత్రమును తావులేదు. లోకమున తన్ను జూచి తానె భయపడువాడుండడు గదా!

శ్లో॥ తస్మాత్త్వ మభయం
నిత్యం కేవలానందలక్షణమ్,
నిష్కలం నిష్క్రియం శాన్తం
బ్రహ్మైవాఽసి సదా వ్యయమ్. ౨౨౮

తా॥ కావున నో పండితుడా! నీవు భయరహితంబును, నిత్యానంద స్వరూపంబును నిరవయవంబులు సర్వక్రియా వర్జితంబును గనుకనే తరంగములులేని సముద్రునివలె నిశ్చలంబును నాశరహితంబుననగు పర బ్రహ్మవే యగుచున్నావు.

శ్లో॥ జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయవిహీనం
జ్ఞాతు రభిన్నం జ్ఞాన మఖండమ్,
జ్ఞేయాజ్ఞేయత్వాది విముక్తం
శుద్ధం బుద్ధం తత్త్వ మసి త్వమ్. ౨౨౯

తా॥ పరబ్రహ్మము అవిద్యాకాలమునందు - తెలిసికొనువాడు తెలియబడునది, తెలియుట యను త్రిపుటితో గూడుకొనియున్నది. ఇట్టి బ్రహ్మము పరమార్థదశయందు స్వవ్యతిరిక్త వస్త్వంతరమేమియు లేమింజేసి, జ్ఞాతృజ్ఞానజ్ఞేయాది త్రిపుటీ రహితంబును, జ్ఞాతయగు జీవుని యొక్క స్వరూపభూతంబును నగుచున్నది. మరియు నా బ్రహ్మము జ్ఞానమాత్ర స్వరూపమగుటచే తెలియబడునదనిగాని, తెలియబడనిదని గాని చెప్పవీలుగాకున్నది. ప్రకాశించుటయే స్వభావముగాగల ప్రదీపము ప్రకాశింపబడు నదనిగాని ప్రకాశింపబడనిదనిగాని వచింప వీలుగాదు గదా! కావున నో పండితుడా! నీవు బోధస్వరూపమగునట్టి పర బ్రహ్మవె యగుచున్నావు.

శ్లో॥ అన్తః ప్రజ్ఞత్వాదివికల్పై
రస్పృష్టం యత్తద్దృశిమాత్రమ్,
సత్తామాత్రం సమరస మేకం
శుద్ధం బుద్ధం తత్త్వమసి త్వమ్. ౨౨౬

తా॥ మాండూక్య శ్రుతియందు వర్ణింపబడినరీతిగా జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థా ధర్మవర్జితంబును, దృఙ్మాత్ర స్వరూపంబును సచ్చిదానందైక స్వభావంబును నగు పరబ్రహ్మమవు నీ వగుచున్నావు.

శ్లో॥ సర్వాకారం స్వైర మసర్వం
సర్వనిషేధావధిభూతమ్,
సత్యం శాశ్వత మేక మనంతం,
శుద్ధం బుద్ధం తత్త్వమసి త్వమ్. ౨౨౭

తా॥ ఏ బ్రహ్మము వ్యవహారకాలమునందు మాయా కల్పితములగు నామరూపాత్మక పదార్థములయొక్క స్వరూపముచే ప్రకాశించుచున్నదై పరమార్థ దశయందు నేతినేతి వాక్యములచే నిదిగా దిదిగాదని సకల ప్రపంచమును నిషేధింపబడగా తానొక్కటియే మిగులుచున్నదో అట్టి శాశ్వతమగు బ్రహ్మస్వరూపుడవు నీ వగుచున్నావు.

శ్లో॥ నిత్యానందాఖండైకరసం నిష్కలమక్రియమస్తవికారమ్,
ప్రత్యగభిన్నంపరమవ్యక్తంశుద్ధం బుద్ధంతత్త్వమసిత్వమ్.

తా॥ అఖండ సచ్చిదానంద స్వరూపంబును, నిరవయవంబును, నిష్క్రియంబును, నిర్వికారంబును, పంచకోశములకు సాక్షియగు జీవుని కంటె నభిన్నంబును నగు బ్రహ్మస్వరూపుడవు నీ వగుచున్నావు.

శ్లో॥ త్వం ప్రత్యస్తాశేష విశేషం
వ్యోమేవాన్త ర్బహిరపి పూర్ణమ్,

బ్రహ్మానందం పర మద్వైతం
శుద్ధం బుద్ధం తత్త్వమసి త్వమ్. 228

తా॥ ఓ పండితుడా! నీవు నేతినేతి వాక్యములచే నిరసింపబడిన సకల విశేషములు గలదియు, ఆకసమువలె లోపలను, వెలుపలను, అంతటను నిండియున్నదియు మాయాదోష వర్జితంబును సత్యజ్ఞానానంద రూపంబును నద్వితీయంబును నగు పరబ్రహ్మమవగు చున్నావు.

శ్లో॥ బ్రహ్మైవాఽహం మహం బ్రహ్మ నిర్గుణం నిర్వికల్పకమ్,
ఇత్యేవాఽఖండయా వృత్త్యా తిష్ఠ బ్రహ్మణి నిష్క్రియే.

తా॥ కావున నో విద్వాంసుడా! నీవు నిరంతరము, 'నిర్గుణమగు బ్రహ్మమే నేను', 'నేనే నిర్గుణ బ్రహ్మము' అని యఖండాకార మనో వృత్తిచే బ్రహ్మమునందె రమించుచుండుము.

శ్లో॥ అఖండా మేవైతాం ఘటితపరమానందలహరీమ్
పరిధ్వస్త ద్వైత ప్రమితి మమలాం వృత్తి మనిశమ్,
అముంచానస్స్వాత్మ న్యనుపమసుఖే బ్రహ్మణిపరే
రమస్వ ప్రారబ్ధం క్షపయ సుఖవృత్త్యా త్వ మనయా.

తా॥ అఖండబ్రహ్మాకారవృత్తి కలుగగనే ద్వైతప్రపంచమునందలి సత్యత్వబుద్ధియంతయు తొలగిపోవును. అద్వితీయమగు బ్రహ్మానంద మభివ్యక్తమగును కావున నో పండితుడా! నీవీ విధమగు బ్రహ్మాకార మనో వృత్తిని నిరంతరమవలంబించినవాడవై నిరతిశయానందరూపమగు పరబ్రహ్మమునందు క్రీడించుచు నీయానందవృత్తిచేత నీ ప్రకృత దేహారంభకములగు పుణ్యపాపముల రెండిటినీ అనుభవమువలన నశింప జేయుము.

శ్లో॥ బ్రహ్మానందరసాస్వాద తత్పరేణైవ చేతసా,
సమాధి నిష్ఠితో భూత్వా తిష్ఠ విద్వ న్సదా మునే. 231

తా॥ వేదశాస్త్రములను చదువుకొని వాని యర్థమును మననము చేయుచున్న మహాపండితుడా! నీవు బ్రహ్మానందము ననుభవించుటయందే యాసక్తిగలవాడవై యెల్లప్పుడు సమాధి నవలంబించి యుండుమా.

శ్లో॥ అఖండాఖ్యావృత్తి రేషా వాక్యార్థశ్రుతిమాత్రతః,
శ్రోతు స్సంజాయతే కింవా క్రియాన్తర మపేక్షతే. ౭౮౩

శ్లో॥ సమాధిః కః కతివిధ స్తత్సిద్ధేః కిము సాధనమ్,
సమాధే రన్తరాయాః కే సర్వమేత న్నిరూప్యతామ్.

తా॥ అని విని శిష్యుడిటు లడుగుచున్నాడు. స్వామీ! తమచే బోధింపబడిన 'నేనే బ్రహ్మనను' నఖండ బ్రహ్మాకార మనోవృత్తి 'తత్త్వమసి' మున్నగు మహావాక్యార్థమును వినినంతమాత్రముననే కలుగునా, లేకున్నచో నేదైన మరియొక వ్యాపారము నపేక్షించునా! వివరించి తెలుప ప్రార్థన. మరియు సమాధి యన నేమి? అది యెన్నివిధములు? అది సిద్ధించుటకు సాధనము లెవ్వి? దానికి విఘ్నము లెవ్వి? ఈవిషయము నంతయు బోధింపవలయునని తమ్ము వేడుకొనుచున్నాను.

శ్లో॥ ముఖ్యగౌణాది భేదేన విద్యన్తేఽత్రాఽధికారిణః,
తేషాం ప్రజ్ఞానుఽసారేణాఽఖండావృత్తి రుదేర్యతే.

తా॥ శిష్యుని ప్రశ్నలకు గురువులు సమాధానమిచ్చుచున్నారు.— మోక్షాధికారులు — ఉత్తములు – మధ్యములు – అధములు నని మూడు విధములుగా నున్నారు. వారల కందరకును తమతమ బుద్ధిబలము ననుసరించి అఖండాకార వృత్తి కలుగుచుండును. ఉత్తమాధికారులకు, వాక్యార్థమును వినినంతమాత్రమునను, తదితరులకు క్రమప్రయత్నము వలనను బ్రహ్మాకారాన్తఃకరణవృత్తి యేర్పడునని భావము.

శ్లో॥ శ్రద్ధా భక్తిపురస్సరేణ
విహితే నైవేశ్వరం కర్మణా
సంతోష్యార్జిత తత్ప్రసాదమహిమా
జన్మాన్తరే ష్వేవయః.
నిత్యానిత్య వివేక తీవ్రవిరతి
న్యాసాదిభి స్సాధనైః
యుక్త స్స్రశ్రవణే సతా
మభిమతో ముఖ్యాధికారీ ద్విజః. ౭౮౬

తా॥ వేదాన్త శ్రవణమునందు ముఖ్యాధికారముగలవా డెవడనగా ఎవడు పూర్వజన్మములందుననే శ్రద్ధాభక్తులతో శాస్త్రచోదితములగు శాస్త్రస్మార్త కర్మములను సక్రమముగా నాచరించి పరమేశ్వరానుగ్రహమును సంపాదించుకొనియుండునో, అట్టివాడు ఈజన్మమునందు బాల్యము నుండియే, నిత్యానిత్యవస్తువివేకము - దృఢవైరాగ్యము - సన్న్యాసము మున్నగు సాధన చతుష్టయ సంపత్తిగలవాడై వేదాన్త శ్రవణమునందు ముఖ్యాధికారి యగుచున్నాడని బ్రహ్మవిదులు వచించుచున్నారు.

శ్లో॥ అధ్యారోపాపవాద క్రమ
మను సరతా దేశికేనాఽత్ర వేత్రా
వ్యాకార్థే బోధ్యమానే సతి
సపది సత శ్శుద్ధబుద్ధేరముష్య,
నిత్యానందాద్వితీయం నిరుపమ
మమలం యత్పరం తత్త్వ మేకమ్
తద్బ్రహ్మైవాఽహ మస్మీ త్యుదయతి
పరమాఽ ఖండతా కారవృత్తిః. ౭౮౭

తా॥ ఈ విధమున ముఖ్యాధికారియగు బ్రాహ్మణునకు గురువు వలనతత్త్వమస్యాది మహావాక్యార్థమును వినినంత మాత్రముననే బ్రహ్మాకారవృత్తి గలుగుచున్నది. ఆదియెట్లనగా— బ్రహ్మనిష్ఠుడగునాచార్యుడు శాస్త్రసంప్రదాయము ననుసరించి యధ్యారోపాఽపవాదములచే మహావాక్యార్థమును బోధింపగనే శుద్ధచిత్తుడగు నుత్తమాధికారికి, 'సచ్చిదానన్ద రూపమగు నద్వితీయ పరబ్రహ్మమే నేను' అని అఖండ బ్రహ్మాకారాన్తఃకరణవృత్తి కలుగుచున్నది.

శ్లో॥ అఖండాకారవృత్తి స్సా చిదాభాస సమన్వితా,
ఆత్మాఽభిన్నం పరం బ్రహ్మ విషయీకృత్య కేవలమ్.
బాధతే తద్గతాఽజ్ఞానం తదావరణలక్షణమ్. ౭౮౮

తా॥ అజ్ఞానమను నొక పదార్థము బ్రహ్మస్వరూపము నాశ్రయించుకొనియుండి, యా బ్రహ్మస్వరూపమునే కనబడకుండ నావరించుచున్నదని శ్రుతిస్మృతులు బోధించుచున్నవి. ఇట్టియెడ తత్త్వమస్యాది-మహావాక్యార్థ శ్రవణజన్యమగు నఖండాకారవృత్తి బ్రహ్మ ఆత్మ స్వరూపము నావరించియున్న అజ్ఞానమును నశింపజేయుచున్నది. అంతట స్వప్రకాశరూపంబగు నాత్మచైతన్యము తన యంతనె వెలుగొందుచున్నది.

శ్లో॥ అఖండాకారయా వృత్త్యా త్వజ్ఞానే బాధితే సతి,
తత్కార్యం సకలం తేన సమం భవతి బాధితమ్. ౭౮౯

శ్లో॥ తంతుదాహే తు తత్కార్య పటదాహో యథాతథా,
తస్య కార్యతయా జీవ వృత్తిర్భవతి బాధితా. ౭౯౦

తా॥ అఖండాకారవృత్తిచే నజ్ఞానము నశింపచేయ బడగనే తత్కార్యమగు పంచకోశాద్యాత్మక ప్రపంచమంతయు నివర్తింపచేయ బడుచున్నది. మరియు సంసార కాలమునందు అజ్ఞాన కల్పితములగు

పంచకోశములందు బ్రహ్మచైతన్యము ప్రతిఫలించుచున్నది. ఇట్టి బ్రహ్మచైతన్యము పంచకోశములయొక్క ధర్మములనన్నింటిని తనయందు నారోపించు కొనుచున్నదై జీవుడను శబ్దముచే వ్యవహరింపబడుచున్నది. ఇట్టి జీవభావముగూడ; - దారములు దహింపబడగనే వాని కార్యమగు వస్త్రము దహింపబడు చున్నట్లుగా అఖండాకార వృత్తిచే నజ్ఞానము బాధింపబడగనే తత్కార్యములగు పంచకోశములు గూడ బాధింపబడుటంజేసి పంచకోశాభిమానాత్మకమగు జీవభావముసైతము నివర్తించుచున్నది.

శ్లో॥ దీపప్రభా యథా సూర్యం ప్రకాశయితు మక్షమా,
తద్వదేవ చిదాభాస చైతన్యం వృత్తి సంస్థితమ్. ౭౯౧
స్వప్రకాశం పరం బ్రహ్మ ప్రకాశయితు మక్షమమ్,
ప్రచండాతప మధ్యస్థ దీపవ న్నష్టదీధితి. ౭౯౨
తత్తేజసాఽ భిభూతం సత్ లీనోపాధితయా తతః,
బింబభూత పరబ్రహ్మమాత్రం భవతి కేవలమ్. ౭౯౩
యథాపనీతే త్వాదర్శే ప్రతిబింబ ముఖం స్వయమ్,
ముఖమాత్రం భవేత్తద్వదే తచ్చోపాధి సంక్షయాత్.

తా॥ అఖండాకారవృత్తిచే నంతఃకరణాదులు విలయము నొందగా తద్గతమగు బ్రహ్మ ప్రతిబింబరూపమైన జీవచైతన్యమేమగు ననగా చెప్పబడుచున్నది—స్వల్పకాంతిగల దీపము, అధికకాంతిగల సూర్యుని ప్రకాశింపజేయ జాలనియట్లు అన్తఃకరణమునందు ప్రతిఫలించినదై స్వల్పజ్ఞానముగల జీవచైతన్యము స్వయం ప్రకాశమానమగు నఖండ బ్రహ్మచైతన్యమును భాసింపజేయ జాలకున్నది. ఇంతియగాక మధ్యాహ్నకాలమునందలి సూర్యకాంతిచే నభిభూతమగు ప్రదీపమువలె, బ్రహ్మచైతన్య జ్యోతిస్సుచే తిరస్కరింపబడిన స్వరూపముగల యంతఃకరణస్థమగు ప్రతిబింబచైతన్యము తనకు నుపాధియగు నంతఃకరణము లయించిన

వెంటనే దర్పణము తొలగి పోవగనే దానియందలి ముఖప్రతిబింబము బింబభూత ముఖము మాత్రమేయగునట్లుగా, తనకు బింబభూతమగు బ్రహ్మ స్వరూపమే తానగుచున్నది.

శ్లో॥ ఘటాఽజ్ఞానే యధా వృత్త్యా వ్యాప్తయా బాధితేసతి
ఘటం విస్ఫురయత్యేవ చిదాభాస స్స్వతేజసా. ౭౯౫
న తథా స్వప్రభే బ్రహ్మణ్యా భాస ఉపయుజ్యతే ౭౯౬
అతఏవ మతం వృత్తి వ్యాప్యత్వం వస్తున స్సతామ్,
నఫలవ్యాప్యతా తేన న విరోధః పరస్పరమ్. ౭౯౭

తా॥ మాయయందలి (అజ్ఞానమునందలి) ఆవరణశక్తిచే బ్రహ్మ చైతన్యమావరింపబడగా పిమ్మట విక్షేపశక్తిచే ఘటపటాది జడపదార్థములు బ్రహ్మమునందు కల్పింబడుచున్నవి. అంతట నా పదార్థములను గ్రహించుటకొరకై అన్తఃకరణవృత్తియు, దానియందలి చైతన్య ప్రతిబింబమును (జీవుడు) ఘటాది పదార్థములను వ్యాపించుచున్నవి. అంతట అన్తఃకరణవృత్తిచే ఘటాదిపదార్థముల కాధారమగు చైతన్యము నావరించియున్న అజ్ఞానము నశింపచేయబడుచున్నది. పిమ్మట జడములగు ఘటాది పదార్థములు తమంతట తాము ప్రకాశింపలేవు గాన, నచ్చటనున్న వృత్తి యందలి చిదాభాసునిచే నా పదార్థములు భాసింప చేయబడుచున్నవి. ఇక, బ్రహ్మ సాక్షాత్కారకాలమునందు మాత్రము అఖండ బ్రహ్మాకారమగు నంతఃకరణ వృత్తిచే బ్రహ్మము నావరించియున్న మూలాఽజ్ఞానమంతయు, సంపూర్ణముగా నశింపచేయబడుటచే బ్రహ్మచైతన్యము స్వయం ప్రకాశమగుటంజేసి తనంతట తానె వెలుగొందుచున్నది. కావుననప్పుడు వృత్తి ప్రతిఫలితమగు చిదాభాసునితో ప్రయోజనమేమియు లేదు. అందు చేతనే, బ్రహ్మ స్వరూపము మనస్సునకు గోచరించునని బోధించెడి శ్రుతులకును, గోచరింపదని బోధించెడి శ్రుతులకును విరోధమేమియు వాటిల్లకున్నది. బ్రహ్మము మనస్సునకు గోచరించు ననగా మనోవృత్తిచే

బ్రహ్మము వ్యాపింపబడు ననియు, గోచరింపద నగా మనోవృత్తియందు పతిఫలించిన చిదాభాసునిచే బ్రహ్మచైతన్యము భాసింపచేయబడ దనియు వర్థము గ్రహింప నగును.

శ్లో॥ శ్రుత్యోదితం తతో బ్రహ్మ జ్ఞేయంబుద్ధ్యైవసూక్ష్మయా
ప్రజ్ఞామాన్ద్యం భవే ద్యేషాం తేషాం న శ్రుతిమాత్రతః,
స్యాదఖండాకారవృత్తి ర్వినాతు మననాదినా. ౭౯౮

తా॥ నిత్యకర్మానుష్ఠానముచే నిర్మలచిత్తులగు నుత్తమాధికారులకు గురువువలన మహావాక్యార్థమును వినినంత మాత్రములనే యఖండ బ్రహ్మాకారమగు నంతఃకరణ వృత్తిగలుగుచున్నది. కావుననే, కాఠకోపనిషత్తు సూక్ష్మబుద్ధిచేతనే బ్రహ్మస్వరూపము తెలిసికొనదగినది యని బోధించుచున్నది. ఈ రీతిగా నుత్తమాధికారులకు శ్రవణమాత్రము వలననే బ్రహ్మసాక్షాత్కారము గలుగుచున్నది. ఇక స్వల్పప్రజ్ఞగల మధ్యమాధికారులకు మాత్రము – మనన ధ్యానములను చేయనిదే కేవలశ్రవణమువలన అఖండాకార వృత్తి గలుగనేరదు.

శ్లో॥ శ్రవణా న్మననా ద్ధ్యానా త్తాత్పర్యేణ నిరన్తరమ్,
బుద్ధే స్సూక్ష్మత్వ మాయాతి తతో వస్తూపలభ్యతే.

శ్లో॥ మన్దప్రజ్ఞావతాం తస్మా త్కరణీయం పునః పునః,
శ్రవణం మననం ధ్యానం సమ్యగ్వస్తూప లబ్ధయే. ౮౦౦

తా॥ శ్రవణము, మననము, నిదిధ్యాసనము (ధ్యానము) అను నీ మూటిచే బుద్ధికి నేకాగ్రత అనగా ఆత్మతత్త్వమును గ్రహించెడి సామర్థ్య మేర్పడుచున్నది. కావున మందబుద్ధిగల ముముక్షువులు శ్రవణాదులను మూటిని పలుమాఱు లభ్యసింపవలయును. మరియు శ్రవణాదులవలన గలిగెడి ప్రయోజనము ఇహజన్మముననే కనబడుచున్నదిగాన, వియ్యము

తయారగునంతవఱకును వద్దను దంపవలసి యున్నట్లుగా, బ్రహ్మసాక్షాత్కారము గలుగునంత వఱకును శ్రవణ మనన నిది ధ్యాసనముల నాచరించుచునే యుండవలయును.

శ్లో॥ సర్వవేదాన్త వాక్యానాం షడ్భిర్లింగై స్తదద్వయే,
పరే బ్రహ్మణి తాత్పర్య నిశ్చయం శ్రవణం విదుః. ౨౦౧

తా॥ "ఉపక్రమోప సంహారములు - అభ్యాసము - అపూర్వత్వము - ఫలము - అర్థవాదము - ఉపపత్తి" అను షడ్విధ లింగములచే సకల వేదాన్తవాక్యములకును నద్వితీయ పరబ్రహ్మమునందు తాత్పర్యమును నిశ్చయించుటయే శ్రవణమగునని బ్రహ్మవిదులు వచించుచున్నారు.

శ్లో॥ శ్రుతస్యైవా౽ద్వితీయస్య వస్తునః ప్రత్యగాత్మనః,
వేదాన్త వాక్యానుగుణ యుక్తిభి స్త్వనుచిన్తనమ్.౨౦౨
మననం తచ్ఛ్రుతా౽ర్థస్య సాక్షాత్కరణకారణమ్.

తా॥ సద్గురూప దిష్టములగు వేదాన్త వాక్యములచే వినబడిన యాత్మ స్వరూపమును, లోకానుభవ సిద్ధములగు వేదాన్త వాక్యానుగుణ యుక్తులచే నిరన్తరమాలోచించుచుండుటయే మననమగుచున్నది. ఇట్టి మననము ఆత్మస్వరూప సాక్షాత్కారమునకు సాధనమగుచున్నది.

శ్లో॥ విజాతీయ శరీరాది ప్రత్యయ త్యాగపూర్వకమ్,
సజాతీయాత్మ వృత్తీనాం ప్రవాహాకరణం యథా
తైలధారావ దచ్ఛిన్న వృత్త్యా తద్ధ్యాన మిష్యతే.౨౦౪

తా॥ ఆత్మ సచ్చిదానంద స్వరూపుడు. దేహేన్ద్రియాదులు అనృత జడదుఃఖాత్మకములు. కావున నివి ఆత్మ స్వరూపమునకు విజాతీయములు. ఇట్టి దేహేన్ద్రియాదులకు సంబన్ధించిన చిత్తవృత్తులే మానవులకు నిరన్తరము గలుగుచుండును. ఈ వృత్తులను విడనాడుచు ఆత్మకు

సంబన్ధించిన మనోవృత్తులనే తైలధారవలె తెంపులేకుండ నావృత్తిచేయు చుండుట ధ్యానమనబడుచున్నది.

శ్లో॥ తావత్కాలం ప్రయత్నేన కర్తవ్యం శ్రవణం సదా,
ప్రమాణ సంశయో యావత్ స్వబుద్ధేర్న నివర్తతే.

శ్లో॥ ప్రమేయసంశయో యావ త్తావత్తు శ్రుతియుక్తిభిః,
ఆత్మ యాథార్థ్య నిశ్చిత్త్యై కర్తవ్యం మననం ముహుః

శ్లో॥ విపరీతాత్మ ధీ ర్యావ న్న వినశ్యతి చేతసి,
తావ న్నిరన్తరం ధ్యానం కర్తవ్యం మోక్ష మిచ్ఛతా.

తా॥ శ్రవణ మనన నిదిధ్యాసనముల నెంతవఱకు నాచరింప వలయుననగా — బ్రహ్మపదార్థమనునది యొకటి గలదనుటకు సరియైన ప్రమాణములు గలవా - లేవా - అను సంశయము నశించునంత వఱకును సద్గురువులయొద్ద వేదాన్తవాక్య శ్రవణము జేయుచుండవలయును. ఆ ట్లే- వేదాన్త ప్రమాణములచే బోధింపబడుచున్న బ్రహ్మము - సంభవించునా- సంభవింపదా అను సందేహము తొలగునంతవరకును, వేదాన్తవాక్యాను గుణములగు యుక్తులచే నాత్మతత్త్వమునే సన్తతము చిన్తించుచుండ వల యును. ఇకను - ఆత్మకంటె భిన్నములగు దేహేన్ద్రియాదులందుగల 'నేను' అను భావము సంపూర్ణముగా నశించునంతవఱకును ఆత్మస్వరూ పమునే ధ్యానించుచుండవలయును.

శ్లో॥ యావ న్నతర్కేణ నిరాసితోఽపి
దృశ్యప్రపంచ స్త్వపరోక్ష బోధాత్,
విలీయతే తావ దముష్యభిక్షోః
ధ్యానాది సమ్యక్కరణీయ మేవ.

తా॥ 'ప్రపంచము' - చూడబడుచున్న దగుటవలనను, జడమైన దగుటవలనను, పరిమితమైన దగుటవలనను సత్యముగానేరదు'' అని మొదలగు యుక్తులచే కనబడుచున్న ప్రపంచము యథార్థముగాదని నిరాకరింపబడి నప్పటికిని ''నేను బ్రహ్మను - నాకంటె భిన్నమేమియు లేదు'' అనెడి బ్రహ్మజ్ఞానము గలిగిననే కాని నివర్తింప నేరదు. కావున నట్టి యఖండ బ్రహ్మసాక్షాత్కారము గలుగునంతవరకును ధ్యాన సమాధుల నాచరించుచునే యుండవలయును.

శ్లో॥ సవికల్పో నిర్వికల్ప ఇతి ద్వేధా నిగద్యతే,
సమాధి స్సవికల్పస్య లక్షణం వచ్మి తచ్ఛృణు. ౮౯౯

తా॥ ఇటు పిమ్మట సమాధి యన నేమి-అది యెన్ని విధములు-అని వెనుక 784 వ శ్లోకమున నడుగబడిన ప్రశ్నకు సమాధానము చెప్పబడుచున్నది— ఓ పండితుడా ! సవికల్పము-నిర్వికల్పము-అని సమాధి రెండు విధములు అందు సవికల్ప సమాధియొక్క లక్షణము జెప్పెద వినుము.

శ్లో॥ జ్ఞాత్రా ద్యవిలయే నైవ జ్ఞేయే బ్రహ్మణి కేవలే,
తదాకారాకారితయా చిత్తవృత్తే రవస్థితిః,
సద్భి స్సఏవ విజ్ఞేయ స్సమాధి స్సవికల్పకః. ౯౦౦

తా॥ తెలిసికొనువాడు తెలివి-తెలిసికొనదగు పదార్థము అను నీ త్రిపుటి యుండగనే చిత్తవృత్తి బ్రహ్మకారమును జెంది యుండునట్టి స్థితియే సవికల్ప సమాధియనబడుచున్నది. వికల్పములనగా జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు. వీనితో గూడుకొనినదిగాన నీ సమాధి సవికల్పమగును.

శ్లో॥ మృదఏవాఽవ భానేఽపి మృణ్మయద్విపభానవత్,
సన్మాత్రవస్తుభానేఽపి త్రిపుటీ భాతి సన్మయా. ౯౦౧

శ్లో॥ సమాధి రతఏవాఽయం సవికల్ప ఇతీర్యతే. ౯౦౨

తా॥ మట్టిచే జేయబడిన యేనుగునందు మట్టియే కనబడుచున్న ప్పటికిని, కరచరణాద్యవయవములతో గూడుకొనిన యేనుగుగూడ భాసించుచుండును. అటులనే సవికల్ప సమాధియందు సద్రూపమాత్రమగు నాత్మస్వరూపము గోచరించుచున్నను, సత్తునకు (ఆత్మకు) సంబన్ధించిన తెలిసికొనువాడు—తెలివి—తెలిసికొన దగినదిఅను త్రిపుటియు, గోచరించు చుండును. కావున నిట్టి జ్ఞాతృజ్ఞానజ్ఞేయములను మూడు వికల్పములతో గూడుకొని యుండుటచే నియ్యది సవికల్ప సమాధి యనబడుచున్నది.

శ్లో॥ జ్ఞాత్రాది భావ ముత్సృజ్య జ్ఞేయమాత్ర స్థితి ర్దృఢా,
మనసో నిర్వికల్పస్స్యా త్సమాధి ర్యోగసంజ్ఞితః. ౮౧౩

తా॥ నేను తెలిసికొనుచున్నాను అనుజ్ఞాతృజ్ఞాన వికల్పద్వయమును విడనాడి, చిత్తము జ్ఞేయమగు బ్రహ్మము నందొక్క దానియందే లగ్నమై యుండునట్టి స్థితి నిర్వికల్ప సమాధి యనబడుచున్నది. ఇందు బుద్ధివృత్తి బ్రహ్మముతో గూడుకొని యుండునుగాన నీ సమాధి యోగమను పేరు తోడను వికల్పము లేమియు లేమింజేసి నిర్వికల్పమను నామముచేతను వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ జలే నిక్షిప్తలవణం జలమాత్రతయాస్థితమ్,
పృథ జ్నభాతి కి న్త్వమ్భ ఏకమేవావభాసతే. ౮౧౪

శ్లో॥ యథా తథైవ సా వృత్తి ర్బ్రహ్మమాత్రతయా స్థితా,
పృథ జ్నభాతి బ్రహ్మైవా ద్వితీయ మవభాసతే. ౮౧౫

తా॥ ఈ నిర్వికల్ప సమాధి, దృష్టాన్త పూర్వకముగా వివరింపబడు చున్నది—జలమునందుంచబడిన యుప్పుగడ్డ జలమాత్రముగనే యుండును గాని జలముకంటె వేఱుగా కనబడకున్నది. అటులనే నిర్వికల్ప సమాధి యందు బ్రహ్మాకారము వొందిన బుద్ధివృత్తి, బ్రహ్మమాత్రముగానే యుండునుగాని, బ్రహ్మముకంటె వేఱుగా భాసింపకున్నది. ఇక నేమన

నద్వితీయమగు పరబ్రహ్మమొక్కటియే నిర్వికల్ప సమాధియందు గోచ రించుచుండును.

శ్లో॥ జ్ఞాత్రాది కల్పనాఽభావా న్మతోఽయం నిర్వికల్పకః,
వృత్తే స్సద్భావ బాధాభ్యా ముభయో ర్భేద ఇష్యతే.

తా॥ తెలిసికొనువాడు-తెలివి-అను రెండు వికల్పములు లేకుండుటచే నియ్యది నిర్వికల్ప మనబడుచున్నది. కావున సవికల్ప నిర్వికల్ప సమాధులకు రెండిటికిని భేదమేమనగా-సవికల్ప సమాధియందు జ్ఞాతృజ్ఞాన వికల్పద్వయరూపమగు బుద్ధివృత్తి యుండును. నిర్వికల్ప సమాధియందు నా బుద్ధివృత్తి యుండదు అని గ్రహింపనగును.

శ్లో॥ సమాధి సుప్త్యో ర్జ్ఞానంచాఽజ్ఞానం సుప్త్యాఽత్రనేష్యతే.

తా॥ బాహ్యవృత్తులు లేకుండుట సమానముగావున సమాధి సుషుప్తులకు రెండింటికిని భేదమేమనగా సమాధికాలమునందు బ్రహ్మా కారమగు నంతఃకరణవృత్తి యుండును. ఈ వృత్తినే జ్ఞానమందురు. ఇట్టి జ్ఞానము సుషుప్తికాలము నందుండదు. ఇక నేమన సుషుప్తియందు ఆత్మ స్వరూపము అజ్ఞానముచే నావరింపబడి యుండును. కావున సమాధి సుషుప్తులకు రెండిటికిని నత్యంత భేదముండుటచే సమాధికాల స్థితికి సుషుప్తికాలస్థితిని దృష్టాంతమునుగా నెంచదగదు. (కూడదు.)

శ్లో॥ సవికల్పో నిర్వికల్ప స్సమాధి ర్ద్వావిమౌ హృది,
ముముక్షో ర్యత్నతః కార్యౌ విపరీత నివృత్తయే ౮౧౮

తా॥ కావున మోక్షమును గోరువారు, దేహేన్ద్రియాదులందు గల యాత్మభావము నశించుటకొరకై సవికల్ప నిర్వికల్ప సమాధులను రెండిటిని తప్పక యాచరించుచుండవలయును.

శ్లో॥ కృతేఽస్మి న్విపరీతాయా భావనాయా నివర్తనమ్,
జ్ఞాన స్యాఽప్రతిబద్ధత్వం సదా నందశ్చ సిద్ధ్యతి. ౮౧౯

తా॥ ఈ విధమగు సమాధిద్వయమును బాగుగా నభ్యసించినచో. దేహేన్ద్రియాదులందుగల ఆత్మ (నేనను) భావము నశించిపోవును, జ్ఞాన ప్రతిబన్ధకములు విలయమునొందును. తుదకు బ్రహ్మానందముకూడ సంభవించును.

శ్లో॥ దృశ్యానువిద్ధ శ్శబ్దానువిద్ధశ్చేతి ద్విధామతః,
సవికల్ప స్తయో ర్యత్త ల్లక్షణ వచ్మి తచ్ఛృణు. ౮-౨౦

తా॥ పూర్వమునందు వర్ణింపబడిన సవికల్ప నిర్వికల్ప సమాధులలో, సవికల్ప సమాధి మరల దృశ్యానువిద్ధమనియు, శబ్దానువిద్ధమనియు రెండువిధములగు చున్నది. ఆ రెంటియొక్కయు లక్షణము జెప్పెద వినుము.

శ్లో॥ కామాది ప్రత్యయై ర్దృశ్యై స్సంసర్గో యత్ర దృశ్యతే,
సోఽయం దృశ్యానువిద్ధస్స్యా త్సమాధి స్సవికల్పకః.

తా॥ కామక్రోధాది చిత్తవృత్తులు ఆత్మకంటె భిన్నముగా గోచరించు చుండును. కావున నివి దృశ్యములనబడుచున్నవి. ఇట్టిదృశ్యములతో కూడుకొనిన సమాధి దృశ్యానువిద్ధ సవికల్ప సమాధియనబడుచున్నది.

శ్లో॥ అహం మమేద మిత్యాది కామక్రోధాది వృత్తయః,
దృశ్యంతే యేన సంద్రష్టా దృశ్యాస్స్యురహమాదయః.

తా॥ నేను - నాది - ఇది అని యీ మొదలగు వృత్తులును కామక్రోధాది వృత్తులును నివి యన్నియు నాత్మచే భాసింపజేయబడుచున్నవి. అందుచే నయ్యవి దృశ్యములగుచున్నవి. ఇట్టి దృశ్యములగు వృత్తులతో కూడుకొనిన సమాధి దృశ్యాను విద్ధమనబడుచున్నది.

శ్లో॥ కామాది సర్వవృత్తీనాం ద్రష్టార మవికారిణమ్,
సాక్షిణం స్వం విజానీయాత్ యస్తాః పశ్యతి నిష్క్రియః.

శ్లో॥ కామాదీనా మహం సాక్షీ దృశ్యన్తే తే మయా తతః,
ఇతి సాక్షితయాఽఽత్మానం విజ్ఞాయాత్మని సాక్షిణి,
దృశ్యం కామాది సకలం స్వాత్మన్యేవ విలాపయేత్.

తా॥ ఇట్టియెడ కామాది సర్వవృత్తులకును సాక్షియై నిర్వికారుండగు నాత్మను తన స్వరూపమునుగా నెఱుంగవలయును. అదియెట్లన - కామాది వృత్తులు నాచే గ్రహింపబడుచున్నవి గాన నేను వానికి సాక్షి నగుచున్నాను'' - అని యీ రీతిగా గ్రహించి పిమ్మట సాక్షియగు తనయందే కామాదుల నన్నిటిని విలయము నొందింపవలయును. కామాదులను సాక్షియందు విలాపన చేయుటనగా కామక్రోధాది రూపమగు ప్రపంచమంతయు నాత్మయందు కల్పితమని వేదాన్తములు బోధించుచున్నవి. కల్పితపదార్థములు, కల్పనాధారమగు వస్తువుకంటె భిన్నములుగానేరవు కల్పితవస్తువులయొక్క గుణదోషములు కల్పనాధార వస్తువునకు సంక్రమింపవు - ఇట్లుండగా - ఆత్మస్వరూపమునందు కల్పితములగు కామాదులన్నియు నాత్మకంటె భిన్నములు గావనియు - అందుచేతనే కామాదులతో నాత్మకు వాస్తవిక సంబన్ధమేమియు లేదనియు దృఢముగా భావన చేయుచుండవలయును. ఇదియే కామాదుల నాత్మయందు లయింపజేయుట యనబడుచున్నది.

శ్లో॥ నాఽహం దేహో నాఽప్యసు ర్నాఽక్షవర్గః
నాఽహం కారో నో మనో నాఽపి బుద్ధిః,
అన్త స్తేషాం చాపి తద్విక్రియాణామ్
సాక్షీ నిత్యః ప్రత్యగేవాఽహ మస్మి, ౮౨౫

తా॥ పూర్వోక్తమగు కామాదుల నాత్మయందు లయింపజేయు పద్ధతియే విశదీకరింపబడుచున్నది - నేను - దేహముగాను, ప్రాణముగాను, ఇన్ద్రియసమాదాయముగాను, అన్తఃకరణముయొక్క గర్వాత్మక

వృత్తియగు నహంకారమనుగాను, సంశయాత్మక వృత్తియగు మనస్సు గాను, నిశ్చయాత్మక వృత్తియగు బుద్ధియుగాను. ఇక నే నెవరనగా దేహాదులకును, వాని ధర్మములగు జరామరణాదులకును ద్రష్టయు, భాసకుండును, శాశ్వతుండును, అనృత జడదుఃఖాత్మకములగు పంచ కోశములకంటె భిన్నుండునగు సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపుండ నే నే నగుచున్నాను.

శ్లో॥ వాచ స్సాక్షీ ప్రాణవృత్తే శ్చ సాక్షీ
బుద్ధే స్సాక్షీ బుద్ధివృత్తేశ్చ సాక్షీ,
చక్షు శ్శ్రోత్రాదీన్ద్రియాణాం చ సాక్షీ
సాక్షీ నిత్యః ప్రత్యగేవాఽహ మస్మి. ౮౨౬

తా॥ మరియు నేను వాక్కు మన్నగు సర్వకర్మేన్ద్రియములకును తద్వ్యాపారములకును సాక్షిని. ప్రాణాది పంచప్రాణ వాయువులకును వానియొక్క సంచారములకును సాక్షిని. అన్తఃకరణమునకు దాని వృత్తులకును సాక్షిని. నేత్రము, శ్రోత్రము మన్నగు జ్ఞానేన్ద్రియములకును తద్వ్యాపారములకును సాక్షిని. ఈ విధముగా సర్వసాక్షియగు సచ్చిదానన్ద పరంబ్రహ్మమే నేనగుచున్నాను.

శ్లో॥ నాఽహం స్థూలో నాఽపి సూక్ష్మో న దీర్ఘో
నాఽహం బాలో నో యువా నాఽపి వృద్ధః,
నాఽహం కాణో నాఽపి మూకో నషండః
సాక్షీ నిత్యః ప్రత్యగేవాఽహ మస్మి. ౮౨౭

తా॥ నేను స్థూలరూపుడనుగాను, సూక్ష్మరూపుడనుగాను, పొడుగు వాడనుగాని, పొట్టివాడనుగానిగాను, బాలుడనుగాను, యువకుడనుగాను, వృద్ధుడనుగాను, గ్రుడ్డివాడనుగాను, మూగవాడనుగాను, నపుంసకుడనుగాను, ఇక నే నెవరన—సర్వసాక్షియగు నాత్మరూపు నేనగుచున్నాను.

శ్లో॥ నాఽసన్న్యగన్తా నాఽపి గన్తా నహన్తా
నాఽహం కర్తా నప్రయోక్తా నవక్తా,
నాఽహం భోక్తా నోసుఖీ నైవదుఃఖీ
సాక్షీ నిత్యః ప్రత్యగేవాఽహ మస్మి. ౮౨౮

తా॥ మఱియు నేను గ్రామాదులనుండి వచ్చువాడనుగాను, గ్రామాదులను గుఱించి పోవువాడనుగాను, వ్యాఘ్రాదులను హింసించువాడనుగాను, ఘటాదులను జేయువాడనుగాను, ఇతరుల నేపనియందైన ప్రేరేపించువాడనుగాను, పాఠము మొదలగు వానిని చెప్పువాడనుగాను, కర్మఫలముల ననుభవించువాడనుగాను, సుఖదుఃఖములు గలవాడనుగాను, మఱేమన—నిఖిల క్రియాసాక్షియగు నాత్మయే నేనగుచున్నాను.

శ్లో॥ నాఽహం యోగీ నోవియోగీ నరాగీ
నాఽహం క్రోధీ నైవ కామీ నలోభీ,
నాఽహం బద్ధో నాఽపియుక్తో నముక్తః
సాక్షీ నిత్యః ప్రత్యగేవాఽహ మస్మి. ౮౨౯

తా॥ నేను భార్యాపుత్రాదులతో సంబన్ధము గలవాడనుగాని, లేనివాడనుగానిగాను, విషయములందు ఆసక్తిగలవాడనుగాను, కామక్రోధలోభములు గలవాడనుగాను, చిత్తవృత్తి నిరోధముగలవాడనుగాను, సంసారబన్ధనములుగలవాడనుగాని, లేనివాడనుగానిగాను, ఇక నేమన సర్వసంసార సాక్షియగు సచ్చిదానంద పరంబ్రహ్మము నేనగుదును.

శ్లో॥ నాఽన్తః ప్రజ్ఞో నోబహిఃప్రజ్ఞకో వా
నైవ ప్రజ్ఞో నాఽపిచాఽప్రజ్ఞ ఏషః,
నాఽహం శ్రోతా నాఽపిమన్తా న బోద్ధా
సాక్షీ నిత్యః ప్రత్యగేవాఽహ మస్మి. ౮౩౦

తా॥ మఱియు నేను జాగ్రదవస్థయందు దేహేన్ద్రియాద్యభిమానము గల విశ్వుడను గాను. స్వప్నకాలమున మనః ప్రధానుడై యుండు తైజసుడనుగాను. సుషుప్తి దశయందు కారణశరీరమగు నజ్ఞానముతో గూడుకొనిన ప్రాజ్ఞుడనుగాను, అచేతనమగు జడస్వరూపుడనుగాను; వినువాడనుగాను, ఆలోచించువాడనుగాను. తెలిసికొనువాడనుగాను. ఇక నేమన సకల జగద్వ్యవహారములకును సాక్షియగు నిత్యాత్మ స్వరూపుడనే నేను.

శ్లో॥ నఽహమేస్తి దేహేన్ద్రియ బుద్ధియోగః
నపుణ్య లేశోఽపి నపాపలేశః,
క్షుధా పిపాసాది షడూర్మిదూరః
సదా విముక్తోఽస్మి చిదేవ కేవలః. ౧౩౦

తా॥ మఱియు నాకు బుద్ధీన్ద్రియ శరీరాదులతో సంబన్ధమేమియు లేదు. పుణ్యపాపములు లేశమాత్రమైనను లేవు. నేను ఆకలి, దప్పిక-శోకము, మోహము – ముదిమి, మరణము - అను షడూర్ములు లేనివాడను. ఇక సర్వసంసారబన్ధవర్జితంబయి కాలత్రయమునను, అవస్థాత్రయమునను ఏకరూపమగు శుద్ధచైతన్యమే నా నిజస్వరూపము.

శ్లో॥ అపాణి పాదోఽహ మవాగచక్షుషీ
అప్రాణఏవాఽ స్వ్యమనాహ్యబుద్ధిః,
వ్యోమేవ పూర్ణోఽస్మి వినిర్మలోఽస్మి
సదైక రూపోఽస్మి చిదేవ కేవలః. ౧౩౧

తా॥ మఱియు నేను కాలుసేతులు - వాగిన్ద్రియము, పంచప్రాణములు - మనోబుద్ధులును లేనివాడను. ఇక ఆకాశమువలె సర్వవ్యాపకుండును, మాయామాలిన్య రహితుండును, నిత్యైకరూపుండును నగు చైతన్య మాత్ర స్వరూపుండనే నే నగుచున్నాను.

శ్లో॥ ఇతి స్వమాత్మాన మవేక్షమాణః
ప్రతీతిదృశ్యం ప్రవిలాపయన్ సదా,
జహాతి విద్వాన్ విపరీతభావమ్
స్వాభావికం భ్రాన్తివశా త్ప్రతీతమ్. 533

తా॥ ఈ విధముగా నాత్మస్వరూపమును సర్వసంసార ధర్మవర్జితమునుగా భావనచేయుచుండు విద్వాంసుడు కనబడుచున్న ప్రపంచమంతయు నాత్మకంటె వేఱుగా లేదను నిశ్చయము గలవాడై బహుజన్మముల నుండియు నజ్ఞానముచే నాత్మభిన్నములగు దేహేన్ద్రియాదులందు భాసించుచున్న 'నేను – నాది' యను నాత్మభావమును నాత్మీయభావమును విడువగలుగుచున్నాడు.

శ్లో॥ విపరీతాత్మతాఽ స్ఫూర్తి రేవముక్తి రితీర్యతే,
సదా సమాహితస్యైవ సైషా సిద్ధ్యతి నాఽన్యథా.

తా॥ అనృత జడదుఃఖాత్మకములగు దేహేన్ద్రియాదులందుగల 'నేన'ను భావము తొలగిపోవుటయే ముక్తి యనబడుచున్నది. ఇట్టి ముక్తి – నిరన్తర సమాధినిష్ఠుడై సర్వకామ వర్జితుండగు మహానుభావునకే సంభవించునుగాని వేఱొకరికి మఱొకవిధముగా లభింపదు.

శ్లో॥ నవేషభాషాభి రముష్య ముక్తిః
యాకేవలాఽఖండ చిదాత్మనా స్థితిః,
తత్సిద్ధయే స్వాత్మని సర్వదా స్థితః
జహ్యాదహన్తాం మమతాముపాధౌ. 535

తా॥ మోక్షము వేషాలంకారములచేతగాని, పాండితీ నైపుణ్యము చేతగాని లభింపదు. కేవల బ్రహ్మాత్మభావముతో నుండుటయే ముక్తి యనబడుచున్నది. ఇట్టి ముక్తిసిద్ధించుటకొఱకై ముముక్షువగు నరుడు తన

నిజతత్త్వమగు బ్రహ్మస్వరూపమునే నిరంతరము భావనచేయుచున్నవాడై శరీరాదులందుగల నేను 'నాది' యను భావమును విడనాడవలయును.

శ్లో॥ స్వాత్మ తత్త్వం సమాలంబ్య కుర్యాత్ప్రకృతినాశనమ్,
తేనైవ ముక్తో భవతి నాఽన్యథాకర్మకోటిభిః. ౫౩౬

తా॥ కావున మూముక్షువులు తమనిజతత్త్వమగు బ్రహ్మరూపమునే భావనచేయుచున్నవారై దేహేంద్రియాదులందుగల 'నేను' 'నాది' యను నభిమానమును నశింపజేసికొనవలయును. ఎప్పటికైనను నిట్టి యభిమాన త్యాగమువలననే మోక్షము లభించునుగాని మఱియొక విధమున నెన్ని కర్మములచేతను ముక్తిలభింపదు.

శ్లో॥ జ్ఞాత్వా దేవం సర్వపాశాఽపహానిః
క్షీణైః క్లేశై ర్జన్మమృత్యుప్రహాణిః,
ఇత్యేవైషా వైదికీ వాగ్బ్రవీతి
క్లేశక్షత్యా మేవ జన్మప్రహానిమ్. ౫౩౭

తా॥ శ్వేతాశ్వతరోపనిషత్తు—సంసార కారణంబులగు క్లేశంబు లన్నియు నాత్మస్వరూప సాక్షాత్కారము కలుగగనే నశించుచున్న వనియు నంతట నష్టమూలంబగుటచే జనన మరణరూపంబగు సంసారము విలయము నొందుచున్నదనియు బోధించుచున్నది. కావున నాత్మజ్ఞానమే సాక్షాన్ముక్తి హేతువుగాని కర్మలు గానేరవని గ్రహింపనగును. శ్రుతి యందు నుదాహరింపబడిన క్లేశంబు లెవ్వియన—అవిద్య-అస్మిత-రాగము ద్వేషము-అభినివేశము అను నైదు క్లేశములు. వానిలో నవిద్యయనగా అనిత్యములును, అపవిత్రములును, దుఃఖప్రదములును (దుఃఖరూపములును అచేతనములును నగు దేహేంద్రియాది సంఘాతమందు - నిత్యములు, పవిత్రములు, సుఖప్రదములు (సుఖరూపములు) చేతనములు ననియెడి భ్రాన్తి (కలిగియుండుట).

అస్మితయన - దృగ్దృశ్యములగు ఆత్మానాత్మలను రెండిటిని ఏక రూపముగా భావించుట.

రాగమన - విషయసుఖానుభవకాలమునందు, ఈ సుఖము చాల బాగుగానున్నది గాన నిట్టి సుఖమే నిరన్తరము లభించుచుండవలయునని యొడి యాసక్తి.

ద్వేషమన - విషయ సంపర్కజనిత మగు దుఃఖము ననుభవించు నప్పుడు, ఈదుఃఖమనుభవింప నలవిగాకున్నది. కాన నిట్టి దుఃఖము మరల నెన్నడును రాకుండుగాక యని నిర్వేదము జెందుట.

ఇక నభినివేశమనగా — పండితులకు నైతము పూర్వజన్మవాస నానుగుణముగా నా యా విషయ విశేషములందు ప్రవృత్తి నివృత్తు లేర్పడుచుండుట. ఇట్టి క్లేశంబు లైదును, సంప్రజ్ఞాత సమాధి ద్వయమున నభ్యసించుట వలన గలిగెడి ప్రకృతి పురుష వివేక పూర్వకంబగు నాత్మ జ్ఞానముచే నశింపగా తిరుగ జన్మించుటకు కారణమేమియు లేమిం జేసి, జన్మమృత్యురాహిత్యరూపంబగు మోక్షము కలుగుచున్నది.

శ్లో॥ భూయో జన్మాద్యప్రసక్తి ర్విముక్తిః
క్లేశక్షిత్యాం భాతి జన్మాద్యభావః,
క్లేశక్షిత్యాః హేతు రాత్మైకనిష్ఠా
తస్మాత్కార్యా హ్యాత్మనిష్ఠా ముముక్షోః. ౮౩౮

తా॥ మరల జననజరామరణాదులు (పునర్జన్మము) లేకుండుటయే మోక్షమనబడుచున్నది. పూర్వోక్తములగు పంచక్లేశములు నశించిననే కాని జన్మమరణములు సంభవింపకుండవు. క్లేశములు నశించుటకు నిరన్తరా త్మానుసంధానమే ముఖ్యసాధనము. కావున ముముక్షు జనులందఱును స్వస్వరూపధ్యానమునే శ్రద్ధతో నాచరించుచుండవలయును.

శ్లో॥ క్లేశా స్స్యు ర్వాసనాఏవ జన్తో ర్జన్మాదికారణమ్,
జ్ఞాన నిష్ఠాగ్నినా దాహే తాసాం నో జన్మహేతుతా.

శ్లో॥ బీజాన్యగ్ని ప్రదగ్ధాని నరోహన్తి యథా పునః,
జ్ఞానదగ్ధై స్తథా క్లేశై ర్నాత్మా సంపద్యతే పునః.

తా॥ మరియు విచారింపగా నవిద్యాది పంచక్లేశములే పూర్వజన్మ (జన్మాన్తర)వాసనలనబడుచున్నవై పునర్జన్మంబునకు హేతువులగుచున్నవి. అట్టి వాసనలన్నియు బ్రహ్మజ్ఞానమను నగ్నిహోత్రముచే దహింపబడినవై వేగింపబడిన విత్తనములు పునరంకురోత్పాదకములు కానట్లుగా జన్మాన్తరారంభకములు గాకున్నవి.

శ్లో॥ తస్మా న్ముముక్షోః కర్తవ్యా జ్ఞాననిష్ఠా ప్రయత్నతః,
నిశ్శేషవాసనాక్షత్యై విపరీతనివృత్తయే. ౨౮౧

తా॥ పైన జెప్పబడిన రీతిగా నాత్మజ్ఞాననిష్ఠయే సకల సంసార దుఃఖ వినాశకంబగుటం జేసి, ముక్తినిగోరు ప్రతిమానవుండును నిఖిల వాసనాక్షయము కొఱకును దేహాదులందుగల విపరీతాత్మభావనా నివృత్తి కొఱకును బహుయత్న పూర్వకముగా జ్ఞాననిష్ఠను సంపాదించుకొనవల యును. అనగా నిరన్తరము స్వస్వరూపాను సంధానమునందె యుండ వలయునని భావము.

శ్లో॥ జ్ఞాననిష్ఠాతత్పరస్య నైవ కర్మోప యుజ్యతే,
కర్మణో జ్ఞాననిష్ఠాయా న సిద్ధ్యతి సహస్థితిః.
పరస్పర విరుద్ధత్వా త్తయో ర్భిన్నస్వభావయోః. ౨౮౨

తా॥ జ్ఞాననిష్ఠ యందాసక్తిగల ముముక్షువునకు కర్మ మెంతమాత్ర మును నుపయోగపడదు. ఏలననగా, కర్మజ్ఞానములు రెండును చీకటి వెలుతురులవలె నన్యోన్య విరుద్ధస్వభావము గలవగుటం జేసి యొక్కచోట గలసి యుండనేరవు-కర్మజ్ఞానములకుగల విరోధము రాబోవు శ్లోకము లందు వివరింపబడుచున్నది.

శ్లో॥ కర్తృత్వభావనాపూర్వం కర్మజ్ఞానం విలక్షణమ్,
దేహాత్మబుద్ధే ర్విచ్ఛిత్త్యై జ్ఞానం కర్మ వివృద్ధయే. ౧౪౩
అజ్ఞాన మూలకం కర్మ జ్ఞానం తూభయ నాశకమ్,
జ్ఞానేన కర్మణో యోగః కథం సిధ్యతి వైరిణా. ౧౪౪
సహాయోగో నఘటతే యథా తిమిర తేజసోః,
నిమేషో న్మేషయో ర్వాపి తథైవ జ్ఞానకర్మణోః. ౧౪౫
ప్రతీచీం పశ్యతాం పుంసాం కథం ప్రాచీవిలోకనమ్,
ప్రత్య క్ప్రవణచిత్తస్య కుతః కర్మణి యోగ్యతా. ౧౪౬

తా॥ కర్మజ్ఞానములకుగల విరోధమెద్దియన - "నే నీ కర్మమును జేయుచున్నానుగాన నే నీ కర్మఫలము ననుభవించుదును" అని యీ పొందలగు కర్తృత్వభోక్తృత్వాద్యభిమానములతో గూడుకొని యుండునది కర్మము. ఇక జ్ఞానమన్ననో కర్తృత్వాది సకలాభిమాన వర్జితమైనది. కర్మముల నాచరించిన కొలదియు దేహాద్యభిమానము వృద్ధినొందుచుండును. జ్ఞానము నభ్యసించిన కొలదియు దేహాత్మభావము క్షీణించిపోవుచుండును. ఆత్మానాత్మా వివేకరూపంబగు నజ్ఞానము కర్మములకు కారణము. జ్ఞానము, అజ్ఞానమును, తత్కార్యములగు కర్మములనుగూడ నశింపజేయు స్వభావముగలది. ఈవిధమున కర్మజ్ఞానములకు నత్యన్త విరోధము గలదు. కావున చీకటి, వెలుతురును గూడియుండనియట్లును, కనుదెరచుట, కనుమూయుటయును గలసియుండని యట్లును కర్మజ్ఞానములు రెండును నొకచో జేరియుండుట సంభవింపదు. ఇంతియగాక, పశ్చిమ దిక్కును జూచుచున్న మనుజు డాసమయముననే తూర్పుదిక్కును జూడశక్యము గానియట్లు పరమాత్మ స్వరూపమునందు లగ్నచిత్తుడగు పురుషుడు దేహేన్ద్రియాద్యభిమాన సాధ్యములగు కర్మముల నాచరింప సమర్థుడుగా నేరడు.

శ్లో॥ జ్ఞానైకనిష్ఠా నిరతస్య భిక్షో
ర్నైవాఽవకాశోఽస్తి హి కర్మతన్త్రే,
తదేవకర్మాఽస్య తదేవ సంధ్యా
తదేవ సర్వం నతతోఽన్యదస్తి. ౧౪౭

తా॥ వేయేల - జ్ఞాననిష్ఠయందే యాసక్తుడగు యతీశ్వరునకు కర్మాచరణమానందించుకంతయు నవకాశము లేదు. అందుచే నతనికి కర్మమైనను, సంధ్యయైనను, తపమైనను, జపమైనను సర్వము నా జ్ఞాననిష్ఠయే కాని దానికంటె నితరమెద్దియు లేదు.

శ్లో॥ బుద్ధికల్పిత మాలిన్య క్షాళనం స్నాన మాత్మనః,
తేనైవ శుద్ధి రేతస్య నమృదా నజలేన చ. ౧౪౮

శ్లో॥ స్వస్వరూపే మనస్స్థాన మనుష్ఠానం తదిష్యతే,
కరణత్రయసాధ్యం యత్త న్మృషా తదసత్యతః. ౧౪౯

శ్లో॥ వినిషిధ్యాఽఖిలం దృశ్యం స్వస్వరూపేణ యా స్థితిః,
సా సంధ్యా తదనుష్ఠానం తద్దానం తద్ధి భోజనమ్. ౧౫౦

తా॥ మఱియు నాత్మకు-బుద్ధి మున్నగు నుపాధులయొక్క సంబ న్ధమువలన నారోపింపబడిన రాగద్వేషశోకమోహాది మాలిన్యములను శమదమాద్యభ్యాసములచే నివారించుటయే భిక్షువునకు ముఖ్యమగు స్నానముగాని, మృత్తికచేతను నుదకముచేతను నాత్మకు శుద్ధి (ఔపాధిక దోషనివృత్తి) కలుగనేరదు. అట్లే మనస్సు నిరన్తరము నాత్మస్వరూపము ననుసరించి యుండుటయే ముఖ్యమగు ననుష్ఠానముగాని మనోవాక్కాయములచే జేయబడు జపతపఃకృచ్ఛ్రచాన్ద్రాయణాదులు ద్వైతబుద్ధివిషయంబులగుటచేసి యథార్థానుష్ఠానములుగానేరవు. ఇక నేల పలుమాటలు-సర్వసంగపరిత్యాగియగు సన్న్యాసికి - నేతినేతీత్యాది శ్రుతివాక్యములచే-

కనబడుచున్న ప్రపంచము నంతయు నాత్మకాదని నిరాకరించి, స్వస్వరూపంబగు నసంగ సచ్చిదానన్ద భావముతో నుండుట, యేది కలదో యదియే సంధ్య-అనుష్ఠానము-దానము-భోజనము మొదలగు సకలంబును నగుచున్నది.

శ్లో॥ విజ్ఞాత పరమార్థానాం శుద్ధసత్త్వాత్మనాం సతామ్,
యతీనాం కి మనుష్ఠానం స్వానుసంధిం వినా పరమ్.

తా॥ శుద్ధ సత్త్వగుణ ప్రధానులును బ్రహ్మానుభవము గలవారును గనుకనే బ్రహ్మస్వరూపులగు సన్న్యాసులకు స్వాత్మస్వరూపానుసంధానము దప్ప మరి యెద్దియు ననుష్ఠానము లేదు.

శ్లో॥ తస్మాత్ క్రియాంతరం త్యక్త్వా జ్ఞాననిష్ఠా పరో యతిః,
సదాఽఽత్మ నిష్ఠయా తిష్ఠే న్నిశ్చల స్తత్పరాయణః.

తా॥ అందువలన జ్ఞాననిష్ఠుడుం దాసక్తిగల సన్న్యాసి ఇతర కార్యముల నన్నిటిని విడనాడి తదేక నిష్ఠుడై బ్రహ్మస్వరూపానుసంధానము నే నిరంతరము జేయుచుండవలయును.

శ్లో॥ కర్తవ్యం స్వోచితం కర్మ యోగ మారోఢు మిచ్ఛతా,
ఆరోహణం కుర్వతస్తు కర్మనాఽఽరోహణం మతమ్.

తా॥ ఇక శ్రుతిస్మృతిచోదితములగు వర్ణాశ్రమ కర్మముల నెంతవరకు నెవరాచరింపవలయుననఁ జెప్పబడుచున్నది - వేదములందు, కర్మయోగ ధ్యానయోగ (లేక భక్తియోగ) జ్ఞానయోగములు మూడును క్రమముగా బోధింపబడినవి. అందు కర్మయోగమువలన మనోగతమాలిన్యము లన్నియు తొలగి, పరమేశ్వర స్వరూపమును ధ్యానింపవలయు ననెడి తీవ్రవాంఛ కలుగును. కావున నిట్టి వాంఛ గలుగునంతవఱకును శ్రౌతస్మార్తకర్మముల నాచరింపవలయును. అటు పిమ్మట నిర్మలమగు చిత్తమునందు భగవంతుని స్వరూపమునే యెల్లప్పుడు ధ్యానము జేయుచుండ

వలయును. ఇదియే ధ్యానయోగ మనబడును. ఇట్టియెడ సేవనిని జేయుటకును వీలులేదుగాన సర్వకర్మముల బరిత్యజింపవలయును. అంతట ధ్యానయోగాభ్యాసపాటవాతిశయముచే చిత్తమున కేకాగ్రత యేర్పడి 'నేనే బ్రహ్మమగుచున్నా'నను జ్ఞానముదయించును. ఇట్టిది జ్ఞానయోగము. ఇంతకు దృష్టాన్తమొండుగలదు—ప్రపంచమునందు వ్యవసాయదారులు విత్తనములు చల్లుటకు పూర్వము పొలమునంతయు నాగలితో బాగుగా దున్నుదురు. అట్లు దున్నుటచే పొలములోని తుంగమున్నగు కలుపంతయు తొలగిపోవును. అంతట విత్తనములను నాటినచో, నీటి సహాయమున నవి త్వరలో మొలకలెత్తును. అట్టియెడ నెవ్వరును తిరుగ భూమిని దున్నరుగదా! ఆవిధముననే మానవునియొక్క చిత్తమనెడి కేదారమునందు రాగద్వేషాదులనెడి చెడుమొక్కలు విపరీతముగా మొలచి యుండును. వీటిని నశింపజేయుటకొరకై శాస్త్రీయకర్మానుష్ఠాన మనెడి కర్షణము నాచరింపవలయును. దానిచే పరిశుద్ధమగు చిత్తక్షేత్రమునందు భగవద్ధ్యానబీజముల నాటవలయును. అంతట మరల కర్మానుష్ఠానకర్షణము జేసినచో నా ధ్యానాంకురములు నశించిపోవునుగాన నప్పుడు సర్వకర్మముల బరిత్యజింపవలయునే కాని యేకర్మంబు నాచరింపదగదు.

శ్లో॥ యోగం సమారోహతి యో ముముక్షుః
క్రియాన్తరం తస్య నయుక్త మీషత్,
క్రియాన్తరాసక్తమనాః పతత్యసౌ
తాళద్రుమారోహణకర్త్రువ ద్ధ్రువమ్. ౧౫౪

తా॥ మరియు పూర్వోక్త విధమున క్రమముగా జ్ఞానయోగము నభ్యసించుచున్న ముముక్షువునకు కొంచెమేనియు గార్యాన్తరము పనికిరాదు. అటుగాక యాతడేదేని వ్యాపారాన్తరమునందు లగ్నచిత్తుడగు నేని పరధ్యానముతో త్రాటిచెట్టునెక్కువాడు క్రిందబడి దెబ్బలు తినునట్లుగా, శోకమోహాది రూపంబగు సంసారమున బడి జననమరణాది

దుఃఖము ననుభవించుచున్నాడు. ఈ మాట యథార్థము. లోకమున జూచు చున్నారము గదా - ఉత్తమస్థితిని జెందినవారలు కూడ, తమ ధర్మముల దామాచరింపక యన్యవ్యాపారంబుల నాచరించుచు దానివలన రాగ ద్వేషాది దుఃఖములకు లోనగుచుండుటను. కావుననే భగవానుడగు వేద వ్యాస మహర్షి - తురీయాశ్రమమును స్వీకరించిన మహానుభావులు, స్వాశ్రమోచితంబగు నాత్మానుసంధానమునే నిరంతరము జేయుచుండ వలయును గాని పూర్వాశ్రమ కర్మముల మరల నాచరింపరాదని బోధించి యున్నాడు.

శ్లో॥ యోగారూఢస్య సిద్ధస్య కృతకృత్యస్య ధీమతః,
నాఽస్త్యవహి బహిర్దృష్టిః కా కథా తత్ర కర్మణామ్.
దృశ్యాఽనువిద్ధః కథితః సమాధిస్సవికల్పకః. ౮౫౫

తా॥ జ్ఞానయోగమును సంపూర్ణముగా నభ్యసించినవాడై 'నేనే బ్రహ్మమునగుచున్నాడ'నని యారూఢ జ్ఞానముగలయతీశ్వరుడు జీవన్ముక్తు డగుచున్నాడు. మనుష్యజన్మమును సార్థక మొనర్చుకొని, సంసారమును తరించి కృతార్థుడైన యిట్టి మహాజ్ఞానికి నిరంతరమును నాత్మదృష్టి తప్ప బాహ్యప్రపంచ దృష్టిలేమింజేసి భేదబుద్ధి విషయకంబగు కర్మానుష్ఠాన మున కొంతమాత్రము దావులేదు. ఈ విధమున ప్రసంగాగత జ్ఞాననిష్ఠా ప్రతిపాదన పూర్వకంబుగా 821 వ శ్లోకంబున నుపక్రమింపబడిన దృశ్యాఽనువిద్ధ సవికల్పక సమాధి నిరూపింపబడినది

శ్లో॥ శుద్ధోఽహం బుద్ధోఽహం
ప్రత్యగ్రూపేణనిత్యసిద్ధోఽహమ్,
శాన్తోఽహమనన్తోఽహం
సతతపరానన్దసిన్ధురేవాఽహమ్. ౮౫౬

శ్లో॥ ఆద్యోఽహ మనాద్యోఽహం వాఙ్మనసా
సాధ్యవస్తు మాత్రోఽ హమ్,
నిగమవచోవేద్యోఽహ
మనవద్యాఖండ బోధరూపో ఽహమ్. ౪౫౭

విదితావిదితాఽన్యోఽ హం
మాయాతత్కార్యలేశశూన్యోఽ హమ్,
కేవలదృగాత్మకోఽ హం సంవిన్మాత్ర
సకృద్విభాతోఽ హమ్. ౪౫౮

అపరో ఽహ మన పరో ఽహం
బహిర న్తశ్చాఽపి పూర్ణఏవాహమ్,
అజరోఽ హ మక్షరో ఽహం
నిత్యానందో ఽహ మద్వితీయోఽ హమ్. ౪౫౯

ప్రత్య గభిన్న మఖండం సత్యజ్ఞానాది లక్షణం శుద్ధమ్,
శ్రుత్యవగమ్యం తత్త్వం బ్రహ్మైవాఽహం పరంజ్యోతిః.
ఏవం సన్మాత్రగాహిన్యా వృత్త్యా తన్మాత్రగాహకైః,
శబ్దై స్సమర్పితం వస్తు భావయే న్నిశ్చలో యతిః. ౪౬౦.

శ్లో॥ కామాదిదృశ్య ప్రవిలాప పూర్వకమ్
శుద్ధోఽ హ మిత్యాదికశబ్దమిశ్రః,
దృశ్యైవ నిమ్నస్య య ఏవ భావః
శబ్దానువిద్ధః కథిత స్సమాధిః. ౪౬౧

తా॥ పిమ్మట నేడు శ్లోకములందు శబ్దానుఽవిద్ధసవికల్పసమాధి యొక్క స్వరూపము నిరూపింపబడుచున్నది. నిజతత్త్వబోధకంబులగు

శబ్దముల నుచ్చరించుచు తత్ప్రతిపాద్యంబగు నాత్మస్వరూపమును భావిం చుచుండుటయే శబ్దానువిద్ధంబగు సవికల్ప సమాధియగుచున్నది. శబ్దానువిద్ధమనగా శబ్దములతో గూడుకొనిన దని యర్థము. ఆ శబ్దము లెట్టివన—నేను శుద్ధుండను (అజ్ఞానము, దాని కార్యమగు సంసారము నను దోషములు లేనివాడను) నేను జ్ఞానస్వరూపుండను. నేను నిరంతరమును సాక్షిస్వరూపముననుండువాడను. నేను సత్త్వరజస్తమోగుణములవలన గలిగెడి కలతలు లేనివాడను. నేను సర్వదేశములందును సర్వకాలము లందును సకలవస్తువులందును నుండువాడనగుటచే త్రివిధ పరిచ్ఛేదములు లేనివాడను. నేను నిత్యానందసాగరుండను. నేను సృష్టికంతకును మొదటి వాడను. నాకంటె మొదటివాడు మరియొకడు లేడు. నేను వాక్కులచే చెప్పుటకుగాని, మనస్సుచే చింతించుటకుగాని వీలుగాని బ్రహ్మస్వరూ పుండను. నేను వేదవాక్యములచే గ్రహింపదగిన రూపము గలవాడను. నేను తెంపులేని నిర్మల జ్ఞానస్వరూపుండను నేను కార్యకారణములకంటె నన్యుండను. నేను మాయతోగాని దాని కార్యములగు దేహేంద్రియాదు లతోగాని యొంత మాత్రమును సంబంధము లేనివాడను. నేను దృశ్యాతీతం బగు కేవల దృక్స్వరూపుండను. నేను చైతన్యరూపుండనై నిరంతరము నేక రూపమున భాసించుచుండువాడను. నేను నిఖిలజగద్విలక్షణుండను. నేను మాయావశమున (తాడు పాముగాను, మట్టికుండగా దోచునట్లు) ప్రపంచ రూపమున దోచుచున్నవాడను. నేను సర్వవ్యాపకుడను. నేను మొదిమి లేని వాడను. నేను నాశములేనివాడను. నేను నద్వితీయానందరూపుండను. మరియు జీవునికంటె వేఱుగానట్టియు శ్రుతి మాత్ర గోచరంబగునట్టియు తేజోరూపంబైనట్టియు సచ్చిదానన్ద పరబ్రహ్మంబె నేనగుచున్నాను.

ఈ విధములగు శబ్దముల నుచ్చరించుచు యతీశ్వరుడు బ్రహ్మ విషయకంబగు మనోవృత్తిచే నాత్మస్వరూపమునే నిరంతరము ధ్యానించు చుండవలయును.

ఇట్లు మొదట దృశ్యానువిద్ధసవికల్ప సమాధిచే కామాదిదృశ్యము లయింపజేసి పిమ్మట నాత్మనిష్ఠుడై "నేను శుద్ధుండను. నేను బుద్ధుండను:

అని యీశబ్దముల స్మరించుచు నాత్మస్వరూపమును భావించుచుండుట యే శబ్దానువిద్ధ సవికల్ప సమాధియగు నని పండితులు చెప్పుచున్నారు.

శ్లో॥ దృశ్యస్యాఽపిచ సాక్షిత్వాత్ సముల్లేఖన మాత్మని,
నివర్తక మనోఽవస్థా నిర్వికల్ప ఇతీర్యతే. ౨౬౩

తా॥ ఆత్మ సర్వంబును భాసింపజేయుచు సర్వసాక్షిగా నుండుటచే కామాది వృత్తులకు సైతము సాక్షిరూపే యగుచున్నాడు. ఇట్టి సాక్షిరూపుడగు ఆత్మయందు మాయచే నారోపింపబడిన కామాది వృత్తి సంబన్ధమేదిగలదో దానిని తొలగింపజేయునట్టి మనోఽవస్థయే నిర్వికల్ప సమాధియనబడుచున్నది అనగా, నిర్వికల్ప సమాధియందు ఆత్మకును, కామాది వృత్తులకును గల యాధ్యాసిక సంబన్ధము నశించునని భావము.

శ్లో॥ సవికల్ప సమాధిం యో దీర్ఘకాలం నిరన్తరమ్,
సంస్కారపూర్వకం కుర్యా న్నిర్వికల్పోఽస్య సిధ్యతి.

తా॥ సవికల్ప సమాధిని బహుకాల పర్యన్తము ప్రతిక్షణమును తెంపులేకుండ నభ్యసించినచో దృఢమగు సమాధి సంస్కారమేర్పడును. ఇట్లు దృఢమగు సమాధిసంస్కార బలముగల యతీశ్వరునకు సులభముగా నిర్వికల్పసమాధి సిద్ధించుచున్నది కావున ముముక్షువులగు సన్న్యాసులు యత్నపూర్వకముగా చిరకాలము నిరన్తరము నత్యంతాదరముతో సవికల్ప సమాధి నలవరచుకొనవలయును అంతట నచిరకాలముననె యనాయాసముగా నిర్వికల్పసమాధిని పొందగలరు.

శ్లో॥ నిర్వికల్పక సమాధినిష్ఠయా
తిష్ఠతో భవతి నిత్యతో ధ్రువమ్,
ఉద్భవాద్యపగతి ర్నిరర్గళా
నిత్యనిశ్చల నిరన్త నిర్వృతిః. ౨౬౪

తా॥ ఈ విధమున నిర్వికల్ప సమాధియందుననే నిరన్తరము నిల్చియుండు యతీశ్వరునకు సకల ప్రతిబన్ధకములు తొలగిపోయి, జననమరణాది నిఖిల సంసారదుఃఖ నివృత్తియు, శాశ్వత బ్రహ్మానంద ప్రాదుర్భావంబును గలుగుచున్నది.

శ్లో॥ విద్వా నహ మిద మితి వా కించిత్
బాహ్యాఽభ్యన్తర వేదన శూన్యః,
స్వానన్దాఽమృత సింధునిమగ్నః
తూష్ణీ మాస్తే కశ్చి దనన్యః. ౮౬౬

తా॥ మరియు నిర్వికల్ప సమాధియందుండు మహానుభావుడగు శోకాశోక యతివరుడు తనకంటె నన్యమగు నవెద్దియు లేమింజేసి బాహ్యములగు దేహేన్ద్రియాదులందుగాని యాన్తరములగు నన్తఃకరణాదులందు గాని 'నాది' 'నేను' అను నభిమానము లేనివాడై బ్రహ్మానన్ద పీయూషాఽబ్ధి నోలలాడుచు స్వాభావికంబగు వ్యాపార రాహిత్యము జెందుచున్నాడు.

శ్లో॥ నిర్వికల్పం పరం బ్రహ్మ యత్తస్మి న్నేవ నిష్ఠితాః,
ఏతే ధన్యా ఏవ ముక్తా జీవన్తోఽపి బహి ర్దృశామ్.

తా॥ నిర్వికల్ప సమాధియందు నిర్గుణ పరబ్రహ్మస్వరూపము జెందియున్న యతీంద్రులు, పామరజనులకు, బ్రతికియున్నవారివలె దోచుచున్నను, పాముకుబుసమును పరిత్యజించునట్లు దేహాఽభిమానమును విడనాడి బ్రహ్మభూతులై జీవన్ముక్తులగుచున్నారు.

శ్లో॥ యథా సమాధి త్రితయం యత్నేన క్రియతే హృది,
తథైవ బాహ్యదేశేఽపి కార్యం ద్వైతనివృత్తయే. ౮౬౭

శ్లో॥ తత్ప్రకారం ప్రవక్ష్యామి నిశామయ సమాసతః. ౮౬౮

తా॥ దృశ్యానువిద్ధము, శబ్దానువిద్ధమునను సవికల్పసమాధులు రెండును, నిర్వికల్ప సమాధి యొకటియు గలసి మూడు సమాధులగుచున్నవి. ఈ మూడును హృదయ దేశమునం దేకాంతమున ననుష్ఠింప నర్హములగుచున్నవి. ఈ విధమున నే బాహ్యప్రపంచమున, సంచరించు సమయమున గూడ నీ సమాధిత్రయము నాచరించినచో బ్రహ్మభిన్నంబగు ద్వైతభావం బంతయు నశించిపోగలదు. కావున నో శిష్యా! నేను నీ కాబాహ్య సమాధిత్రయము ననుష్ఠించు విధానము జెప్పెదగాన శ్రద్ధతో సంపూర్ణముగా నాకర్ణింపుము.

శ్లో॥ అధిష్ఠానం పరం బ్రహ్మ సచ్చిదానన్ద లక్షణమ్,
తత్రాఽధ్యస్త మిదం భాతి నామరూపాత్మకం జగత్.
సత్త్వం చిత్త్వం తథాఽఽనన్దో
రూపం యద్బ్రహ్మణస్త్రయమ్
అధ్యస్త జగతో రూపం
నామరూప మిదం ద్వయమ్. ౮౭౧
ఏతాని సచ్చిదానన్ద నామరూపాణి పంచచ,
ఏకీ కృత్యోచ్యతే మూర్ఖై రిదం విశ్వ మితిభ్రమాత్.
శైత్యం శైత్యం రసం దీర్ఘం తరంగ ఇతి నామచ,
ఏకీకృత్య తరంగోఽయ మితి నిర్దిశ్యతే యథా. ౮౭౩

తా॥ సచ్చిదానన్దరూపంబగు పరబ్రహ్మంబను నాధారమునందు నామరూపాత్మకంబగు నిఖిల జగంబును శుక్తికయందు రజతమువలె నారోపింపబడినది. ఇట్టియెడ తెలుపు, చల్లదనము, ద్రవము అను నీమూడు జలగుణములను, పొడుగుగానుండుట యను రూపమును, తరంగమను నామధేయమును-ఈయైదింటిని జేర్చి లోకులు తరంగమని వ్యవహరించుచున్నటు

సత్త్వము, చిత్త్వము, ఆనందము అను నీ మూడు బ్రహ్మరూపములను నామము, రూపము అను నీ రెండు జగద్రూపంబులను, ఈ యైదింటిని గలిపి పామరజను లజ్ఞానముచే నిది ప్రపంచ మని చెప్పుచున్నారు.

శ్లో॥ ఆరోపితే నామరూపే ఉపేక్ష్య బ్రహ్మణి స్వతః,
స్వరూపమాత్రగ్రహణం సమాధి ర్బాహ్య ఆదిమః.
సచ్చిదానన్ద రూపస్య సకాశా ద్బ్రహ్మణో యతిః. ౮౭౪
నామరూపే పృథక్కృత్య బ్రహ్మణ్యేవ విలాపయన్
అధిష్ఠానం పరం బ్రహ్మ సచ్చిదానన్ద మద్వయమ్,
యత్తదేవాఽహ మిత్యేవనిశ్చితాఽఽత్మాభవేద్ధ్రువమ్.

తా॥ ఇట్లుండఁ గల్పితములగు నామరూపములను రెండిటిని బరిత్యజించి, సద్రూపంబగు బ్రహ్మమును మాత్రము చింతించుచుండుటయే బాహ్యమగు దృశ్యాఽను విద్ధ సవికల్ప సమాధి యగుచున్నది. కావున మోక్షకాంక్షియగు యతీశ్వరుడు సచ్చిదానన్దరూపంబగు పరబ్రహ్మము నుండి జగద్రూపంబులగు నామరూపములను రెంటిని విడదీసి యవి రెండును బ్రహ్మముకంటె వేఱుగా లేవని భావించుచు నారెంటికి నాధారమగు నద్వితీయ పరబ్రహ్మమె నే నగుచున్నానని నిశ్చయించుకొనవలయును.

శ్లో॥ ఇయం భూ ర్నవాఽపి తోయం నతేజో
నవాయు ర్నఖం నాఽపి తత్కార్యజాతమ్,
యదేషా మధిష్ఠాన భూతం విశుద్ధమ్
తదేకం పరం సత్తదేవాఽహ మస్మి. ౮౭౬

తా॥ ఆత్మనుండి నామరూపాత్మక జగత్తును విడదీయుచు నెట్లనగా నేను భూమినిగాను, జలమునుగాను, అగ్నినిగాను, వాయువునుగాను

ఆకాశమునుగాను పంచభూతములయొక్క కార్యములగు దేహేన్ద్రియాదు-
లును కాను, ఇక నేమన భూమ్యాదుల కన్నింటికిని నాధారమగు
పరిశుద్ధ పరబ్రహ్మమె నేనగుచున్నాను.

శ్లో॥ నశబ్దో నరూపం నచస్పర్శ కోవా
తథా నోరసో నాఽపిగంధో నచాఽన్యః,
యదేషా మధిష్ఠాన భూతం విశుద్ధమ్
తదేకం పరం సత్తదేవాహాఽహా మస్మి. ౮౭౭

తా॥ నేను శబ్దముగాను, రూపముగాను, స్పర్శముగాను, రసము-
గాను, గంధముగాను, ఇన్ద్రియ గోచరంబగు నితర విషయ మెద్దియు నేను
గాను. కాని శబ్దాది విషయముల కన్నింటికి నాధారమగు పరబ్రహ్మమే
నేనగుదును.

శ్లో॥ నదేహా నచాఽక్షాణి నప్రాణవాయుః
మనోనాఽపి బుద్ధి ర్నచిత్తం హ్యహం ధీః,
యదేషా మధిష్ఠాన భూతం విశుద్ధమ్
తదేకం పరం సత్తదేవాఽహా మస్మి. ౮౭౮

తా॥ నేను స్థూలదేహముగాను, నేత్రము మున్నగు నిన్ద్రియములు
గాను, ప్రాణవాయువుగాను, మనోబుద్ధి చిత్తాహంకారములలో నెద్దియును
గాను. కాని దేహేన్ద్రియాదుల కన్నింటికి నాధారంబగు పరబ్రహ్మము
నేనగుచున్నాను.

శ్లో॥ నదేశో నకాలో నదిగ్వ్యాప్యహం స్యామ్
నవస్త్వన్తరం స్థూలసూక్ష్మాది రూపమ్,
యదేషా మధిష్ఠాన రూపం విశుద్ధమ్
తదేకం పరం సత్తదేవాఽహా మస్మి. ౮౭౯

తా॥ నేను దేశముగాను, కాలముగాను, పూర్వము మున్నగు దిశలంగాను, మరియే స్థూలసూక్ష్మ పదార్థమునుగాను. ఇక నీ దేశకాలాదులకన్నింటికిని సాధారమగు నద్వితీయ శుద్ధసచ్చిదానన్ద పరబ్రహ్మమూర్తినే నే నగుచున్నాను.

శ్లో॥ ఏతద్దృశ్యం నామం రూపాత్మకం యోఽ
ధిష్ఠానం తద్బ్రహ్మ సత్యం సదేతి,
గచ్ఛం స్తిష్ఠ న్వాశయానోఽపి నిత్యమ్
కుర్యా ద్విద్వాన్ బాహ్యదృశ్యానువిద్ధమ్. ౨౨౦

తా॥ ఈరీతిగా ముముక్షువగు యతీశ్వరుడు నడచుచున్నను, నిలుచుండినను, నిద్రించుచుండినను, మరియేపని చేయుచున్నను గూడ నిరన్తరము, నామరూపాత్మకమగు ప్రపంచమున కాధారమగు సచ్చిదానన్ద పరబ్రహ్మమే కాలత్రయా బాధ్యమైనదని భావించుచుండవలయును. ఇదియే దృశ్యానువిద్ధ బాహ్యసమాధి యనబడుచున్నది.

శ్లో॥ అధ్యస్తనామ రూపాది ప్రవిలాపేన నిర్మలమ్,
అద్వైతం పరమానన్దం బ్రహ్మైవాఽస్మీతి భావయేత్.
నిర్వికారం నిరాకారం నిరంజన మనామయమ్,
ఆద్యన్తరహితం పూర్ణం బ్రహ్మైవాఽహం నసంశయః.
నిష్కళంకం నిరాతంకం త్రివిధచ్ఛేద వర్జితమ్,
ఆనన్ద మక్షరం ముక్తం బ్రహ్మైవాఽస్మీతి భావయేత్.
నిర్విశేషం నిరాభాసం నిత్యముక్త మవిక్రియమ్,
ప్రజ్ఞానైకరసం సత్యం బ్రహ్మైవాఽస్మీతి భావయేత్.
శుద్ధం బుద్ధం తత్త్వసిద్ధం పరం ప్రత్య గఖండితమ్,
స్వప్రకాశం పరాకాశం బ్రహ్మైవాఽస్మీతి భావయేత్.

శ్లో॥ సుసూక్ష్మ మస్తితామాత్రం నిర్వికల్పం మహత్తమమ్,
కేవలం పరమాద్వైతం బ్రహ్మైవాఽస్మీతి భావయేత్.
ఇత్యేవం నిర్వికారాది శబ్దమాత్రసమర్పితమ్,
ధ్యాయతః కేవలం వస్తు లక్ష్యే చిత్తం ప్రతిష్ఠతి. ౮౮౭

తా॥ ఇక శబ్దాఽనువిద్ధ బాహ్యసవికల్ప సమాధి స్వరూపంబెద్ది యన-కల్పితమగు నామరూప గుణక్రియాత్మక జగత్తునంతయును బ్రహ్మమునందు లయింపజేసి (జగత్తునకు బ్రహ్మముకంటె పృథక్సత్త లేదని గ్రహించి) పిమ్మట నిజతత్త్వ బోధకంబులగు శబ్దముల నుచ్చరించుచు నా యాత్మతత్త్వమును దానుగా ధ్యానించుటయే శబ్దానువిద్ధ బాహ్య సవికల్ప సమాధియగుచున్నది. ఆశబ్దము లెవ్వియన- నేను వికారములు లేని వాడను ఆకారము లేనివాడను దేనితోడను సంగము లేనివాడను. అద్యన్తములు లేనివాడను. సర్వవ్యాపకుడను, నిర్దోషుండను. దేశకాల వస్తుకృతత్రివిధ భేద శూన్యుండను. నిత్యముక్తుండను. సజాతీయ విజాతీయ స్వగత విశేష రహితుండను. మద్భిన్నంబగున ద్దియు లేమింజేసి ప్రతిబింబవర్జితుండను. ప్రజ్ఞానఘనుండను. ప్రపంచ విలక్షణుండను, పరమార్థ స్వరూపుండను. స్వయంప్రకాశమానుండను. సచ్చిదానన్దరూపుండను. సాక్షాద్బ్రహ్మమునే నేను. అజ్ఞానులకు గోచరింపని యద్వితీయాత్మ తత్త్వమునే నేను. అని యీ మున్నగు శబ్దములచే స్ఫురింపజేయబడెడి బ్రహ్మపదార్థమును ధ్యానించు యతీశ్వరుని చిత్తము బ్రహ్మమునందే లగ్నమై యుండును.

శ్లో॥ బ్రహ్మానన్దరసావేశా దేకీభూయ తదాత్మనా,
వృత్తే ర్యానిశ్చలాఽవస్థా సా సమాధి రకల్పకః. ౮౮౮

తా॥ అన్తఃకరణవృత్తి బ్రహ్మస్వరూపముతో నైక్యము జెంది బ్రహ్మానన్దము ననుభవించుచు నిశ్చలముగా నుండుటయే బాహ్యనిర్వికల్ప సమాధి యనబడుచున్నది.

శ్లో॥ ఉత్థానేవాఽ ప్యనుత్థానేఽ ప్యప్రమత్తో జితేన్ద్రియః,
సమాధిషట్కం కుర్వీత సర్వదా ప్రయతో యతిః.

తా॥ ఈవిధమున నారు విధములగు సమాధి జెప్పబడినది. జితేన్ద్రియుడగు యతీశ్వరుడు అన్తర్ముఖుడగునప్పు డాన్తర సమాధిత్రిక మును, బహిర్ముఖుడగునప్పుడు బాహ్యసమాధిత్రికమును, నిరన్తరము, జాగరూకుడై యాచరించుచుండవలయును.

శ్లో॥ విపరీతార్థ ధీర్యావ న్నని శ్శేషం నివర్తతే,
స్వరూపస్ఫురణం యావ న్నప్రసిధ్య త్యనర్గళమ్,
తావ త్సమాధి షట్కేన నయే త్కాలం నిరన్తరమ్.

తా॥ ఈరీతిగా నెంతకాలము చేయవలయుననన - ఎంతవరకు దేహేన్ద్రియాదులందుగల 'నేను' 'నాది' యను విపరీతాత్మభావము తొలగిపోదో ఎంతవరకు 'నేనే బ్రహ్మమగుదు'నని యఖండితమగు నాత్మస్వరూపభావము గలదో యంతవరకును నీ యాఱు సమాధుల నాచరించుచుండవలయును. అనగా దేహాత్మభావముపోయి, యవిచ్ఛిన్న మగు బ్రహ్మాత్మభావము కలుగు పర్యన్తము నీ సమాధి షట్కము ననుష్ఠింపవలయు నని భావము.

శ్లో॥ నప్రమాదోఽ త్రకర్తవ్యో విదుషా మోక్ష మిచ్ఛతా,
ప్రమాదేజృంభతేమాయాసూర్యాపాయేతమోయథా.

తా॥ ముక్తిని గోరు యతివరుడు పూర్వోక్తములగు నారు సమాధుల నాచరించు విషయమై పొరపాటు నెంతమాత్రమును జెంద రాదు. ఏలనన — సూర్యుడస్తమించినచో చీకటి విజృంభించి నేత్ర దృష్టి నడ్డగించు నటుల సమాధి విషయమై యేమరుపాటు నొందినచో వెంటనే యజ్ఞానము విజృంభించి బ్రహ్మస్వరూపము నావరించుచున్నది.

కావున నిట్టి ప్రమాదము నెంతమాత్రము నొందక నిరన్తరము సావధానుడై సమాధినభ్యాసము నాచరింపవలయునని భావము

శ్లో॥ స్వాఽనుభూతిం పరిత్యజ్య నతిష్ఠన్తి క్షణం బుధాః,
స్వాఽనుభూతౌ ప్రమాదో యస్సమృత్యుర్న యమస్సతామ్.

తా॥ కావుననే యీ రహస్యము నెఱిగిన యతీశ్వరులు క్షణకాలమైనను, స్వాత్మస్వరూప సుఖానుభవమును విడవకున్నారు. మరియు సత్పురుషులకు స్వరూపానన్దమును నశింపజేసెడి ప్రమాదమే మృత్యువగును గాని దేహనాశకుడగు యముడు మృత్యువు గానేరడు. అందుచేతనే భగవంతుడగు సనత్సుజాతుడు ధృతరాష్ట్రమహారాజు నుద్దేశించి "ముముక్షుజనులకు సమాధి నిష్ఠయందు ప్రమాదము నొందుటయే మృత్యువగునని నా యభిప్రాయము" ని బోధించియున్నాడు.

శ్లో॥ అస్మిన్ సమాధౌ కురుతే ప్రయాసమ్
యస్తస్య నైవాఽస్తి పున ర్వికల్పః,
సర్వాత్మ భావోఽ ప్యమునైవ సిద్ధ్యేత్
సర్వాత్మ భావః ఖలు కేవలత్వమ్. ౧౯౩

తా॥ ఈ సమాధినభ్యాసమునందు ప్రయత్నము జేయువానికి తిరుగ దేహాత్మభావము గలుగనేరదు. ఇంతియగాక యీ సమాధిచేతనే 'ఇదగ్ం సర్వంయదయమాత్మా' ఇత్యాది శ్రుతిబోధితంబగు సర్వాత్మభావముకూడ నేర్పడుచున్నది ఇట్టి సర్వాత్మభావమేగదా ముక్తియనబడునది.

శ్లో॥ సర్వాత్మభావో విదుషో బ్రహ్మవిద్యా ఫలం విదుః,
జీవన్ముక్తస్య తస్యైవ స్వానన్దానుభవః ఫలమ్. ౧౯౪

తా॥ జ్ఞానియగు యతీశ్వరునకు 'సకలము నాత్మయే' యను భావము గలుగుటయే బ్రహ్మవిద్యాభ్యాసమునకు ఫలమగుచున్నది. ఇట్టి

సర్వాత్మభావముగల జీవన్ముక్తునకే స్వస్వరూపంబగు బ్రహ్మానన్దము ననుభవించుటయును ఫలమని అనుభవజ్ఞులగు బ్రహ్మవిదులు వచించుచున్నారు.

శ్లో॥ యోఽహం మమేత్యాద్య సదాత్మగాహో
గ్రన్థిర్లయం యాతి సవాసనామయః,
సమాధినా నశ్యతి కర్మబంధో
బ్రహ్మాత్మబోధోఽప్రతిబన్ధ ఇష్యతే. ౮౯౫

తా॥ మఱియు నీ సమాధివట్కము ననుష్ఠించుటచే దేహేన్ద్రియాదులందుగల 'నేను' 'నాది' యను నభిమాన గ్రన్థి విడిపోవుచున్నది. శ్రోత్రజన్మమును గలిగించెడి కర్మబన్ధములన్నియు నశించుచున్నవి. ప్రతిబన్ధ రహితమగు జీవబ్రహ్మైక్య జ్ఞానమును గలుగుచున్నది.

శ్లో॥ ఏష నిష్కంటకః పన్థాః ముక్తేర్బ్రహ్మాత్మనా స్థితేః,
శుద్ధాత్మనాం ముముక్షూణాం యత్సదేకత్వ దర్శనమ్.

తా॥ శుద్ధచిత్తులగు ముముక్షువులకు 'జీవుడు బ్రహ్మకంటె భిన్నుడు కాడు' అను సపరోక్షజ్ఞానమే బ్రహ్మస్వరూపమగు మోక్షప్రాప్తికి కంటకములు లేని రహదారి మార్గ మగుచున్నది.

శ్లో॥ తస్మాత్త్వం చాప్యప్రమత్తస్సమాధీన్
కృత్వా గ్రన్థిం సాధునిర్దహ్య యుక్తః,
నిత్యం బ్రహ్మానన్దపీయూషసిన్ధౌ
మజ్జన్ క్రీడన్ మోదమానో రమస్వ. ౮౯౭

తా॥ కావున పండితుడవగు నో శిష్యా! నీవు గూడ ప్రమాదమెంతమాత్రమును లేనివాడవై పూర్వోక్తములగు నాఱు సమాధులను బాగుగా నాచరించి, దేహేన్ద్రియాద్యభిమానమను ముడిని త్రెంచివైచి

నిశ్చల చిత్తుడవై నిరంతరమును బ్రహ్మానందమను నమృత సముద్రము నందు మునిగి తేలుచు సాటిలేని సుఖము ననుభవింపుము.

శ్లో॥ నిర్వికల్పసమాధిర్యా వృత్తి ర్నైశ్చల్య లక్షణా,
తమేవ యోగ ఇత్యాహుర్యోగ శాస్త్రార్థకోవిదాః.

తా॥ బ్రహ్మాకారమును జెందిన నిశ్చల చిత్తవృత్తియే నిర్వికల్ప సమాధియగునని వెనుక వర్ణింపబడినది. ఇట్టి నిర్వికల్పసమాధినే పాతంజల యోగశాస్త్రజ్ఞులు 'యోగ' మని వ్యవహరించుచున్నారు.

శ్లో॥ అష్టాంగాని యోగస్య యమో నియమ ఆసనమ్
ప్రాణాయామ స్తథా ప్రత్యాహారశ్చాఽపిచ ధారణా,
ధ్యానం సమాధి రిత్యేవ నిగదన్తి మనీషిణః. ౮౯౯

తా॥ అట్టి యోగమునకు యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధియనను నెనిమిది యంగములుగలవని యోగశాస్త్రవిదులు వచించుచున్నారు.

శ్లో॥ సర్వం బ్రహ్మేతి విజ్ఞానా దిన్ద్రియగ్రామ సంయమః,
సజాతీయ ప్రవాహశ్చ విజాతీయ తిరస్కృతిః. ౯౦౦
యమోఽయమితిసంప్రోక్తోఽభ్యసనీయోముహుర్ముహుః.

తా॥ శాస్త్రాచార్యోపదేశ జనితమగు "సకల ప్రపంచంబును బ్రహ్మమే" యను నిశ్చయజ్ఞానమువలన ఇన్ద్రియముల నా యా విషయ భోగములనుండి మరలింపజేసి, మనస్సునందలి ప్రాపంచిక వృత్తుల నన్నింటిని లయింపజేసి బ్రహ్మాకార మనోవృత్తి నావృత్తిజేయుచుండుటయే యమ మనబడుచున్నది. దీనిని ముముక్షువులు నిరన్తర మభ్యసించుచుండ వలయును.

శ్లో॥ నియమోహి పరానన్దో నియమాత్క్రియతే బుధైః,
సుఖేనైవ భవేద్యస్మా దజస్రం బ్రహ్మచిన్తనమ్. ౯౦౨

తా॥ దేనివలన(ఏనియమమువలన) శ్రమలేకయే బ్రహ్మస్వరూపము మననము జేయ వీలగుచున్నదో దేనిని నిరంతర మభ్యసించుటవలననే పండితులగు ముముక్షువులు తుదకు బ్రహ్మానందమును గూడ బొందుచున్నారో అదియే నియమ మనబడుచున్నది.

శ్లో॥ ఆసనం తద్విజానీయా దితర త్సుఖనాశనమ్,
చిత్తాది సర్వభావేషు బ్రహ్మత్వేనైవ భావనాత్. ౧౦౩

తా॥ ప్రపంచము నందలి పదార్థము లన్నియు బ్రహ్మముకంటె భిన్నసత్తాకములుగావని నిశ్చయించుటవలన, చిత్తము బ్రహ్మస్వరూపము నందు స్థిరముగానుండుటయే ముఖ్యమగు సుఖకరమైన యాసనముగాని, మత్స్యము, కూర్మము, స్వస్తికము మొన్నగు నాసనములు మాత్రము శ్రమముచే సాధింప దగిన వగుటచే నత్యంత దుఃఖప్రదములగుచున్నవి.

శ్లో॥ నిరోధ స్సర్వవృత్తీనాం ప్రాణాయామ స్సఉచ్యతే,
నిషేధనం ప్రపంచస్య రేచకాఖ్య సమీరణః. ౧౦౪
బ్రహ్మైవాఽస్మీతి యావృత్తిః పూరకో వాయు రీరితః,
తత స్తద్వృత్తినైశ్చల్యం కుంభకః ప్రాణసంయమః
అయం చాఽపి ప్రబుద్ధానా మజ్ఞానాం ప్రాణపీడనమ్.

తా॥ చిత్తవృత్తుల నన్నింటిని నరికట్టుటయే ప్రాణాయామ మగుచున్నది. ఇయ్యది రేచకము—పూరకము—కుంభకము నని మూడు విధములు. అందు ప్రపంచము నంతయు నిది బ్రహ్మస్వరూపము గాదని నిరాకరించుట రేచకము. "బ్రహ్మమే నే నగుచున్నా" నను బుద్ధివృత్తి పూరకము. పిమ్మట నా బ్రహ్మాకారమనోవృత్తి నిశ్చలముగా నుండుటయే కుంభకము. ఇట్టి ప్రాణాయామము జ్ఞాననిష్ఠులగు పండితులకు మాత్రమే విహితమై యున్నది. ఇక నవివేకులకు మాత్రము - బాహ్యవాయువును పదియారు చిటికల కాలము లోపలకు పీల్చుట పూరకమనియు, పీల్చినవాయువును

అరువది నాల్గు చిటికల కాలము లోపల నిలుపుట కుంభకమనియు, ఆ వాయువును ముప్పదిరెండు చిటికల కాలములో తిరిగి వెలుపలకు విడచుట రేచకమనియు యోగశాస్త్రమున జెప్పబడిన విధమున ప్రాణ వాయువును పీండిచుటనే ప్రాణాయామమునుగా జెప్పుచున్నారు.

శ్లో॥ విషయే ష్వాత్మతాం త్యక్త్వా మనస శ్చితిమజ్జనమ్,
ప్రత్యాహార స్సవిజ్ఞేయోఽ భ్యసనీయో ముముక్షుభిః.

తా॥ దేహేన్ద్రియాదులందుగల 'నేను'ను భావమును నాదియను భావమును విడిచి మనస్సు బ్రహ్మమునందు మునింగియుండుట ప్రత్యాహార మగుచున్నది, దీనిని ముముక్షుజనులు నిరన్తర మభ్యసించుచుండ వలయును.

శ్లో॥ యత్రయత్ర మనోయాతి బ్రహ్మణ స్తత్ర దర్శనాత్,
మనసో ధారణంచైవ ధారణా సా పరామతా. ౯౦౭

తా॥ మనస్సు స్వభావవశమున నేయే విషయములందు ప్రసరించుచుండునో ఆ యా విషయము లన్నింటియందును తదాధారమగు సద్రూపమైన పరబ్రహ్మమును గాంచుటవలన మనస్సునకు గలిగెడి స్థైర్యమే ధారణయనబడుచున్నది.

శ్లో॥ బ్రహ్మైవాఽస్మీతి సద్వృత్త్యా నిరాలంబతయా స్థితిః,
ధ్యానశబ్దేన విఖ్యాతా పరమానన్దదాయినీ. ౯౦౮

తా॥ బుద్ధివృత్తి - ప్రాపంచికములగు విషయాన్తరముల నవలంబింపక బ్రహ్మైకాకారముతో నుండుటయే ధ్యానమనబడుచున్నది ఇట్టి ధ్యానము బ్రహ్మానన్దప్రద మగుచున్నది.

శ్లో॥ నిర్వికారతయా వృత్త్యా బ్రహ్మాకారతయా పునః,
వృత్తివిస్మరణం సమ్యక్ సమాధి ర్ధ్యానసంజ్ఞితః. ౯౦౯

తా॥ నిర్వికారుడై బ్రహ్మాకారమగు నంతఃకరణవృత్తితో బ్రహ్మస్వరూపము జెందియున్న వాడగుటచే మరల "నే నిప్పుడీవృత్తితో నున్నాడ"నను వృత్తిని కూడ మరచియుండుటయే యోగాంగ సమాధి యగుచున్నది. ఇయ్యది సమ్యగ్ధ్యానమని గూడ వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ సమాధావ్క్రియమాణేతువిఘ్నా హ్యాయాన్తి వైబలాత్,
అనుసంధాన రాహిత్యం మాలస్యం భోగలాలసమ్.
భయంతమశ్చవిక్షేపస్తేజస్స్పన్దశ్చశూన్యతా,
ఏవం యద్విఘ్నబాహుళ్యంత్యాజ్యంతద్బ్రహ్మవిజ్ఞనైః.

తా॥ ఇట్టి యష్టాంగ సమేతమగు సమాధి నాచరించునప్పుడు విఘ్నము లనేక లు బలాత్కారముగా వచ్చిపడుచుండును - అవి యేవనగా - ఆత్మానుసంధానము లేకుండుట, చురుకుదనము లేకుండుట, విషయభోగములం దాసక్తి గలుగుట, ఇటుపై నేమగుదునో యని భయముగలుగుట, ఏమిచేయవలయునో యది తోచకుండుట, చిత్తమునం దనేక వృత్తులు పుట్టుచుండుట, వీర్యస్ఖలనమగుట, ధ్యానింపదగిన స్వరూపము స్ఫురింపకుండుట" యున్నగునవి. ఈ విఘ్నముల నన్నిటిని యత్నముతో పరిహరించుకొనవలయును.

శ్లో॥ విఘ్నా నేతా న్పరిత్యజ్య ప్రమాదరహితో వశీ,
సమాధినిష్ఠయా బ్రహ్మ సాక్షాద్భవితు మర్హసి. ౯౧౨

తా॥ కావున నో శిష్యా! నీవును పూర్వోక్తములగు విఘ్నముల నన్నిటి బాఱ ద్రోలి నిశ్చలుండవును జితేన్ద్రియుండవునై సమాధినిష్ఠచే సాక్షాద్బ్రహ్మస్వరూపుడవుగా దగియున్నావు.

శ్లో॥ ఇతిగురువచనా చ్ఛ్రుతి ప్రమాణాత్
పరమనగమ్య సతత్త్వ మాత్మయుక్త్యా,

ప్రశమితకరణ స్సమాహితాత్మా
క్వచి దచలాకృతి రాత్మనిష్ఠితోఽభూత్. ౯౧౩

తా॥ ఈ విధమున శిష్యుడు శ్రుతిమూలకంబులగు గురువచనముల వలన నిజతత్త్వము నెరిగి పిమ్మట స్వస్వరూపధ్యానముచే జితేన్ద్రియుండును వశీకృత చిత్తుండునునై యొకానొకచోట నాత్మనిష్ఠను బొంది నిశ్చల రూపుడాయెను.

శ్లో॥ బహుకాలం సమాధాయ స్వస్వరూపేతు మానసమ్,
ఉత్థాయ పరమానన్దా ద్గురు మేత్య పున ర్ముదా,
ప్రణామపూర్వకం ధీమాన్ సగద్గద మువాచహ. ౯౧౪

తా॥ ఈ విధముగా బుద్ధిమంతుడగు నా శిష్యుడు తన మనస్సును సమాధిచే స్వస్వరూపంబైన పరబ్రహ్మమునందు చిరకాలము నిలిపి సమాధినుండి లేచినవాడై బ్రహ్మానన్దానుభవజన్య సంతోషముచే మరల గురుని కడకు జేరి నమస్కరించి ఆనన్దబాష్పములతో నొక వాక్యము బలికెను.

శ్లో॥ నమోనమస్తే గురవే నిత్యానన్దస్వరూపిణే,
ముక్తసంగాయ శాన్తాయ త్యక్తాఽహంతాయ తే నమః
శ్లో॥ దయాధామ్నే నమో భూమ్నే మహిమ్నః పారమస్య తే,
నైవాఽస్తి యత్కటాక్షేణ బ్రహ్మైవాభవ మద్వయమ్.

తా॥ స్వామీ! బ్రహ్మతత్త్వము నుపదేశించి నా యజ్ఞానమును నశింపజేసిన గురువగు నీకు నమస్కారము. మరియు బ్రహ్మస్వరూపుండవును సంసారసంగవర్జితుండవును శాంతుడవును, దేహాద్యభిమానరహితుడవును నగు నీకొఱకు నమస్కారము. ఓ గురూత్తమా! నేను తమ యనుగ్రహ విశేషమున సాక్షాద్బ్రహ్మస్వరూపుండనైతిని గాన తమ.

మహిమాతిశయమును నే వర్ణింపజాలను. అందుచే దయా సముద్రులగు తమకు ననేక వందనము లర్పించుచున్నాను.

శ్లో॥ కిం కరోమి క్వగచ్ఛామి కిం గృహ్ణామి త్యజామి కిమ్,
యన్మయా పూరితం విశ్వం మహాకల్పాంబునా యథా.

తా॥ గురువర్యా! ఇప్పుడు నా స్వరూపము నేమని వర్ణింపగలను! తమ యనుగ్రహాలబ్ధమగు జ్ఞాననిష్ఠచే నా స్వస్వరూప మభివ్యక్తమైనది. ప్రళయకాలమునందు మహాజలప్రవాహములచే ప్రపంచమంతయు నింపబడినట్లుగా నా నిజమగు బ్రహ్మస్వరూపముచే నీ జగమంతయు వ్యాపింపబడినది. అందుచే నేనిప్పుడేమి చేయుదును? ఎక్కడకు బోదును. ఏ వస్తువును పరిగ్రహింతును! దేని పరిత్యజింతును! నాకంటె నన్యమగున దెద్దియు లేమింజేసి దేనిని జేయజాలకున్నాను. అజ్ఞాన దశయందు కల్పితములగు దేహేంద్రియాదులందలి యభిమానముతో పరిచ్ఛిన్నరూపుడగు జీవుడు సకల కార్యములు జేయ సమర్థుడగుచున్నాడు. సద్గురూపదిష్టమగు జ్ఞాననిష్ఠచే స్వకీయ బ్రహ్మస్వరూపము నొందిన వానికి నేని క్రియయు సంభవింపనేరదని భావము.

శ్లో॥ మయిసుఖబోధపయోధౌ
మహతి బ్రహ్మాండ బుద్బుదసహస్రమ్,
మాయామయేన మరుతా
భూత్వాభూత్వా పున స్తిరోధత్తే. ౯౯౫

తా॥ మరియు సచ్చిదానందరూపంబగు నా నిజమైన సర్వవ్యాపక బ్రహ్మస్వరూపమను మహాసముద్రమునందు మాయ యను పెనుగాలిచే వేలకొలది బ్రహ్మాండములను నీటి బుడగలు పుట్టుచు లయించుచు నున్నవి.

శ్లో॥ నిత్యానన్దస్వరూపో ఽహం మాత్మాహంత్వదనుగ్రహాత్,
పూర్ణో ఽహం మనవద్యో ఽహం కేవలో ఽహంచసద్గురో!

శ్లో॥ అకర్తాఽహ మభోక్తాఽహ
మవికారోఽహ మక్రియః,
ఆనన్దఘనవి వాఽహ
మసంగోఽహం సదాశివః. ౯౨౦

తా॥ ఆచార్యవర్యా! నేను తమ ప్రసాదమువలన నిరన్తరానన్ద రూపుండను, సర్వవ్యాపకుడను, కర్తృత్వభోక్తృత్వాది సకల సంసార ధర్మవర్జితుండను, అద్వితీయుండను, సచ్చిదానన్ద బ్రహ్మస్వరూపుండను నైతిని.

శ్లో॥ త్వత్కటాక్ష వరచన్ద్ర చన్ద్రికా
పాతధూత భవతాపజశ్రమః,
ప్రాప్తవా నహ మఖండ వైభవా
నన్ద మాత్మపద మక్షయం క్షణాత్. ౯౨౧

తా॥ మరియు నో దేశికేన్ద్ర! నేను తమ క్రీగంటి ప్రసార మనెడి శరత్కాల పూర్ణిమా చంద్రుని వెన్నెలచే నివారింపబడిన నిఖిల సంసార తాపములు గలవాడనై యచిరకాలముననే నా నిజరూపంబగు శాశ్వత బ్రహ్మానన్దము బడసినాడను.

శ్లో॥ ఛాయయా స్పృష్టముష్ణం వా శీతంవా దుష్టుసుష్టువా,
నస్పృశత్యేవ యత్కించిత్పురుషంతద్విలక్షణమ్ ౯౨౨

శ్లో॥ న సాక్షిణం సాక్ష్యధర్మాః స్పృశన్తిహి విలక్షణమ్,
అవికార ముదాసీనం గృహధర్మాః ప్రదీపవత్. ౯౨౩

తా॥ ఆత్మకు సంసారధర్మములు సంక్రమించవనుటకు దృష్టాన్తము చెప్పబడుచున్నది—శరీరము నడచి పోవునప్పుడు దానినీడ రొండయందు గాని నీడయందుగాని, మంచిచెడుగు ప్రదేశములందుగాని పడినచో నా

యొంటి మున్నగు వానివలన గలుగు గుణదోషము లెంతమాత్రమును శరీరమునకు సంబంధింపకున్నవి మరియు రాత్రులందు దీపము ప్రకాశించుచుండగా నింటిలో నెన్నిదోషములు చేయబడుచున్నను నాపము లెవ్వియు దీపమునకు సంక్రమింపకున్నవి. ఈవిధముననే ఆత్మస్వరూపజ్యోతిస్సుచే భాసింప చేయబడుచున్న బుద్ధీన్ద్రియ శరీరాదులయొక్క ధర్మములగు కర్తృత్వభోక్తృత్వాదులు గాని, జన్మజరామరణాదులుగాని యాత్మకు సంభవింపకున్నవి.

శ్లో॥ రవే ర్యథా కర్మణి సాక్షిభావో,
వహ్నే ర్యథా వాఽఽయసి దాహకత్వమ్,
రజ్జో ర్యథాఽఽరోపితవస్తుసంగః
తథైవ కూటస్థ చిదాత్మనో మే. ౯౨౮

తా॥ మరియు నో గురూత్తంసమా! లోకులుచేయు కర్మములన్నిటికిని సూర్యుడు సాక్షిమాత్రుడుగా నున్నాడే కాని వారి పుణ్యపాపములతో తానెంతమాత్రమును సంబంధింప కున్నాడు. అగ్నిహోత్రుడు ఇనుమును దహింపజేయు చున్నాడుగాని ఇనుముయొక్క సమ్మెట దెబ్బలతోగాని, తదాకార విశేషములతోగాని తాను వికారము నొందకున్నాడు. త్రాటియందు కల్పింపబడిన సర్పాదులయొక్క విషము మున్నగున వెవ్వియు త్రాటికి సంక్రమింపకున్నవి. ఆ విధముననే దేహేన్ద్రియాది ప్రపంచమున కంతకును భాసకుడనైయున్న సచ్చిదానన్ద బ్రహ్మస్వరూపుడనగు నాకు దేహాదులయొక్క ధర్మము లెంత మాత్రము నంటకున్నవి.

శ్లో॥ ఇత్యుక్త్వా సగురుం స్తుత్వా ప్రశ్రయేణ కృతానతిః,
ముముక్షో రుపకారాయ ప్రష్టవ్యాంశ మపృచ్ఛత.

తా॥ శిష్యుడీ రీతిగా తన బ్రహ్మానుభవము నంతయు జెప్పి గురువు ననేక విధముల గొనియాడి వినయముతో తిరుగ భక్తిపూర్వకంబుగ

సాష్టాంగవందనం బాచరించి ముముక్షువులకు తెలియదగిన మరియొక విషయము నడిగెను.

శ్లో॥ జీవన్ముక్తస్య భగవ న్ననుభూతేశ్చ లక్షణమ్,
విదేహముక్తస్యచ మే కృపయా బ్రూహి తత్త్వతః.

తా॥ భగవద్రూపుడవగు నో యాచార్యవర్యా! తమరు నాకు దయతో జీవన్ముక్తునియొక్కయు, విదేహముక్తునియొక్కయు, వారిరువురి యనుభవముయొక్కయు స్వరూపమును జెప్పగోరుచున్నాను.

శ్లో॥ వక్ష్యే తుభ్యం జ్ఞానభూమి
కాయాలక్షణ మాదితః,
జ్ఞాతే యస్మిన్ త్వయా సర్వం
జ్ఞాతం స్యా త్స్వప్న మద్యయత్. ౯౨౬

తా॥ అంతట గురువిట్లనియె—నాయనా! నీకు ముందుగా జ్ఞానభూమికాలక్షణము జెప్పెద వినుము—అది తెలిసినచో నీవిప్పుడు నన్నడిగిన దంతయు చక్కగా దెలియును.

శ్లో॥ జ్ఞానిభూమి శ్శుభేచ్ఛాస్యా త్ప్రథమా సముదీరితా,
విచారణా ద్వితీయాతు తృతీయా తనుమానసా. ౯౨౭
సత్వాపత్తి శ్చతుర్థీస్యా త్తతోఽ సంసక్తినామికా,
పదార్థాఽ భావనాషష్ఠీ సప్తమీ తుర్యగాస్మృతా.

తా॥ జ్ఞాన భూమికలు సప్తసంఖ్యాకములు. అందు శుభేచ్ఛ మొదటిది. విచారణ రెండవది తనుమానస మూడవది. సత్వాపత్తి నాల్గవది. అసంసక్తి యైదవది. పదార్థాభావన యారవది. తుర్యగ యేడవది. వీనియొక్క లక్షములు రాబోవు శ్లోకములలో చెప్పబడుచున్నవి.

శ్లో॥ స్థితః కిం మూఢఏవాస్మి ప్రేక్ష్యేఽహం శాస్త్రసజ్జనైః,
వైరాగ్య పూర్వమిచ్ఛేతి శుభే చ్ఛేత్యుచ్యతే బుధైః.

తా॥ అందు శుభేచ్ఛయన— "నేను మనుష్యుడనై, బ్రాహ్మణుడనై, పురుషుడనై యుండి కూడ పశుపక్ష్యాదులవలె విషయసుఖములను మాత్రమె యనుభవించుచు వివేకహీనుడనై యున్నాడనేమి ? ఛీ ! నాజీవితమంతయు వ్యర్థమైపోయినది. మంచిపని యొక్కటియు జేయలేదు. కనుక నిప్పటినుండియైనను దప్పక శాస్త్రముల జదువుకొని సత్పురుషుల సాంగత్యము జేసి వారి యనుగ్రహమువలన నా నిజమగు బ్రహ్మస్వరూపమును దెలిసికొందును." అను మోక్షరూప శ్రేయోదాయకమగు శుభవాంఛయే శుభేచ్ఛ యనబడుచున్నది.

శ్లో॥ శాస్త్రసజ్జనసంపర్క వైరాగ్యాఽభ్యాస పూర్వకమ్,
సదాచారప్రవృత్తిర్యా ప్రోచ్యతే సా విచారణా. ౯౩౧

తా॥ సద్గురువుల యొద్ద వేదాన్త శాస్త్రము నభ్యసించుచు, సత్పురుషుల సహవాసమును వారి శుశ్రూషయు జేయుచు విషయము లందు దోషదృష్టిచే వైరాగ్యమును వృద్ధిపొందించుకొనుచు, మహానుభావుల నడత ననుసరించి ప్రవర్తించుచుండుటయే విచారణ యనబడును.

శ్లో॥ విచారణా శుభేచ్ఛాభ్యా మిన్ద్రియార్థే ష్వరక్తితః,
యత్ర సా తనుతా మేతి ప్రోచ్యతే తనుమానసా. ౯౩౨

తా॥ పూర్వమందు చెప్పబడిన శుభేచ్ఛ – విచారణ యను నీ రెండు భూమికల నభ్యసించుటచే రూపాది విషయములందు విరక్తి గలిగి మనస్సునందలి విషయవాసనలన్నియు నశించిపోవుట వలన మనస్సు క్షీణించుచున్నది. అందుచే నీ తృతీయ భూమిక తనుమానస యనబడుచున్నది.

శ్లో॥ భూమికాత్రితయాఽభ్యాసా చ్చిత్తేఽర్థ విరతే ర్వశాత్,
సత్త్వాత్మని స్థితి శ్శుద్ధే సత్త్వాపత్తి రుదాహృతా. ౯౩౩

తా॥ శుభేచ్ఛ – విచారణ – తనుమానస – అను నీ మూడు భూమికల ననుష్ఠించుటవలన, చిత్తమునందలి విషయసంస్కారము లన్నియు నశించి చిత్తము సద్రూపంబగు శుద్ధ బ్రహ్మమునందు నిలిచియుండుటయే. సత్త్వాపత్తియను నాల్గవభూమిక యగుచున్నది.

శ్లో॥ దశా చతుష్టయాఽభ్యాసా దసంసర్గ ఫలేన చ,
రూఢసత్త్వ చమత్కారా ప్రోక్తాఽ సంసక్తినామికా.

తా॥ ఇంతవఱకు చెప్పబడిన – శుభేచ్ఛ – విచారణ – తను మానస – సత్త్వాపత్తి – అను నాల్గుభూమికల నాచరించుటవలనను మాయతోడను, తత్కార్యమగు ప్రపంచముతోడను సంబంధము నశించి దృఢమైన బ్రహ్మసాక్షాత్కారము గలుగుచున్నది. ఇట్టి దశయే అసంసక్తియను పేరుగల పంచమభూమిక యగును.

శ్లో॥ భూమికా పంచకాఽభ్యాసాత్
స్వాత్మారామతయా భృశమ్,
అభ్యన్తరాణాం బాహ్యానాం
పదార్థానా మభావనాత్. ౯౩౫

శ్లో॥ పరప్రయుక్తేన చిరప్రయత్నేనాఽ వబోధనమ్,
పదార్థాభావనా నామ షష్ఠీ భవతి భూమికా. ౯౩౬

తా॥ పూర్వోక్తములగు నైదు భూమికల ననుష్ఠించుటవలన నిశ్చలమైన యాత్మనిష్ఠ లభించుచున్నది. అంతట బాహ్యములగు ఘటపటాది పదార్థములనుగాని, లోపలనుండు మనోవృత్తులనుగాని స్మరింపకున్నవాడగుటచే సమీపముననున్న శిష్యులు మున్నగు వారివలన చిరకాలము

బోధింపబడి పిమ్మట భిక్షాస్వీకారాది దేహకృత్యముల నాచరించుట యేది కలదో అట్టి స్థితియే పదార్థాఽభావన యని ప్రసిద్ధికెక్కిన యాఱవ జ్ఞానభూమిక యగుచున్నది

శ్లో॥ షడ్భూమికా చిరాఽభ్యాసాత్
ద్వైతస్యాఽనుపలంభనాత్,
యత్స్వభావైక నిష్ఠత్వం
సా జ్ఞేయా తుర్యగాగతిః. ౯౩౭

తా॥ వెనుక వర్ణింపబడిన యాఱు భూమికల నభ్యసించుటవలన పరప్రయత్నముచేగూడ నెంతకాలమునకైనను దేహేంద్రియాది ప్రపంచము గోచరింపక స్వస్వరూపంబైన సచ్చిదానన్ద పరబ్రహ్మమున జేరి యుండు టయే తుర్యగ యను నామముగల యేడవ జ్ఞానభూమిక యగుచున్నది.

శ్లో॥ ఇదంమమేతిసర్వేషుదృశ్యభావేష్వభావనా,
జాగ్రజ్జాగ్రదితిప్రాహుర్మహాన్తోబ్రహ్మవిత్తమాః. ౯౩౮

తా॥ ఇటుపై ముముక్షువులచే నభ్యసింప దగిన కొన్ని యవస్థా విశేషములు చెప్పబడుచున్నవి. వానిలో జాగ్రజ్జాగ్రదవస్థ యెట్లన — మానవులు జాగ్రదవస్థయందు ఘటము, పటము, మఠము, శరీరము మున్నగు పదార్థములను ఇవి 'నావి' అని భావించుచున్నారు. ఇట్టి భావన లేకుండుటయే జాగ్రజ్జాగ్రద్దశ యనబడునని బ్రహ్మవిదులు వచించు చున్నారు.

శ్లో॥ విదిత్వా సచ్చిదానన్దే మయి దృశ్యపరం పరామ్,
నామరూప పరిత్యాగో జాగ్రత్స్వప్న స్సఈరితః. ౯౩౯

తా॥ ప్రపంచమునందు సత్తు-చిత్తు-ఆనన్దము-నామము-రూపము అనున వైదు భాసించుచున్నవి. వీనిలో సచ్చిదానన్దములు మూడును

బ్రహ్మస్వరూపములు. నామరూపములు రెండును జగత్స్వరూపములు. ఇట్టియెడ సచ్చిదానన్ద బ్రహ్మస్వరూపుడనగు నాయందు (జీవునియందు) నామరూపాత్మకమగు జగత్తంతయు మాయచే కల్పింపబడినదని గ్రహించి నామరూపములను పరిత్యజించుటయే జాగ్రత్స్వప్న మనబడును.

శ్లో॥ పరిపూర్ణచిదాకాశేమయిబోధాత్మతాం వినా,
నకించి దన్యద స్తీతి జాగ్రత్సుప్తి స్సమీర్యతే. ౯౮౦

తా॥ ఆకాశమువలె సర్వవ్యాపకుడను, స్వయంప్రకాశమానుడను' బ్రహ్మస్వరూపుడనునైన నాయందు జ్ఞానము తప్ప మరియొక టేమియు లేదని భావించుటయేది కలదో అదియే జాగ్రత్సుప్తి యగుచున్నది.

శ్లో॥ మూలాఽజ్ఞాన వినాశేన కారణాభాసచేష్టితైః,
బన్ధో నమేఽతి స్వల్పోఽపి స్వప్నజాగ్ర దితీర్యతే ౯౮౧

తా॥ సంసారమున కంతకును మూలకారణమజ్ఞానము. ఇట్టియజ్ఞానము బ్రహ్మజ్ఞానముచే నశించినను దాని కార్యములగు దేహేన్ద్రియాదులు మాత్రము వస్త్రము దగ్ధమైనను దాని యాభాస కొంతకాల ముండునట్లు ప్రారబ్ధము నశించు పర్యన్తము వ్యాపారముల జేయుచుండును. ఇట్టియెడ దేహేన్ద్రియాది వ్యవహారములచే నా కెంతమాత్రమును సంసారబన్ధము లేదని తలంచుటయే స్వప్నజాగ్రత్తనబడుచున్నది.

శ్లో॥ కారణా ఽజ్ఞాననాశాద్య ద్ద్రష్టృదర్శన దృశ్యతా,
నకార్య మస్తి తజ్జ్ఞానం స్వప్నస్వప్న స్సమీర్యతే.

తా॥ ప్రపంచ వ్యవహారమున కంతకును కారణమగు నజ్ఞానము నశించుటం జేసి దాని కార్యమగు చూచువాడు – చూచుట – చూడబడు నది–ఈ మొదలగు త్రిపుటియంతయు గూడ నివర్తించినదనియెడు జ్ఞానమే స్వప్నస్వప్న మనబడుచున్నది.

శ్లో॥ అతిసూక్ష్మ విమర్శేన స్వధీ వృత్తి రచంచలా,
విలీయతే యదా బోధే స్వప్నసుప్తి రితీర్యతే. ౯౮౩

తా॥ అతిసూక్ష్మమగు నాత్మస్వరూపమును బాగుగా విచారించుటచే బుద్ధివృత్తి నిశ్చలమైనదై జ్ఞానరూపంబగు బ్రహ్మమునం దెప్పుడు చేరి (విలయమునొంది) యుండునో అట్టి స్థితియే స్వప్నసుప్తియనబడుచున్నది.

శ్లో॥ చిన్మయాకార మాత్రోయో ధీవృత్తి ప్రసరై ర్గతః,
ఆనన్దానుభవో విద్వన్ సుప్తి జాగ్ర దితీర్యతే. ౯౮౪

తా॥ బ్రహ్మకారమును జెందిన బుద్ధివృత్తులచే లభింపబడిన యాత్మానన్దానుభవ మెద్దికలదో యదియే, ఓ పండితుడా! సుప్తి జాగ్రత్తని వ్యవహరింపబడుచున్నది.

శ్లో॥ వృత్తౌ చిరానుభూతాన్త రానన్దానుభవస్థితౌ,
సమాత్మతాం యో యాత్యేవ సుప్తిస్వప్న ఇతీర్యతే.

తా॥ బ్రహ్మకారితమగు నంతఃకరణవృత్తిచే సర్వాన్తరమైన యాత్మానన్దమును చిరకాల మనుభవించుచుండునట్టి యవస్థయే సుప్తిస్వప్నమనబడును.

శ్లో॥ దృశ్యధీ వృత్తిరేతస్య కేవలీభావ భావనా,
పరంబోధైకతా వాప్తి సుప్తిసుప్తి రితీర్యతే. ౯౮౬

తా॥ ఏ యవస్థయందు జీవబ్రహ్మైక్యభావనగల జ్ఞానియొక్క బుద్ధివృత్తి జ్ఞానస్వరూపంబగు బ్రహ్మముతో నైక్యము నొందియుండునో, ఆ యవస్థయే సుప్తిసుప్తి యని చెప్పబడుచున్నది.

శ్లో॥ పరబ్రహ్మ వదాభాతి నిర్వికారైక రూపిణీ,
సర్వావస్థాసు ధారైకా తుర్యాఖ్యా పరికీర్తితా. ౯౮౭

తా॥ తైలధారవలె జాగ్రస్స్వప్న సుషుప్తిదశ లన్నిటియందు నేకరూపమైన నిర్వికార బ్రహ్మస్వరూపము జెంది పచ్ఛిదానంద పర బ్రహ్మంబువలె భాసించుచున్న బుద్ధివృత్తియే 'తుర్య' లేక చరమవృత్తి యనబడుచున్నది.

శ్లో॥ ఇత్యవస్థా సముల్లాసం విమృశన్ ముచ్యతే సుఖీ. ౯౪౮

శ్లో॥ శుభేచ్ఛాది త్రయం భూమిభేదాఽభేద యుతం స్మృతమ్,
యధా వద్భేదబుద్ధ్యేదం జగజ్జాగ్ర దితీర్యతే. ౯౪౯

శ్లో॥ అద్వైతే స్థైర్యమాయాతే ద్వైతేచ ప్రశమం గతే,
పశ్యన్తి స్వప్నవల్లోకం తుర్యభూమి సుయోగతః. ౯౫౦

శ్లో॥ పంచమీం భూమి మారుహ్య సుషుప్తిపదనామికామ్.
శాన్తాశేష విశేషాంశ స్తిష్ఠే దద్వైత మాత్రకే. ౯౫౧

శ్లో॥ అన్తర్ముఖతయా నిత్యం షష్ఠీం భూమి ముపాశ్రితః,
పరిశ్రాన్తతయా గాఢ నిద్రాళు రివలక్ష్యతే. ౯౫౨

శ్లో॥ కుర్వ న్నభ్యాస మేతస్యాం
భూమ్యాం సమ్యగ్వివాసనః,
తూర్యావస్థాం సప్తమీంచ
క్రమా త్ప్రాప్నోతి యోగిరాట్. ౯౫౩

తా॥ ఇంతవరకు వర్ణింపబడిన యవస్థల నన్నింటిని బాగుగా విచారణచేసి యభ్యసించునట్టి యోగిపుంగవుడు శ్రమ యించుకంతయు నొందకయే జననమరణాత్మకంబగు సంసారబన్ధమునుండి విడుదల నొందు చున్నాడు. పూర్వోక్తములగు శుభేచ్ఛాది సప్తభూమికలలో శుభేచ్ఛ - విచారణ - తనుమానస - అను నీమూడును పరస్పరము కొలది భేదమును

కొలది యభేదమును గలిగియున్నవి. వీనియందుండు వారలకు బూర్వము వలెనె భేదబుద్ధి తొలగకుండును. ప్రపంచము యథాప్రకారము గోచరమగుచుండును. కావుననే నీ భూమికాశ్రయము జాగ్రదవస్థయని వ్యవహరింప బడుచున్నది. ఇక నాల్గవదియగు సత్త్వాపత్తి యను భూమిక నధిష్ఠించిన యోగులు 'సర్వము బ్రహ్మమే' యను భావముగలవారై ప్రపంచము నంతను స్వప్నమువలె బ్రహ్మమునందు కల్పితమైన దానినిగా జూచుచుందురు. అందుచే నీ భూమిక స్వప్నావస్థ యనబడుచున్నది. పిమ్మట నైదవదగు అసంసక్తి భూమికయం దుండువారలు సుషుప్తియందువలె లయించిన నిఖిలవిశేషములు గలవారలై 'నేను బ్రహ్మమునైతినను' అద్వైతభావముననే వసించుచుందురు. కాన నీ భూమిక సుషుప్త్యవస్థయని చెప్పబడుచున్నది. అంతట పదార్థాఽభావన యను నారవభూమిక నాశ్రయించినవారలు నిరంతరము నంతర్ముఖులగుట చేతను బ్రహ్మనిష్ఠారూపమగు కార్యభారముచే మిక్కిలి బడలినవారగుట చేతను నిద్రాశీలుర (నిదురపోతుల) వలె కన్పట్టుచుందురు. ఈభూమికయం దనవరతము బ్రయత్నము జేయువారు తమ యోగాగ్నిచే సకల సంసార వాసనల దహింపజేసికొని క్రమముగా తుర్యగ యను నేడవ భూమిక నొందినవారలై యోగిశ్రేష్ఠులన బ్రసిద్ధికెక్కుదురు.

శ్లో॥ విదేహముక్తి రేవాఽత్ర
తుర్యాతీత దశోచ్యతే,
యత్రనాఽసన్న సచ్చాఽపి
నాఽహం నాఽప్యనహం కృతిః.
కేవలక్షీణ మనన
ఆస్తేఽ ద్వైతేఽతి నిర్భయః. ౯౫౮

శ్లో॥ అన్తశ్శూన్యో బహిశ్శూన్యశ్శూన్యకుంభ ఇవాఽంబరే,
అన్తః పూర్ణో బహిః పూర్ణః పూర్ణకుంభ ఇవాఽర్ణవే.

తా॥ ఇక తుర్యాతీతదశ యనసేమనగా-యోగీశ్వరుడు ప్రారబ్ధాక్షీనమగు తనశరీరము నశించిన పిమ్మట విదేహముక్తుడై పరబ్రహ్మస్వరూపముతో నుండునట్టి స్థితియే తుర్యాతీతదశ యనబడుచున్నది. ఇట్టి దశయందు సంసార కారణమగు నజ్ఞానముగాని, దానికార్యములగు ఆకాశాది భూతములుగాని వానివలన బుట్టెడి బుద్ధీన్ద్రియ ప్రాణశరీరాదులుగాని యేమియు నుండవు. కావుననే విదేహముక్తుడగు పురుషుడు సర్వసంకల్ప శూన్యుండును, తనకు రెండవ దేమియు లేమింజేసి యత్యంత నిర్భయుండును నగుచున్నాడు. మరియు నాకాశమునందున్న వట్టికుండకులోపలను నేమియుండదు. వెలుపలను నేమియుండదు. అట్లే లోపలను వెలుపలను తన సచ్చిదానన్ద స్వరూపముకంటె నితరమేమియు లేనివాడు విదేహముక్తుడు. సముద్రము నందున్న పూర్ణకలశమునకు లోపలను వెలుపలను జలము మాత్రమేయుండును. అట్లే తానొక్కడే లోపలను వెలుపలను అంతటను వ్యాపించి యుండువాడు విదేహముక్తుడు. ఇట్టి విదేహముక్తుని స్థితియే తుర్యాతీతదశ యనబడును.

శ్లో॥ యథా స్థితమిదం సర్వం వ్యవహారవతోఽపి చ,
అస్తంగతం స్థితం వ్యోమ సజీవన్ముక్త ఉచ్యతే. ౫౪౬

తా॥ కృతార్థులైన జీవన్ముక్తులయొక్క లక్షణములు సాధకులగు ముముక్షువులకు ప్రయత్నముచే సాధింపబడ దగినవి గాన నిటుపైన 12 శ్లోకములందు జీవన్ముక్త లక్షణములు వర్ణింపబడుచున్నవి. ఎవనికి బాహ్య దృష్టిచే ప్రారబ్ధ కర్మము ననుసరించి లౌకిక వైదిక వ్యవహారము జరుగుచున్నను, అంతర్దృష్టిచే మాత్రము ప్రపంచమంతయు నాకాశమువలె స్వరూపము లేనిదిగా దోచుచుండునోవాడు బ్రతికి యుండగనే సంసార బన్ధమునుండి విడుదల నొందుచున్నాడుగాన జీవన్ముక్తుడనబడుచున్నాడు.

శ్లో॥ నోదేతి నాస్తమాయాతి సుఖదుఃఖే ముఖప్రభా,
యథాప్రాప్తస్థితి ర్యస్య సజీవన్ముక్త ఉచ్యతే. ౫౪౭

తా॥ ఎవనికి సుఖప్రాప్తియందు ముఖకాన్తి యధికమగుటగాని, దుఃఖావాప్తియందు ముఖకాన్తి క్షీణించుటగాని సంభవింపదో ఎవడు దైవదత్త పదార్థములచే జీవనమును గడపుకొనుచు నిరన్తరము చిరునగవుతోడనే గూడుకొని యుండునో వాడు జీవన్ముక్తు డనబడుచున్నాడు.

శ్లో॥ యో జాగర్తి సుషుప్తిస్థో యస్యజాగ్ర న్నవిద్యతే,
యస్య నిర్వాసనో బోధ స్సజీవన్ముక్త ఉచ్యతే. ౯౫౮

తా॥ ఎవడు తనపరిసరములందుండు వారలకు గాఢనిద్రయందున్న వాడువలె దోచుచున్నను తాను మాత్రము బ్రహ్మానందానుభవమున మేల్కాంచియే యుండునో ఎవనికి 'నేనుకర్త' ననెడిభావముతో నింద్రియములచే విషయముల ననుభవించుటయను జాగ్రద్వ్యవహారము లేకున్నదో మరియు నెవనికి ప్రపంచ వాసనా శూన్యంబగు నాత్మజ్ఞానము గలదో అతడు జీవన్ముక్తు డనబడుచున్నాడు.

శ్లో॥ రాగద్వేష భయాదీనా మనురూపం చరన్నపి,
యోఽన్త ర్వ్యోమవద త్యచ్ఛ స్సజీవన్ముక్త ఉచ్యతే.

తా॥ ఏపురుషుడు బాహ్యదృష్టిచే తన కనుకూలములగు స్వాహారాది పదార్థములు సంభవించినప్పుడు వానియందును రాగముతోడను, ప్రియవస్తువులు నశించి యప్రియవస్తువులు సంప్రాప్తములైనప్పుడు వానియందు ద్వేషముతోడను, సర్ప వృశ్చికాదులు కనబడినప్పుడుగాని కఱచినప్పుడుగాని వానివలన భయముతోడను గూడుకొనియున్నవానివలె దోచుచున్నను, చిత్తమునందు మాత్రము వికారమేమియు లేక ఆకాశమువలె అత్యన్త నిర్మలుడైయుండునో ఆ పురుషుడు జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ యస్య నాఽహంకృతో భావో బుద్ధి ర్యస్య నలిప్యతే,
కుర్వతోఽకుర్వతో వాఽపి సజీవన్ముక్త ఉచ్యతే.

తా॥ ఎవనికి శాస్త్రీయ కర్మముల నాచరించుచున్నను, ఆచరింపకున్నను, నేను కర్త ననెడి భావముగాని, కర్మఫలములందు వాంఛగాని లేకున్నదో వాడు జీవన్ముక్తుడనబడుచున్నాడు.

శ్లో॥ య స్సమస్తాఽర్థజాతేషు వ్యవహార్యపి శీతలః,
పదార్థేష్వపి పూర్ణాత్మా సజీవన్ముక్త ఉచ్యతే. ౯౬౧

తా॥ ఎవ్వడు సకల వ్యవహారముల నాచరించుచున్నప్పటికిని హృదయమునందు మాత్రము రాగద్వేషాదిరహితుడై యతి ప్రసన్నుడగుచున్నాడో, ఎవ్వడు సర్వపదార్థములందును నధిష్ఠానరూపుడనైయుంటి నను భావము గలిగి యున్నాడో వాడు జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ ద్వైతవర్జిత చిన్మాత్రే పదే పరమపావనే,
అక్షుబ్ధ శ్చిత్తవిశ్రాన్త స్సజీవన్ముక్త ఉచ్యతే. ౯౬౨

తా॥ ఎవ్వడు ప్రపంచభేదశూన్యంబును పరమ పవిత్రంబును నగు బ్రహ్మచైతన్యమునందే నిశ్చల చిత్తుడై నిలిచి యుండునో వాడు జీవన్ముక్తుడనబడును.

శ్లో॥ ఇదం జగదిదం సోఽయం దృశ్యజాత మవాస్తవమ్,
యస్య చిత్తే న స్ఫురతి సజీవన్ముక్త ఉచ్యతే. ౯౬౩

తా॥ ఇది ప్రపంచము, ఇవి ఘటపటాది పదార్థములు. ఇతడు నిన్న చూచినవాడు. అని యీ మొదలగు వ్యవహారమంతయూ నెవ్వని చిత్తమునందు గోచరింపకున్నదో వాడు జీవన్ముక్తుడనబడుచున్నాడు.

శ్లో॥ చిదాత్మాఽహం పరాత్మాఽహంనిర్గుణోఽహంపరాత్పరః,
ఆత్మమాత్రేణ య స్తిష్ఠేత్ సజీవన్ముక్త ఉచ్యతే.

తా॥ "నేను జ్ఞానస్వరూపుడను, నేను సత్త్వరజస్తమోగుణవర్జితుండను నేను నిఖిల జగముకంటె పరమగు మాయనుగూడ నతిక్ర

మించిన పరబ్రహ్మ స్వరూపుడను" అని యీ మొదలగు భావనతో యెవడు నిజరూపమునందే నిలిచియుండునో వాడు జీవన్ముక్తు డగుచున్నాడు.

శ్లో॥ దేహత్రయాతిరిక్తోఽహం శుద్ధచైతన్య మస్మ్యహమ్,
బ్రహ్మాఽహ మితి యస్యాఽన్తః సజీవన్ముక్త ఉచ్యతే.

తా॥ "నేను స్థూలసూక్ష్మ కారణములను మూడు శరీరములకంటె నత్యంత భిన్నుండను" "నేను మాయాసంబన్ధ రహితంబగు సచ్చిదానన్ద బ్రహ్మస్వరూపుండను" అను నిట్టి భావము ఎవ్వని హృదయమునందు సూచనగగలదో వాడు జీవన్ముక్తుడనఁబడుచున్నాడు.

శ్లో॥ యస్య దేహాదికం నాఽస్తి యస్య బ్రహ్మేతి నిశ్చయః,
పరమానన్ద పూర్ణో యః సజీవన్ముక్త ఉచ్యతే. ౯౬౬

తా॥ ఎవ్వనిదృష్టిలో దేహేన్ద్రియాదులు వాస్తవికములుగా లేవో, ఎవ్వనికి 'నేను బ్రహ్మమునే' యను దృఢనిశ్చయము గలదో ఎవ్వడెల్లప్పుడు నిరతిశయానందమునందే మునిగియుండునో వాడు జీవన్ముక్తుడనబడును.

శ్లో॥ అహం బ్రహ్మ స్మ్యహం బ్రహ్మ
స్మ్యహం బ్రహ్మేతి నిశ్చయః,
చిదహం చిదహం చేతి
సజీవన్ముక్త ఉచ్యతే. ౯౬౭

తా॥ ఏయే మానవునకు సకలావస్థలందును ముమ్మాటికిని బ్రహ్మమే నేనగుచున్నాననియు, జ్ఞానస్వరూపుడనే నేనగుచున్నాడననియు, ప్రకాశ స్వరూపుడనే నేనగుదుననియు నిశ్చయముగలదో, ఆ మానవుడు జీవన్ముక్తుడని చెప్పబడుచున్నాడు.

శ్లో॥ జీవన్ముక్తపదం త్యక్త్వా స్వదేహే కాలసాత్కృతే,
విశత్య దేహముక్తత్వం పవనోఽస్పన్దతామివ. ౯౬౮

తా॥ పై లక్షణములుగల జీవన్ముక్తుడు ప్రారబ్ధకర్మాధీనమగు తన శరీరము నశించినతోడనే ప్రాణవాయువు పైకి క్రిందికి సంచరించుట మాని నిశ్చలంబగునట్లుగా పరలోక గమనాదులం జెందక జీవన్ముక్తిని పరిత్యజించి విదేహముక్తుం డగుచున్నాడు.

శ్లో॥ వాచా స్తత్సంబభూవాఽసౌ
యద్గిరా మప్యగోచరమ్,
యచ్ఛూన్యవాదినాం శూన్యం
బ్రహ్మ బ్రహ్మవిదాం చ యత్. ౯౬౯

విజ్ఞానం విజ్ఞానవిదాం మలానాంచ మలాత్మకమ్,
పురుష స్సాంఖ్యదృష్టీనా మీశ్వరో యోగవాదినామ్.
శివ శ్శైవాగమ స్థానాం కాలః కాలైక వాదినామ్,
య త్సర్వశాస్త్ర సిద్ధాన్తం వస్తుత తసదసౌస్థితః. ౯౭౦

తా॥ విదేహ ముక్తినొందిన పురుషుడు, వాక్కులకు, మనస్సునకును గోచరింపని సచ్చిదానన్ద పరమాత్మ స్వరూపుడగుచున్నాడు. ఈ పరమాత్మనే శూన్యవాదులుశూన్యమనియు, వేదశాస్త్రతత్త్వవిదులగు వైదికులు బ్రహ్మమనియు, బౌద్ధులు క్షణికవిజ్ఞానమనియు, రాగ ద్వేషాది భూయిష్ఠులగు పామరులు రాగద్వేష విశిష్టుడనియు, సాంఖ్యమతస్థులు పురుషుడనియు, యోగశాస్త్రజ్ఞులు ఈశ్వరుడనియు, శైవులుశివుడనియు, వైష్ణవులు విష్ణువనియు, జ్యోతిషికులు కాలమనియు వచించుచున్నారు. మరియు నీ యాత్మ వస్తువే సకల శాస్త్రములందును నిత్యమైనదిగా నిర్ణయింపబడుచున్నది. ఇట్టి స్వరూపము జెంది యున్నవాడు విదేహముక్తుడు.

శ్లో॥ బ్రహ్మైవాఽహంచిదేవాఽహ మేవంవాఽపి నచిన్త్యతే,
చిన్మాత్ర ఏవ య స్తిష్ఠే ద్విదేహో ముక్త ఏవసః.

తా॥ మరియు ఎవ్వడు 'నేను బ్రహ్మము నని గాని, నేను జ్ఞాన స్వరూపుడన'ని గాని కూడ చింతింపక బ్రహ్మస్వరూపుడేయయి యుండునో వాడు విదేహ ముక్తుడే యగుచున్నాడు.

శ్లో॥ యస్య ప్రపంచ భానం న బ్రహ్మాకారమపీహ న,
అతీతా తీతభావో యో విదేహో ముక్త ఏవసః.

తా॥ ఎవ్వనికి ప్రపంచము భాసింపకున్నదో ఎవ్వనికి బ్రహ్మ విషయకంబగు ధ్యానము సైతము లేకున్నదో ఎవ్వడు సర్వజ్ఞకదతీతంబగు సగుణ బ్రహ్మస్వరూపమును గూడ నతిక్రమించియున్నాడో వాడు విదేహముక్తు డగుచున్నాడు.

శ్లో॥ చిత్తవృత్తే రతీతో యశ్చిత్తవృత్త్యవభాసకః,
చిత్తవృత్తివిహీనో యో విదేహో ముక్తఏవ సః.

తా॥ ఎవ్వడు - చిత్తవృత్తుల నతిక్రమించియుండి సాక్షి స్వరూపమున చిత్తవృత్తుల భాసింపజేయుచున్నవాడై స్వస్వరూపముచే మాత్రము చిత్తవృత్తులు లేనివాడగుచున్నాడో వాడు విదేహముక్తుడే యగుచున్నాడు.

శ్లో॥ జీవాత్మేతి పరాత్మేతి సర్వచింతావివర్జితః,
సర్వసంకల్పహీనాత్మా విదేహో ముక్తఏవ సః. ౯౭౨

తా॥ ఎవనికి "అన్తఃకరణముతో గూడుకొనిన వాడును, సంసారియు, కర్తయు, భోక్తయు, నల్పజ్ఞుడును నగువాడు జీవాత్మ" యనియు "మాయోపహితచిన్నుడును, సంసారము లేనివాడు, సర్వజ్ఞుడునునగు వాడు పరమాత్మ" యనియు నీ విధములగు చింతలేమియు లేవుగనుక నే సర్వసంకల్పములును నశించిపోయినవో వాడు విదేహముక్తుడగుచున్నాడు.

శ్లో॥ ఓంకారవాచ్యహీనాత్మా సర్వవాచ్యవివర్జితః,
అవస్థాత్రయహీనాత్మా విదేహో ముక్తఏవ సః.

తా॥ ఓంకారమనగా అకారోకార మకారాత్మకంబగు ప్రణవము ఇట్టి ప్రణవముచే సగుణమగు నీశ్వర చైతన్యము బోధింపబడుచున్నది. ఎవడు ఈ సగుణ చైతన్యమును గూడ నతిక్రమించి కేవల నిర్గుణచైతన్య స్వరూపుడగుచున్నాడో, ఎవ్వడు సకల శబ్దములచే తను, చెప్పబడెడు కల్పిత జగత్స్వరూపము నతిక్రమించుచున్నాడో, మరియు నెవ్వడు జాగ్రత్స్వప్న సుషుప్తులనెడి మూడవస్థలు లేనివాడగుచున్నాడో వాడు విదేహముక్తుడే యగుచున్నాడు.

శ్లో॥ అహినిర్ల్వయనీ సర్పనిర్మోకో జీవవర్జితః,
వల్మీకే పతిత స్తిష్ఠేత్ తం సర్పో నాఽభిమన్యతే. ౯౨౭

శ్లో॥ ఏవం స్థూలం చ సూక్ష్మం చ శరీరం నాఽభిమన్యతే,
ప్రత్యగ్జ్ఞానశిఖిధ్వస్తే మిథ్యాజ్ఞానే సహేతుకే. ౯౨౮

శ్లో॥ నేతి నేతీత్యరూపత్వా దశరీరో భవత్యయమ్. ౯౨౯

తా॥ పాముచే విడువబడిన కుబుసము పుట్టమీద పడియుండును. దాని నెంతమాత్రమును 'పాము' 'ఇది నేననీ-నాది' యని యభిమానింప కున్నది. అటులనే – సంసారకాలమున దేహేంద్రియాదులందు 'నేను' – 'నాది' యను నభిమానముతో గూడుకొనిన జీవుడు ముక్తికాలమున 'నేను బ్రహ్మనైతి' నను బ్రహ్మజ్ఞానముచే సంసారకారణమగు మూలాఽజ్ఞానమంతయూ నశింపబడగా దేహేంద్రియాద్యభిమానము బరిత్యజించి శరీరరహితుడై విదేహముక్తుడగుచున్నాడు.

శ్లో॥ విశ్వశ్చ తైజసశ్చైవ ప్రాజ్ఞశ్చేతి చ తే త్రయః,
విరాట్ హిరణ్యగర్భశ్చేశ్వరశ్చేతి చ తే త్రయః.

బ్రహ్మాణ్డాం చైవ పిండాండం
లోకాభూ రాదయః క్రమాత్,
స్వస్వోపాధిలయాదేవ
లీయన్తే ప్రత్యగాత్మని. ౫౮౦

తా॥ లోకమున - త్రాటియొక్క స్వరూపము తెలియక పోవుట వలన దానియందు పాము - భూరన్ధ్రము - జలధార-పుష్పమాల - మున్నగున వెన్నయో కల్పింపబడుచున్నవి. ఇవి యన్నియు త్రాటియొక్క నిజస్వరూపము తెలియబడగానే తిరిగి త్రాటియందే లయించుచున్నవి. అనగా నచ్చట త్రాడుతప్ప మరియేమియు నుండదు. అటులనే అజ్ఞానము యొక్క ఆవరణశక్తిచే బ్రహ్మస్వరూపము కనబడకుండ చేయబడగా పిమ్మట విక్షేపశక్తిచే బ్రహ్మమునందు వ్యష్టిరూపమున జాగ్రదవస్థలో విశ్వుడనియు స్వప్నదశలో తైజసుడనియు, సుషుప్తిదశలో ప్రాజ్ఞుడనియు, అట్లే సమష్టిరూపమున - విరాట్టు - హిరణ్యగర్భుడు - ఈశ్వరుడు అనియు, అటులనే వ్యష్టిరూపములగు నెనుబది నాలుగులక్షల జీవరాసుల యొక్క స్థూలశరీరములును (పిండాండములు) సమష్టి రూపంబగు బ్రహ్మాండంబును, పాతాలాది బ్రహ్మలోకాన్త భువనంబులును ఇవియన్నియు కల్పింపబడుచున్నవి. విదేహముక్తియందు, శక్తిద్వయ సహితంబైన యజ్ఞానమంతయు సంపూర్ణముగా లయించుటజేసి విశ్వాది పదార్థము లన్నియు తిరిగి తమ కధిష్ఠానంబగు బ్రహ్మమునందె విలయము నొందుచున్నవి.

శ్లో॥ తూష్ణీమేవ తత స్తూష్ణీం తూష్ణీం సత్యం నకించన,
కాలభేదం వస్తుభేదం దేశభేదం స్వభేదకమ్. ౫౮౧

శ్లో॥ కించి ద్భేదం నతస్యాఽస్తి కించిద్వాఽపి నవిద్యతే,
జీవేశ్వరేతి వాక్యేచ వేదశాస్త్రే ష్వహంత్వితి. ౫౮౨

శ్లో॥ ఇదం చైతన్యమేవేతి చాఽహం చైతన్య మిత్యపి,
ఇతినిశ్చయశూన్యోయో విదేహో ముక్తఏవ సః.

తా॥ ఈ విధమున బ్రహ్మజ్ఞానముచే కల్పిత ప్రపంచమంతయు బ్రహ్మమునందు లయించిన పిమ్మట విదేహముక్తుని స్వరూపం బగు పరబ్రహ్మము తప్ప మరేమియును ముముక్షువుకిని లేదు. భేదమును కలిగించెడి దేశకాలవస్తువులం సైతము నశించుట జేసి బ్రహ్మమునందు దేశకాలవస్తు కృతంబగు భేదంబును లేదు. బ్రహ్మము నిరవయవమగుటచే స్వగత భేదంబును లేదు. ఇట్టి విదేహముక్తావస్థయందు వేదశాస్త్రములు గాని, తత్ప్రతిపాదితములగు జీవేశ్వరాది వాక్యములుగాని యేమియు లేవు. మరియు నెవ్వనికి - నే నిట్టివాడననియు - చైతన్య మీవిధంబైనదనియు - నేను చైతన్యస్వరూపుడనే యనియు - ఈ విధమగు నిశ్చయము కూడ లేకున్నదో వాడు విదేహముక్తుడే యగుచున్నాడు.

శ్లో॥ బ్రహ్మైవ విద్యతే సాక్షా ద్వస్తుతో౽ వస్తుతో౽ పిచ,
తద్విద్యా విషయం బ్రహ్మ సత్యజ్ఞాన సుఖాత్మకమ్.
శాన్తంచ తదతీతంచ పరం బ్రహ్మ తదుచ్యతే. ౯౪౭

తా॥ మరియు వ్యవహార కాలమునందుసైతము బ్రహ్మపదార్థ మొక్కటియే ఘటపటాది వస్తువులుగాను, శుక్తిరజతరజ్జుసర్పాది ప్రాతిభాసిక మిథ్యాపదార్థములుగాను భాసించుచున్నది. ఇట్టి సచ్చిదానన్ద రూపమగు బ్రహ్మము ఉపనిషద్వాక్యములచే దెలియబడుచున్నది. ఈ బ్రహ్మమే సర్వసంసార సంక్షోభ వర్జితంబనియు, మాయాతీతం బనియు, సర్వోత్తమంబనియు బ్రహ్మవేత్తలచే చెప్పబడుచున్నది

శ్లో॥ సిద్ధాన్తో౽ ధ్యాత్మ శాస్త్రాణాం
సర్వా౽పహ్నవఏవహి,
నా౽విద్యాస్తీహ నోమాయా
శాన్తం బ్రహ్మేద మక్లమమ్. ౯౪౮

తా॥ వేదాన్తములన్నియు, సచ్చిదానన్ద పరబ్రహ్మ మొక్కటి తక్క తద్భిన్నంబగున దెద్దియును యథార్థముగా లేదని నొక్కివక్కా

ణించు చున్నవి. కావున వ్యష్టిరూపమగు నవిద్యగాని, సమష్టిరూపమగు మాయగాని బ్రహ్మమునందు లేదు. ఇక నేమన గుణత్రయాతీతంబును సర్వోపద్రవ రహితంబును నగు బ్రహ్మపదార్థ మొక్కటియే పరమార్థ సత్యంబగుచున్నది.

శ్లో॥ ప్రియేషు స్వేషు సుకృత మప్రియేషు చ దుష్కృతమ్,
విసృజ్య ధ్యానయోగేన బ్రహ్మాఽప్యేతి సనాతనమ్.

తా॥ విదేహముక్తిపొందినట్టి బ్రహ్మజ్ఞాని తనచే చేయబడు పుణ్య పాపముల నేమి జేయుననగా చెప్పబడుచున్నది-బ్రహ్మజ్ఞాని తన పుణ్యమును (తనకు ప్రియులగు) తన్ను ప్రేమించెడి శిష్యమిత్ర భృత్యాదులకును, తన పాపమును తన్ను ద్వేషించెడి శత్రువులకును సంక్రమింపజేసి తాను మాత్రము బ్రహ్మధ్యానముచే శాశ్వతంబైన సచ్చిదానంద బ్రహ్మస్వరూపము నొందుచున్నాడు. ఇచ్చట నొకరిచే జేయబడిన పుణ్యపాపములు మరియొకరి కెట్లు సంక్రమింపగలవనెడి యొకానొక శంకకు తావు కలదు. ఇందులకు సమాధాన మేమన – బ్రహ్మజ్ఞానియొక్క పుణ్యపాపము లన్నియు నాతని బ్రహ్మజ్ఞానాఽగ్నిహోత్రముచే దహింపబడినవైనను అతనిని ప్రేమించెడి ప్రియులకు అతని పుణ్యముతో సమానమగు పుణ్యంబును, అతనిని ద్వేషించెడి శత్రువులకు అతని పాపముతో సమానమగు పాపమును సంక్రమించునని శ్రుత్యర్థము. మరియు విచారింపగా బ్రహ్మజ్ఞానమును మిక్కిలి స్తుతించుటయే శ్రుతియొక్క ముఖ్యార్థము. అది యెట్లన బ్రహ్మజ్ఞానము గలుగగనే బ్రహ్మజ్ఞానియొక్క పుణ్యపాపము లన్నియు నాతనిచే విడువబడినవై యతని మిత్రశత్రువులకు సంభవించు చున్నవిగాన బ్రహ్మజ్ఞానము అత్యంత ప్రశస్తమైనది యగుటంజేసి అది యెట్లైనను సంపాదించుకొనదగినదనియు, ఇంతియగాక బ్రహ్మవిదుల సాంగత్యమునే నిరంతరము చేయుచుండవలయును గాని వారినెన్నడును ద్వేషింపగూడదనియు శ్రుతియొక్క ముఖ్యాభిప్రాయము.

శ్లో॥ యావద్యావన్మునిశ్రేష్ఠ! స్వయం సంత్యజ్యతేఽఖిలమ్‌,
తావత్తావత్పరాలోకః పరమాత్మైవ శిష్యతే. ౯౮౭

శ్లో॥ యద్యత్త్వాభిమతం వస్తు తత్త్యజన్మోక్షమశ్నుతే.

శ్లో॥ అసంకల్పనశస్త్రేణ ఛిన్నం చిత్తమిదం యదా,
సర్వం సర్వగతం శాన్తం బ్రహ్మసంపద్యతే తదా. ౯౮౯

తా॥ ఆత్మస్వరూపమును విచారణజేసి కృతార్థుడనైన ఓ శిష్యా! నీ కిప్పుడు సర్వవేదాన్త సారమగు నర్థమును జెప్పెద వినుము - ఆత్మకు (మాయాకార్యమగు) మనస్సంబన్ధమువలన సంసారమేర్పడుచున్నది. మనస్సనగా ననేక కామవాసనలయొక్క సముదాయము. ఇట్టి మనస్సుతో తాదాత్మ్యము జెందుటవలన ఆత్మయొక్క సచ్చిదానన్ద స్వరూపము తిరోహితమగును. మనఃకల్పితములగు ప్రపంచ ధర్మములే ఆత్మయందు భాసించుచుండును. కావున మనస్సంబన్ధమును పరిత్యజించిన కొలదియు దానివలన నేర్పడు ప్రపంచము పరిత్యక్తమైనదై ఆత్మయొక్క నిత్యచైతన్య ప్రకాశము పరిశిష్టమగుచున్నది. అందుచే ముక్తిగోరువాడు తనకు ప్రేమాస్పదములగు ప్రాపంచిక పదార్థములందలి యభిమానమును బరిత్యజించినచో ననాయాసముగా మోక్షమును పొందగలడు. మరియు నెప్పుడు సర్వకామ పరిత్యాగంబను నాయుధముచే హృదయగ్రన్థి (ఆత్మకును మనస్సునకునుగల అన్యోన్య తాదాత్మ్యసంబన్ధము) ఛేదింపడు చున్నదో అప్పుడే జీవుడు నిష్క్రియంబును, సర్వవ్యాపకంబును నగు సచ్చిదానన్ద పరబ్రహ్మ స్వరూపము జెందుచున్నాడు.

శ్లో॥ యత్ర యత్ర మృతో జ్ఞానీ పరమాక్షరవిత్సదా,
పరబ్రహ్మణి లీయేత న తస్యోత్క్రాన్తిరిష్యతే. ౯౯౦

తా॥ ఈ విధమున నిరన్తరమాత్మస్వరూప జ్ఞానము గలిగియున్న బ్రహ్మజ్ఞాని ప్రారబ్ధకర్మము క్షయింపగనే ఏదేశమునం దేకాలమున

దేహమును బరిత్యజించు చున్నాడో ఆ దేశమున నా కాలముననే సర్వ వ్యాపకంబగు పరబ్రహ్మస్వరూపము జెందుచున్నాడు. అతనికి పరలోక గమనహేతువులగు కామకర్మాదులు లేమిం జేసి అజ్ఞ జనులకుబోలె ప్రాణోత్క్రమణము సంభవింపనేరదు.

శ్లో॥ ఇతి శ్రుత్వా గురో ర్వాక్యం శిష్యస్తు ఛిన్నసంశయః.
జ్ఞాతజ్ఞేయ స్సంప్రణమ్య సద్గురో శ్చరణాంబుజమ్,
స తేన సమను జ్ఞాతో యయౌ నిర్ముక్తబన్ధనః. ౯౯౩

తా॥ ఈ విధమున గురునిచే నుపదేశింపబడినయాత్మ తత్త్వమును వినిన శిష్యుడు - జీవుడెవరు - ఈశ్వరుడననెవరు - జీవునకు సంసార మెట్లు వచ్చెను - తుదకు మోక్షమెట్లు లభించును-'' అని యీ మొదలగు సంశయములు లేనివాడై సద్గురు పాదారవిందములకు సాష్టాంగ ప్రణామం బాచరించి జ్ఞాతబ్రహ్మతత్త్వుండగుటచే సంసారబన్ధ నిర్ముక్తుడైగురుని యనుమతి బడసి యథేచ్ఛ జనెను.

శ్లో॥ గురు రేవ సదానన్దసిన్ధౌ నిర్మగ్నమానసః,
పావయన్ వసుధాం సర్వాం విచచార నిరుత్తరః.

తా॥ అంతట నా గురువును, నిజస్వరూపంబగు బ్రహ్మానన్దానుభవ సాగరంబున మునిగిన మనస్సు గలవాడగుటచే సర్వేన్ద్రియ మౌనం బవలంబించి స్వపాద పరాగముచే భూమిని పవిత్రీకరింప జేయుచు నచ్చ టచ్చట దిరుగుచుండెను.

శ్లో॥ ఇత్యాచార్యస్య శిష్యస్య సంవాదేనాత్మలక్షణమ్,
నిరూపితం ముముక్షూణాం సుఖబోధోపపత్తయే. ౯౯౪

తా॥ ఈ రీతిగా ముక్తిని గోరువారలకు ఆత్మతత్త్వము సులభ ముగా తెలియుటకొరకై గురుశిష్యసంవాద రూపమున నాత్మ స్వరూప మంతయు చక్కగా బోధింపబడినది.

శ్లో॥ సర్వవేదాన్త సిద్ధాన్త సారసంగ్రహ నామకః,
గ్రంథోఽయం హృదయగ్రన్థి విచ్ఛిత్త్యై రచితస్సతామ్.

శ్లో॥ శ్రీమద్భి ర్భగవత్పాదై రాదృత్యోఽయం ముముక్షుభిః,
శ్రోతవ్యో దర్శనీయశ్చ పఠనీయశ్చ సర్వదా. ౧౧౬

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య శ్రీ మద్గోవింద భగవ
త్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛంకరభగవత్పూజ్యపాద విరచితః
సర్వవేదాన్త సిద్ధాన్త సార సంగ్రహ స్సంపూర్ణః

తా॥ ఈవిధంబున సర్వవేదాన్త సిద్ధాన్తసార సంగ్రహమను నీగ్రన్థము సకలసంపత్సంపన్నులగు శంకర భగవత్పాదాచార్యులవారిచే ముముక్షుజనుల ననుగ్రహించుటకొరకై రచింపబడినది. దీనివలన సర్వ సంసార కారణంబగు హృదయగ్రన్థి అనగా ఆత్మకును మనస్సునకును గల తాదాత్మ్య రూపమగు సంబన్ధమను ముడి విడిపోగలదు. కావున నీ గ్రన్థరాజము ముక్తికాములచే నెల్లప్పుడు సద్గురువుల వలన వినదగిన దియు, చూడదగినదియు, చదువదగినదియు నగుచున్నది.

ఓం తత్సత్.

శ్లో॥ ఏవమేషాకృతా వ్యాఖ్యా శ్రీమచ్ఛంకర సత్కృతేః,
ఆచార్యానుగ్రహేణైవ ప్రీణాతు భగవాంఛ్ఛివః.

ఇతి శివమ్

శ్లో॥ యదత్ర సౌష్ఠవం కించిత్ తద్గురో రేవ మే న హి,
యదత్రాసౌష్ఠవం కించిత్ తన్మమైవ గురో ర్న హి.

# సవరణ

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 7 | పూజ్యాపాదులను | పూజ్యపాదులను |
| 4 | 23 | గలుగుగనే | గలుగగనే |
| 7 | 17 | ననిత్యయనియు | ననిత్యమనియు |
| 14 | 11 | నిశోగ్ర | నీశోగ్ర |
| 16 | 3 | దుఃఖమస్తి | దుఃఖమస్తీ |
| 29 | 19 | వృత్తైవోభయయథా | వృత్తైకోభయథా |
| 39 | 11 | శమాన్సిద్ధ్యతి | శమసిద్ధ్యతి |
| 44 | 2 | హాకృంతే | హాంకృతే |
| 47 | 5 | వాధు | సాధు |
| 60 | 23 | వండితులకు | పండితులకు |
| 64 | 13 | శంక్యతాబుద్ధైః | శంకృతాంబుద్ధైః |
| 65 | 5 | సర్వవ్యాపకమ | సర్వవ్యాపకము |
| 72 | 9 | ముక్తస్సేశ్వర | ముక్తస్యేశ్వర |
| 72 | 19 | సమ్యదాధానం | సమ్యగాధానం |
| 78 | 5 | బన్దాద్విముచ్యతే | బన్ధాద్విముచ్యతే |
| 79 | 7 | ననుభవింప | మనుభవింప |
| 94 | 3 | సత్సత్వేన | సత్యత్వేన |
| 95 | 5 | యప్రయాణ | యప్రమాణ |
| 97 | 16 | నాతతత్వమును | నాత్మతత్వమును |
| 101 | 18 | భవితి | భవతి |
| 111 | 19 | వాయువు | పాయువు |
| 111 | 22 | పనేడుదును | పదునేడును |
| 111 | 23 | జిహ్వ | జిహ్వ |
| 112 | 6 | చక్షుర్ద్రియమును | చక్షురిన్ద్రియమును |
| 117 | 24 | హ్యుత్తపలభ్య | హ్యుపలభ్య |
| 118 | 8 | రజదోషై | రజోదోషై |
| 133 | 16 | నివర్త్యతే | నిర్వర్త్యతే |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 134 | 15 | సాక్షే | సాక్షీ |
| 140 | 10 | శద్దాదీఒ | శబ్దాదీన్ |
| 143 | 23 | యత్రాఒదాత్మేతి | యత్తదాత్మేతి |
| 149 | 20 | సమాగతః | స్వమాగతః |
| 149 | 2. | సిద్ధసతి | న సిద్ధ్యతి |
| 150 | 19 | నిరవయవపదార్థమగు | |
| | | నిరవయావ | నిరవయవ |
| 162 | 23 | సంప్రాప్త | సంప్రాప్తః |
| 171 | 4 | గృహస్థులరు | గృహస్థులకు |
| 181 | 6 | చూభన్యస్త్రైవ | చూభన్యస్త్రైవ |
| 185 | 10 | ఖపుష్పాతిం | ఖపుష్పాత్మికం |
| 186 | 24 | ఎందు | లందు |
| 186 | 25 | లంత | ఎంత |
| 188 | 23 | కోఒభవితా | కోపిభవితా |
| 19? | 1 | కేనాయము | కేనాయం |
| 2?2 | 1 | దర్శనా | దర్శనా |
| 203 | 1 | పత్యర్థే | సత్యర్థే |
| 223 | 2 | రఖండత్వ | రఖండత్వ |
| 232 | 17 | అంశ | అంశం |
| 235 | 3 | మ ాద్యత | మనాద్యంత |
| 236 | 19 | భిదాపివాః | భిదాపివా |
| 240 | 3 | తదేభవ | తదేవ |
| 240 | 4 | సకాశే | కారే |
| 240 | 15 | నశ్యతి | నశ్యతి |
| 244 | 8 | నిరవయవంబులు | నిరవయవంబును |
| 245 | 8 | స్వరమసర్వం | సర్వమసర్వం |
| 252 | 2 | పతిఫలించిన | ప్రతిఫలించిన |
| 252 | 8 | మాత్రములనే | మాత్రమున నే |
| 255 | 16 | కారితయా | కారితాయాః |
| 275 | 5 | విద్యానహా | విద్యానహా |
| 281 | 18 | తయోాయథా | తమోయథా |

అద్వైతరసపిపాసువులకు అపూర్వావకాశము!

పిబన్తువాఙ్మయసుధామ్! తరంతు భవసాగరమ్!!

# శంకర గ్రంథరత్నావళి

శ్లో॥ శ్రుతి స్మృతి పురాణానా మాలయం కరుణాలయం ।
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరమ్॥

శ్రీ శంకరాచార్యులు జగద్గురువులు. వారి మహాత్త్వము సర్వజన విదితము. వారురచించిన గ్రంథములనేకములు. అవియన్నియు కర్మ, భక్తి జ్ఞాన ప్రబోధకములు. అవి రచించబడి వేలయేండ్లు గడచినవి. అయినను వానిదీప్తి మాయలేదు మాయదు. ఈ వాఙ్మయసేవనమువలన మానవ లోకము దీప్తిమంతమగును. మానవజన్మ చరితార్థమగును

సంస్కృతభాషయందున్న యీ గ్రంథములు శ్రీరంగం, పూనా, బొంబాయి, కలకత్తా మున్నగుచోట్ల ముద్రితములై లభించుచున్నవి. ఈ గ్రంథములు మొత్తము 153. ఉపదేశప్రకరణగ్రంథములు 57 - స్తవస్తోత్ర గ్రంథములు 72 - భాష్యములు 24

ఈ గ్రంథములు ప్రపంచమునందలి ప్రధానభాష లన్నిటియందు ననువదింపబడి విరాజిల్లుచున్నవి. తెనుగునగూడ వీనియందు గొన్నికొన్నింటి యనువాదములు కొన్నికొన్నిచోట్ల వెలువడి లభించుచున్నవి. గ్రంథము లన్నియు అనువదింపబడలేదు. అనువదింపబడిన గ్రంథములుకూడ ఒకచోట లభించుటలేదు.

ఈ శంకరవాఙ్మయము నంతను "శంకర గ్రంథ రత్నావళి" అను పేర ప్రత్యేకశాఖగా మా మండలిలో 32 సంపుటములుగ తెనుగున అనువదించి మూలముతోఁ బ్రకటింపవలెనని సంకల్పించితిమి. ఇప్పటికి మూడు సంపుటములను బ్రకటించితిమి. ఇది శ్రమ వ్యయసాధ్యమైన కార్యము. అనువాద కార్యమునకై పండితులు శ్రమించినను ఉదారులు చేయూత యొసంగనిచో గ్రంథప్రకటనము దుస్సాధమగును. జ్ఞానకర్మోపాసనామార్గములకు వెలుగుబాటలైన యీ గ్రంథములను బ్రకటించుటయందు వితరణచేయబడిన ధనము ఇతర ధర్మకార్యములకంటె మిన్నయై సత్ఫలము నొసంగునను విషయము విజ్ఞులకు దెలియనిదికాదు. అందుచే మాయీ 'శంకరగ్రంథరత్నావళి' కి క్రిందివిధముగ తోడ్పడవలెనని ఉదారులైన సంపన్నులను వేడుచున్నాము.

1. శ్రీ శంకర వాఙ్మయోద్ధారకులు ... రు 500
2. మహారాజపోషకులు ... రు 250
3. రాజపోషకులు ... రు 125

విరాళమిచ్చి సహాకరింతురుగాక! పై మూడుతరగతులవారికిని 'శంకరగ్రంథ రత్నావళి' పుస్తకములన్నియునీయబడును. ఒకటి, రెండు తరగతులవారికి సాధనగ్రంథమండలి పుస్తకములన్నియుగూడ నీయబడును.

ఒకమారు రు 5 లు యిచ్చి సభ్యులుగా చేరినవారికి 'శంకరగ్రంథ రత్నావళి' ప్రతిసంపుటము నిర్ణయించిన వెలకు పోస్టుఖర్చులు మేము భరించి వి. పి. చేయుదుము. వి. పి నిరాకరించినచో మీ సభ్యత్వము రద్దగును. మీ సభ్యత్వచందా రు 5 లు తిరిగి వాపసు చేయబడదు.

ఇంతవరకు ప్రకటింపబడిన గ్రంథములు

## శంకరగ్రంథరత్నావళి

1. ప్రథమసంపుటము (40 ప్రకరణగ్రంథములు) వెల రు 4 00
అనువాదకులు : శ్రీ నిర్వికల్పానందస్వామి

2. ద్వితీయసంపుటము (5 ప్రకరణగ్రంథములు) వెల రు 4-00
అనువాదకులు : శతావధానులు, శ్రీ వేలూరి శివరామశాస్త్రి

3. తృతీయసంపుటము (7 ప్రకరణగ్రంథములు) 4-00
అనువాదకులు : శ్రీ హరి సాంబశివశాస్త్రి, యం. ఏ.,

4. చతుర్థసంపుటము:
(సర్వవేదాంత సిద్ధాంత సారసంగ్రహము) రు 4-00
అనువాదకులు : శ్రీ సర్వా శివరామకృష్ణశాస్త్రి

5. ఈశావాస్యోపనిషత్తు ... వెల రు 0-75
శ్రీ నృసింహానంద భారతీస్వామి

6. కనకదుర్గానందలహరి (మూలముమాత్రము) వెల రు 0-25
జయన్తి తే సుకృతిన స్వ్యాకహూరా యశస్వినః.

సాధన గ్రంథ మండలి, తెనాలి.